# చతుర ప్రపంచం

## మన 'ఛీ! యాక్!' వారి ఆహారం

గొంగళి పురుగులను చూస్తేనే ఒళ్ళు జలదరిస్తుంది మనకి. పొరపాటున అది కట్టుకున్న బట్టల్లో దూరిందంటే ఒళ్ళంతా దురదలు, దద్దుర్లు వచ్చేస్తాయి. ఇలాంటి పురుగును ఎంతో ఆనందంగా కమ్మగా భోంచేస్తారు సౌత్ ఆఫ్రికా ప్రజలు. నలుపు, ఊదారంగు వర్ణాల్లో వుండే ఓ రకం గొంగళిపురుగుల్ని మాత్రమే వారు భక్షిస్తారు. కారణం వీటిలో మాంసకృత్తులు అధికంగా వుంటాయి. ఎండబెట్టిన 100 గ్రా. గొంగళులు ఓ మనిషికి సగటున రోజుకు అవసరం అయ్యే మాంసకృత్తుల్లో 76 శాతాన్ని కలిగి వుంటాయి. ఇవికాక ఎన్నో విటమిన్స్‌ని, ఖనిజ లవణాలనీ కూడా కలిగి వుంటాయి. దాంతో ఇవి చేపలు, మాంసాలతో సమానమైన ఆహారంగా స్థానం సంపాదించాయి. ముఖ్యంగా పప్పుధాన్యాలు పెద్దగా పండకపోవడంతో సౌత్ ఆఫ్రికన్ దేశాలలో ఈ గొంగళీల గిరాకీ ఎక్కువయింది. దాంతో వారికి మాంసకృత్తులు లభ్యం అయ్యే ప్రధాన ఆహారం ఈ గొంగళి పురుగులే.




ఇవి మొపేన్ చెట్లమీద నివశిస్తూ ఆ చెట్ల ఆకులను తింటూ జీవిస్తాయి. నవంబర్ మొదటివారంలో వర్షాలు ఆరంభం అవగానే ఇవి భూమిలోంచి బయటకు వచ్చి ఆ చెట్లను చేరి వాటిమీద 100 నుంచి 300 దాకా గుడ్లు పెడతాయి. 18 రోజుల్లో చెట్ల ఆకుల అడుగు భాగంలోంచి ఆ గుడ్లు పగిలి లార్వాదశలోని పిల్లలు బయటికి వస్తాయి. అయిదు మిల్లీమీటర్ల పొడవుండే అవి 5-6 వారాల్లో పది సెంటీమీటర్లకి పెరిగి, సగటున ఒక్కొక్కటి 15 గ్రా. బరువు తూగుతుంది. డిసెంబరు నెలలో వీటికోసం వేట సాగుతుంది.

మరోసారి ఫిబ్రవరి నెలలో కూడా గుడ్లు పెడతాయివి. దాంతో ఏప్రిల్‌లో మళ్ళీ వీటి కోసం వేట సాగుతుంది. ఆరువారాలపాటు ఆడవాళ్ళు భుజాన వేలాడే బుట్టల్లోకి వీటిని ఏరుతారు. ఏరోజు ఏరిన వాటిని ఆ రోజు ఉప్పునీళ్లల్లో ఉడకపెట్టి, ఎండబెడతారు. ఎండాక ఇవి బాగా మాడిన వేరుశనగ గింజలను పోలివుంటాయి. అంతేకాదు, వేరుశనగపప్పులాగే మంచి రుచిగా కూడా వుంటాయిట.

వాటిని చిన్నచిన్న ప్లాస్టిక్ సంచుల్లో కిలోల లెక్కన అమ్ముతారు. బస్‌స్టాపుల్లో, రైళ్ళల్లో వందగ్రాముల ప్యాకెట్లలో అమ్ముతారు. డబ్బాలలో ప్యాక్ చేసి సూపర్ మార్కెట్‌లలో కూడా అమ్ముతారు. కిలో ఖరీదు అంతర్జాతీయ మార్కెట్‌లో 16 దాకా పలుకుతుంది. నమీబియా, బోట్స్‌వానా, జింబాబ్వే, మొజాంబిక్, సౌత్ ఆఫ్రికా దేశాల్లో మొపేన్ వృక్షాలు అధికం కాబట్టి ఈ ప్రాంతాల్లో ఆహారపదార్థంగా

వుపయోగపడే ఈ గొంగళి పురుగుల సాగు అధికంగా వుంటుంది.

బెల్జియంలోని ఓ చాక్లెట్ తయారీదారు వీటిని దిగుమతి చేసుకుని చాక్లెట్‌లలో వుంచి అమ్ముతున్నాడు. ఇతడు వేయించిన తేనెటీగలని కూడా చాక్లెట్‌లలో వుంచి అమ్ముతాడు.

ఏటా 200 టన్నుల మొపేన్ గొంగళీ పురుగులను సౌత్ ఆఫ్రికా దేశాలు ఆహారంగా ఉత్పత్తి చేస్తున్నాయి.

## పిల్లల్ని కనని దేశం

ఇద్దరూ లేక ముగ్గురు అంటూ ఒకప్పుడు ఘోషించిన ఈ దేశంలో రానురాను ఇద్దరే ముద్దనీ, అటుపైన ఒక్కరే చాలని కూడా ఆ స్లోగను మారుతూవచ్చింది. పిల్లలు కలుగకుండా ఆపరేషన్ చేయించుకున్నవాళ్లకి ఎన్నో సౌకర్యాలను, ఆర్థిక ప్రయోజనాలను కూడా కలుగజేస్తామని ఎర చూపించింది ప్రభుత్వం. అయినా ఎంత జాగ్రత్త వహించినా ఇంతింతై వటుడింతై అన్నట్టు పెరుగుతూనే వుంది జనాభా. ఇలా అధిక జనాభా మన దేశ సమస్య




అయితే ఇటలీలో ప్రధాన సమస్య 'తగ్గిపోతున్న జనాభా'. ప్రతి సంవత్సరం ఇటలీలో జనసంఖ్య తగ్గుతూ వస్తోంది. ఇటలీలోని ఓ చిన్న గ్రామంలోని కేథలిక్ ప్రీస్ట్ ఏడాదికి 40 నుంచి 50 మందికి అంత్యక్రియలు నిర్వహిస్తుంటే అదే కాలానికి కొత్తగా పుట్టిన పిల్లలు కేవలం 15, 20 మందికి మాత్రమే బాప్టిజం చేస్తున్నారు. దాదాపు ఇటలీలోని అన్ని గ్రామాల్లోని పరిస్థితీ ఇలాగే వుంది. ఇటలీ జనాభా 1989 నాటికి అయిదు కోట్ల డబ్బయి లక్షల మంది. 1999కి అంటే పదేళ్లకి 4 కోట్ల 10 లక్షల మందికి తగ్గింది. ఇందుకు కారణం మగవాళ్లు వివాహం పట్ల విముఖత చూపించడం. అక్కడి ఆచారం ప్రకారం పెళ్లి చేసుకున్న మగవాళ్లు తల్లిదండ్రులను వదలి వేరే ఇంటికి మారాలి. అయితే ఒంటరిగా భార్యతో నివశిస్తే అనేక సమస్యలను ఎదుర్కోవలసి వస్తుందనీ, దానికి బదులు తల్లితండ్రుల రక్షణలోనే వుండటం మంచిదని చాలామంది మగవాళ్లు అభిప్రాయపడటం ప్రధాన కారణం.

ఇకపోతే వివాహం చేసుకున్న వాళ్లు పిల్లల్ని కనడానికిష్టపడకపోవడం మరో కారణం. బిడ్డ అంటే ఇటాలియన్స్ ఖర్చుగా భావించడం ఇందుకు కారణం. ఇద్దరు పిల్లలుండే కుటుంబాలు అక్కడ తక్కువ. పెళ్లయిన ఏ పదేళ్లకో ఓ బిడ్డని అయిష్టంగానే కంటున్నారక్కడ. ముఖ్యంగా గత పదేళ్లుగా ఆడవాళ్లు ఉద్యోగం చెయ్యడం అధికమయిందక్కడ. మొదటి మూడేళ్లూ మెటర్నిటీ లీవ్ లభ్యం కాని నియమం ఇటలీలో వుండటంతో పిల్లల్ని కనడానికి వాళ్లు ఇష్టపడటంలేదు.

తమాషా ఏమిటంటే ప్రపంచంలో చిన్న పిల్లల దుస్తుల ఫేషన్స్‌కి ఇటలీయే మొదటి స్థానం వహిస్తుంది. తమకి పుట్టే బిడ్డని టాప్‌క్లాస్‌గా పెంచాలన్న కోరికతో వున్నదంతా ఒకే బిడ్డకోసం వెచ్చించే స్వభావం కూడా ఇటాలియన్స్‌లో వుండటంతో వాళ్లు ఒక్కరినిమించి కనదలుచుకోవడం లేదు. వివాహం అయ్యాక ఇద్దర్నికంటే జనాభా

సమతూకంగా వుంటుందిగానీ అలా జరగడంలేదక్కడ. దాంతో కొన్ని చోట్ల స్కూళ్లను మూసేయాల్సిన పరిస్థితి ఏర్పడుతోందక్కడ.

ముగ్గురు పిల్లల్ని కన్నవాళ్లకి ఇటాలియన్ ప్రభుత్వం ఇన్‌కంటాక్స్ తగ్గింపు, ఇతరత్రా బెనిఫిట్స్ ఇచ్చే యోచన చేస్తోందిప్పుడు.

## వార్ డాగ్స్

మనకి పోలీసుకుక్కలు తెలుసు. పెంపుడు కుక్కలు, కాపలా కుక్కలు తెలుసు. గుడ్డివాళ్లకి సహాయం చేసే సెయింట్ బెర్నార్డ్ కుక్కల గురించి తెలుసు. కానీ యుద్ధ శునకాలుంటాయని మనలో చాలా మందికి తెలియదు.




రెండో ప్రపంచ యుద్ధకాలంలోజర్మన్ సైన్యం తొలిసారిగా కుక్కలకి యుద్ధంలో సైనికులకి సహాయం చేసే శిక్షణను ఇచ్చి యుద్ధంలో వాటిని ఉపయోగించుకుంది. దీన్ని అమెరికన్ సైన్యం ఇప్పుడు అనుసరిస్తోంది.

ఆల్సేషియన్, లేబ్రడార్ జాతికి చెందిన కుక్కలకి వాసనశక్తి అధికం. అలాగే వినికిడి శక్తి కూడా. రాత్రుళ్లు కందకాల్లో దాక్కొన్న శత్రుసైనికుల వాసననుబట్టి వారి కందకాల దగ్గరకి మునికాళ్ల మీద పాకుతూ వెళ్లడంలో శిక్షణనిస్తారు. ఒకవేళ వాళ్లు కందకంలోంచి లేచి కుక్కని కాల్చాలనుకుంటే ఎగిరి తుపాకి పట్టుకున్న చేతి మణికట్టుని కొరికి పారిపోయి వచ్చే శిక్షణ కూడా దానికి ఇస్తారు. ఇంకా మందుగుండు సామాగ్రి గిడ్డంగులను వాసనతో వెదికి దారి చూపడం, మనిషి చెవులకి అందని శత్రువుల కదలికల చప్పుళ్లను పసికట్టి హెచ్చరించడం, తమవైపు సైనికులు గాయపడితే వెంటనే వెళ్లి ఆ సంగతిని నిర్ణీత సంజ్ఞలద్వారా ఇతర సైనికులకు తెలియజెయ్యడం లాంటివాటిలో కూడా యుద్ధశునకాలకు శిక్షణనిస్తారు.

1968దాకా అమెరికాకి, వియత్నాంకి యుద్ధం జరిగినప్పుడు కొన్ని వందల డాగ్ బెటాలియన్స్ వియత్నాం యుద్ధంలో పాల్గొన్నాయి. ఆ యుద్ధంలో మొత్తం 4,000 యుద్ధశునకాలు పాల్గొంటే యుద్ధం ముగిశాక కేవలం 204 కుక్కలే తిరిగి అమెరికా చేరుకున్నాయి. యుద్ధంలో మరణించిన ప్రతి శునకం సగటున నలుగుర్ని రక్షించిందని అంచనా. అంటే దాదాపు 16000 మంది అమెరికన్ సైనికుల ప్రాణాలను కాపాడాయి ఆ శునకాలు.

కొన్ని కుక్కలని సౌత్ వియత్నాం సైనికులకి ఇచ్చారు. ప్రతీ శునకానికి ముగ్గురు హాండ్లర్స్ వుంటారు. ఈ ముగ్గురి మాట అది వింటుంది. అంటే 4000 కుక్కలతోపాటు 12000 మంది హాండ్లర్స్ కూడా వియత్నాం యుద్ధంలో పాల్గొన్నారు. వీళ్లు సైనికుల్లోని వారే తప్ప ప్రత్యేకంగా ఈ పోస్ట్ వుండదు. ఈ హాండ్లర్స్ తమ శునకం మరణిస్తే తమ సహచరులు మరణించినప్పటికన్నా అధికంగా బాధపడతారు. ఎందుకంటే కుక్కలకు ప్రేమించడం తప్ప సహచరుల్లా అప్పుడప్పుడు పోట్లాడటం తెలియదు.

★



# చిత్రమైన కతలు

## ఎందుకంటే...

పోలీసు శాఖలో సబ్ ఇన్‌స్పెక్టర్ ఉద్యోగానికి ఇంటర్వ్యూలు జరుగుతున్నాయి. ముగ్గురు అభ్యర్థులు బయట వేచి ఉన్నారు. మొదటి వ్యక్తిని లోపలకి పిలిచారు.

ఓ వ్యక్తి ఫొటోని చూపించి అడిగారు.

"ఇది చూస్తే నీకేమని పిస్తోంది? "

తలలో సైడ్‌మాత్రం కనపడేలా తీసిన ఆ ప్రొఫైల్ ఫొటోని దీక్షగా చూసిచెప్పాడు ఆ అభ్యర్థి.

"ఇతడికి ఒకటే చెవి వుంది"

అతను వెళ్ళిపోయాక రెండో అభ్యర్థిని పిలిచారు. అతనికీ ఈ ఫొటోనే చూపించి అడిగారు.

"ఈ ఫొటో చూస్తే నీకేమనిపిస్తోంది? "

దాన్నతను మొదటివ్యక్తి కన్నా ఇంకాస్త దీక్షగా చూసి చెప్పాడు.

"ఇతడికి ఒకటే కన్ను, ఒకటే చెవి వున్నాయి"

అతనూ వెళ్ళాక మూడో అభ్యర్థిని పిలిచారు. మళ్ళీ ఆ ఫొటోనే చూపించి అడిగారు ఇంటర్వ్యూ చేసే అధికారులు అదే ప్రశ్నని.

"ఈ ఫొటో చూస్తే నీకేమనిపిస్తోంది? "

అతడు దానివంక దీర్ఘంగా చూసి చెప్పాడు.

"ఇతనికి కాంటాక్ట్ లెన్స్ వున్నాయి"

ఇంటర్వ్యూ చేసే అధికారులు వెంటనే, ఆ ఫొటోకి సంబంధించిన వివరాలున్న కాగితాన్ని చదివి తృప్తి చెందారా సమాధానానికి.



"ఈ ఉద్యోగం నీకే ఇవ్వదలచాం"

"థాంక్స్ సర్" చెప్పాడతను ఆనందంగా.

"ఇప్పుడు చెప్పు. ఇతనికి కాంటాక్ట్ లెన్స్ ఉన్నాయని ఎలా గ్రహించావు? " అడిగాడు మళ్ళీ.

"అది కనుక్కోవడం తేలిక. ఇతనికి ఉన్నది ఒకటే చెవికాబట్టి, కళ్ళజోడు పెట్టుకోవడం కుదరదు. పైగా ఒకటే కన్ను కాబట్టి ఆ ఒక్క కంటికి కళ్ళజోడు వేస్ట్. అందుకని ఆ ఒక్క కంటికి కాంటాక్ట్ లెన్స్ ధరించి ఉంటాడనుకున్నాను"

**–పృథ్వీరాజ్**

## హెచ్చరిక

ఒక అమెరికన్ పిట్టకథ ఇది! వైట్‌హా





స్‌లో అమెరికన్ ప్రెసిడెంట్ అధికారిక నివాస భవనం. అందులో ప్రెసిడెంట్ పడక గదది. క్లింటన్ మీద ఇంపీచ్‌మెంట్ కార్యక్రమం జరిగే రోజులవి.

ప్రెసిడెంట్ క్లింటన్ భార్య హిల్లరికి అకస్మాత్తుగా మెలకువ వచ్చింది. ఎదురుగా ఉన్న గోడ గడియారం వంక చూసింది. చీకట్లోనైనా రేడియం ముళ్లు కాబట్టి టైం స్పష్టంగా కనిపించింది.

రెండూ ముప్పావు.

ఇంక కొద్ది గంటల్లో తెల్లారబోతోంది. పక్కనే పడుకుని ఉన్న క్లింటన్ కూడా గాఢనిద్రలో వున్నాడు. హిల్లరి మెల్లిగా మంచం దిగింది. కింగ్ సైజ్ మంచం పక్కనే, నేల మీద ఉన్న బాత్‌రూం స్లిప్పర్స్ తొడుక్కుంది.



నాలుగడుగులు బాత్ రూంవైపుకివేసి ఏదో ఆలోచన వచ్చిన దానిలా ఠక్కున ఆగింది. వెనక్కి తిరిగి మంచంవైపు మళ్లీ నడిచి గాఢనిద్రలో వున్న క్లింటన్‌ని భుజంమీద తట్టి పిలిచింది.

"డార్లింగ్... హనీ..."

ఆయనగారికి మెలకువ రాలేదు.

"మై స్వీట్ హార్ట్... మైడియర్" మళ్లీ తట్టి లేపింది.

ఈసారి మెలకువ వచ్చిన క్లింటన్ లేచి హిల్లరి వంక, గోడగడియారం వంక చూసి గట్టిగా ఆవులించి అడిగాడు.

"ఏమిటి ఇంత అర్ధరాత్రి నిద్రలేపావు?"

"నేను బాత్‌రూంకి వెళ్తున్నాను డార్లింగ్"

"అది చెప్పడానికా నన్ను నిద్రలేపింది?"

"అవును"

ఆశ్చర్యంగా భార్య వంక చూసి అడిగాడు

"నా అనుమతి లేకుండా నువ్వు బాత్ రూంకి కూడా వెళ్లకూడదని నేనెప్పుడైనా ఆంక్ష పెట్టానా?"

హిల్లరి మొహంలో క్షణాల్లో విచారం ప్రవేశించింది.

"నేను బాత్‌రూంలోకి వెళ్లివచ్చే లోగా మంచంమీది నా భాగం అలాగే ఖాళీగా ఉంచమని హెచ్చరించడానికి నిన్ను లేపాను"

చెప్పి శ్రీమతి క్లింటన్ మాస్టర్ బాత్‌రూం లోకి వెళ్లింది.

**–మల్లాది**

---

# ఎంత లేటో

బస్సు స్టాండులో జనాలు కిటకిటలాడి పోతున్నారు. కూర్చునేందుకు బల్లలు చాలక నేలమీదే కూర్చున్నారు కొందరు. మరికొందరు ఆ సాహసం చేయలేక నిలబడే వున్నారు రాని బస్సును తిట్టుకుంటూ. ఏడ్చే పిల్లల్ని సముదాయించలేక తల్లులు అవస్థ పడుతుంటే వాళ్ల చుట్టూనే తిరుగుతున్నారు తినుబండారాలమ్మేవాళ్లు.

సిగరెట్టు కాల్చుకుంటూ బస్సు కోసం ఎదురుచూస్తున్నాడు మారుతీరావు. అప్పటికే మూడుగంటలయింది తను బస్టాండు



కొచ్చి ఎదురుచూపుల్తో ఏమీ తోచక పది సిగరెట్లు ఊది పారేశాడు. అసలే ఆలస్యంగా బయలుదేరాడు. దానికితోడు బస్సులేటు. ఆఫ్‌డే లీవ్ ఇవ్వని ఆఫీసర్‌ని తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టేశాడు తనకొచ్చిన తిట్లన్నీ.

చిన్ననాటి స్నేహితుడు రాజేంద్ర "పెళ్లికి నాలుగు రోజులు ముందుగా రావాలి" అంటూ స్వయంగా వచ్చి మరీ పిలిచి వెళ్లాడు. ఆఫీసులో ఆడిటింగ్ కూడా ఇప్పుడే తగలడాలా? శలవు ఇవ్వనుగాక ఇవ్వనని మొరాయించాడు ఆఫీసరు శతమొండి శంకరరావు. వాడి ఇంటిపేరులోనే ఏడ్చింది మొండితనం. అది వాడికి బాగా వంట పట్టే




సింది. ఆఖరికి పెళ్లిరోజునన్నా ఆఫ్‌డే శలవు ఇమ్మని శతవిధాల బతిమాలాడు. "ఊహూ! ససేమిరా" అంటూ భీష్మించుకున్నాడు.

చేసేదిలేక ఆఫీసవర్స్ అయిన తర్వాతే బయలుదేరాడు. అదృష్టం ఏమిటంటే పెళ్లి మరీ ఏ ఎనిమిది గంటలకో కాక రాత్రి రెండు గంటలకి ముహూర్తం. ఆ మర్నాడు ఆదివారం కూడా కలిసి వచ్చింది. కనీసం పెళ్లి సమయానికైనా వెళ్లి 'సారీ చెప్పుకోవచ్చు'. ఆలోచనలు సాగిపోతున్నాయే తప్ప బస్సు వచ్చే జాడలేమీ కన్పించడంలేదు.

నిల్చుని నిల్చుని కాళ్లు పీకుతున్నాయి. చుట్టూ చూశాడు ఖాళీ బల్లలేమైనా కనపడతాయేమోనని. ఎక్కడా ఖాళీ బెంచీ కంటికానలేదు. ఏ మాత్రం రద్దీ తగ్గలేదు. పెళ్లిళ్ల సీజను. వచ్చిన బస్సుల్లో ఏ కొందరో వెళ్లినా మళ్లీ కొత్తవాళ్ల రాకతో ఆ స్థానం భర్తీ అవుతోంది. "హు" అంటూ విసుగ్గా నిట్టూర్చాడు మారుతీరావు.

ఎన్నిసార్లని చదువుతాడు గోడలమీదున్న ఎడ్వర్టయిజ్‌మెంట్లు వగైరా వగైరాలని. ఓ పక్క రైల్వే టైంటేబులు. మరోపక్క బస్సు వేళలు తెలిపే పట్టిక. ఎన్నిసార్లు చదివినా అవే రూట్లు, అవే టైములు.

తనకి కావలసిన రూటులో గంటకి రెండు చొప్పున బస్సులున్నట్టు రాసివుంది. అంటే ఈ పాటికి నాలుగు రెళ్లు ఎనిమిది బస్సులు వచ్చి వుండాలి. కానీ ఒక్కటి... ఒక్కటంటే ఒక్కటి రాలేదు. అసలే ఆఫీసరు మీద కోపంతో ఒళ్లు మండిపోతోంది. బస్సు రాకపోవడం పుండుమీద కారం చల్లినట్టు వుంది. ఆ పక్కన ఎంక్వయిరీ కౌంటర్లో గుమాస్తా కునికిపాట్లు పడుతూ కనిపించాడు. అవన్నీ ఒక ఎత్తైతే బస్సు రాకపోకల పట్టీ తనవంక హేళనగా చూస్తూ వికటాట్టహాసం చేస్తున్నట్టుగా అన్పించడం మరో ఎత్తయింది.

చేతిలో కాలుతున్న సిగరెట్టుని విసిరికొట్టాడు. విసవిసా నడుచుకుంటూ ఎంక్వైరీ దగ్గరకి వెళ్ళాడు. విసురుగా బల్లమీద కొడుతూ "ఏయ్ మిష్టర్. మీకు గవర్నమెంట్ జీతాలిస్తున్నది నిద్రపోవడానికి కాదు" అంటూ విరుచుకుపడ్డాడు తనది వృధా ప్రయాసన్న విషయం తెలిసే.

అదే సినిమాల్లోనయితే దున్నపోతుమీద వాన కురుస్తున్నట్టు సింబాలిక్‌గా చూపించే వారేమో. "ఇది మాకు మామూలే" అన్నట్టు అతి తాపీగా కళ్ళు తెరిచాడు ఎంక్వైరీ క్లర్కు. ఏంటన్నట్టు చిరాగ్గా చూశాడు మారుతీరావు వంక. "నాలుగ్గంటుల్నుంచి ఎదురు చూస్తున్నాను. ఒక్క బస్సురాలేదు. ఎందుకయ్యా అన్ని బస్సులున్నట్టు ఆ బోర్డులు... ఆ రాతలు" కసురుకున్నాడు క్లర్కుని మారుతీరావు.

వేదాంతిలా ఓ నవ్వు నవ్వాడు ఆ గుమస్తా. "పిచ్చి వాడా" అంటున్నట్టుగా చూశాడు మారుతీరావు వంక. "ఆ బోర్డులలా వుంటేనే కదయ్యా మీకే బస్సులు ఎంత లేటో నేను చెప్పగలిగేది" గీతా రహస్యం బోధించే కృష్ణుడిలా ఓ ఫోజుపెట్టి మళ్ళీ తన నిద్రలోకి సాగిపోయాడు.

వెర్రిముఖం వేసుకోవడం మారుతీరావు వంతయింది.

–సూరిపండు

---

# మూడు కోరికలు

ఓ రోజు కృష్ణారావు తన ఇంట్లోని పాత లాంతర్లని తీసి తుడుస్తూండగా ఓ లాంతరులోంచి ఓ భూతం ప్రత్యక్షమైంది.

"నరుడా! నువ్వు కోరే మూడు కోరికలు తీరుస్తాను. అడుగు" చెప్పిందా భూతం.



"మంచిది. పది కోట్ల రూపాయలు నేను కోరుకునే మొదటి కోరిక" చెప్పాడు కృష్ణారావు.

ఒక్క చిటికెలో పది కోట్ల రూపాయలు అతని పేర స్టేట్‌బ్యాంక్‌లో వేసిన ఫిక్స్‌డ్ డిపాజిట్ల తాలూకు పత్రాలనిచ్చిందా భూతం.

వాటిని సరిచూసుకుని తృప్తిచెందాక రెండో కోరిక కోరాడు కృష్ణారావు.

"నాకో లక్ష జానీవాకర్ స్కాచ్ బాటిల్స్ కావాలి"

మరు క్షణంలో అతనింట్లో లక్ష జానీవాకర్ బాటిల్స్ గల కేసులు ప్రత్యక్షమయ్యాయి.

అవిచూసి తృప్తి చెందాక చెప్పాడు కృష్ణారావు.

"ఇక నా ఆఖరి కోరిక. నన్ను చూడగానే ఏ టీనేజ్ అమ్మాయి అయినా సరే తప్పనిసరిగా ముద్దెట్టుకుని, అనుభవించాలి"

"అలాగే" అని ఆ భూతం మాయమైంది.

మరుక్షణం కృష్ణారావు ఫైవ్‌స్టార్ చాక్‌లెట్ బార్‌గా మారిపోయాడు.

–డి.పద్మజ



# చతుర

సంపుటి : 23    సంచిక : 1    ఫిబ్రవరి 2000

జోరున ముసిరే దోమల మధ్య, గాలి ఆడని ఉక్కపోతలో, చీకటిగా వున్న జైలుగదిలో ఒంటరిగా ఉందామె. నిద్రపట్టని కళ్లతో శూన్యంలోకి రెప్పవాల్చక చూస్తున్నా... మనసు మాత్రం గతజీవితం తాలూకు ప్రతి ఘట్టాన్నీ... నెమరు వేసుకుంటోంది.

వరకట్నాలను నిషేధించాలనో, కులాంతర వివాహాలను ప్రోత్సహించాలనో, అనాథ స్త్రీ, శిశుమందిరాలను నడపడానికి చేయూతనివ్వాలనో నినాదాలిచ్చే తీరుకాదామెది. వీటన్నిటికీ ఆధారమైన మూలాల్లోకి చొచ్చుకుపోయి వాటిని వేళ్లతోసహా పెకలించి, సాంఘిక చట్రాన్నే మార్చాలనేది ఆమె ధ్యేయం. అందుకు ఆమె చేసిన పోరాటం ఎలాంటిది? దాని ఫలితం ఏమిటి?

మరోసమాజ నిర్మాణం కోసం... మమతల్నీ... మాతృబంధాన్నీ కూడా మరచి విప్లవించిన మగువ మనోభావాలకు సాహిత్య స్వరూపం...

జతిన్‌కుమార్ రచన

# వేకువపూలు

ఈ నెల చతుర సమగ్ర నవల.

"అమ్మా! నే వెళ్తున్నా" అంటూ సమత అడుగు బయటకేసింది. "అదేమిటే! ఎన్ని సార్లు చెప్పినా "వెళ్ళొస్తాను అనవుగదా!" తలపైకెత్తింది వరలక్ష్మమ్మగారు "ఏం పిల్లలో- ఏం కాలమో!" అని గొణుగుతూ.

"వెళ్లిన పిల్ల రాక ఏమవుతుందిలే! నీ చాదస్తంగానీ, నువ్వు వెళ్ళిరామ్మా" అని సాగనంపాడు కూతురిని వెంకటరామారావు గారు.

రోజూ వినే ఆ మాటల్ని పరధ్యానంగా వింటూనే చకచకా కదిలిపోయింది సమత.

పుస్తకాలు, టిఫిన్‌బాక్సూ పట్టుకొని, కాలేజీకి వెళుతున్న కూతురివైపు ఆప్యాయంగా చూస్తూ కూర్చున్నాడు ఆయన. దొడ్లో పూసిన గులాబి సమత జడలో ఒద్దికగా కూర్చుని సందుమలుపు తిరిగేదాకా ఆయనకు వీడ్కోలు చెబుతూనే వుంది ఎర్రనెర్రగా నవ్వుతూ.

పూర్తి పేరు చెబితే ఎవరికీ తెలియరాయన. 'కె.వి.ఆర్. మాష్టారు' అంటే ఎవరయినా ఇట్టే పోల్చుకుంటారు. రిటైర్ అయి ఐదేళ్లు కావొస్తున్నా చిన్న పిల్లలకి కూడా ఆయన కె.వి.ఆర్. మాష్టారే!

ఇంట్లోకి వెళ్ళి ఓ పుస్తకం పట్టుకొచ్చి వరండాలో కూర్చుని చదవసాగాడు. పుస్తకాలు ఆయనకి మంచి నేస్తాలు. ఎందరికో జీవితపాఠాలు నేర్పిన ఆయనకు ఎన్నో పాఠాలు చెప్పేవి ఆ పుస్తకాలు. ఆయన అరవై సంవత్సరాల జీవితంలో సంపాదించిన ఆస్తిపాస్తులు పుస్తకాలు మాత్రమే! ఎక్కడెక్కడో ఉద్యోగరీత్యా తిరిగివచ్చినా, రిటైర్ అయ్యేనాటికి మిగిలింది ఈ పల్లెటూళ్ళో తండ్రులనాటి చిన్న పెంకుటిల్లే. ఆయన సంపాదించుకున్నది పెద్ద కూతురికి పెళ్ళి చేశాడన్న ఖ్యాతి- ఆ ఖ్యాతి పొందడానికి చేసిన అప్పు. అది ఇంకా తీరని అప్పు.

"నాన్నా! నాకు పెళ్ళి చేయగలవా, లేదా?" అని మూగగా అడుగుతున్నట్లు తిరిగే రెండో కూతురు ఝాన్సీ సంపాదనే ప్రస్తుతం ఆ సంసారానికి ఆధారం. ఆయనకు వచ్చే కాస్త పెన్షను, నలుగురైదుగురు పిల్లలకి సాయంత్రాలు ట్యూషన్ చెప్పి సంపాదిస్తున్న 'డబ్బు' పాత అప్పులకింద చెల్లిపోతూనే వుంది. నిజంగా చూస్తే ఆ పెంకుటిల్లు, దాని చుట్టూ వున్న కాస్త చోటు వాళ్ళకీ స్థితిలో కల్పవృక్షం అనే చెప్పాలి. ఆ చారెడునేల కాయో, పండో, ఆకో, పువ్వో ఏదో ఒకటి దయగా ఇస్తుంది. గుంభనంగా వరలక్ష్మమ్మగారు ఆ సంసారాన్ని నడుపుకొస్తోంది. అందుకనే టౌనుకు పది హేనుమైళ్ళ దూరంలోవున్నా ఇద్దరు కూతుళ్ళూ రోజూ టౌనుకు, ఇంటికీ తిరగడం కష్టమయినా ఆ వూళ్లోనే స్థిరపడిపోయారు.

పిల్లలకు చదువు చెప్పించగలిగినందుకు సంబరపడి పోతుంటాడాయన అప్పుడప్పుడూ. మొదటి కూతురు స్వరాజ్యం డిగ్రీ చదువుతుండగానే ఏదో సంబంధం కలిసివొచ్చిందని అంతా పట్టుబట్టడంతో పెళ్ళి చేసేశాడు. అల్లుడు ఎక్కడో దూరంగా మున్సిపల్ ఆఫీసులో ఉద్యోగం చేస్తున్నాడు. ఇప్పటికి పెళ్ళి అయి ఏడు సంవత్సరాలయినా ఇంకా ఆ అప్పు పూర్తిగా తీరలేదు. స్వరాజ్యం పుట్టింటికి వొచ్చి రెండు కాన్పులు చేసుకుని వెళ్ళింది. కొత్త మర్యాదలు ఏమీ జరగటంలేదని అల్లుడితోపాటు ఆ అమ్మాయికీ కొంచెం కష్టంగానేవుంది. అందుకనే పెద్దగా రాకపోకలు లేవు. ఏ పండగకో పబ్బానికో తలచుకోవటమే తప్ప ఆమె గురించి పెద్దగా దిగులూ లేదు. సంతోషమూ లేదు.

ఝాన్సీకీ- స్వరాజ్యానికి మధ్య రెండు సంవత్సరాలు కూడా ఎడంలేదు. బి.కామ్. పూర్తిచేసిన ఝాన్సీ ఐదేళ్ళనుంచీ ప్రైవేటు ఉద్యోగాలు చేసింది. టైపు, షార్టుహేండు లాంటి ప్రక్రియలెన్నో వొంటపట్టించుకుని మొత్తానికి సంవత్సరం క్రితం ప్రభుత్వ ఉద్యోగం సంపాదించుకుంది. ఆ తంటాలన్నీ పాపం ఆ అమ్మాయివే. ఉదయం

వెళ్ళటం రంచనుగా వెళ్ళినా, సాయంత్రం ఏ వేళకు తిరిగివస్తుందో తనకే తెలియదు. పగలంతా ఉద్యోగం చేసి ఇంటికి వొచ్చిన తర్వాత నయినా తీరికగా కూర్చోదు ఝాన్సీ. ప్రైవేటుగా యమ్.కామ్. చదువు తోంది. ఎక్కడెక్కడికో వెళ్ళటం, పుస్తకాలు తెచ్చుకోవటం! తన లోకం తనది. ఇంట్లో వున్నా, లేకున్నా తేడా తెలీదు.

కళ్లల్లో కాంతి తగ్గిపోతూ, జవసత్వాలుడి గిపోతున్నట్టు నిస్తేజంగా తిరిగే ఝాన్సీని చూస్తే రామారావుగారికి తన చేతకానితన మంతా రూపుకట్టుకొని కళ్ళముందు తిరుగు తున్నట్లు అనిపిస్తుంది. కూతురి పెళ్ళి చేయ లేకపోయామే అనే బాధకన్న ఆడపిల్ల సంపాదన తింటున్నామనే బాధ వెయ్యింత లుగా వుంది ఆ తల్లిదండ్రులకి. ఆ పిల్ల సంపాదన మీద ఆశతో పెళ్లిచేయటంలేదని నలుగురూ ఎక్కడ నవ్విపోతారో అని సిగ్గు పడుతుంటారు ఇద్దరూ. "కనీసం దాని జీతం దాచివుంచినా ఈపాటికి ఏ అయ్యకో ముడిపెట్టే వాళ్ళంగదా!" అని వాపోతూ వుంటుంది వరలక్ష్మమ్మగారు. ఝాన్సీ మన సులో ఏముందోకానీ పైకి ఏమీ తేలదు. చిన్నప్పటినుంచీ ఆ అమ్మాయి తీరే అంత. ఏదయినా చేసింతర్వాతనే ఇతరులకి తెలి యటం.

మూడో కూతురు సమత, ఝాన్సీకంటే ఏడేళ్లు చిన్నది. చూస్తుండగానే ఎదిగిపో యింది. బి.యస్.సి. చదువుతోంది. ఇంకెంత నాల్గు నెలలుపోతే ఆఖరి పరీక్షలు ఇస్తుంది. అయినా అమ్మానాన్నలకు ఆఖరి పిల్ల కావటంతో సమత అంటే 'ఇంకా చిన్న పిల్ల' అనే భావమే వుంది. నిస్సారంగా గడి చిపోతున్న వాళ్ళ జీవితాల్లో సమత ఒక ఆనందం. ఒక పాట పాడినా, ఒక ఆట ఆడినా, ఏదయినా చర్చ సాగించినా అన్నిం టికీ ఆ ఇంట్లో సమతే. సమతే ఆ ఇంట్లో ఒక సందడి. ఒక సంబరం.

తండ్రి కూర్చుకున్న పుస్తకాలన్నీ ఏనాడో చదివేసింది సమత. తమ ఇంట్లోనేకాక చుట్టూ వున్నవాళ్ళ జీవితాలను క్షుణ్ణంగా పరిశీలించింది. చిన్న వయసుకే పెద్ద అవ గాహన కలిగింది. జీవితంపట్ల సమ్యక్‌దృష్టి, జీవనంలో హుందాతనం ప్రతి పనిలోనూ ఆత్మవిశ్వాసం, ప్రతిమాటలోనూ ఆలోచన కనిపిస్తూవుంటాయి.

ఇంత తాత్విక పరిశీలన, సామాజిక దృష్టి వున్న ఆమె భవిష్యత్తు ఎలా వుంటుందా? అని ఒక జిజ్ఞాస మాష్టారికి.

చేతిలో పుస్తకం వున్నా మనసు నిలబడ టంలేదు. చిన్నగా లేచి వెళ్ళి ఇంటిముందు వున్న నిమ్మ చెట్లకు పాదులు సరిచేయసా గాడు. ఇంతలో ఝాన్సీ ఆఫీసుకు బయలు దేరి బయటకు వచ్చింది. తండ్రి వంక చూసి "ఏమయినా కావాలా నాన్నా? " అని అడిగింది.

ఇంటికోసం తప్ప తన కోసం ఏమీ అడ గడాయన.

"అమ్మనడుగమ్మా" అంటూ తల తిప్పుకు న్నాడాయన.

ఓ క్షణం తండ్రికేసి చూసి ఝాన్సీ గేటు మూసివెళ్ళిపోయింది. వెళుతున్న కూతురి వంక భారంగా చూస్తూ మళ్ళీ తన పనిలో, ఆలోచనల్లో మునిగిపోయాడాయన.

"మేష్టారూ" పెద్ద కంఠంతో కేక వేసు కుంటూ వచ్చాడు కుటుంబయ్య.

"కుటుంబయ్యా! రావయ్యా... రా..." అని తోటలోనుంచే బదులు పలికాడాయన.

"అగ్గి మండిపోతావుంది. ఈ వయసులో ఈ పనులేమిటి. కాస్త నీడపట్టున సాయంత్రం చేసుకోవచ్చుగదా" అంటూ వరండా గచ్చుమీద కూలబడ్డాడు కుటుం బయ్య చెమటలు తుడుచుకుంటూ.

"సాయంత్రం మళ్ళా ట్యూషన్ పిల్లలు వస్తారుగదయ్యా! అయ్యో... అలా కింద కూర్చున్నావేమిటి? ఆ మంచం వాల్చుకు కూర్చో" అంటూ చేతులు కడుగుకొని వచ్చారు మాష్టారు. ఆయనే మంచం వాల్చి



"ఏమిటి చెప్పు" అన్నారు. తను పడక కుర్చీలో కూర్చుంటూ.

కుటుంబయ్య లేచి మంచంమీద కూర్చుని "మీరే చెప్పాలి మేష్టారూ! మొన్న నేను చెప్పిన విషయం ఏం ఆలోచించారు? నేనీ పూట పట్నం బయలుదేరుతున్నా. మీరు సరేనంటే, వాళ్ళకి అక్కణ్ణుంచే ఫోను కలుపుతాను" అన్నాడు.

కుటుంబయ్య మాటలు విని వరలక్ష్మమ్మ గారు కూడా బయటకు వచ్చింది. ఆయన ఈమధ్య ఝూన్సీకి ఒక సంబంధం పట్టుకొచ్చాడు. కుండలో నీళ్ల గ్లాసులో పట్టుకొచ్చి ఆయనకిస్తూ "ఏమిటోనయ్యా! ఆయనకై ఆయన తిరగాలేరు. నీలాంటివాళ్ళు చెప్పినా చురుకూ లేదు" అన్నది భర్తమీద నెపం వేస్తూ.

"నన్ను ఏం చేయమంటావు చెప్పు. మళ్ళీ ఈ ఇంటిమీద అప్పు తేవటం తప్ప. అదేదో పెళ్ళిఖర్చులకే చాల్తుంది. వాళ్ళు కనీసం పదిహేనువేలయినా అడుగుతున్నారుకదా! అదెక్కడినుంచి తీసుకురాను? చేతిలో డబ్బు లేకుండా పరుగులు తీసి ఏమిటి ప్రయోజనం? " అన్నాడాయన.

"డబ్బు లేదని చేతులు ముడుచుకుంటే పెళ్ళవుతుందా మేష్టారూ? అసలు పెళ్లికొడుకుల ధరలు ఎలా మండిపోతున్నాయి? ఇంకా వీళ్ళేదో మంచివాళ్లు. అమ్మాయి ఉద్యోగం చేస్తోందికదా! అని సరిపెట్టుకుంటున్నారు. ఇంత మంచి అవకాశం మళ్ళా వస్తుందో, రాదో! ఈసారి మీరు తొందరపడాలి మేష్టారూ!" అన్నాడు కుటుంబయ్య.

"నీకు తెలియని మాటలు నా దగ్గరేం వున్నాయి చెప్పు. పెన్షను డబ్బులతో బతుకులు గడవటమే కష్టంగా వుంది. తాతల నాటి ఈ ఇల్లే లేకపోతే 'అలో... లక్ష్మణా!' అంటూ నడివీధిలో నిలబడాల్సిన పరిస్థితి. ఝూన్సీ జీతం సగంపైగా అప్పులు తీర్చటానికే సరిపోతోంది! నెలనెలా వడ్డీ కట్టేసరికి తాతలు దిగివస్తున్నారు. ఆపైన చిన్నా చదువు వొకటి వుందా! ఏమి చెయ్యాలో పాలుపోవటం లేదయ్యా"

"అలా అంటే ఎలాగండీ! మీరు నిప్పులాంటి మనిషని అందరికీ తెలుసు. 'మేష్టారు మహామంచివాడు' అని తప్ప మరోమాట వినలేదు నేను బుద్ధి ఎరిగింతర్వాత. మీరు నోరు తెరిచి అడిగితే ఎవరయినా ఇంత అప్పు ఇస్తారు. అసలు పదిహేనువేలు అంటే ఈ రోజుల్లో ఒక లెక్కా? ఆపైన దేవుడే వున్నాడు" తనకు తోచిన సలహా చెప్పాడు కుటుంబయ్య.

"అడిగితే ఇస్తారయ్యా! కానీ తీర్చే మార్గం ఏది? అది లేకుండా ఏమని తీసుకురాను అప్పు? ఇదిగో మీవాళ్ళనో ఆరు నెలలు గడువు అడగవయ్యా. ఇంతలో చిన్నా డిగ్రీ చేతికి వస్తుంది. అదేదో ఉద్యోగంలో చేరుతుంది. ఈ ఇల్లు కాస్తా అమ్మేసి ఝూన్సీకిస్తాను. రాలిపోయే ఆకులం. ఏ చెట్టుకింద నిలబడ్డా మా రోజులు గడిచిపోతాయి"

"కాస్త ఈ సాయం చేశావంటే నీ పేరున ఇంట్లో రోజూ దీపం వెలిగిస్తానయ్యా" అన్నది వరలక్ష్మమ్మగారు మధ్యలో అందుకుంటూ.

"అంతమాటన్నావేమిటమ్మా! ఏదో తెలిసినవాళ్ళు. వాళ్ళమాట ఇక్కడా- ఇక్కడిమాట అక్కడా కలపటమేగా నేను చేస్తున్నది. బరువు ఎత్తుకొనేది మీరేనయ్యో" అని మాష్టారివైపు తిరిగి "అదికాదు మేష్టారూ! మీకు ఎన్నాళ్ళుగానో చెబుతున్నాను. నా మాట వినిపించుకోవటంలేదు మీరు. స్వతంత్ర పోరాటంలో మీరు ఎన్నో త్యాగాలు చేశారుకదా! క్విట్ ఇండియా ఉద్యమంలో మూడేళ్ళకు పైగానే జైలులో వున్నారని అందరూ చెప్పుకుంటారు. అలాంటివాళ్ళకందరికీ ఫించను పతకాలు ఇస్తున్నారుగదండీ- మీరేమీ పట్టించుకోరాయే! కాస్త ఆ కాగితాలేవో నా మొఖాన కొట్టండి... నేను సాధించుకొస్తాను ఆ డబ్బులు... కాలుమీద కాలు వేసుకుని కూర్చున్నా





రోజులు' గడిచిపోతాయి" అన్నాడు కుటుంబయ్య.

"అలా చెప్పు నాయనా! నీ కడుపు చల్లగా! ఆ టైములో జేబులుకొట్టి జైలుకు వెళ్ళిన వాళ్ళు కూడా ఫించన్లు తెచ్చుకున్నారు. ఈయనేమో దానికీ కదలరు" అన్నది వరలక్ష్మమ్మగారు.

"వీళ్ళేదో ఫించన్లు ఇస్తారనీ, శాలువాలు కప్పుతారనీ ఆశించికాదు నేను ఉద్యమంలో పాల్గొన్నది. అదో జాతీయవెల్లువ. అందులో నేనూ ఒక కెరటంలా పొంగాను. అంతే! నా బాధ్యత అనుకున్నాను. జైలుకు వెళ్ళాను. ఇవ్వాళ నన్ను అధికారం వున్న రౌడీ గాంగుముందు చేతులు మోడ్చి బిచ్చ మడుగుకోమంటారా? " ఆవేశంగా వణికారు మాష్టారు.

"ఇదయ్యా! అసలు చిక్కు. ఈ వయసులో ఆ ఆవేశం ఏమిటి చెప్పు. రిటైర్ అవ్వటానికి ముందు, ఆరు నెలలు జైలులో వుండివచ్చారు ఈ ఆవేశం కారణంగానే. అయినా దేశం సంగతి ఎత్తితే చూడు. ఆ ఉడుకు చల్లారదు. 'గుంపులో గోవిందా' అని కాస్త తలవొంచితే చాలు. అమ్మాయిలు బాగుపడిపోతారుకదా" కుటుంబయ్యతోనే అన్నదావిడ.

"ఏమిటి గోవింద కొట్టేది? గుండాగిరీ, జబర్దస్తీ రాజ్యం చేస్తున్నాయి. అవినీతి, అక్రమం గద్దెలెక్కాయి. ఎందరో మహామహులు అకుంఠిత దీక్షతో చేసిన పోరాటాల ఫలితం ఈ స్వాతంత్ర్యం. దాన్ని కొంత మంది స్వార్థపరులు తమ హక్కు భుక్తం చేసుకుంటున్నారు. కల్లబొల్లి కబుర్లు చెప్పి పదవులకు ఎగబాకటానికీ, ఆస్తిపాస్తులు కూడబెట్టి కుబేరులవ్వటానికీ వాడుకుంటుంటే అలాంటివాళ్ళకు జైకొట్టాలా? "

"కాలాన్ని బట్టి మారాలికదా మేష్టారూ!" అన్నాడు కుటుంబయ్య. ఈ పూట ఆ సంగతి పూర్తిగా తేల్చాలనుకొన్నాడాయన.

"మారటానికి సిద్ధమేనయ్యా! కానీ ఇది దిగజారటంకదా! నా మనసు ఒక పట్టాన ఒప్పుకోవటంలేదు. ఆ ప్రస్తావనే నా దగ్గర ఇక తేకండి. గాంధీగారి సిద్ధాంతాలను నిలువెత్తు గోతిలో పూడ్చిపెట్టిన ఈ ప్రభుత్వాలు పెన్షన్లు ఇచ్చి, పతకాలుకట్టి స్వాతంత్ర్యయోధుల నోళ్ళు మూయించాలని చూస్తుందేకానీ వాళ్ళపట్ల మర్యాద, మన్నన చూపించటానికి కాదు. ఆ డబ్బులు తీసుకోవటంకంటే పదిళ్లముందు నిలబడి బతికిచెడ్డవాణ్ణి అని అడుక్కు తినటం ఎక్కువ మర్యాద" అన్నారు మాష్టారు కటువుగా.

ఇక ఆయనకి చెప్పి లాభంలేదని "సరే మేష్టారూ! నేను బయలుదేరతా. పట్నం పని ఒకటివుందా! మీరడిగినట్టు గడువు ఇస్తారేమో కనుక్కుంటాను వాళ్లని" అని లేచి చెప్పుల్లో కాళ్లు దూర్చాడు కుటుంబయ్యగారు.

"అలా ఒప్పించి కాస్త పుణ్యం కట్టుకోవయ్యా" అంటూ మాష్టారు ఆయన్ని సాగనంపారు ఆశగా.

"అమ్మాయ్... సమతా... సాయంత్రం వచ్చేప్పుడు కాస్త ఆ దుర్గాబ్రాండు కాఫీ పొడరు తెచ్చి పెట్టమ్మా. మా తల్లిగదూ! రంగయ్య కొట్లోది అమ్మో చింతపిక్కలపొడి. అది తాగలేకపోతున్నాను" అంటూ ఐదు రూపాయల నోటు అందించింది వీధి చివరింటి మామ్మగారు.

"అలాగే మామ్మా" అంటూ నోటందుకుని "ఇక నేను వచ్చేవరకూ గుమ్మంలోనే కూర్చునేవు. లోపలకు వెళ్లు" అంటూ ముందుకు సాగింది సమత.

సమత ఉదయం 7.30కే బయలుదేరి ఫస్టు బస్సులో టౌనుకు వచ్చేస్తుంది. ఝాన్సీ తొమ్మిది గంటల ట్రిప్పులో బయలుదేరుతుంది. సాయంత్రం వచ్చేపుడు మాత్రం సాధారణంగా ఇద్దరూ ఏడు గంటల బస్సులో వస్తారు కలిసి. కాలేజీ అయిపోయినా సమత అక్కడే లైబ్రరీలోనో, లేడీస్ హాస్టలులోనో కూర్చుని చదువు

కుంటూ వుంటుంది. తను ఇంటికి వచ్చిం దంటే క్లాసు పుస్తకాలు చదవదు. తండ్రితో చర్చలే!

తమ జీవితం అలా ఎందుకుందో తండ్రికి అర్థం గాకపోయినా జీవితాలను శాసిస్తున్న ఆ సామాజిక సత్యాలను సమత అర్థం చేసుకుంటోంది. తండ్రికంటే స్పష్టంగా భవిష్యత్తులోకి చూడగలుగుతోంది. తండ్రిలోని గుండె దిటవు, ఆర్ద్రత, సమాజంపట్ల స్పందన పుణికిపుచ్చుకొంది సమత.

"నలభై సంవత్సరాలు కలిసి కాపురం చేసినా తండ్రి ప్రభావం తన తల్లిమీద ఏమాత్రం పడలేదేమిటా? " అని సమతకు ఆశ్చర్యం. తమ ఇంటి నాలుగు గోడలు తప్ప మరో విషయం గురించి తల్లి ఆలోచించటం సమతకు తెలియదు. వంటిల్లు ఆమెకు మహా సామ్రాజ్యం. తన పిల్లల్ని కూడా ఏనాడూ అందులో అడుగు పెట్టనీయలేదావిడ.

"మమ్మల్నీ నేర్చుకోనీయవే" అని సమతే గునిసినా "ఇదేం బ్రహ్మవిద్యా! పెళ్ళిళ్లు అయ్యాక ఎలాగూ తప్పదు. అప్పుడు మీకే వస్తుంది. నేనేం చేయనీయనిప్పుడు? " అంటూ తన పని తను చేసుకుపోతుంటుంది.

ఆలోచనల్లో మునిగి బస్సుకోసం ఎదురు చూస్తున్న సమత వులిక్కిపడింది బొంయ్యంటూ వచ్చి కీచుమంటూ ఆగిన బస్సును చూసి.

"గులాబి బుగ్గలను తాకాలని వుంది" అని పాట అందుకుని సడెన్‌గా సమత భుజం మీద చేయివేశాడు వెనక కూర్చున్న కుర్రాడు.

"ముళ్లు గుచ్చుకుంటాయి తమ్ముడూ" అంది సమత వెనక్కి తిరిగి.

ఒక్క క్షణం బిక్కచచ్చినట్లయి వెంటనే పక్కవాళ్లతో ఏవో కబుర్లలోకి దిగాడతను. కానీ సమత ఒదిలిపెట్టకుండా "నీపేరేమిటి తమ్ముడూ" అంది మళ్లీ.

"శేషగిరి అంటారండీ" అన్నాడతను.

"నీతో కొంచెం మాట్లాడాలి. కాలేజీలో కలుస్తావా" అడిగింది సమత.

"నాతోనా!" అంటూ ఆశ్చర్యంగా నోరు తెరిచాడు. బస్సు దిగేవరకూ మళ్లీ నోరెత్త లేదతను ఈవిడ ఏం చేస్తుందా అనే ఆలోచనలతో.

కాలేజి టౌనుకు మైలు దూరంలో కట్టారు. బస్సు కాలేజీ దగ్గరే ఆపి చాలా మంది దిగిపోతారు. సమత, కుర్రాళ్లు అలాగే దిగారు.

"చూడు శేషగిరీ, మీది ఏ వూరు? ఎవరబ్బాయివి? మీ నాన్నగారు ఏం చేస్తారు? " బస్సు దిగగానే ఇలా మాట్లాడటం మొదలెట్టింది సమత.

"ఈవిడ ఏదో పెద్ద ప్లానులోనే వుందిరా దేవుడా! కొంపదీసి ప్రిన్సిపాలు దగ్గరికి తీసుకెళ్లి సస్పెండ్ చేయించదుగదా! ఆ... ఆయన మాత్రం ఏం చేస్తాడులే" మనసులో ఇలా భయపడుతూనే సమతతో మాట్లాడుతున్నాడు శేషగిరి.

"నీ కంఠం చాలా బావుందోయ్. పాటలు చక్కగా పాడగలవు. నాకు తెలిసినవాళ్లు మన కాలేజీ వాళ్లు కూడా వున్నారులే. ఒక నృత్యరూపకం తయారుచేస్తున్నారు. వాళ్లకి చక్కగా పాడేవాళ్లు కావాలి. నువ్వు పాడతావా? " అని అడిగింది.

పదిమందిలో గుర్తింపు కలిగేట్లయితే ఏ పనయినా చేస్తాడు శేషగిరి. వెంటనే ఎగిరి గంతేసినంత పనిచేసి "ప్రదర్శన ఎక్కడండీ" అడిగాడు.

"ముందు కాలేజీలో వేస్తారు. ఆ తర్వాత టౌను హాలులో వేద్దామనుకుంటున్నారు. ప్రదర్శన సక్సెస్ అయితే హైదరాబాద్‌లో మీటింగులు వున్నాయి. అక్కడికి కూడా వెళతారు" చెప్పింది సమత.

అంతే శేషగిరి ఏవో కలలు కనసాగాడు. "నేను పాడతానండీ" అన్నాడు తేరుకుని.

సమత చిన్నగా నవ్వి "మరి ఈ ప్రదర్శ

నలో నువ్వు పాడవలసింది సినిమా పాటలుకావు. ప్రేమగీతాలు అసలే కావు. మేము తయారు చేసిన పాటలు. జీతాలు రాలేదనీ, ధరలు పెరుగుతున్నాయనీ ఇలా వుంటాయి ఆ పాటలు" అంది.

అలాంటి విషయాలు పాటలెలా అవుతాయా అని సందేహిస్తూనే టౌను హాలులో ప్రదర్శనకదా అని "ఏవయినా సరే పాడగలనండీ" అన్నాడు శేషగిరి ఉత్సాహంగా.

"అలా అయితే రేపు ఆదివారం ఉదయం పదిగంటలకు కాలేజీ ఆడిటోరియం దగ్గర కలువు" అని చెప్పి సమత తన క్లాసు వైపు వెళ్ళిపోయింది.

అంతదాకా మాట్లాడకుండా మౌనంగా అన్నీ వింటున్న అబ్బాయి "అరేయ్ శేషూ! ఈ అమ్మాయితో దూరంగా వుండటం మంచిదిరా. నాకేదో భయంగా వుంది. నువ్వు చేసిన వెధవ పని నేను చూశాను. ఇంకో అమ్మాయి అయితే ఎంత గొడవ చేసేది? ఈవిడ చూడు ఆ విషయమే ఎత్తలేదు"

"చూడు మోహన్... పదిమంది ముందూ పాడాలనీ, స్టేజీ ఎక్కాలనీ నాకు ఎంత కాలంగానో ఉన్నా ఇంతవరకు ఆ ఛాన్సు రాలేదు. ఇప్పుడు అవకాశం వచ్చింది. వెళ్ళి చూస్తాను. అక్కడికి వెళ్ళాక నాకు నచ్చకపోతే పాడను అని చెబితే ప్రాణాలు తీయరుగదా!" అన్నాడు శేషగిరి.

"అదే! నేను చెప్పబోయేది. ఈ డ్రామాలవీ తయారుచేస్తున్న వాళ్ళు ప్రాణాలు తీసేవాళ్ళేనట. నక్సలైటు గ్రూపని మా అన్నయ్య చెప్పాడు. ఈ అమ్మాయి నాన్న జైలుకు కూడా వెళ్ళాడట. తెలుసా!" అన్నాడు మోహన్.

మోహన్ అన్నయ్య సమత క్లాసే కావటంతో శేషగిరి ఆలోచనలో పడ్డాడు. కొంచెంసేపు అయ్యాక నక్సలైటు గ్రూపులో పాడటం అంటే చాలా వీరోచితకార్యం అన్న భావం లాంటిది ఏదో అతని ఎదలో కదిలింది. అసలు నిజం ఏమిటో స్వయంగా తెలుసుకుందాం అని కూడా అనిపించింది.

"సరే నేను వెళ్ళి చూస్తాన్రా" అన్నాడు.

"నాకు తెలిసింది చెప్పాను. తర్వాత నీ ఇష్టం" అని మోహన్ కూడా మౌనంగా వుండిపోయాడు.



"హలో! సమతా"

లైబ్రరీలో చదువుకుంటున్న సమత ఆ పిలుపు విని తలెత్తి చూసింది.

"ఓ సౌందర్యా! అమ్మాయిగారు ఎప్పుడు వచ్చారు వూరినించి" ఆనందంగా అడిగింది సమత.

"రాత్రే వచ్చాను. అనవసరంగా టెలిగ్రాము ఇచ్చి పిలిపించారోయ్" అన్నది సౌందర్య సమాధానంగా.

సౌందర్య వాళ్ళ నాన్నగారు డిప్యూటీ తహసీల్దారుగా ఈ వూళ్ళోనే పనిచేస్తూ ప్రమోషను మీద దూరంగా ట్రాన్స్‌ఫర్ అయ్యారు. ఒక్క సంవత్సరం భాగ్యానికి కాలేజీ మార్చటం ఎందుకులే అని సౌందర్యను హాస్టలులో వుంచారు. ఈ డిగ్రీ పూర్తి కాగానే పెళ్ళి చేసే ఏర్పాట్లలో వున్నారు. తమ డిపార్టుమెంటులోనే కొత్తగా చేరిన కుర్రాడొకడిని పట్టాడాయన. అతనికి

చూపించాలనే సౌందర్యను పిలిపించింది.

"అయితే పెళ్లి చూపులన్నమాట!" అంది సమత విషయం విని.

"పెళ్లీలేదు... చూపులు లేవు. నేను యం.యస్.సి చేసిన తర్వాతే పెళ్లి చేసుకునేది అని గట్టిగా చెప్పి వచ్చేశాను" అంది సౌందర్య.

పైకి అలా అంటుందికానీ చదువుమీద సౌందర్యకు అంతశ్రద్ధ లేదని సమతకు తెలుసు.

"కెమిస్ట్రీ లాబ్‌కు వెళ్దాం వస్తావా" అడిగింది సౌందర్య.

"ఈ పూట మనకి ఫిజిక్సు ప్రాక్టికల్సు. అవీ కాన్సిలు చేశారు"

"నాకు తెలుసు. కెమిస్ట్రీ లాబ్‌లో ధీరజ వుంది. దాన్ని కలిసి వద్దాం" అన్నది సౌందర్య. 'సరే పద' మని బయలుదేరారు ఇద్దరూ.

"ఏమిటి, నన్ను లేపకుండానే వచ్చేశావు? " అడిగింది సౌందర్య ధీరజను చూస్తూనే.

"నువ్వు రాత్రి వచ్చేసరికి చాలా పొద్దుపోయిందికదా! ఈ రోజు కాలేజీకి రావేమో అనుకున్నా! అందుకనే నేను వచ్చేశాను" అంది ధీరజ సంజాయిషీగా.

ధీరజ, సౌందర్య హాస్టలు రూమ్‌మేట్సు. ధీరజ తండ్రి పెద్ద మోతుబరి రైతు. ప్రత్యేకంగా ఒక ఇల్లు తీసుకుని వుంచుదామనుకున్నాడు కూతురిని. కానీ ధీరజే పట్టుబట్టి హాస్టల్లో చేరింది.

ఏవో పొడిపొడి మాటలు సాగాయి. మాట్లాడుతున్నంతసేపూ సౌందర్య చూపులు దిక్కులు వెతుకుతున్నాయి.

"ఈ వేళ హరీష రాలేదులే" గుసగుసలాడింది ధీరజ.

"అబ్బే, అదేంలేదు. నీకోసమే నేను వచ్చింది" అంది సౌందర్య.

రెండు నిమిషాలు గడిపి మళ్లీ ఇద్దరూ లైబ్రరీకి దారితీశారు. లైబ్రరీ దగ్గర పార్కు చేసిన చిలకపచ్చ రంగు వెస్పా చూస్తూనే, "నువ్వెళ్లు సమతా! నాకు వేరే పని వుంది" అని సౌందర్య కాలేజికి ఒక పక్కగా పెంచిన చిన్న గార్డెన్‌వైపు వెళ్లింది.

★ ★ ★

"సమతా! సౌందర్య వ్యవహారం నాకేమీ నచ్చటంలేదు. నేను చెప్పినా వినిపించుకోవటంలేదు. కాస్త నువ్వయినా చెబుదూ" అంది ధీరజ ఒకరోజు సమతతో.

"ఏ విషయంలో" అడిగింది సమత.

"ఇంకే విషయం? ఆ హరీషతో తిరగటం గురించి. ఇదేమో పిచ్చిదానిలా అతనితో తిరుగుతోంది. ఖచ్చితంగా పెళ్లి చేసుకుంటాడని నమ్ముతోంది. అందుకే వాళ్ల నాన్నగారు చూసిన సంబంధం తిరస్కరించి వచ్చేసింది"

"మంచిదేగా ధీరూ! తనకు నచ్చిన వాడిని చేసుకుంటుంది. మనం ఎలా అభ్యంతరం చెబుతాం? " అంది సమత.

"చేసుకుంటే ఫరవాలేదు. కానీ నాకేమీ నమ్మకంలేదు. అతను ఈమధ్యనే వెళ్లి ఒక అమ్మాయిని చూసి వచ్చాడు. మా బంధువుల అమ్మాయే. ఏదో వానాకాలం చదువు. కానీ ఐదారు లక్షల కట్నం ముట్టచెపుతాడు వాళ్ల నాన్న. హరీష తండ్రి ఛైర్మన్ అయితే ఆ అమ్మాయి తండ్రి సమితి ప్రెసిడెంటు. సంబంధం దాదాపు ఖాయం అయినట్లే అనుకుంటున్నారు మా బంధువులు.

"మరి ఈ సంగతి సౌందర్యకు తెలియదా? " మధ్యలోనే అడిగింది సమత.

"తెలియకేం? నేనే చెప్పాను. అతను పెద్దల బలవంతం మీద అమ్మాయిని చూసి వచ్చాను. పరీక్షలు పూర్తికానీ నిన్నే చేసుకుంటాను అని మాట ఇచ్చాడట. ఇదేమో ఆ మాటలు గట్టిగా నమ్ముతోంది"అంది.

ఇహ ఆరోజు క్లాసులు లేవన్నారు.

"ఓ.కే. నా బస్సుకు టైమయ్యింది. ఇక నేను వెళ్తాను" అని బయలుదేరింది సమత.

★ ★ ★





సాయంత్రం ఐదు గంటలు దాటుతోంది. ఆఫీసులో దాదాపు అంతా వెళ్ళిపోయారు. పేపర్లన్నీ సర్దిపెట్టి, తను అప్పుడే టైపు చేసిన వుత్తరాలు తీసుకెళ్ళి ఆఫీసరు టేబిలు మీదపెట్టింది ఝాన్సీ. ఈ ఆఫీసరు యువకుడే. కొత్తగా పెళ్ళి అయినవాడు. అయినా ఆఫీసు అతనికి మొదటి భార్య అని చెప్పుకుంటారు. తను డిక్టేట్ చేసిన లెటరు అయినా సరే పదిసార్లు చదవందే సంతకం పెట్టడు.

"చూడు ఝాన్సీ అన్నీ బాగానే వున్నాయి. కానీ ఈ లెటరు, సెక్రటేరియట్‌కు వ్రాసింది పొలైట్‌గా లేదు. మళ్ళీ ఓసారి డిక్టేట్ చేస్తాను" అన్నాడు ముక్తసరిగా.

ఒకసారి వాచివంక, అతని వంక అర్థవంతంగా చూసింది ఝాన్సీ. ఆయన అవి ఏమీ పట్టించుకోకుండా డిక్టేట్ చేయడం ఆరంభించాడు. తప్పేదేముంది.

"త్వరగా టైపు చేసి తీసుకువస్తే సంతకం పెట్టేస్తాను. రేపుదయమే పోస్టులో వెళ్ళిపోవాలి" అన్నాడు ఆఫీసరు.

ఝాన్సీవచ్చి టైపుమిషను ముందు కూర్చుని యంత్రంలా మళ్ళీ పని మొదలు పెట్టింది. పక్కరూములో ఝాన్సీ కోసమే నిరీక్షిస్తున్న శర్మ అసహనంగా పచార్లు చేస్తూ చివరికి ఝాన్సీ టేబిల్ దగ్గరకు వచ్చి

"ఇంకా ఎంతసేపు ఝాన్సీ? " అని అడిగాడు.

"అయిపోయింది. ఇదే ఆఖరిది" అంటూనే కార్బన్స్ పక్కనపెట్టి పేపర్లు తీసుకుని ఆఫీసరు దగ్గరకు వెళ్ళింది.

"ఇక నీవు వెళ్ళవచ్చు ఆc... రామలింగంవుంటే నా దగ్గరకు పంపించు" అన్నాడు ఆఫీసరు లెటరును శల్యపరీక్ష చేస్తూ.

"ఈయన ఎప్పుడూ ఇంతే. కనీసం థాంక్స్ అయినా చెప్పడు" అనుకుంటూ ఝాన్సీ బయటపడింది.

ఆఫీసరు ఎవరినయినా సరే ఏకవచనంలో సంబోధించటం తప్ప, ఇంకే విధంగాను అమర్యాదకరంగా ప్రవర్తించడు. తన పని ఖచ్చితంగా చేస్తాడు. ఎవరిసంగతో ఎందుకుగానీ ఝాన్సీకి మాత్రం ఈయన వచ్చిన తర్వాత ఆఫీసు వాతావరణం బాగు పడిందనిపిస్తుంది. ఇంతకు ముందున్న ఆఫీసరు తనే ఆడవాళ్ళ గురించి అసభ్యంగా వాగుతుండేవాడు. ఏవో వంకరచూపులు, వెగటు నవ్వులు రువ్వుతూ. ముఖ్యంగా ఝాన్సీని చాలా తేలిక భావంతో చూసేవాడు.

"ముప్పై ఏళ్ళు నెత్తిమీదకి వచ్చాయి. ఉప్పు, కారం తినటంలేదూ! పైకి అలా గుంటుందిగానీ, వెనక ఏదో గ్రంధం వుండకపోదు" అనేదే ఆయన ఆలోచన. "ఇంకెవరికో ప్రసాదం పెడుతోంది. నాకు కనీసం తీర్థం అయినా ఇవ్వదేమిటోయ్" అని తెగ బాధపడిపోయేవాడు. అది మనసులో వుంచుకుని పైకి సూటీపోటీ మాటలతో తెగ హింసించేవాడు.

ఆఫీసరే అలా చేస్తుంటే మిగతావాళ్ళు వూరుకుంటారా? కొందరు సూటిగాను, మరి కొందరు నర్మగర్భంగాను ఝాన్సీని ఏదో వొకటి అనేవారు. తన లాగే ఆఫీసులో కొత్తగా చేరిన శర్మ మాత్రం కాస్త స్నేహపూర్వకంగా వుండేవాడు. "ఇప్పుడిప్పుడే ఆడవాళ్ళు ముందుకువస్తున్నారు. వాళ్ళకు కాస్త మంచి వాతావరణం కల్పించటం మగవాళ్ళ బాధ్యత. లేకపోతే మూతి కాలిన తెనాలి రామలింగని పిల్లిలాగ ఇక వాళ్ళు ఏనాటికీ ముందుకురారు" అనేవాడు అతను. ఈ సంవత్సరంలోనూ ఇద్దరిమధ్యా కుటుంబవిషయాలు చర్చించుకునేంత ఆత్మీయత పెరిగింది.

తమతో అంత ముభావంగా వుండే ఝాన్సీ, శర్మతో కలుపుగోలుగా వుండటంతో కొందరు చెవులు కొరుక్కున్నారు. కొన్ని పక్షులు శర్మకీ, ఝాన్సీకీ సంబంధాలు అంటగట్టి కూయసాగాయి. వాళ్ళు అలా

అంటున్న కొద్దీ వీళ్ళిద్దరూ మరింత చేరువ య్యారనేది మాత్రం నిజం. మొదట కేవలం సానుభూతి, స్నేహంగా వున్నవారి సంబంధం ఈ మధ్యే ఏవో కొత్త మలుపులు తిరుగుతున్నట్లు వారిద్దరూ గుర్తించారు.

"ఎంత దూరం వచ్చామో చూశావా?" అన్నాడు శర్మ.

టైము చూసుకుంది ఝాన్సీ. తర్వాత పార్కులో పచ్చగా పెరిగిన లానులో, క్రోటన్సు పక్కగా కూర్చున్నారు ఇద్దరూ. వేసవి సాయంత్రం కావటంతో, అప్పటి వరకూ ఆఫీసులో వుడికిపోయిన వాళ్ళకి, పార్కులో చల్లగాలి సేదతీర్చినట్లయింది. లేచి వెళ్ళి రెండు గ్లాసులు లైమ్ జ్యూస్ పట్టుకొచ్చాడు శర్మ. ఇద్దరూ మెల్లగా సిప్ చేయసాగారు.

"ఎంతకాలం ఇలా ఝాన్సీ? నేను చాలా రోజులుగా చెప్పాలనుకొంటున్నాను. మనిద్దరం పెళ్ళి చేసుకుందాం" అన్నాడు శర్మ అనూహ్యంగా.

వాళ్ళిద్దరూ కొంత చనువుగా వున్నా, ఒకరినొకరు కోరుకుంటున్నారనేది ఇద్దరికీ అర్థమయినా, ఎన్నడూ ఆ భావాలు మాటల్లో వ్యక్తం కాలేదు. అందుకే అకస్మాత్తుగా శర్మ అలా అనేసరికి, ఝాన్సీకి ఒక్క క్షణం అర్థం కాలేదు. కానీ ఆ మాటలు మెదడులో ముద్రపడగానే, గుండెల్లో ఏదో తియ్యని భావం వుప్పొంగింది. ఆనంద విద్యుత్తులు శరీరమంతా ప్రవహించాయి. అంతలోనే శతకోటి అనుమానాలు, సంకోచాలు తలెత్తాయి.

తొలి యవ్వన ఉద్రేకాలను ఏనాడో దాటి వచ్చింది ఝాన్సీ. చిన్ననాటినుంచీ జీవితంలో చవిచూసిన చేదు వెంటనే ఏ తీపినీ గుర్తించనీయదు ఆమెను. అందుకే మనసులోని మధురిమల నదిమిపెట్టి, తలెత్తి, శర్మ కళ్ళలోకి పరీక్షగా చూసింది. దీక్షగా ఝాన్సీనే చూస్తున్న ఆ కళ్ళలో పెళ్ళి పందిరి కనపడుతోంది. అతని మనసులో వినిపిస్తున్న కల్యాణ రాగాల పదాలను పలుకుతున్నట్లు పెదవులు మెల్లగా కంపిస్తున్నాయి. ఏమనాలో తెలియక "అది సాధ్యమా" అంది సాలోచనగా.

"అనుమానం ఎందుకు ఝాన్సీ?" ఒక నిమిషం మౌనంగా వుండి, ఝాన్సీ మెల్లగా, దృఢంగా చెప్పసాగింది. "చూడు శర్మా, నాకూ పెళ్ళి చేసుకోవాలనే వుంది కానీ నేను వెళ్ళిపోతే నా తల్లిదండ్రుల పరిస్థితి, నా చెల్లి చదువు- ఏమవుతాయో అని ఒక భయం. నా సంగతి, నా కుటుంబ పరిస్థితి, నా బాధ్యత, అన్నీ నీకు వివరంగా తెలుసు. ఏమగవాడయినా నన్ను తన భార్యగా చేసుకుంటాడనేది నేను నమ్మలేని విషయంగా వుంది.

"నేను పైసా కట్నం ఇవ్వలేను. పైపెచ్చు నాకు పెళ్ళి అయినా నా తల్లిదండ్రుల బాధ్యత వుంది. అందుకే ఏవయినా సంబంధాలు వొచ్చినా ఎవరూ నన్ను చేసుకోవడానికి సిద్ధపడలేదు. కనీసం ఐదారు నెలలు గడువడిగినా తిరస్కరించారు. అందుకనే నేను మానసికంగా ఇక నాకు పెళ్ళి కాదు అనే నిర్ణయానికి వచ్చాను. నన్ను తెలిసిన వాళ్ళందరూ నేను పెళ్ళి చేసుకోను అనుకున్నారు.

"అంతేకాదు తన జీవితంలోనూ, ఆలోచనల్లోనూ నాకు సమాన భాగమివ్వ గలిగిన వాడిని, నా ఆలోచనలకూ, అభిప్రాయాలకు తగిన వాడిని మాత్రమే భర్తగా వూహించగలను. నా మనసు ఇంత పరిపక్వం కాక ముందు ఎవరిని నా భర్తగా నిలిపినా, అతనితో జీవితం పంచుకోగలిగేదానిని. కానీ ఈనాడది అసాధ్యం.

"నీతో పరిచయం అయ్యాకనే నా వూహలకు దగ్గరగా వున్న మూర్తిని నీలో చూడగలిగాను. అయినా నిన్ను పెళ్ళిచేసుకోవాలనుకోవటం అత్యాశ అవుతుందనుకున్నాను. ఈ రోజు నీ అంతట నీవే ఈ ప్రస్తావన తెచ్చావు. నా బాధ్యతల్ని నీవు గుర్తించి




అంగీకరించగలిగితే, నీ భార్యగా బతకడానికి నాకేమీ అభ్యంతరంలేదు" అంది ఏమాత్రం తొందరపాటు లేకుండా.

శర్మకు కూడా ఈ విషయాలు కొత్తవి కాకపోవటంతో అతను సిద్ధంగానే వున్నాడు. "మన సమాజంలో తల్లిదండ్రుల బాధ్యత మగపిల్లలిదిగా వస్తోంది. అయితే మీ కుటుంబం పరిస్థితివేరు. ఆ బాధ్యత నిర్వహించటానికి నా అభ్యంతరం ఏమీ లేదు. నాకు పెద్ద బాధ్యత లేమీలేవు. ఒక్క నా చెల్లెలి పెళ్ళి తప్ప. దానికయినా ఆర్థి కంగా నేను చేయవలసింది ఏమీ లేదు.

"ఝాన్సీ! నేను కూడా ఒక విషయం ముందే చెప్పదలచుకొన్నాను. మన పెళ్ళి కులాంతర వివాహం అవుతుంది. అది నా చెల్లెలి పెళ్ళిని ఆటంకపరచవచ్చు. అందుకే మా శ్రీలక్ష్మి పెళ్ళి అయ్యేవరకూ మన పెళ్ళి జరగదు. దాని పెళ్ళి అయితే మనకు ఏమీ అడ్డువుండదు" అన్నాడు.

శ్రీలక్ష్మి అంటే అతనికి ఎంత అభిమా నమో, ఆమె వివాహం గురించి అతను ఎన్ని కలలు కంటున్నాడో ఝాన్సీకి అంతకు ముందే తెలుసు. శర్మకు ఈ చెల్లెలు తప్ప తోడబుట్టిన వాళ్ళు లేరు. "ఒక్క ప్రాణంగా పెరిగాము" అని పదేపదే చెబుతాడు. ఆ అమ్మాయికీ సంబంధం సిద్ధంగానే వుంది. వాళ్ళ బంధువులబ్బాయే. అందుకే ఝాన్సీ తేలికగా నవ్వేస్తూ "మీకోసం ఎంత కాలమ యినా వేచి ఉండగలను శ్రీదత్తాత్రేయ శర్మ గారూ" అంది కొంత పరిహాసంగా.

తమ భవిష్యత్తు గురించి ముఖ్యమైన నిర్ణయాలు చేసుకున్న ఆ సాయంత్రం వాళ్ళ మనసుల్లోని భావాలు మరువంలా గుభాళి స్తున్నాయి. చుట్టూ అలుముకుంటున్న చీక టినే వాళ్ళు గమనించలేదు. ఝాన్సీ ముందుగా తేరుకుని చుట్టూ కలయజూ సింది. "అమ్మో? ఎంత చీకటిపడిందో" అంది.

"పద బస్సుదాక వస్తాను" అంటూ శర్మ లేచి చేయి అందించాడు.

ఝాన్సీ ఆ చేతిని పట్టుకుని లేస్తూ "ఇదే మన పాణిగ్రహణం" అనుకుంది మన సులో.

ఒకరి పక్కన ఒకరు మెల్లగా ఏడడు గులూ నడిచారు.

★ ★ ★

పరీక్షలకింక నిండా మూడు నెలలు లేవు. త్వరగా ఈ పరీక్షలు పూర్తిచేసుకుంటే ముందు కొంత ఖర్చు తప్పుతుంది. ఆ తర్వాత ఏమిటి? అనేది ప్రశ్నార్థకం. తనకి పోస్టుగ్రాడ్యుయేషన్ చేయాలనీ యూనివర్సి టీలో చదవాలనీ కోరిక వున్న మాట నిజం. కానీ ఇప్పటికే శక్తికి మించి చదివిస్తున్నారు.

అక్క చూపిన మార్గం ఒకటి వుండనే వుంది. తను కూడా ముందు ఏదైనా వుద్యోగం చూసుకుంటే, అటు అక్కకు బరువూ తగ్గుతుంది. ఇటు తల్లిదండ్రుల బాధ్యతా పంచుకోవచ్చు. కొంచెం కాలూ చేయీ కూడదీసుకుంటే అక్క పెళ్ళీ తలపె ట్టవచ్చు"

తన ఆలోచనలకు తనకే నవ్వు వచ్చింది సమతకు.

"ఆడది కోరుకునేది చక్కని కాపురం, చల్లని సంతానం" అని అనుకునే మామూలు ఆడపిల్లలలాగానే ఆలోచిస్తు న్నాను అనుకుంది. అయితే తన పెళ్ళి గురించి కాదు అక్క గురించి ఆలోచిస్తు న్నాను అంతే తేడా అని సర్దుకుంది.

వయసు తేడా ఎక్కువ వుండటం వల్లనో, అసలు ఝాన్సీ ప్రవృత్తిలోనే వుందో కానీ వీళ్ళిద్దరి మధ్య చనువు తక్కువ. ఆలోచ నలు, అనుభవాలు కలిసి చెప్పుకోవటం అనేది లేదు. ఎవరి మనో ప్రపంచం వారిది. అయితే ఇద్దరూ ఒకరి గురించి మరొకరు ఆలోచించకుండా వుండలేరు.

స్వంత సంపాదన వుండి, స్వయం కృషితో పోస్టుగ్రాడ్యుయేషన్ పూర్తి చేయబో తున్న ఝాన్సీకి ముప్పై సంవత్సరాలు



పైబడ్డా ఇంకా పెళ్ళి కాకపోవటం ఇంట్లో ఎంత అసంతృప్తిగా వుందో! వయసు ముదురుతున్న సూచనలు స్పష్టంగా కనప డుతున్నాయి కానీ, ఎంత అందంగా వుంటుంది అక్క. సరి అయిన పోషణ, అలంకారం లేకపోయినా, ఎంత సహజంగా, ఎంత శుద్ధంగా వుంటుంది అక్క. కుదుర యిన మొఖంలో అద్భుతమయిన కళ్ళు! ఎన్ని అర్హతలుండీ ఏమిలాభం? ఈ నేలమీద ఆడదిగా పుట్టడమే పెద్ద అనర్హత అయ్యింది. అదీ డబ్బులు లేని వాళ్ళింట పుట్టటం ఒక శాపంలా పరిణమించింది. తన అక్కలాటి శాపగ్రస్తులు ఎందరో? !

తన సహచరుల్లో ఎందరు లేరు? తమకో అభిరుచి వుందనీ, తమకో ఆలోచన వుందనీ వాటిని గౌరవించగల మగవాడి తోనే జీవితం పంచుకోవాలని ఆలోచిస్తున్న వాళ్ళు లేరు. ఇవన్నీ గొంతెమ్మ కోర్కెలకింద జమకడ్తున్నారు. ఏ ఆలోచనా లేకుండా మగవాడన్న వాడు దొరికితే చాలు, తల వొంచి తాళికట్టించుకుందామని ఎదురు చూస్తున్నారు చాలామంది ఆడపిల్లలు.

ఏ కొద్దిమందో మాత్రం కొన్ని ప్రిన్సిపల్సు పెట్టుకొని వాటి ప్రకారమే జీవిస్తాం అని అనటం వింటోంది. అయితే వీళ్ళయినా తమ వ్యక్తిగత జీవితానికి సంబంధించినంత వరకే ఆలోచిస్తున్నారు. కానీ మొత్తం సమా జంలో స్త్రీ స్థానం గురించి ఆలోచించటం లేదు. వీళ్ళు ఎంతవరకు తమ ఆశయాలను చిత్తశుద్ధితో అమలు పరుస్తారో తెలియదు"

మన జీవితాల్లో వస్తున్న సమస్యలు కేవలం ప్రత్యేకంగా ఒక్కో వ్యక్తికి మాత్రమే సంబంధించినవి కావనీ, ఒక రకం స్థాయిలో జీవించే అనేకమందికి, అదే రకం సమస్యలు వుంటున్నాయనీ తను ఏనాడో గమనించింది. అందుకనే ఆ సమస్యల పరి ష్కారం కూడా అనేకమంది కలిసి వొక వుద్యమంగా సాగితే తప్ప కుదరదని తనకో నమ్మకం.

వొక నృత్యరూపకం పెద్ద ఎత్తున తయా రుచేస్తున్నారు ఆమె లాంటి వాళ్ళు. ఈ దృష్టితోనే కాలేజీ డ్రామాల్లో పాల్గొని అను భవం సంపాదించిన వ్యక్తులు కొందరు న్నారు. అయితే అంతోఇంతో ప్రతిభ వున్న వాళ్ళకు సరిఅయిన అవగాహన లేదు. మంచి ఆలోచనా, అవగాహనా వున్నవా ళ్ళకు కళాప్రతిభ లేదు కానీ అందరికీ పని చేయాలనే వుత్సాహం మాత్రం వుంది. అందుకే అంతా కలిసి సమిష్టి సృష్టిగా రూపకం తయారు చేస్తున్నారు.

సమత నిర్వహణ కృషిలో పాల్గొంటు న్నదే కానీ తను మాత్రం ఏ పాత్రా తీసుకో దలుచుకోలేదు. బోటనీ లెక్చరరు దర్శకత్వం వహిస్తానన్నాడు. ఈయన యూనివర్శిటీ స్థాయిలో బహుమతులు పొందాడు ఇదివ రకు. అయితే నటించడానికి మళ్ళీ అవకాశం రాలేదు. ఆయన చాలా వుత్సాహంగా పాల్గొ నేట్టు కనపడుతున్నాడు. కానీ ఈ కార్యక్ర మాల వెనకనున్న రాజకీయ అవగాహనతో ఆయన ఏకీభవించడు. సరే.. ఆయన ఎన్నాళ్లు వస్తే అన్నాళ్లు చూద్దాం అనుకుం టున్నారు వీళ్లుకూడా.

ఇలాంటి ఊహలతో ఆదివారం కాలేజీ ఆడిటోరియం దగ్గరకి చేరుకుంది సమత. గేటు దగ్గర నిలబడి వున్నాడు శేషగిరి. "లెక్చరరు గారు లోపల వున్నారు." అన్నాడు సమత కనపడగానే.

తనే లేటుగా వచ్చానని సమత కించప డింది. ఇద్దరూ కలిసి లోపలకు వెళ్లారు. పదిమంది అబ్బాయిలు, నలుగురు అమ్మా యిలు వున్నారక్కడ. వాళ్ల మధ్య కూర్చుని తన అనుభవాలు చాలా ఉత్సాహంగా చెబు తున్నాడు లెక్చరరుగారు.

ఇంకో అరగంట అయ్యేసరికి అంతా చేరు కున్నారు. శేషగిరి కూడా మాటలు దులిపే స్తున్నాడు.

అదంతా అక్కడున్న ఆడపిల్లల్ని ఆకర్షించ డానికే అని తెలిసిపోతోంది. అంతా పరిచ




యాలు చేసుకున్నాక ఒక్కొక్కరూ తమకున్న ప్రతిభ ప్రదర్శించసాగారు. శేషగిరి పాట పాడితే అచ్చం ఘంటసాలలాగానే పాడాడని అంతా మెచ్చుకున్నారు.

లెక్చరర్‌గారు, మరో బాధ్యుడూ కలిసి పాత్రల నిర్ణయం చేశారు. సమతని కూడా ఒక పాత్ర తీసుకోమని అంతా బలవంతం చేశారు. "నాకు నటించటం చేతకాదు. అయినా చేయవలసిన పనులు చాలా వున్నాయి" అని సమత తిరస్కరించింది.

అంతా నిర్ణయించాక సంస్థ కన్వీనరు ధర్మతేజ మాట్లాడాడు. "టౌన్‌లోని అన్ని కాలేజీల విద్యార్థులమూ ఈనాడు ఇక్కడ కలిశాం. మనందరినీ కలిపింది ప్రజలకు ఉపయోగపడేలా కళాప్రదర్శనలు ఇవ్వాలనే సంకల్పం. మొదటి ప్రయత్నంగా మనం 'ఈ వ్యవస్థలో స్త్రీల పాత్ర' గురించి ఒక నృత్యరూపకం తయారుచేస్తున్నాం.

పిల్ల వ్యవహారంలా కాక చాలా బాధ్యతా యుతంగా కార్యక్రమాలు నిర్వహించాలి. క్రమశిక్షణతో, సంస్కారయుతంగా ప్రవర్తిం చాలి. ఆడపిల్లలు పనిచేస్తున్నారు కనక నలుగురూ నాలుగు మాటలు అంటారు. మనం అలాంటి నిందలకు అవకాశం లేకుండా ప్రవర్తించాలి"

సంస్థ సభ్యులు కాకుండా కేవలం నాటక ప్రదర్శనలో పాల్గొనటానికి వచ్చినవాళ్ళకు సంస్థ ప్రణాళికలు పంచి, "జాగ్రత్తగా చదివి ఆలోచించండి" అని చెప్పారు.

శేషగిరి లేచి "ఇది కమ్యూనిస్టు సంస్థ అంటున్నారు, కొందరు! నక్సలైటు సంస్థ అంటున్నారు కొందరు. ఈ ప్రదర్శనల్లో పాల్గొంటే ప్రమాదం అని కొందరు అంటు న్నారు. అసలు మీరు ఏ పార్టీ? " అని అడి గాడు.

ధర్మతేజ "కొందరు కావాలని అలా ప్రచారం చేస్తున్నారు. మేము ఈ సంస్థని ఏ ఆదర్శాలతో, ఏ లక్ష్యాలతో ఏర్పరిచామో ఎన్నోసార్లు పబ్లిక్‌గానే చెప్పాం. మీ చేతుల్లో వున్నది మా ప్రణాళిక. ఇవ్వాళ చాలా సంస్థలు ఏదో ఒక రాజకీయ పార్టీ తోకలుగా, పార్టీ ప్రచార వేదికలుగా వున్న మాట నిజం. అందుకనే మనం ఈ సంస్థను అలా కాకుండా ప్రజాసంస్థగా నిర్వ హించటానికి ఏర్పరిచాం. నక్సలిజం, కమ్యూ నిజం అంటే మేం చేయగలిగింది ఏమీలేదు.

"ఈరోజు, మనం ప్రదర్శించబోయే నాటి కను క్షుణ్ణంగా చదివాం. మీరంతా కూడా ఇంకా అందులో చేయవలసిన మార్పులు సూచించారు. చాలావాటిని మేం ఆమో దించాం కూడా. శేషగిరి కూడా పల్లెటూరి జీవితానికి చెందిన కొన్ని అంశాలు చెప్పాడు. వాటిని కూడా మేం అంగీక రించాం. మనం ప్రదర్శించేది ఏమిటో మీ అందరికీ తెలుసు. దాంతో అంగీకరించేవాళ్ళే ప్రదర్శనలు ఇస్తారు. ఈ ప్రదర్శనలో పాల్గొంటే ప్రమాదం అంటే అది మన చేతుల్లో లేని విషయం" అన్నాడు.

"అవును. నాటికలో అభ్యంతరకరమైనది ఏమీలేదు. ఏ అనుమానాలు లేకుండా ప్రద ర్శనలో పాల్గొని విజయవంతం చేద్దాం" అనుకున్నారు కొత్తవాళ్ళు. ఏవైనా అనుమా నాలుంటే అవి లెక్చరరుగారికే మిగిలాయి.

నాటికలో వున్న జనజీవితం, అది చిత్రించ చబడ్డ తీరు శేషగిరికి నిత్య అనుభవం. అయితే అది కళారూపంగా ముందు నిలిచే సరికి చాలా ఉత్సాహపడ్డాడు. గాయకుని గానే కాక ఈ రూపకం తయారుచేయ టంలో తను ఇంకా అనేకరకాలుగా పనిచే యగలనని అతనికి అర్థమయ్యింది. అదే అన్నాడు సమతతో. సినీమాలిన్యంలో ఈదు లాడుతున్న అతనిలోని కళాభిరుచికి ఈ సంస్థలో సరి అయిన ప్రోత్సాహం, సరిఅ యిన దారి దొరికింది. నీకు తెలిసినవి, చేత నయినవి ఇతరులకు నేర్పు. మా సంస్థ నీకు ఆ అవకాశం ఇస్తుంది. ధర్మతేజతో కూడా చెబుతాను" అన్నది సమత.

"మీరు రోజూ రిహార్సల్స్‌కు రారా? " అడి



గాడు శేషగిరి.

"లేదు. నాకు కుదరదు. నాకు కాలేజీ వార్షికోత్సవం పనులువున్నాయికదా. ఎప్పుడయినా వచ్చి చూస్తూవుంటాను" అన్నది సమాధానంగా సమత.

"నిన్నీ సంస్థకు పరిచయం చేసినందుకు నాకు మాట రాకుండా చూడు" అంది.

ఆ మాటల వెనక వున్న అర్థం తెలిసి సిగ్గుపడ్డాడు శేషగిరి.

★ ★ ★

హాస్టలు దాదాపు నిర్మానుష్యంగా వుంది. కాలేజి టైము కావడంతో అంతా వెళ్ళిపోయారు. సౌందర్య మాత్రం గదిలోనే వుంది.

"ఏం చేయాలి? నలుగురిలో నగుబాట్ల పాలవడం తప్ప ఇంక ఏం మిగిలింది? ప్రేమించినవాణ్ణి పెళ్లి చేసుకుని ఇద్దరే ఇద్దరు పిల్లలతో సుఖంగా, సంతోషంగా గడుపుతానని కంటున్న కలలు కల్లలయిపోయాయి

"అందమైన కలల రెక్కల్ని ఎంత నిర్దయగా కత్తిరించివేశావ్ హరీష్! ఎందుకిలా చేస్తున్నావు. నేనేం నేరం చేశానని? నీమీద నిండు నమ్మకంతో నా సౌందర్యమంతా నీ పాదాక్రాంతం చేశానే? నన్ను కాదని నాలు గుకాసుల కాశపడి ఇంకెవరినో చేసుకుంటావా? "

ఆలోచనలు కందిరీగల్లా రేగుతున్నాయి. ఆమె మనసంతా కుట్టికుట్టి వొదులుతున్నాయి. గుండెలనుంచి పొంగే రక్తం కన్నీళ్ళై ప్రవహిస్తోంది. ఆవేదన కన్నీళ్లతో కరిగిపోవడంలేదు. సరిగదా, ఇంకా పొంగి పొంగి వస్తోంది.

"మనం అనుభవించిన సుఖం నాలో ప్రాణం పోసుకుంది. సుఖమే నా పాలిట శాపం అయ్యింది. కాకుల్లా పొడిచే లోకుల మధ్య ఏకాకిగా నేను బతకలేను. అంతే నేను బతికివుండలేను. వుండకూడదు"

సౌందర్య లేచి గబగబా డ్రస్ చేసుకుని ఏదో లోకంలో వున్నట్లు వెళ్ళి తలుపుతీసి నాలుగు మెట్లు దిగింది.

"ఎక్కడికి సౌందర్యా! నీకు వొంట్లో బాగో లేదని చెప్పింది ధీరజ. అందుకనే వస్తున్నాను" అంటూ మెట్లమీద ఎదురుపడింది సమత.

సౌందర్య మారుమాట్లాడకుండా గదిలోకి పరుగెత్తి మంచంమీద పడి ఏడవసాగింది.

సమత గదిలోకి వచ్చి, తలుపులు మూసి అలాగే ఏడుస్తున్న సౌందర్యను చూస్తూ కూర్చుంది. తర్వాత "ఎందుకలా ఏడుస్తున్నావు సౌందర్యా? ఏమిటి నీ బాధ? పోనీ డాక్టరు దగ్గరకు వెళదామా? " అనునయంగా అడిగింది.

"నేను వెళ్ళవలసింది డాక్టరు దగ్గరకు కాదు. వల్లకాటికి" అంది సౌందర్య.

"అదేంమాట సౌందర్యా" అంటూ వారించి "ఎందుకీ బాధ? " బుజ్జగించి అడిగింది సమత.

సౌందర్యకు ఆ క్షణంలో సమత తన కష్టాలు తుడిచివేయటానికి వచ్చిన దేవత లాగ కనిపించింది. అంతే తన అనుమానం బయటపెట్టింది. "నెలమీద పదిరోజులు గడిచిపోయాయి. ఈ సంగతి బయటకు పొక్కకముందే నేను చచ్చిపోవటం మేలు" అని కుళ్ళి కుళ్ళి ఏడవసాగింది.

సమత ఆలోచిస్తూనే "ఈ విషయం హరీష్‌కు తెలుసా? " అనడిగింది.

"అమ్మో! వాడికి తెలిస్తే ఇంకా అలుసయిపోతాను సమతా. ఈ విషయం చెప్పకుండానే, కాళ్ళావేళ్ళాపడి బతిమాలాను. నన్ను అన్యాయం చేయవద్దని వేడుకున్నాను. సమాధానంగా, ఇదిగో! ఈ కార్డు ఇచ్చాడు' ' అంటూ శుభలేఖ చూపించింది.

ఇంకో పదిరోజులలో అతని పెళ్లి. ధీరజ చెప్పిన అమ్మాయితోనే.

సమత చాలా ఆవేశపడింది. "చెప్పు సౌందర్యా, ఈ పెళ్లి ఆపి, హరీష్‌కు, నీకు పెళ్ళి జరిపించమంటావా? మన విద్యార్థి

సంస్థ తలుచుకుంటే జరగనిదేం లేదు. ఒక వేళ హరీష్ వాళ్ళ నాన్నకు భయపడుతు న్నాడేమో. అందరం కలిసి నచ్చజెబుదాం"

"వొద్దు సమతా! నీవేం చేసినా ఇంట్లో తెలుస్తుంది. నా పరువు పోతుంది. ప్రస్తుతం మనిద్దరి మధ్యే వున్న విషయం లోకమంతా తెలుస్తుంది. ఇక నేను తలె త్తుకు తిరగలేను" అన్నది సౌందర్య భయంగా.

"నువ్వెందుకు తలెత్తుకోలేవు. తప్పు చేసింది అతను. తప్పించుకోవాలని పారిపో తున్నది అతను. మీ ఇద్దరికీ పెళ్లి జరిపించే పూచీ నాది" ఇంకా గట్టిగా అన్నది సమత.

"కాదు సమతా. నన్ను అర్థం చేసుకో. గొడవపడటం నావల్ల కాదు. ఒకవేళ అందరి బలవంతంవల్ల ఇప్పుడు పెళ్లి చేసు కున్నా ఆ తర్వాత వాడు నన్ను కాల్చుకుతిం టాడు. ఆ నరకం నేను పడలేను. అసలు అతను నన్ను ప్రేమించలేదు. నాతో ఆడుకు న్నాడు. అంతే.

"మీరు నన్ను ముందే హెచ్చరించారు. కానీ ప్రేమించని వాళ్ళకు ప్రేమ సంగతి ఏం తెలుసు అని నేనే కళ్ళు మూసుకు పోయి కాలు జారాను. శిక్ష నాకే పడాలి. పడింది" అంటూ శూన్యంలోకి చూస్తూ కూర్చుంది. ఒక నిమిషం ఆగి పెద్దగా నవ్వి...

"ఈ కట్నంపెళ్లి పెద్దవాళ్ళ కోసం చేసు కుంటున్నాడట. నేను ఓపికగా నిరీక్షిస్తే, ఆ తర్వాత నన్ను బంగారు భవనంలో పెట్టి, మనసునిండా కొలుచుకుంటాడట. అర్థమ య్యిందా సమతా! నన్ను వుంచుకుంటాడన్న మాట. వుంచుకుంటాడట" అంటూ పిచ్చిగా నవ్వసాగింది.

"ఇంత జరిగాక, అతనెంత అధముడో తెలిశాక, ఇంకా నేను అతని కోసం ప్రాకులా డాలా? ప్రయత్నించాలా?"

"పోనీ అతన్ని శిక్షించవద్దా? అలాంటివా ళ్ళకు గుణపాఠం నేర్పవద్దా?" అంది సమత.

"నాకు నా జీవితం ముఖ్యం. అతనికి శిక్ష పడితే నాకు వొరిగేదేమిటి? ఎవరేం చేసినా, నాకు వీసమెత్తు ఉపకారం లేక పోగా, నేను సంఘం దృష్టిలో చెడిపోయిన దానినవుతాను. ఆ బరువంతా నేను బతు కంతా మోసుకుతిరగాలి. నాకంత ధైర్యం లేదు సమతా"

"మరి ఇప్పుడు ఏం చేద్దామని?"

"సమతా! నీవు రావటం మరో పదినిమి షాలు ఆలస్యమయి వున్నట్లయితే నా సమస్య ఈసరికే తీరిపోయివుండేది. ఎలుక లమందు పొట్లాలు ఎక్కడయినా దొరుకు తాయి"

పది నిమిషాలు ఏమీ మాట్లాడలేదు సమత. ఆ తర్వాత "మనం అనవసరంగా భయపడుతున్నామేమో. ముందు డాక్టరు దగ్గరికి వెళ్ళి పరీక్ష చేయించుకుందాం" అంది.

"నాకు తెలుసు సమతా నేనంత అదృష్ట వంతురాల్ని కానని" అంటూనే డాక్టరు దగ్గ రికి వెళ్ళటానికి సిద్ధమయ్యింది సౌందర్య.

డాక్టర్ సౌందర్యది ప్రెగ్నెన్సీ అని క న్ఫర్మ్ చేసింది.

"అబార్షను చేయించుకోవటం తప్ప ఇంక వేరే మార్గం లేదు" అంది సమత.

"ఈ విషయం నీకు తప్ప ఇంకెవరికీ తెలీదు. ఈ పాపాన్ని ఇక్కడే కడిగివేయిం చుకుంటాను. చివరంటా నాతోడు వుండు సమతా" బేలగా చూసింది సౌందర్య.

సౌందర్య మనోస్థితిని అర్థం చేసుకున్న సమత "నీకేం భయంలేదు. తప్పో, ఒప్పో జరిగిపోయింది గదా! ఇక అది మర్చిపోయి ముందు జీవితం గురించి ఆలోచించటం మంచిది. ఒక స్నేహితురాలిగా నీకు నేను చేయగలిగినదంతా చేస్తాను. బతుకు పండించుకోవటానికే కానీ మండించుకోవటా నికి కాదు. ఒక చిన్న పొరపాటుకు, అదీ ఇద్దరు కలిసి చేసినదానికి, స్త్రీ మాత్రం



నిండు జీవితం బుగ్గిచేసుకోవటం ఏమాత్రం సమర్థనీయం కాదు డాక్టరుగారికి అన్నీ వివరంగా చెప్పిచూద్దాం. ఎంతయినా ఆవిడా ఒక స్త్రీ. ఈ సమస్యను అర్థం చేసుకోగలదు. ఆవిడ మనకు తప్పక సహకరిస్తుందని నా నమ్మకం. నీవేం భయపడకు" అని ధైర్యం చెప్పింది.

ఆ రాత్రే తొమ్మిది గంటలకు అంతా పూర్తిచేసుకుని తేలికయిన మనసులతో హాస్టలు దగ్గర రిక్షాలో దిగారు సమత, సౌందర్య.

ప్రకృతి స్త్రీకి మాత్రం వేసిన శిక్షనుంచి తప్పుకొంది సౌందర్య. కొన్ని గంటల వ్యవధిలో సౌందర్య జీవితంలో ఎంత మార్పు వచ్చిందో! పైకి ఎవరికీ కనిపించవు కానీ తనలో ఎన్ని బడబానల జ్వాలలు. భౌతికంగా అందరిలా వుందికానీ మనో ప్రపంచంలో ఎంతటి మథనం... ఎంతటి వేదన.

కృతజ్ఞతాపూర్వకంగా తలెత్తి సమత కళ్లలోకి చూసిన సౌందర్యకు తల్లీదండ్రీ ఆ కళ్లల్లో కనిపించారు. సమత రెండు అరచేతులూ దగ్గరకు తీసుకుని పదేపదే ముద్దు పెట్టుకుంది. మాటల్లో చెప్పలేని కృతజ్ఞతను సమత అరచేతులమీద వ్రాస్తున్నట్లు సౌందర్య కళ్ళనుంచి నాలుగు చుక్కలు రాలిపడ్డాయి.

"చాల్లే పిచ్చీ! ఈరోజు జరిగిందంతా ఇక్కడే ఇప్పుడే మరిచిపో. మమతలేని మనిషికోసం మనసు పాడుచేసుకోవటం శుద్ధ తెలివితక్కువ. ఇక నీ బతుకును సరికొత్తగా ఆరంభించు" దృఢంగా అంది సమత.

★ ★ ★

నెలరోజులు ఇట్టే గడిచిపోయాయి. ధర్మతేజ, సమతలకు ఈ నెల చాలా బిజీగా వుంది. ఒకవంక నృత్యరూపకం, మరోవంక కాలేజి వార్షికోత్సవం. కాలేజి యూనియన్ కూడా వీళ్ళ చేతుల్లోనే ఉండటంతో వార్షికోత్సవం రెండు రోజులూ ఒక గొప్ప అవకాశంగా తీసుకుని సాంస్కృతిక రంగంలోనూ, విద్యార్థి ఉద్యమాలలోనూ ప్రబలుతున్న అనేక ధోరణులమీద గోష్టి నిర్వహించాలని సంకల్పించారు. రచయితలూ, కళాకారుల్ని కూడా ఆహ్వానించారు.

కాలేజి ప్రిన్సిపాలు, కమిటీ మెంబర్లు మొదట్లో వ్యతిరేకించినా, తలవంచక తప్పలేదు. కాలేజి కమిటీలో రెండు గ్రూపులున్నాయి. ఆ గ్రూపు తగాదాలను తెలివిగా తనకు అనుకూలంగా మలచుకొంటూ ధర్మతేజ పనులు సాగిస్తున్నాడు. ఛోటామోటా సినిమా యాక్టర్లను వార్షికోత్సవానికి ఆహ్వానించటం ఆ కాలేజీ ఆనవాయితీ. దానిని తప్పించి గోష్టి ఏర్పాటు చేశారు ఈ సంవత్సరం.

స్థానిక యం.యల్.ఎ. ప్రోత్సాహంతో కొందరు విద్యార్థులు ప్రిన్సిపాలు దగ్గరకు, డి.యస్.పి. దగ్గరకూ వెళ్ళి ఆ నృత్యరూపకం కాలేజిలో ప్రదర్శించటానికి వీలులేదనీ, అదంతా అతివాద రాజకీయం అనీ ప్రదర్శనను ఆపే ప్రయత్నం చేశారు.

దాంతో "మన కాలేజిలో ఇతర కాలేజి విద్యార్థులు పాల్గొనే కార్యక్రమం ప్రదర్శించటానికి వీలులేదు" అని ప్రిన్సిపాలు ఒక వాదం తెచ్చాడు.

"బయటి కళాకారులు కాలేజి ఉత్సవాలలో పాల్గొనటం ఇది మొదటిసారి కాదు. వందలు, వేలు ఖర్చుచేసి మరీ, పేరున్న కళాకారులను మీరు ఇంతవరకూ ఆహ్వానిస్తూనే వచ్చారు. మద్రాసునుంచి వాళ్ళను కారుల్లో తీసుకువచ్చేవారు. అలాంటిది ఈ సంవత్సరం మన కాలేజి విద్యార్థులు కొంతమంది వేరే కుర్రవాళ్ళతో కలిసి ప్రదర్శన ఇస్తామంటే ఎలా అభ్యంతరపెడతారు? " అని సమత నిలదీసి అడిగింది.

★ ★ ★

నృత్యరూపకంలో పాల్గొంటున్నవాళ్ళంతా కలిసి ఒకరోజు ప్రిన్సిపాలు రూము ముందు ధర్నాలాంటిది చేశారు. ఆయన భయపడిపోయి వెంటనే పోలీసులకు ఫోను చేస్తే,





వాళ్ళు వొచ్చి కొంతమంది విద్యార్థులను అరెస్టు చేసి స్టేషనుకు తీసుకువెళ్ళారు.

విద్యార్థుల్లో చాలామంది, లెక్చరర్లలో కొంతమంది ప్రిన్సిపాలుని వ్యతిరేకించి, ఆయనతో అరెస్టయిన వాళ్ళకు సంజాయిషీ ఇప్పించి విద్యార్థులను విడుదల చేయించారు. ధర్మతేజ ఈ అవకాశాన్ని తీసుకొని విద్యార్థులను అటకాయిస్తున్న, తెరవెనుక స్వార్థరాజకీయవాదుల చర్యలను బాగా ప్రచారం చేశాడు. సమతా వాళ్ళు లాకప్పులో వున్నది కొన్ని గంటలే అయినా, అది వాళ్ళందర్నీ మరింత దగ్గర చేసింది.

శేషగిరి వీటిల్లో చురుకుగా పాల్గొన్నాడు. "ఏదో పాటలు పాడదామని వస్తే లేనిపోని తల నెప్పులు తలకు చుట్టుకుంటున్నాయేమిటా? " అని కొంచెం అనిపించినా అతనిలోని ఏదో శక్తి ప్రోత్సహించింది. "అన్యాయాలు చేస్తున్నదీ వాళ్ళే. అనవసరంగా ఇతరులను శిక్షిస్తున్నదీ వాళ్ళే! ఇలా జరగడానికి ఎంతమాత్రమూ వీలులేదు" అన్నాడతను సమతతో

మొత్తంమీద వాతావరణం చాలా వేడెక్కిపోయింది. అంతా వుద్రేకంగా తిరుగుతున్నారు. సమత స్నేహబృందం మొత్తం ఈ విషయంలో విద్యార్థి సంస్థ వెనక నిలిచింది. చివరికి కార్యక్రమాలన్నీ అనుకొన్న ప్రకారం జరిగాయి. పట్టణంలో ఏర్పడ్డ ఉద్రేకాలవల్ల ప్రజలు కూడా ఎక్కువ సంఖ్యలో పాల్గొన్నారు. వీళ్ళ కార్యక్రమాలు కూడా ఆసక్తిదాయకంగానూ, కళాత్మకంగానూ వుండటంతో మంచి రెస్పాన్సు వొచ్చింది.

బోటనీ లెక్చరరు రఘురామ్ దర్శకత్వంలో తయారయిన రూపకం అందరినీ ఆకర్షించింది. మామూలు పద్ధతులకు భిన్నంగా దానిని ఆయన చక్కగా తయారు చేశాడు. శేషగిరి జానపద నృత్యరీతిని, పాటల పద్ధతిని అందులో చక్కగా మిళితం చేయగలిగాడు. అతని సినిమా పరిజ్ఞానం మొత్తం ప్రదర్శనని ప్రేక్షకులకు ఆసక్తికరంగా సమర్పించటంలో పనికి వచ్చింది.

ఇన్నాళ్ళ వాళ్ళ కృషి గంటన్నర ప్రదర్శనగా వొచ్చి అందరిలోనూ తాము ఏదో చేయగలం అనే ఆత్మవిశ్వాసాన్ని నింపింది.

"ఇన్ని అడ్డంకులను ఎదుర్కొని, ఎవరూ భయపడకుండా నిలిచి ప్రదర్శన ఇవ్వగలగడమే గొప్ప విజయం" అన్నాడు తేజ.

సమత తన మిత్రులతో కలిసి, ప్రదర్శన చూసినవాళ్ళను కలిసి అభిప్రాయాలు సేకరించింది. వాటి ఆధారంగా కొన్ని చిన్న మార్పులు చేసి పది రోజులు తిరగకుండానే టౌను హాలులో ప్రదర్శించారు. ఈసారి విద్యార్థులేకాక అనేక రంగాలకు చెందిన ప్రజలు చాలామంది చూశారు. జనబాహుళ్యంలోకి వెళ్ళాలంటే స్క్రిప్టులో చాలా మార్పులు చేయాలనీ, మామూలు ఆడవాళ్ళకు అర్థంకావాలంటే ఇంకా తేలికగా చెప్పాలనీ అర్థమయ్యింది ఆ బృందానికి.

ఈలోగా శేషగిరి వాళ్ళ వూళ్ళో ఓ సంఘం వాళ్ళు "మీ ఖర్చులకు ఇస్తాం. మన వూళ్ళో మీ నాటకం వేయండి" అని అడిగారు.

ఈ ప్రదర్శన శేషగిరిని చాలా మార్చిందని చెప్పాలి. తన వూళ్ళో ప్రదర్శన కనక అతను అన్ని పనులు నెత్తిన వేసుకుని బాధ్యతాయుతంగా చేశాడు. తమ బృందం రాకపోకలకు, తిండీ తిప్పల ఏర్పాట్లకు అతను ఆ సంఘంవాళ్ళతో కలిసి వ్యవహరించవలసి వచ్చింది. ప్రదర్శన దగ్గర చందాలు వసూలు చేశారు.

ఖర్చులుపోను ఏభై రూపాయలు అదనంగా వొచ్చింది. మీ సంఘ కార్యకలాపాలకు వాడుకోండని చెప్పి వూరి వాళ్ళకే ఇచ్చేశారు విద్యార్థులు.

టౌనులో ఇచ్చిన ప్రదర్శనలకు, దీనికీ మధ్య ఎంతో తేడా వొచ్చింది. అవి హాలులో ఇచ్చారు. ఇక్కడ చిన్న స్టేజీ. చుట్టూరా జనం. తెరలు, లైటింగులాంటివి చాలా ఇబ్బందిని కలిగించాయి. తాము



రూపకాన్ని తయారుచేసిన పద్ధతి గ్రామాలకు పనికిరాదని తెలిసిపోయింది. అయినా రూపకంలోని విషయం పట్టణంలోకంటే గ్రామస్తులనే ఎక్కువగా ఆకట్టుకొంది. పేద స్త్రీలను పీడిస్తున్న దొరను చూసినప్పుడల్లా జనం తిట్టారు.

ఈ ప్రదర్శన అందరికీ కొంత వెలుగునిచ్చింది. శేషగిరి పేరు వూళ్ళో మోగిపోయింది. నలుగురైదుగురు కుర్రాళ్ళు ఆ పాటలు మాకు నేర్పమని అతని వెంట పడ్డారు. తను మామూలుగా సినిమా పాటలు పాడుతున్నప్పుడు కూడా జనం ఆసక్తిగానే వినేవారు కానీ ఏదో తేలికభావం కనిపించేది. ఇప్పుడు వాళ్ళ ఆసక్తిలో తన పట్ల ఏదో గౌరవం కూడా కనిపించింది శేషగిరికి. ఈ గోష్టులు, తమ ప్రదర్శనల సందర్భంగా సమత, తేజలాంటివాళ్ళు చెబుతున్న విషయాలు వింటూ వుంటే తనలో ఏదో మార్పు కలుగుతున్నట్లు శేషగిరికి అనిపించింది. వాళ్ళు చెబుతున్న దృష్టితో తన చుట్టూ జరుగుతున్న విషయాలను పరిశీలిస్తుంటే తను ఇన్నాళ్ళూ కళ్ళుండీ గుడ్డివాడుగా బతికినట్లనిపించసాగింది అతనికి.

సమత అంటే అతనికి అదో ఆప్యాయత, గౌరవం కలిగాయి. ఆమెను తన బతుకు బాగుచేయటానికి వచ్చిన అక్కలా తలపోయసాగాడు.

పరీక్షలు నెలలోకి వచ్చేశాయి. తాత్కాలికంగా అన్ని కార్యక్రమాలు వాయిదావేసి పరీక్షలకు తయారవసాగారందరూ.

★ ★ ★

ఒకరోజు ధీరజ తండ్రి బలరామయ్యగారు, "అమ్మడూ? నాతో ఒక గంట బయటకు రావాల్రా" అంటూ వచ్చారు.

"అలాగే నాన్నగారూ" అంటూ చకచకా తయారై బయటకు వెళ్ళింది ధీరజ. సౌందర్య, సమత రూములో కూర్చుని చదువుకుంటూనే వున్నారు.





తిరిగి వొచ్చిన ధీరజ ఏదోచెప్పలేని ఆనందంతో వెలిగిపోతున్నట్లనిపించింది ఇద్దరికీ. అసలే అందమైన అమ్మాయి. లేత మొగలి రేకుల వర్ణంలో, బారుగా, తగుపాటి లావుగా, ప్రత్యేక శ్రద్ధతో మంచి శిల్పకారుడు తయారుచేసిన గంధపు బొమ్మలా వుంటుంది ధీరజ మామూలుగానే. అప్పుడే ఎండలోంచి రావటంతో పట్టిన చిరుచెమట వల్ల తను లేతమంచు కప్పిన ఎర్ర గులాబిలా వుంది. నిండయిన చెక్కిళ్ళు సిగ్గులూరుతున్నాయి. రూపురేఖలే కాదు, చూడగానే 'చాలా మంచి అమ్మాయి సుమా' అనిపిస్తుంది.

చన్నీటితో ముఖం కడుగుకొనివచ్చి కూర్చుంది ధీరజ. మల్లెలమధ్య పెట్టిన రోజాపువ్వులా వుంది ధీరజ!

పుస్తకాలు మూసిపెట్టి "ఎందుకీ ఆనందం" అన్నట్లు ధీరజ వంక చూశారు మిత్రురాళ్ళిద్దరూ!

"ఈరోజుకు సరిగ్గా ఐదవరోజున నా పెళ్ళి నిర్ణయించారోయ్" అంది నులిసిగ్గుతో, అంతకుమించిన ఆనందంతో.

సమత క్షణంపాటు ఆశ్చర్యపోయింది. సౌందర్య లేచి ధీరజ చేతులు పట్టుకొని "కంగ్రాచ్యులేషన్స్" అంటూ తన పెళ్ళే అన్నంత ఆనందంగా వూపింది.

"అతను అమెరికాలో ఇంజనీరుగా పనిచేస్తున్నారు. నెల రోజులు సెలవుమీద వచ్చారట. పెళ్ళిచేసుకుని వెంటనే వెళ్ళిపోవాలని ఆయన ప్రోగ్రాం. అందుకనే ఇంత హడావుడిగా లగ్నం పెట్టేశారు"

ధీరజకు యూనివర్సిటీ రాంకు వస్తుందని అంతా అనుకుంటున్నారు. తను పోస్టుగ్రాడ్యుయేషన్ ఆపైన రీసెర్చి చేస్తుందని, చేయాలనీ అంతా అనుకునేవారు. ధీరజ కూడా ఫ్రండ్సు ముందు అలాటి మాటలు ఎన్నడూ ఖండించలేదు. ఇంతలో ఇంత అర్థాంతరంగా పెళ్లి అంటే సమతకు నమ్మబుద్ధికావటంలేదు. అందుకనే.

"మరి పరీక్షలు... నీ చదువు...?" అడి

గింది.

"ముందయితే తనతోపాటే అమెరికా వచ్చే యాలన్నారు. మద్రాసు కౌన్సిలేట్‌లో తెలిసి నవాళ్ళున్నారట. వీసా ప్రోబ్లమ్ కూడా లేద న్నారు. కానీ నేనే పరీక్షలు రాస్తాను అంటే చివరికి వొప్పుకున్నారు. పెళ్ళి కాగానే ఆయన వెళ్ళిపోతారు. ఆపైన నెల తిరిగేలోపు నేను స్టేట్స్ వెళ్ళిపోవాలి. చదువు సంగతి ఆ తర్వాతే..." అంతా నిర్ణ యించుకున్న కంఠంతో చెప్పింది ధీరజ.

రెండు గంటలక్రితంవరకూ ఎవరికెవరో తెలియని ఇద్దరు పెళ్ళి పేరుతో ఏకం కావటం, అతనితో కలిసి మరో దేశం ఎగిరి పోవటం, తలుచుకుంటే సమతకు తమాషా గానూ, అంతకుమించి ఏదో విషాదంగానూ వుంది. నిమిషాలమీద జరిగిపోతున్న నిర్ణ యాలు, వాటిమీద మొత్తం బతుకంతా ఆధారపడి వుండటం, తన కెరీర్ అంతా వొదిలేసుకొని అతనితో వెళ్ళటానికి సిద్ధప డటం ఏదో అపశృతిగా అనిపించసాగింది సమతకు. ఆ అబ్బాయి ఎవరో వొప్పుకున్నా డుగానీ లేకపోతే పరీక్షలు వొదిలేసి అయినా వెళ్ళటానికి ధీరజ సిద్ధంగా వుందని సమతకు అర్థమయ్యింది.

ధీరజకు పెళ్ళిచీర పదివేలు పెట్టి తీశారు. పెళ్ళికొడుకు నెక్ టై వేయి రూపాయలట. పెళ్ళి అంతా వీడియో తీశారు. అక్షింతలు చల్లటానికి వచ్చిన పెద్దలను, రాజకీయ నాయకులను ప్రత్యేకంగా అలంకరించిన ఆసనాలమీద కూర్చోపెట్టారు. పెళ్ళి అంద రికీ కనపడాలని టి.వి. సెట్లలో కనిపించే ఏర్పాటుచేశారు. 'ధనికుల విలాసాలు' అని వినటమే కానీ వాటి అర్థం ధీరజ పెళ్ళిలో కొంచెం తెలిసింది సమతకు. హాస్టలు మిత్ర బృందం అంతా రెండు రోజులు తమ పరీ క్షల సంగతి మరిచిపోయి ఆ హడావుడిలో పడ్డారు. సమతే పట్టనట్టు దూరంగా వుంది. మర్యాదకో మొహమాటానికో పెళ్ళి దగ్గర కాసేపు కూర్చుని వచ్చేసింది.

నోట్ల కట్టలకో, బాంకు ఎకౌంట్లకో మధ్య పడుతున్న ముడి తప్ప ఇది ఇద్దరు వ్యక్తులు తమ జీవితాలను కలుపుకునే ఘట్టం కాద నిపించింది సమతకు. "ఎంత బాగా జరి గింది పెళ్ళి అంటే ఎంత బాగా జరిగిందని అమ్మాయిలు గంతులేశారు. ఏ కొందరో మాత్రం 'అంతా బడాయి కాకపోతే ఇదెం దుకు? అదెందుకు?' అని విమర్శించారు. అయితే వాళ్ళ నిరసనల్లో వినిపించింది ఈర్ష్య, తమకు అలా జరగదే అని దిగులు తప్ప-అసలు ఇది ఏమి సంస్కృతి? అని ఆలోచించిన వాళ్ళు లేరు.

ఈ పెళ్ళితో సమతకు అంతకుముందు నుంచీ వున్న భావాలు కొన్ని మరీ ఘనీభ వించాయి. "అందరూ మనుషులే అయినా అందరు మనుషులూ వొకటి కాదు. ఈ సమాజంలో కొందరి జీవితవిధానం, వారి జీవనస్థాయి, ఎందరికో వూహకు అందనంత ఎత్తులోవుంది. ఎందరో కనీస కోర్కెలు తీర్చుకోలేకపోవటం, కొందరు ఇలా మితిమీ రిన పద్ధతిలో మదించటం వెనక వున్న సామాజిక క్రౌర్యం సమతకు చాలా స్పష్ట రూపంలో కనిపించింది. అసలు ఇవి పూర్తిగా రెండు విభిన్న తరగతులకు చెందిన జీవితవిధానాలు, రూపంలో మను షులై ఒక్కలాగే కనిపిస్తున్నారు తప్ప, అన్ని విషయాలలోనూ, అన్ని విలువలలోనూ ఈ సమాజం రెండుగా చీలిపోయి వుంది.

ఆఖరి పరీక్ష అయిపోయిన రోజున అంద రికీ పెద్ద పండగలా అనిపించింది. బాగా రాసిన వాళ్ళు, అంత బాగా రాయనివాళ్ళు అంతా ఆ విషయం మరిచిపోయి కబుర్లలో పడ్డారు. రెండుమూడురోజుల్లో ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళతారు. ఈ పరీక్ష గట్టె క్కినా, లేకున్నా మళ్ళీ ఎవరెవరు ఎక్కడ తేలతారో? ఏమేమి చేస్తారో?

★ ★ ★

మూడు సంవత్సరాలు కొట్టుకుంటూ, తిట్టుకుంటూ, అంతలోనే ఒకటిగా కలిసి



పోతూ అనుభవించిన విద్యార్థి దశ ముగిసి పోతోంది. కలలు, కన్నీళ్ళు, ఆశలు కలబో సుకుని ఎన్నో భయాలతో, అంతలోనే విరిసే విశ్వాసాలతో వాకరికొకరు వీడ్కోలు వచనాలు చెప్పుకుంటున్నారు.

"ధీరూ! అమెరికా ఎగిరిపోతావు. ఇంక మేము గుర్తు వుంటామా? కనీసం వుత్తరా లయినా రాస్తారా? " సౌందర్య అడుగు తోంది.

"అదేమిటి! మన మూడేళ్ళ స్నేహాన్ని, ఈ హాస్టల్ జీవితాన్ని అంతతేలికగా మర్చిపో తానా? సరే! నా సంగతి ఏదో దారిన పడింది. మరి మీ సంగతి? ఏం చేయబో తున్నారు? "

"చేసేదేముంది. చేస్తే పెళ్ళిచేసుకోవటం. లేకుంటే యూనివర్సిటీకి వెళ్ళటం. నేను దేనికయినా సిద్ధంగానే వున్నాను" అంటూ ..."ఇంటికి ట్రంకాల్ పెట్టాను. బయల్దేరే టైమవుతోంది. ఇంకా కాల్ రాలేదు. ఎంక్వ యిరీ చేసి వస్తాను" అంటూ కిందకి వెళ్ళింది సౌందర్య.

"నీ సంగతి ఏమిటి సమతా? ఏమీ మాట్లాడటంలేదు" అంది ధీరజ.

"మా పరిస్థితులు నీకు తెలియనివి కావు ధీరూ! నాకేవో కోర్కెలు వున్నా అవి ఆకాశ కుసుమాలే అని తెలుసు. ఏదో ఉద్యోగం చూసుకోవటం నాకు తప్పనిసరి. ఆ తర్వాతే ఏమి చేసినా"

"కానీ సమతా నీ అంత తెలివిగలవాళ్ళు, ఇంకా చదువుకోకుండా ఏదో చిన్న ఉద్యో గంలో ఇరుక్కుపోవటం ఘోరం"

"నాకంటే ఇంకా ఎన్నో రెట్లు సమర్థుల యిన వాళ్ళెందరో వున్నారు. అందరికీ వాళ్ళ కలలు నెరవేర్చుకునే అవకాశాలు లేవు ధీరజా. పరిస్థితులకు లోబడి సాగుతాయి జీవితాలు"

"ఏమిటి నువ్వింత నిరాశగా మాట్లాడుతు న్నావు? పరిస్థితులను ఎదిరించటమేగా నీ మతం? " ఆశ్చర్యంగా అంది ధీరజ.

"నాది నిరాశ కాదు. వాస్తవాన్ని గుర్తిం చటం. పరిస్థితులు అనుకూలించినట్లు జీవితం సాగిస్తూనే వాటిని మార్చాలి. మన అభివృద్ధికి ఆటంకంగా వున్న పరిస్థితుల మీద దెబ్బతీయాలి! నాకు వునికే లేకపోతే ఇంక ఎదిరించటం ఎలా కుదురుతుంది? "

"ఏమో సమతా! ఒక్కోసారి తలచుకుంటే నాకెంతో భయంవేస్తుంది, నీ బతుకేమవు తుందా అని. ఒక్కోసారి ఎంతో క్యూరియ స్గా వుంటుంది నీ వెంత గొప్ప మనిషిగా మారతావో అని. ఈ లోకం సమస్యలపట్ల నీ ఆవేశం, బాధామయ జీవులపట్ల నీ ఆవే దన, సమాజగతిపట్ల నీ ఆలోచన, స్వంత సమస్యలను పక్కకు నెట్టి ఇతరుల గురించి ఆలోచించే లక్షణం, నీ గుండె నిబ్బరం... ఇవి తలుచుకుంటే నాకెంతో ఆనందంగా వుంటుంది. మానవులందరికీ సుఖసంతో షాలు దక్కాలని నాకూ వుంది. కానీ ఏమి లాభం? ఏది చెయ్యాలన్నా నాకు ధైర్యం లేదు. ఆ ధైర్యం అంతా నా పేరులోనే చిక్కుకుపోయినట్లుంది. అందుకనే కనీసం నీలాంటివాళ్ళు చేసే ప్రయత్నాలకు ఉడతా భక్తిగా ఆర్థికసాయం చేసేది. నేను ఎక్క డున్నా మీ కార్యక్రమాలకు ఏదో ఒక రకంగా డబ్బులయినా అందిస్తాను సమతా" అంది ధీరజ.

"చాలా థాంక్స్ ధీరూ. నీకు నామీద వున్న మంచి అభిప్రాయాలకు భంగం కలి గేలా వుండదులే నా భవిష్యత్తు"

"ఇంకా మాట్లాడుతూనే కూర్చున్నారా? ఆటోలు వచ్చాయి ఇక స్టేషనుకు బయలు దేరాలి లెండిలెండి" అంటూ హడావుడిగా వచ్చింది సౌందర్య. తలా రెండు సామాన్లు తీసుకుని బయలుదేరారు.

"బైబై సమతా! మళ్ళీ ఏనాటికి కలు స్తామో? అప్పటికి నువ్వు ఎన్ని బంగారు పతకాలు సాధిస్తావో? " అంటూ ధీరజ.

"రిజల్ట్సు వచ్చాక రెండో మంగళవారం నాడు ఇక్కడికి వస్తాను. తప్పకుండా కలుద్దాం" అంటూ సౌందర్య వెళ్ళిపో




యారు.

ఏదో తెలియని బరువుతో హాస్టలు చేరుకుంది సమత. లోపలకి అడుగు వేస్తోందో? లేదో! ధర్మతేజ ఎదురొచ్చి "మీకోసమే చూస్తున్నాను. అర్జంటుగా నాతో రండి. దారిలో విషయం చెబుతాను" అంటూ తొందర పెట్టాడు. ఇద్దరూ అట్నుంచి అటే వెళ్ళిపోయారు.

"మన ఇంగ్లీషు జె. యల్. జగదీష్‌చంద్ర, అతని భార్య సుచరిత వాళ్ళంతా కాలిన గాయాలతో హాస్పిటలులో వున్నారు. కాఫీ పెట్టబోతుంటే గ్యాస్ స్టవ్ అంటుకుందట. ముందుగదిలో వున్న జగదీష్ పరుగెత్తుకు వెళ్ళి మంటలు ఆర్పబోయాడట. కానీ ఆమె పూర్తిగా కాలిపోయింది. అతనికీ వొళ్ళంతా కాలింది. వాళ్ళనటు హాస్పిటల్‌కు పంపించి, మీకోసం ఇటు వొచ్చాను. ఆ అమ్మాయి మీ ఫ్రెండు కదా" మాట్లాడుతూ వుండగానే హాస్పిటలుకు చేరారు.

హాస్పిటలు అంతా హడావుడిగా వుంది. నలుగురైదుగురు స్టూడెంట్లు వున్నారు. మిగతా అంతా ఇరుగుపొరుగు వాళ్ళు చేరి కలగాపులగంగా మాట్లాడుతున్నారు. జగదీష్‌చంద్రకు అంత ఎక్కువగా కాలలేదు. పొట్టమీద, చేతులు ముందుభాగం కాలాయి. కానీ చాలాబాధగా కేకలు వేస్తున్నాడు. మధ్యమధ్యలో "నా సుచీని చూడండి డాక్టర్, సేవ్ హర్ ఫస్ట్" అంటున్నాడు.

సమత సుచరిత వున్న దగ్గరికే పరుగెత్తింది. సుచరితకు వొళ్ళంతా పూర్తిగా కాలింది. దాదాపు అపస్మారకంలో వుంది. పక్కనే వాళ్ళత్తగారు "ఎంత పని జరిగిందే తల్లీ... ఏమిటోనమ్మా మాయదారి టైము. ఎన్నడూ లేనిది, వంటింట్లోకి పంపాను. ఇంత ఘోరం రాసి పెట్టాడా దేవుడు" అంటూ శోకాలు పెడుతోంది.

"చూడండి ముందు వైద్యం జరగనీయండి. మీరిలా గోల చేస్తుంటే మేమెలా పనిచేసేది. సిస్టర్ ఈవిడను ముందు బయటకు తీసుకువెళ్ళండి" అన్నాడు డాక్టర్.

"నేను వెళ్ళను డాక్టర్. నా కోడల్ని వొదిలి నేను క్షణం వుండను" అంటూ ఆవిడ దీర్ఘాలు తీస్తోంది.

"చూడండీ! మీరు జగదీష్‌గారి దగ్గరకు వెళ్ళండి. నేను ఇక్కడ వుంటాను" అంటూ సమత రావటం, వార్డు బోయ్‌లిద్దరు అత్తగారిని బయటికి తీసుకువెళ్ళటం వొక్కసారే జరిగాయి.

సుచరిత సమతను గుర్తించగానే ప్రాణాలన్నీ తిరిగి తెచ్చుకున్నట్టుగా బలవంతంగా మాటలు కూడదీసుకొని చెప్పింది.

"ఇది యాక్సిడెంటు కాదు సమతా వాళ్ళే కావాలని పెట్రోలు పోసి అంటించారు. ఉక్రోషంతో ఇంకేమీ చేయలేక నేను ఆయన్ని బలవంతంగా పట్టుకున్నాను. అందుకనే ఆయనకీ కాలింది. అంతే. మా నాన్నకీ విషయం చెప్పు సమతా" చెబుతూనే మళ్ళీ తెలివి తప్పిపోయింది.

"డాక్టర్! వెంటనే మెజిస్ట్రేటును పిలిపించండి. ఈ అమ్మాయి మాటలు రికార్డు చేయించండి" అని కేకవేసింది సమత. కానీ డాక్టరు "అదంతా పోలీసులు చూస్తారమ్మా. ముందు నన్ను వైద్యం చేయనీ" అంటూ రెండు మూడు ఇంజక్షన్లు ఇచ్చాడు. ఆయన ఒక వంక వెనిసెక్షన్ చేసి గ్లూకోజ్ సెలైన్ ఎక్కించాడు. మరో పక్క బ్లడ్ గ్రూపింగ్‌కు ఏర్పాట్లు చేశాడు. ఆయన చేతులు కడుగుకొని వచ్చే లోపలే సుచరిత చనిపోయింది.

అచ్యుతంగారు వచ్చేసరికి పోస్టుమార్టం చేసి శవాన్ని అప్పగించారు. అప్పటికే తేజ, సమత, ఇంకొందరు స్టూడెంట్లు ఏంచేయాలా? అని ఆలోచించారు. మరణ వాఙ్మూలం ఏదీలేదు. నిజం తెలిసింది సమతకు మాత్రమే. హాస్పిటలులో జగదీష్ చంద్ర చెప్పినట్లు యాక్సిడెంటు అని రాశారు. పోలీసులు కూడా అలాగే రాసేసి చేతులు కడుగుకునేలా కనిపించారు. ఏది

ఏమయినాసరే ఈ విషయాన్ని అంత తేలికగా పోనీయకూడదనుకున్నారు స్టూడెంట్లు. విషయం చెబితే ఇరుగుపొరుగు వాళ్లు కూడా చూస్తే 'ఇది హత్యలాగానే వుంది' అంటూ కొందరు ముందుకు వచ్చారు.

అచ్యుతంగారు రాగానే "బాబాయిగారు! సుచరిత నాతో మాట మాత్రంగానయినా ఏమీ అనలేదండీ. వీళ్లు హత్య చేసేంత దూరం ఎందుకు వెళ్లారు. మీకేమయినా వివరాలు తెలిస్తే చెప్పండి. పోలీసు కంప్లైంటు ఇద్దాం" అంది సమత.

"పోనీలే అమ్మా! మనం ఏమి చేసినా నా కూతురు తిరిగి రాదుకదా! వాళ్లపాపాన వాళ్లేపోతారు" అన్నాడాయన. కానీ అంతా గట్టిగా ఒత్తిడిచేస్తే ఆయన చెప్పుకొచ్చాడు.

"తన భర్త, అత్తగారు పైకి ఎంతో మంచిగా మాట్లాడుతారనీ కానీ తనను చాలా బాధపెడుతున్నారని రాసింది సుచరిత. అనుకున్న కట్నం ముప్పైవేలు ఇచ్చేశానమ్మా. కానీ అతనికి కలర్ టీవీ కావాలట. అందరు లెక్చరర్ల దగ్గరా వుంది. మనకే లేదు అంటూ రోజూ దాన్ని సతాయించేవాడట. నాకు తెలిసి ఉత్తరం రాశానమ్మా. "నా కూతురు సుఖంకంటే నాకు కావలసింది ఏముంది. కానీ నా పరిస్థితి కూడా నువ్వు ఆలోచించు బాబూ! వచ్చే సంవత్సరం ఎలాగైనా మీ ముద్దు చెల్లిస్తాను. ఈ మాత్రం టైము ఇవ్వు" అంటూ అల్లుడికే ఉత్తరం రాశానమ్మా. మళ్లీ నెల రోజుల నుంచి మరో కొత్త కోరిక మొదలెట్టాడమ్మా. ఈసారి కాలేజీలు మూయగానే దక్షిణదేశ యాత్ర చేసి రావాలి. మా అమ్మా అందరం తీర్థయాత్రల స్పెషల్‌లో వెళతాం. మూడు వేలు పంపమని ఉత్తరం రాయమన్నాడట అమ్మాయిని. ఈ విషయం రాయనంటే రాయనని కూర్చొందట అమ్మాయి. అతనే ఉత్తరం రాసి దాని చేత సంతకం చేయించి పంపాడమ్మా. అతనికి తెలీకుండా సుచరిత మరో ఉత్తరం రాసింది. "వీళ్లవి హిరణ్యాక్ష వరాలు. ఒకటి తీరితే మరోటి పుట్టుకొస్తూనే వుంటాయి నాన్నా. మీరు ఈ డబ్బు సర్దటానికి తలపెట్టవద్దు. మీరు డబ్బు తెస్తే నా తమ్ముళ్లని, చెల్లెలిని నేను కాల్చుకుతిన్నంత ఒట్టు" అని రాసింది.

అయినా అమ్మాయిని ఏమి చేస్తారో అన్న భయంతో డబ్బు కోసం ప్రయత్నిస్తూనే వున్నాను నేను. ఇంతలో ఈ ఘోరం జరిగిపోయింది" అంటూ శూన్యంలోకి చూడసాగాడు ఆయన.

విషయం అంతా అర్థమయ్యాక అందరిలోనూ ఆవేశం పెరిగింది. అచ్యుతంగారితో కంప్లైంటు రాయించారు. ఒక కరపత్రం రాసి ప్రచురించి వూరంతా పంచిపెట్టారు. అన్ని దిన పత్రికలకూ పోలీసు సమాచారం తప్పనీ, ఇది వరకట్నం తగాదాలవల్ల చేసిన హత్య అనీ ప్రకటనలు పంపారు. తమ ప్రయాణాలు వాయిదా వేసుకుని ఒక సమావేశం ఏర్పాటు చేశారు. ఈ విషయం అంతు చూడాలనుకున్నారు.

ఇటు జగదీష్‌చంద్ర తరపున కూడా కొందరు కదిలి "వాళ్లిద్దరూ అన్యోన్యంగా వుండే దంపతులనీ, జరిగింది కేవలం యాక్సిడెంటు మాత్రమే" అనీ ప్రచారం చేశారు. అంతకంటే ముఖ్యంగా పోలీసులను బాగా మేపారు. ప్రజలలో వున్న ఆవేశంవల్ల అచ్యుతంగారి కంప్లైంటు రిజెక్ట్ చేయలేక పోయామనీ, కానీ తన విచారణలో అది యాక్సిడెంటుగానో, ఆత్మహత్యగానో తేలినట్లు రాస్తానని అభయం ఇచ్చాడు సర్కిలిన స్పెక్టరు. డాక్టరేమో వచ్చిన దగ్గర్నుంచీ ఆ అమ్మాయి అపస్మారకస్థితిలోనే వుందని సర్టిఫికెటు ఇచ్చాడు.

అయినా విద్యార్థులు పట్టుదలగా పనిచేశారు. సమత నాయకత్వంలో ఒక బృందం ఇంటింటికీ తిరిగింది. దినవార పత్రికలలో ప్రచురింపబడుతున్న అనేక వరకట్నం చావుల గురించి తెలియజెప్పింది. అచ్యుతంగారి దగ్గరున్న ఉత్తరాల కాపీలను ప్రచురించి పంచారు. దగ్గర వూళ్లలోవున్న విద్యా

# ఏరిన ముత్యాలు

★ ప్రజ్ఞాపాటవం లేకపోవడంకంటే అశ్రద్ధ అధికంగా కీడు కలిగిస్తుంది
-ఫ్రాంక్లిన్

★ విప్లవాలు, ద్రోహాలు రెండూ దారిద్ర్య సంతతే.
-అరిస్టాటిల్

★ ఇతరులను నిరసించేముందు ఆత్మావలోకనం అత్యవసరం.
-మోలియర్

★ నైపుణ్యాలకు, ఆశయాలకు మధ్య బేధమే అసౌఖ్యం.
-ఎడ్వర్డ్ డి. బోనో

★ దారిద్ర్యానికి ఎన్నోవేళ్లు, కానీ తల్లి వేరే అవివేకం
-లిండన్ జి. జాన్సన్

★ అసత్యాలతో పొందిన విజయంకంటే, నీతిగా పొందే అపజయం మేలు
-ఆర్థర్‌కార్‌వెల్

★ మూఢనమ్మకంతో విజ్ఞానిగూడా అవివేకిని అనుసరిస్తాడు
-ఫ్రాన్సిస్‌బేకన్

★ శాంతంకంటే శక్తివంతమైనదిలేదు. నిజమైన శక్తికంటే శాంతంలేదు
-ఫ్రాన్సిస్ ది సేల్స్

★ జీవితంలో దేన్నైన అనుభవించదలచుకోడానికి మార్గం ముందు దానిని సంపాదించుకోవడం
-జంజర్‌రాగెల్స్

★ తెలిసేది అనారోగ్యం, తెలియనిది ఆరోగ్యం
-థామస్‌ఫుల్లర్

★ సౌందర్యం నిత్యానందం, దాని సొగసు సదాప్రవృద్ధినే పొందుతుంది.
- కీట్స్

★ జీవితంలో అన్నిటికంటే మంచి లక్షణం ఏకాగ్రత
-ఎమర్సన్

★ శీలం గౌరవప్రదం. శీలం ఇతరులకు నేర్పడం మరింత గౌరవప్రదం
-మార్క్‌ట్వేయిన్

★ ఈ ప్రపంచంలో అన్నీ నశించేవే. భావాలు, ఆశయాలు, కలలు తప్ప
-సుభాష్‌చంద్రబోస్

★ మన అవసరాలు ఎంత తగ్గితే దేవుడికి మనం అంత చేరువ అవుతాము
-సోక్రటీస్

★ తనకు హానిచేసిన వారిమీద ద్వేషం ఉండడం మానవనైజం
-టాసిటస్

★ ఆశ్చర్యంలోనుంచే తత్వశాస్త్రం పుడుతుంది.
-సోక్రటీస్

సేకరణ: ఎ. రాంబాబు




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**ఫిబ్రవరి చతుర నవల వేకువపూలు**

..................................................

**సమీక్షకుని పేరు :** ..................................................

**చిరునామా :** ..................................................

..................................................

..................................................

..................................................

ర్థులందరినీ సమీకరించారు. మహిళా సంఘాలను, యువజన సంఘాలను రంగం లోకి దించారు. టౌన్‌బంద్ జరిపారు. జనం కూడా ఏదో వెల్లువ వచ్చినట్లు కది లారు.

జగదీష్‌చంద్రకు కల్గిన గాయాలు మాని హాస్పిటలు బయటకు వచ్చేసరికి రెండు వారాలు పట్టింది. అతను కొందరు రాజ కీయ నాయకులను, తోటి లెక్చరర్లను కలిసి విద్యార్థులకు వ్యతిరేకంగా మరో ఆందోళన లేపే ప్రయత్నం చేశాడు. కానీ స్త్రీలు చాలా చురుకుగా కదిలి అతని ప్రయత్నాలకు పురి ట్లోనే సంధికొట్టించారు. మొత్తం మీద అత నికి కాలేజీ నుంచి సస్పెన్షను, పోలీసులచేత అది హత్యకేసు అని అంగీకరింపచేసిగానీ విద్యార్థి ఉద్యమం చల్లారలేదు. ఫలితంగా జగదీష్‌చంద్రని, అతని తల్లిని రిమాండ్‌కు పంపారు.

ఈ పది రోజుల్లోనూ ఏ రెండుమూడు సార్లో మాత్రం ఇంటికి వచ్చి వెళ్లింది సమత. కూతురు చేస్తున్న ఉద్యమానికి సంతోషపడాలో, ఆమెను ఆటంకపరచాలో తెలీలేదు వరలక్ష్మమ్మగారికి.

"నలుగురితోపాటు నారాయణా అన్నట్లు వుండు. నువ్వో నాయకురాలిగా ముందుకు దూకకు తల్లీ" అని చెప్పనే చెప్పింది. మాష్టారు మాత్రం కూతురు చేస్తున్నదానికి ఒకవిధంగా గర్వించారు. అయినా పోలీ సులు ఏమిచేస్తారో అని ఆవేదన కమ్ము కొంది ఆయనను.

★ ★ ★

"తమ పరువుపోతుందనో, కాపురం చెడి పోతుందనో స్త్రీలు భయపడి నోరు మెదప నంతకాలం ఆడపిల్లల మీద అత్యాచారాలు, నవవధువుల దహనకార్యక్రమాలు సాగిపో తూనే వుంటాయి. ఇలాంటి ఉద్యమాలు బలంగా సాగితే పురుషాహంకారపరుల దౌర్జన్యాలు కొంతమేరకు అరికట్టబడతాయి. కనీసం నేరస్తులు శిక్షింపబడవచ్చు కానీ సుచరితలు, సౌందర్యలు ముందే ధైర్యంగా నిలబడితే జగదీష్‌చంద్రలు, హరీష్‌లు కోరలు తీసిన పాములవుతారు.

ఈ దేశంలో స్త్రీని ఒకవంక శక్తిస్వరూ పిణి, మాతృదేవత అని కీర్తిస్తారు. మరో వంక మధ్య యుగాల బానిసకన్నా అథ మంగా చూస్తారు. అర్థాంగి అని అంగీకరి స్తూనే కాళ్లపట్టాలకన్నా నీచంగా చూస్తారు. అయినా స్త్రీలకు తమ స్థితిపట్ల ఏవగింపు లేదు. ఆత్మగౌరవం అనేది మగవాడికీ, స్త్రీకీ సమానమే అనీ, ఆత్మగౌరవం లేనివ్యక్తి వ్యక్తే కాదనీ గుర్తింపులేదు. ముందుగా ఈ గుర్తింపును కలిగిస్తే తప్ప స్త్రీవిముక్తి వాదాలు, సమానహక్కుల నినాదాలు స్త్రీలను ఆకట్టుకొని సంఘటిత వుద్యమా లుగా ఎదగలేవు. అల్లిబిల్లిగా అల్లుకుంటున్న అనేక వూహలమధ్యనుంచి తన భవిష్యత్ కార్యక్రమాలకు ఒక స్పష్టమయినదారిని ఏర్పరుచుకొంటూ తన జీవిత గమ్యాలను, గమనాలను నిర్వచించుకొంటోంది సమత.



"ఏమిటండీ! ఆడవాళ్లకీ మగవాళ్లకీ మధ్య శతృత్వం ఏమిటీ? మగవాడే ఒక బానిస. ఆడది ఆ బానిసకు బానిస అని చెబుతోంది చిన్నా" అన్నది వరలక్ష్మమ్మ



గారు భర్తతో.

కుటుంబ విషయాలు, వంటలు వాటి రుచులు తప్ప మరో విషయం మాట్లాడని తల్లి ఆవిధంగా అడుగుతుండటం సమతను ఆశ్చర్యపరిచింది. తమ చర్చలు, ఆందోళనలు, ఆవిడలోకూడా ఏవో ఆలోచనలు రేపుతున్నాయని గుర్తించింది సమత.

"అమ్మాయి చెప్పేది దేశంలో వున్న పేద, ధనిక తేడా గురించి. పెద్దపెద్ద ఆస్తిపరులు, భూస్వాములు ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసి పేద ప్రజలను బానిసలుగా చూస్తున్నారని దాని ఉద్దేశం. యజమానుల కిందో, పెద్ద ఆఫీసర్ల కిందో, రైతుల కిందో పనిచేస్తూ బానిసగా అణిగిమణిగి వుండే మగవాడు, ఇంటి దగ్గర మాత్రం ఆడవాళ్ల మీద పెత్తనం సాగిస్తూ వాళ్లను మనుషులుగా కాక బానిసలుగా చూస్తున్నాడని అమ్మాయి చెబుతున్నది" అన్నారాయన.

"ఎవరో కొందరు ఆడవాళ్లను హింసలు పెట్టినంత మాత్రాన మగవాళ్లందరూ చెడ్డ వాళ్లనో, శత్రువులనో అనటం ఏం న్యాయం? ఆ మాటకొస్తే ఆడవాళ్లే ఆడవాళ్లను బాధపెట్టటం ఎక్కువ. అచ్యుతం గారమ్మాయిని అత్తేకదా పెట్రోలు పోసి కాల్చింది. మంచీ చెడూ అని వుంటాయికానీ దానికి ఆడమగ అని పేర్లు పెట్టటం ఏమీ బాగోలేదు"

"కాదు లక్ష్మీ! ఇది మంచీచెడుల మధ్య విభజన కాదు. ఒక సమాజంలో ఒకేరకం మనుషులలో ఎక్కువమంది ఒకేరకం సమస్యలతో బాధపడుతున్నారంటే అర్థం, ఆ సమాజం నడిచే తీరులోనే ఏదో లోపం వుందనుకోవాలి. మన పిల్లలకు పెళ్లికాకపోయినా, అచ్యుతం కూతురిని ఒకరు చంపినా దీని వెనకవుంది డబ్బు సమస్య. ఆ డబ్బు అందరికీ 'అందుబాటులో వుండక దాని మీద భ్రమ పెరుగుతోంది. ఆ డబ్బు అవసరం, లేక మోజు కొందరి స్వభావాన్ని వికృతంగా మారుస్తోంది. చెడ్డవాళ్లుగా మారుస్తోంది.

ఆడపిల్ల అంటే మగవాళ్లకంటే తక్కువ అనే భావమే మన సంఘంలో వుంది. అందుకనే పెళ్లిచేసుకోవటం అంటే మగవాడు తానేదో ఆడదాన్ని ఉద్ధరిస్తున్నట్టు భావిస్తున్నాడు. కట్నాలు కానుకలు డిమాండు చేస్తున్నాడు. అదే పెళ్లి అనేది ఇద్దరికీ అవసరం అనే గుర్తింపు, ఆడ-మగ సమానం అనే భావం వుంటే ఈ బేరసారాలు వేరులోనే కుళ్లిపోతాయి"

తల్లీతండ్రీ మాటలను సమత ఆసక్తిగా వింటోంది.

"అంటే మగవారు కనుక మీరు ఎక్కువ, ఆడదాన్ని కనుక నేను తక్కువ అని కదా మీ మాటల అర్థం. నలభై ఏళ్ల కాపురంలో మీరు పెత్తనం చేసింది ఏమిటి? నేను బానిసగా అణిగిపోయింది ఏమిటి?

చాలీచాలని జీతంతో కాపురం సాగిస్తూ ముగ్గురు పిల్లల్ని పెంచాము. మీరు మాస్టారుగిరీ చేసి జీతంరాళ్లు పట్టుకొచ్చారు. నేను ఇంటిని సక్రమంగా చూసుకున్నాను. ఇద్దరం ఒకటిగానే వున్నాము. ఏ కష్టం వచ్చినా అది బయటినుంచి వచ్చిందేకానీ మనమధ్య విరోధం ఏమీలేదుకదా! ఎప్పుడయినా ఏదయినా భేదాభిప్రాయం వచ్చినా పెద్దవారు చదువుకున్న వారు అని మీ మాట విన్నాను. ఇందులో అంత మునిగిపోయిందేమిటి? "

తల్లి ఈ సంగతేమిటో తేల్చుకోవాలి అన్నట్లు మాట్లాడటం చూసి సమత జోక్యం చేసుకుంది. "అది కాదమ్మా! మనుషుల్లో వున్న సంస్కారం, మంచితనంవల్ల కొంత మంది జీవితాలు బాగానే వుండవచ్చు సంఘంలోవున్న ప్రతికాపురమూ ఘోరంగానే వుందని మా వుద్దేశం కాదు. కానీ ఆడవాళ్లు ఒక జాతిగా చూస్తే మాత్రం రెండో శ్రేణిలోనే వున్నారు."

"ఏమో తల్లీ! నీ మాటలు అర్థమయ్యీ కానట్టు వున్నాయి. పోనీలే! ఈ వయసులో

నాకు తెలిసేమిటి? తెలియకేమిటి? ఏదైనా వొకటే" అన్నదామె.

"ఇందులో అర్థంకాకపోవడానికేమున్న దమ్మా! మన ఇంటి పరిస్థితే చూడు పెద్దక్క పెళ్ళికి చేసిన అప్పు తీరటానికి ఎన్ని సంవత్సరాలు పట్టింది? చిన్నక్కకు పెళ్ళిచేయరేం? అని ఎంత పొడుచుకు తింటున్నారు? ఇప్పుడు నన్ను హాస్యానికన్నట్లు అంటూనే వున్నారు గదా 'ఏమే, నువ్వూ అక్కలాగానేనా? పప్పన్నం పెట్టేది వుందా?' అని. ఇదే మగపిల్లలమయితే మమ్మల్ని అలా ఎవరడుగుతారు? "స్వంత సుఖం మానుకొని తల్లిదండ్రుల సుఖం చూస్తున్న అపర రామస్వరూపాలు" అని పొగిడేవారు పైపెచ్చు తరతరాలుగా ఆడదాని స్థితి అలాగే వుందమ్మా. ఏమీ మారలేదమ్మా"

"ఏమీ మారలేదనటం తప్పు చిన్నా, నా వూహ తెలిసిన తర్వాత ఈ నలభై సంవత్సరాలలోనూ నాకు ఎంతో ప్రగతి కనపడుతోంది. నాటికి, నేటికీ స్త్రీ గుర్తుపట్టలేనంతగా మారిపోయిందమ్మా. ఈరోజున ఎంత మంది ఆడపిల్లలు చదువుకుంటున్నారు. ఎంతలేసి ఉద్యోగాలు చేస్తున్నారు" సమతకు అడ్డుపడుతూ రామారావుగారు అన్నారు.

"పైకి చూడటానికి ఎంతో ప్రగతి వుంది నాన్నగారూ! ఒకనాడు స్త్రీకి ఇంటిపనులే ఒక బాధ్యత. కానీ ఈనాడు బయటకి వస్తోంది. దాంతోపాటే ఎన్నో కొత్త సమస్యలు ఎదుర్కొంటోంది. పాత బరువు తగ్గకపోగా కొత్త బాధ్యతలు పైన బడుతున్నాయి"

"సమస్యలు లేవని నేననడంలేదమ్మా. స్త్రీలు ఎన్నోరంగాలలో పురోగమిస్తున్నారు. దేశాలను కూడా ఏలుతున్నారు కదా. మార్పు వస్తోంది. ఇదంతా ముందడుగే కదా!" అన్నాడు ఆయన.

"ఒక ఇందిరాగాంధీనో, ఒక థాచరో, ఇంకో సిరిమావోనో దేశాలు ఏలితే కాదు. అయినా అది కొత్తాకాదు. ఒక రుద్రమదేవి,. ఒక ఝాన్సీలక్ష్మి చరిత్రలో అక్కడక్కడా కనపడుతూనే వుంటారు. సామాన్య స్త్రీ బతుకేమిటి? ఆమె చేతిలో అధికారం ఏమిటీ? అది మనం ఆలోచించాలి" అంది సమత.

"అందుకేగదా ఆడవాళ్ళకు ఆస్తి హక్కు కల్పించే చట్టాలు చేస్తున్నారు"

"చట్టాలు చాలా వున్నాయి. కానీ ఉపయోగం ఏమిటి? వరకట్న నిషేధం ఏనాటి చట్టం? కానీ ఆచరణలో ఏమి జరుగుతోంది. తిండీ బట్టకోసం మగవాడిమీద ఆధారపడకుండా బతకగలిగిన పరిస్థితులు ఎంతమందికి అందుబాటులో వున్నాయి? ఆత్మవిశ్వాసంతోనూ, ఆత్మగౌరవంతోనూ బతకగలిగిన సామాజిక పరిస్థితులు సిద్ధించాయా? ఇన్ని సంవత్సరాల తర్వాత కూడా సమాజంలో 'ఆడది' అనే కారణం చేత సమస్యలు ఎదుర్కోవలసిరావడం ఈ నాగరికతకే సిగ్గు చేటు. స్త్రీ స్థానం రంగులు పులుముకొని అలంకారం చేసుకుంటుంటేకానీ ఎదగడంలేదు నాన్నగారూ" అంది సమత.

సమతలో ధ్వనిస్తున్న ఆవేశాన్ని ఆయన అర్థంచేసుకున్నాడు. తను ఆడవాళ్ల దృష్టి నుంచి సమస్యను అర్థంచేసుకోలేదేమో అని ఆయన ఆలోచనలో పడ్డాడు.

"మీ చిన్ననాటి సమాజంలోని బాలవితంతువులలాంటి సమస్యలు సమసిపోయి వుండవచ్చు నాన్నగారూ! ఆనాటితో పోలిస్తే స్త్రీ ముందుకువచ్చినట్టు కనిపించవచ్చు కానీ ఆమె ముందు నడిచిరావలసిన యోజనాల దూరం అలాగే వుంది. ఒక్క విషయం గుర్తు చేస్తాను నాన్నగారూ! మీ చెల్లెలి పెండ్లికి మీరు అప్పుచేసి మరీ డబ్బు సద్దారు. అది మీ కుటుంబ బాధ్యత అనుకున్నారు. మరి అమ్మ తన చెల్లెలి పెళ్లికి అలా చేయగలిగిందా? జాతీయ ఉద్యమాలలో పాల్గొని, సమాజకల్యాణం గురించి ఆలోచించే మీలాంటివాళ్ల ఇళ్లల్లోనే ఇలా

ఉంటే మామూలు ఇళ్లల్లో ఉండే స్త్రీల సంగతేమిటి?

ఈ రోజున కుటుంబ బాధ్యతలు ఉన్నాయనేగదా అక్కను చేసుకోవడానికి ఎవరూ ముందుకు రావడంలేదు. మగవాడికి అర్హత అయిన మంచి లక్షణం ఆడదానికి అనర్హత యింది. ఎందుకని?

ఏమిటి మారింది స్త్రీ బతుకు?

ఏమిచ్చిందీ ప్రగతి స్త్రీకి? ? "

ముగ్గురూ తమతమ ఆలోచనల్లో మునిగిపోయారు.

★ ★ ★

దిక్కుల్లో పుట్టుకొస్తున్న చీకటిని పట్టుకోవడానికన్నట్టు నీడలు దూరంగా విస్తరిస్తున్నాయి.

పార్కులో ఒక మూల కూర్చుని వున్నారు ఝాన్సీ, శర్మ. ఇద్దరూ ఏవో కలలు పంచుకుంటున్నారు. ఏవో సౌందర్యలోకాలు సృష్టించుకుంటున్నారు. చెట్ల ఆకులు కదిలినప్పుడల్లా వాళ్లమీద నీడలు పడి మాయమవుతున్నాయి. ఆ వెలుగుచీకట్ల వింతల్ని పరీక్షగా చూస్తున్నాడు శర్మ.

"ఏమిటి అలా చూస్తున్నావు? " అతని నుంచి చూపులు మరల్చుకుంటూ అంది ఝాన్సీ.

"ఏమో నాకూ తెలియదు. ఈ వెలుగు చీకట్ల సయ్యాటలో నీ ముఖంలో ఈ ప్రకృతి అందమంతా ముద్దకట్టినట్టు కనిపిస్తోంది. నీ కళ్లలోంచి నా చూపులు ఇంకా లోపలికి, ఈ చర్మం పొరను చీల్చుకుని ఇంకా లోపలికి వెళ్లిపోయి నీ రక్తంలో కలిసిపోయినట్లు అనిపిస్తోంది.

"నా గుండెల్లోంచి ఒక ముక్కను తుంచి నిన్ను తయారుచేశారేమో! నువ్వు నాదానివి అని గుర్తించిన తర్వాతనే ఈ గుండెకు నిండుదనం వొచ్చింది"

ప్రేమతో మూర్తిమంతమైన చూపులతో శర్మ ఎంతో కొత్తగా కనిపించాడు ఝాన్సీకి. అబ్బురంగా అతన్ని చూస్తూ, "అబ్బో! చాలా కవిత్వం వస్తున్నదే" చిలిపిగా అన్నది ఝాన్సీ.

"కవిత్వం కాదు ఝాన్సీ! కమనీయభావం నాలో సుళ్లు తిరుగుతూ నన్ను ఉన్నచోట ఉండనీయక నీ దగ్గరకు తరుముకువచ్చేటంతటి భావ సంచలనం. ఏం? నీకట్లా అనిపించదా? " అన్నాడతడు.

"ఏమో నాకు తెలీదు. కానీ మనం పెళ్లి చేసుకుందామనుకున్న నాటినుంచీ నాలోనూ ఏదో మార్పు వచ్చింది. నువ్వు, నేను అని ఇద్దరం లేమనీ వున్నది ఒక్కటే అయిన బతుకనీ అనిపిస్తోంది. లాంఛనంగా పెళ్లి జరగకపోయినా మనం ఎన్నో జన్మలనుంచీ కాపురం చేస్తున్న ఆలుమగలం అనిపిస్తోంది. నిన్ను నా భర్త అని నాలోని అణువణువూ గుర్తించింది. ఆ ఆనందం నాలో పొంగి ప్రవహిస్తోంది. థాంక్స్ శర్మా! నాలో పెరుగుతున్న ఏదో వికటత్వాన్ని హరించి నా గుండెల్లో మధురిమను నింపావు"

"థాంక్స్ కాదు ఝాన్సీ! నాకు ఒకటి అర్థమయ్యింది. ఒక మనసు ఒక్కమనిషిగా సంతృప్తి పొందలేక, ప్రపంచంలోని ఆనందాన్ని నాలుగుచేతులా అందుకుని ఆస్వాదించాలని మన రెండు శరీరాలుగా రూపం దాల్చింది. ఒకరం లేకపోతే ఇంకొకరు సగం మాత్రమే అవుతాము. మనం వొకరికొకరు అనుబంధాలము"

ఒక నిమిషంపాటు మౌనంగా వుండి ఝాన్సీ అంది. "ఎల్లుండి బయలుదేరి హైదరాబాదు వెళుతున్నాను. పరీక్షలయ్యాకనే వచ్చేది. ఈ ఇరవై రోజులు నిన్ను వొదిలి వెళ్లాలంటే బెంగగా వుంది."

"హైద్రాబాద్‌లో ఎక్కడ వుంటావు? " అడిగాడు శర్మ.

"వసంత అని నా కాలేజీ స్నేహితురాలు అక్కడే వుంది. ఎయిర్ హోస్టెస్‌గా పనిచేస్తోంది. దానితో వుంటాను. వారం క్రితమే ఉత్తరం రాశాను కూడా. పరీక్షలవ్వగానే వచ్చేస్తాను" అంటూ లేచి నిలబడింది.

★ ★ ★

ఆఖరి పరీక్ష రాసి బయటకు వచ్చేసరికి ఝాన్సీకి, రోడ్డుమీద పచార్లు చేస్తూ శర్మ కనిపించాడు. ఒకరినొకరు చూడగానే ఏదో ఆనందం ఉప్పొంగింది వాళ్ళల్లో.

ఝాన్సీకి చాలా సంతృప్తిగావుంది. పరీక్షలు తాను అనుకున్నదానికన్నా బాగా రాసింది. సెకెండ్ క్లాసుకు ఎట్టి ఢోకాలేదు. యమ్.కామ్ డిగ్రీ తన చేతిలో వున్నట్లే చిరు గర్వంగా ఫీల్ అయ్యింది.

"పరీక్షలెలారాశావు ఝాన్సీ" అన్న శర్మ ప్రశ్నకు బదులుగా.

"ఏమిటీ! ఇలా అనుకోకుండా... దయచేశారు?" అంది పెదవుల మీద ఆనందం చిరునవ్వుగా మెరుస్తుంటే.

"ఆడిట్ ఆఫీసులో పనిమీద వచ్చాను. ఈ ఉదయమే బస్సు దిగాను. ఏమిటి నీ ప్రోగ్రాము?" అని అడిగాడు.

"ఏముంది. రాత్రి పది గంటల బస్సులో మనవూరు వెళ్ళటమే" అంది ఝాన్సీ.

"ఇద్దరం కలిసి వెళ్దాములే ఝాన్సీ. ఎంతనా పని రెండు రోజులే"

ఆ పూటే ఝాన్సీ సామాన్లు తీసుకుని ఇద్దరూ హోటలు రూముకు వెళ్ళిపోయారు. రిసెప్షనులో భార్యాభర్తలని రాస్తుంటే ఇద్దరికీ అదోరకం గర్వం కలిగింది.

నులివెచ్చని నీళ్లతో షవరుకింద స్నానం చేసి జుట్టు ఆరబెట్టుకుంటూ కూర్చుని వుంది ఝాన్సీ. ఏవో పొడిమాటలు తప్ప రూముకు వచ్చాక వెంటనే వాళ్ళేమీ మాట్లాడుకోలేదు.

"ఏమనుకుంటున్నావు ఝాన్సీ?"

"దేన్ని గురించి?" జుట్టు చిక్కు తీసుకుంటూ అంది.

"ఇదే! ఇలా నిన్ను హోటలుకు తెచ్చినందుకు" సందేహంగా శర్మ.

"మరి ఇంక ఎక్కడకి వెళతాము" సమాధానంగా ఝాన్సీ.

"అదికాదు. మనకు ఇంకా... పెళ్ళి కాలేదుగదా! ఎవరయినా చూస్తే, ఎవరికయినా తెలిస్తే ఏమనుకుంటారో అని" సంకోచంగా అన్నాడు.

"అలాంటి సంకోచాలు నాకు లేవు శర్మా. నువ్వు హోటలుకు వెళ్దాం అనగానే ఒక అర క్షణం అలా అనిపించినా, మనసంతా వున్న నీతో ఇక్కడికే కాదు, ఎక్కడికి రావటానికయినా నేను సిద్ధమే. ఎవరేమనుకుంటారో అని నేను ఎప్పుడూ ఆలోచించను. మనం బతికేది మనకోసం.

"నా సమస్త అస్తిత్వమూ నిన్ను భర్తగా ఆరాధిస్తూవుంటే నాకు ఇతరుల సంగతి ఎందుకు? ఇదివరకే చెప్పాను. మనిద్దరం పెళ్ళి చేసుకోవాలని ఏ క్షణంలో నిర్ణయించుకున్నామో, ఆ క్షణంనుంచీ నేను నీ భార్యను. నీవు నా భర్తవు" అంది ఝాన్సీ దృఢంగా.

ఆమె మాటలతో గదినిండా ఏదో మిస్టిక్ వాతావరణం నిండినట్లయింది. తనమీద ఆవిడకున్న నమ్మకానికీ, ఆవిడ అనుభూతి సాంద్రతకీ చలించిపోయాడు శర్మ. ఏదో మహదానందం ముప్పిరిగొనగా ఝాన్సీ రెండు చేతులూ తీసుకుని మృదువుగా చుంబించాడు. ఆ రెండు అరచేతులూ తన గుండెలమీద అన్చుకుని, వాలిపోయే ఆమె కళ్లలోకి చూస్తూ.

"నీ మాటలే మంత్రాలు. నీ చిరునవ్వులే అక్షతలు. మౌనంగా మాట్లాడే మన మనసులే పెద్దమనుషులు. కలుపుకున్న మన చేతులే పూల మాలలు. ఇదే కల్యాణం" అంటూ ఆమెను గట్టిగా ఆలింగనం చేసుకున్నాడు. ఆమె పెదవులు అతని గుండెల మీద, గాలికి గులాబి రెక్కలు కదిలినంత మంద్రంగా కదిలాయి. తన అంగీకారాన్ని అక్కడ అక్షరబద్ధం చేసిందామె.

ఏ చట్టాలు, నియమాలు తెలీకుండా, మొట్టమొదటిసారి స్వచ్ఛంగా వొకరినొకరు కావాలని కలుసుకున్న ఆది స్త్రీ పురుషుల తొలి సమాగమం అది. పెచ్చుమీరిన

మహోద్రేకాలతో ఏమి చేయాలో తెలియని ఆరాటాలతో, ఆర్తిగా, కాంక్షగా వొకరిలోవొకరు కలిసిపోయిన అనాది సంగమం అది. కాంక్షా కీలలు రగిలించిన మహాగ్ని మార్గం నుంచి ఎగిసివొచ్చిన ఆత్మలను వొకరికొకరు ఆధీనం చేసిన... తమ అస్తిత్వాలను ఒకరిలో ఒకరు లీనం చేసిన పవిత్ర సంయోగం అది.

స్థలం, కాలం, శరీరం, ఆత్మ, అస్తిత్వం అన్న స్పృహలన్నీ నశించి, అన్నీ కలిసి, ఇంకేదో తెలీని, ఏమాటల్లోనూ వొదగని, క్షణిక, అనుక్షణిక, శాశ్వత, అశాశ్వత, భావాల, భావరాహిత్యాల, మధుర మంజుల మనోజ్ఞ మనోస్థితి... అస్థితి. మానవుడు అనుభూతి చెందగల ఐక్యతానుభూతి సాంద్రతను అందుకుని వాళ్ళిద్దరూ శాంతించారు.

నూత్న తేజస్సుతో వెలిగిపోతున్నట్లు ఒకరిని ఒకరు గెలుచుకున్నట్లు రెండురోజులు రాజధాని రోడ్లన్నీ తిరిగారు. రెండోరోజు సాయంత్రం ఇందిరాపార్కులో బోటుషికారు చేస్తూ ఆనందరసగంగలో ఓలలాడుతున్నట్లు వూగిపోయారు.

"మన మనస్సుల్లో ఎంత మృదుభావ సంచయం దాగుంది. వాస్తవ జీవిత కఠినత్వంలో దెబ్బలు తినీ తినీ మొద్దుబారిపోయినా, స్పందించే జీవలక్షణం ఇంకా మనలో మిగిలేవుందని నాకు ఇప్పుడే అర్థమయ్యింది ఝాన్సీ.

"నాకు అపురూపంగా దొరికావు. ఏవో యవ్వనపు కలలకే కాక మనసు లోతుల్లోని మధురత్వాలకు ఆకారంగా నాకు నువ్వు దొరికావు.

"ఇంత ఆనందం అనుభవించాక ఈ గుండె ఆగిపోతేనేం? ఈ బతుకు అంతమైపోతేనేం? అనిపిస్తోంది"

"అవేం మాటలు శర్మా! ఇంక నిన్ను విడిచి నేను వుండలేను. మనం కలిసి వుండటానికి ఇల్లు ఏర్పాటు చేయి త్వరలో" గోముగా అంది ఝాన్సీ.

మా చెల్లెలి పెళ్ళి నిశ్చయమయిపోయింది. నీకూ పరీక్షలు అయిపోయాయి. సమత పరీక్షలూ పూర్తయ్యాయి. ఏదో లాంఛనంగా పెళ్ళి అయింది అనిపించుకుందాం. లేకపోతే అనవసరంగా సూటీపోటీ మాటలు ఎదుర్కోవాలి. అదేదో పూర్తిచేసుకుంటే మనను అడిగే వాళ్ళు వుండరు" అన్నాడు శర్మ.

"సరే! అలాగేకానీ... కానీ నా భయం కొద్దీ మళ్ళీ చెబుతున్నాను శర్మా. ఏమనుకోవద్దు. అవమానంగా అసలే భావించకూడదు. నా కుటుంబ బాధ్యతలు ఎప్పుడూ నన్ను వెన్నంటే వుంటాయి. సమత చాలా ఇంటిలిజెంటు అమ్మాయి. డబ్బులేక మాత్రం దాని చదువు ఏస్థాయిలోనూ ఆగిపోవటానికి వీలులేదు. అలాగే నేను పడిన ఆందోళన కూడా అది పడకూడదు. దాని పెళ్ళి అయ్యేవరకూ దాని బాధ్యతంతా నాదే" అంది ఝాన్సీ.

"నాకేమీ అభ్యంతరం లేదని చెప్పానుగా ఝాన్సీ. ఇకపైన నీవాళ్ళంతా నావాళ్ళు అవుతారు. ఆర్థిక పరమయిన అంశాలు మనమధ్య ఇక తీసుకురాకు. అవన్నీ నీయిష్టం" అన్నాడు శర్మ.

తమ కొత్త జీవితం చిత్రాలు గీసుకుంటూ, చేతిలో చేయిగా ఇంటికి బయలుదేరారు వాళ్ళిద్దరూ.

★ ★ ★

"రావమ్మా! నాయకురాలా రావమ్మా!" సమతను అదోరకం అసూయ ధ్వనిస్తుండగా ఆహ్వానించింది మిసెస్ సుందరీ కామేశం.

మిసెస్ సుందరీ కామేశం టౌన్ మహిళా మండలి సెక్రటరీ. సుచరిత కేసు విషయంలో తిరుగుతున్నపుడు సమతకు పరిచయం ఏర్పడింది. ఈ మహిళామండలి చాలా పెద్దది. మెంబర్లయితే చాలామంది వున్నారు కానీ ఏవో పోసుకోలు కబుర్లకు

పనికి వచ్చే రకం. వేసవికాలంలో మూడు నాలుగుచోట్ల చలివేంద్రాలు నడపటం వీళ్ళ పెద్దకార్యక్రమం.

వార్షికోత్సవం మాత్రం ఘనంగా చేస్తూ వుంటారు. పేపర్లలో ఫొటోలు, ఆకాశవాణిలో రంగవల్లిలో ఇంటర్వ్యూలు, అప్పుడప్పుడూ ఇచ్చే పాటల ప్రోగ్రాములు, ఆడవాళ్ళని ఆ సంస్థవైపు ఆకర్షించే అంశాలు. కుట్టుకేంద్రం ఒకటి అట్టహాసంగా ప్రారంభించారు కానీ అది ప్రస్తుతం నత్తనడక నడుస్తోంది. శిశుమందిరం వొకటి తమ ఆధ్వర్యంలో నడపాలని ప్రయత్నం. గవర్నమెంటు గ్రాంటుకోసం .తెగ తిరుగుతున్నారు.

ఈసారి వార్షికోత్సవంలో చెప్పుకోవడానికి ఏమీలేదే అని సుందరి బాధపడిపోతున్న సమయంలో సుచరిత హత్య జరిగింది. అయినా మొదటి వారంరోజులు ఈ మహిళాసంఘం వాళ్ళు ఏమీ పట్టించుకోలేదు. ఎప్పుడైతే సమత ఆధ్వర్యంలో టౌన్‌లో ఆడవాళ్ళంతా కదలటం ఆరంభించారో అప్పుడు వాళ్ళకీ చీమకుట్టినట్టయింది. పైగా సమత వీళ్ళందర్నీ కలవటం పదేపదే ఉద్యమంలోకి రమ్మనటం జరిగింది. చివరికి వాళ్ళూ ఆందోళనలో పాల్గొన్నారు.

"ఏమిటమ్మా సంగతులు. మన కేసు ఎందాక వచ్చింది" అడిగింది సుందరి.

"ఆ విషయంలోనే వచ్చానండీ. వాళ్ళను బెయిలుమీద వొదిలిపెట్టారు అప్పుడే. కోర్టు కమిటీ అంటూ వొకటి ఏర్పరిచి కేసు తేలేవరకూ చూడాలని మా విద్యార్థులు అంటున్నారు. మరి మీరేమంటారు"

"కోర్టుదాక విషయాన్ని లాక్కువచ్చాముగదామనం. కోర్టు విషయం అంటే త్వరగా తేలేది కాదుగదా! అదంతా లాయర్లు, జడ్జీలు చేయవలసిన పని. నీకీ విషయం తెలుసా. డి.యస్.పి.గారి భార్యను చూసి ఆగారటగానీ లేకపోతే మొన్ననే ఫైరింగు చేశేవారట తెలుసా" ఎంత పెద్ద ప్రమాదం తప్పిందో మీకు మా సంఘం వుండటంవల్ల అన్నట్లు అన్నదావిడ సమత మాట మారుస్తూ.

"అదేమిటండీ. పట్టపగలు భార్యను కాల్చి చంపిన వాళ్ళను పట్టుకోవాలని మనం అడుగుతుంటే, హంతకులను పట్టుకోవటం పోయి అడిగేవాళ్ళను కాల్చి చంపాలనుకోవటం ఏమిటి?" అమాయకత్వం ధ్వనించేట్లు అంది సమత.

ఆవిడ కూడా తన మాటలు సర్దుకుంటూ "నిజమేలే. మనం చేసిన దాంట్లో తప్పులేదు, కానీ దేనికయినా పట్టువిడుపులు వుండాలి కదా. పెద్దపెద్ద ఆఫీసర్లను ఇబ్బందిలో పెట్టడం ఏమి భావ్యంచెప్పు. యం.యల్.ఎ. గారి భార్య కూడా కబురు చేసింది ఇక ఈ విషయం వొదిలివేయమని. ఇక వాళ్ళూ వాళ్ళూ చూసుకుంటారు" అంది.

"వాళ్ళూ వాళ్ళూ చూసుకునేంత చిన్న విషయం కాదుగదండీ. పాపం అచ్యుతం గారు ఏ అండా లేనివాడు. ఇవతల లెక్చరరుగారేమో అయినవాళ్ళనూ, కానివాళ్ళనూ కాళ్ళూ, గడ్డాలు పట్టుకుని కేసంతా తనకు అనుకూలంగా మార్చుకుంటున్నాడు. ఇలాంటప్పుడు మనం మధ్యలో వొదిలేస్తే ఎలాగండీ. ఇన్నాళ్ళూ చేసినదానికి ఫలితం లేకుండాపోతుందిగదా" అంది సమత.

"ఏమోనమ్మా. మనం చేయగలిగిందేమీ కనపడటంలేదు నాకు. పెద్ద ప్రచారం చేశాం. పదిమంది దృష్టికీ తెచ్చాం. కోర్టు విషయం అంటే అది పెద్ద తలనొప్పి" అంది సుందరి.

"సరే కోర్టు విషయం తర్వాత ఆలోచిద్దాం. అంతకంటే ముందు మనం చేయవలసింది ఇంకోటుందండీ" అంది సమత. ఏమిటన్నట్లు చూసింది సుందరి.

"సుచరిత కట్నం తాలుకూ ముప్పైవేలు అచ్యుతంగారికి తిరిగి ఇప్పించాలండీ"

అనూహ్యమైనదేదో విన్నట్లు ముఖం

పెట్టింది సుందరి. "అదెలా సాధ్యమ మ్మాయి. పెళ్ళివేడుకలు ఏవో జరుగుతాయి. అవన్నీ ఇప్పుడు బయటకు లాగడం పద్ధతి కాదుగదా" అంది నిక్కచ్చిగా.

"పద్ధతేమిటండీ! ఈ హత్య జరిగిందే ఆ డబ్బు సమస్యవల్ల అయితే. కట్నాలు, కానుకలు అనే అమానుషత్వంవల్ల కదా కూతురూ పోయి డబ్బూ పోయింది"

"అదికాదులే సమతా. కట్నం అనేది తప్పే అనుకో. అయినా ఎవరు ఆగుతున్నారు చెప్పు. ఇచ్చిపుచ్చుకోవటం మామూలుగా జరిగిపోతోంది. ఈ మామూలు విషయాన్ని మనం ఒక సమస్యగా చేయటం తప్పు. దానికోసం ఆందోళన చేయటం జరిగేపని కాదు.

"సరేలెండి. మీ అంతట మీరు రావాలిగానీ ఇందులో ఇంకొకరి బలవంతం ఏముంది? ఇది ఒక్క సుచరిత విషయం కాదుగదా మొత్తం స్త్రీలకు. అసలు నిజం చూస్తే ఈ సమాజంలోని మానవత్వానికి చెందిన సమస్య. ఈ సంఘంలో ఆ సంస్కారం, మానవత తలెత్తేలా చేయటం మన కనీస కర్తవ్యం. ఆ మానవత నిలదొక్కుకునేలా సమాజాన్ని సమూలంగా మార్చటం అసలయిన కర్తవ్యం. మీలాంటి సంఘాలు కనీస కర్తవ్యాలనయినా స్వీకరించకపోవటం మనలో వున్న దౌర్భాగ్యాన్ని, అంతకుమించి చైతన్యరాహిత్యాన్ని సూచిస్తాయి"

అనుకోకుండానే సమత తీవ్రధోరణిలో పడిపోయింది. అంతలోనే నిగ్రహించుకొని, "మిమ్మల్ని తప్పు పడుతున్నాననుకోకండి. ఇంతవరకూ ఆందోళనలో పాల్గొన్నదానికి కమిటీ కన్వీనరుగా నా కృతజ్ఞతలు. ఇక ముందు కూడా మీరు ఎంతవరకు వీలయితే అంతా సహకరించండి" అని చెప్పి సెలవు తీసుకొంది.

సమత తమ కమిటీ ఆఫీసుకు వచ్చేసరికి అచ్యుతంగారు, తేజ, ఇతర కమిటీ సభ్యులు మాట్లాడుకుంటున్నారు.

"మీ అందరికీ ఎంతో కృతజ్ఞతలు నాయనా. నా కోసం, నా చనిపోయిన కూతురుకోసం ఇంత ఆందోళన చేశారు. మీలాంటి యువతరాన్ని చూస్తుంటే నాకు ఆనందంగానూ, గర్వంగానూ వుంది" అన్నారు అచ్యుతంగారు.

సమత సుందరితో తను మాట్లాడిన విషయాలు చెప్పింది. ఇతర మహిళా సంఘాలు కూడా ఇక ముందుకు వచ్చేట్లుగా లేరు అంది.

"చూడమ్మా. ఇప్పటికే మీనుంచి ఎంతో సమయం, శక్తి నేను తీసుకున్నాను. సంఘంలో ఒక అన్యాయాన్ని ప్రశ్నించే లక్షణం వుందని నిరూపించారు. ఇక చాలమ్మా. ఇంక ఆ కోర్టులు, గొడవలు నేను పడలేను తల్లీ. ఏదయినా తెగేవరకూ లాగటం మంచిదికాదు.

"జగదీష్ వెనకవున్న రాజకీయబలం, పోలీసు బలగం నాకు తెలియనిది కాదు. ఇంకా ఆందోళన సాగిస్తే అరెస్టులు, కోర్టులు తప్పవు. మీరు కూడా ఆందోళన ఆపివేయడం మంచిదమ్మా" అని హితవు చెప్పారు అచ్యుతంగారు.

తేజ తాను జగదీష్ దగ్గరకు వెళ్ళివచ్చానని చెప్పాడు. "జగదీష్ పైకి గంభీరంగా వున్నా లోపల చాలా భయపడుతున్నాడండీ. ఏదోవిధంగా సర్దుబాటు చేసుకుందాం అంటున్నాడు. ముప్పైవేలు తిరిగి ఇవ్వడానికి కూడా సిద్ధపడుతున్నాడు. అయితే మనం కోర్టు విషయం పట్టించుకోకుండా వొదిలెయ్యాలట" అన్నాడు.

ముప్పైవేలు ఇచ్చి మన ఆందోళన కొనివేయాలనుకుంటున్నాడా అని కొందరు ఆవేశపడ్డారు. అచ్యుతంగారున్న స్థితిలో ఆ ముప్పైవేలు తీసుకోవడం మంచిదని ఎక్కువమంది అన్నారు. తర్జన భర్జనలు జరిగి, అచ్యుతంగారి అభీష్టంమేరకు జగదీష్‌నుంచి డబ్బు తీసుకోవటం, కోర్టు విషయంలో




ప్రత్యేక ప్రయత్నాలు చేయకుండా ప్రాసిక్యూషన్‌కే వదిలిపెట్టడం అని నిర్ణయించారు.

దెబ్బతిన్న మనిషి, కలిసి రావలసిన శక్తులు సిద్ధం కాకపోవటంతో సమత, తేజ లాంటి వాళ్ళు తమ మనసుల్లో ఎంత గట్టిగా కోరుకున్నా జగదీష్‌చంద్రను కటకటాల వెనకకు పంపే కార్యక్రమం వొదులుకోవలసివచ్చింది.

★ ★ ★

ఆరోజు కాలేజీ అంతా సందడిగా వుంది. మార్కుల లిస్టులు తీసుకునేవాళ్ళు, స్టడీసర్టిఫికెట్లు తీసుకునేవాళ్ళు, పూర్వ విద్యార్థినీ విద్యార్థులందరూ చేరారు. పరీక్షలు కాగానే పెళ్ళిళ్లయినవాళ్ళు, పెళ్ళికి ముహూర్తాలు పెట్టుకున్నవాళ్ళు, అంతా ఏమిటో మారిపోయినట్టుగా అనిపిస్తోంది. ఈ మూడు నెలలలోనే మూడేళ్ళ స్నేహం మరుగున పడిపోయినట్టు, ఎవరి లోకం వారికి వేరేగా వుందని అర్థం చేసుకున్నట్టు కనిపిస్తున్నారు.

అంతా సమతను కంగ్రాచ్యులేట్ చేశారు. తను కెమిస్ట్రీలో యూనివర్సిటీ ఫస్టు వచ్చింది. కెమిస్ట్రీ డిపార్టుమెంటు మొత్తం మహా గర్వంగా తిరగసాగారు. ఎంతమందికి క్లాసులు వచ్చిందీ, ఎవరు ఏదో గట్టెక్కామనిపించిందీ మార్కులు బేరీజు వేసుకున్నారు. చెప్పినట్టుగానే ఆరోజు సౌందర్య వచ్చింది. తను మామూలుగా పాసు అయ్యింది. ధీరజ ఫస్ట్‌క్లాస్‌లో పాసయింది. ధీరజ సర్టిఫికెట్లు తీసుకుంది సౌందర్య తనకు పంపిస్తానని.

హడావుడి అంతా తగ్గాక సౌందర్య, సమత ఒక పక్కగా కూర్చున్నారు.

"నీకెలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో తెలీటంలేదు సమతా"

"ఈరోజు ఇలా మొదలెట్టావేమిటి? "

"నీకు తెలీదు కానీ... నువ్వే లేకపోతే, నేను ఈరోజు బతికేవుండేదాన్ని కాదు. ఆరోజు..."

"సరేలే! నువ్వింకా ఆ పాతసంగతి మర్చిపోలేదా? నేనేమని చెప్పాను. ఆ క్షణంలోనే మరిచిపోయి కొత్త బతుకు మొదలెట్టాలన లేదూ"

"నా కొత్త బతుకు మొదలవుతోంది సమతా. అది చెప్పాలనే. నా పెళ్ళి నిర్ణయించారు నాన్నగారు. ఈసారి నోరు మూసుకుని వొప్పుకున్నాను. ఆ అబ్బాయి డైరెక్టు ఆర్.డి.వో.గా రిక్రూట్ అయ్యాడు ఈమధ్యే. వున్నది నేనొక్కతే కూతుర్నిగదా! ఏవో పెద్ద ఎత్తునే ఏర్పాట్లు చేస్తున్నారు. శుభలేఖ తర్వాత పంపిస్తాను. నువ్వు తప్పకుండా రావాలి సుమా!"

"నాకెక్కడ కుదురుతుంది సౌందర్యా అంతదూరం రావటం. నీ బతుకంతా సంతోషంగా గడవాలని నేనెప్పుడు కోరుకోను చెప్పు. అంత దూరం వచ్చి చెబితేనే శుభాకాంక్షలా!"

సమత మనసు పూర్తిగా తెలిసిన సౌందర్య ఇక బలవంతం చేయలేదు. "మరి నీ విషయం ఏం ఆలోచించావు సమతా? "

"నిజం చెప్పాలంటే ఇంతవరకు గట్టిగా ఏమీ అనుకోలేదు. కాలేజీ ముగిసింతర్వాత నేను పట్టుమని పదిరోజులు కూడా ఇంట్లో కూర్చోలేదు తెలుసా? " అంటూ సుచరిత విషయంలో తాము ఏవిధంగా ఆందోళన చేసిందీ చెప్పుకొచ్చింది సమత.

"డబ్బు సంగతి అటుంచినా అసలీ చదువులెందుకా అనిపిస్తోంది. ఏమిటో ఈ ఫస్టు రాంకులు, యూనివర్సిటీ ఫస్టులు సాధించేది. నిజం చెప్పనా- కెమిస్ట్రీ యూనివర్సిటీ ఫస్టు అన్న సంగతి తెలిసినరోజున నాకేమీ పెద్ద సంతోషం కలగలేదు"

"అదేమిటి సమతా అలాగంటున్నావు. స్త్రీలందరూ చదువుకోవాలనీ, మగవాళ్ళను మించిపోవాలనీ, అసలు స్త్రీలు ఇంత వెనకబడి వుండటానికి చదువు లేకపోవడం ఒక ముఖ్య కారణం అనీ వాదిస్తావుకదా"

"అది ఈనాడూ కాదనటంలేదు. చదువు

కుంటే స్త్రీ తన పరిస్థితిని అర్థం చేసుకుంటుంది. ఆర్థికంగా తన కాళ్ళమీద నిలబడగలుతుంది. అప్పుడే సమానస్థానం పొందగలుగుతుంది. అందుకనే అలా వాదిస్తాను. అయితే చదువు అంటే మనం ఈ కాలేజీల్లో చదువుతున్నదేనా? జీవితాన్ని సమగ్రంగా అర్థం చేసుకోవటానికి, జీవన సంఘర్షణని సమర్థవంతంగా ఎదుర్కోవటానికీ మనిషిని సిద్ధం చేసే జ్ఞానమే చదువు అంటే. ఆ చదువు కొద్దో గొప్పో పొందాననే అనుకుంటున్నాను.

"నేను పైచదువులు చదువుకోకపోయినా, నా శక్తిసామర్థ్యాలను మరో రంగంలో ఈ సమాజ కల్యాణంకొరకు ఉపయోగిస్తాను. నేను వంటయింటి కుందేలై కూర్చుంటానన టంలేదే! మన చుట్టూ ఎన్ని సమస్యలు! తొలగించవలసిన ఎన్నెన్ని ముళ్ళకంపలు" అన్నది సాలోచనగా సమత.

"నువ్వు ఏదో గాడితప్పుతున్నావు సమతా! బంగారంలాంటి బతుకును పాడుచేసుకుంటావా? రొచ్చుగుంటలాంటి రాజకీయరంగంలో చేరతావా నువ్వు. నీలాంటివాళ్ళు అక్కడ కలికానికి కూడా కనపడరు" చాలా ఆవేదనగా, అభ్యంతరం చెబుతూ అన్నది సౌందర్య.

"అంతగా చెడిపోయిన వాటినేగదా బాగు చేయవలసింది. దేశాల చరిత్రనే మార్చే రాజకీయాలను ప్రజలకు ద్రోహంచేసే వాళ్ళకు వదిలి మనలాంటి ఆలోచనాపరులు లేబరేటరీలలో గడపటం సరిఅయినదిగా నాకు అనిపించటం లేదు సౌందర్యా" సమత తన వాదం చెప్పింది.

"నువ్వు ఎంతో తార్కికంగా ఆలోచిస్తావు. నీకు చెప్పేంత తెలివి నాకు లేదు... కానీ నువ్వు చదువుమాత్రం మానకు సమతా. డబ్బుకోసం ఆలోచించకు ఏదోవిధంగా సర్దుబాటు అవుతుంది" అంది సౌందర్య ఆరాటంగా.

ఇంతలో సౌందర్య నాన్నగారు అక్కడికి వచ్చారు. 'నమస్కారమండీ' లేచినిలుచుంది సమత.

"చాలా సంతోషమమ్మా! అమ్మాయి స్నేహితురాలివి. నిన్ను చూస్తే నాకు చాలా గర్వంగా వుందమ్మా! ఇంకా ఎన్నో గోల్డుమెడల్సు సాధించమని ఆశీర్వదిస్తాను. ఏమ్మా నీ పనయిందా? ఇంక వెళ్దాం" అంటూ సౌందర్యను అడిగారు.

"అయిపోయింది నాన్నగారు? ఇంక వెళ్తాం సమతా" అంటూ సమత చేయి చిన్నగా నొక్కి ఇంక జీవితంలో మళ్ళీ కలుస్తామో లేదో అన్నట్టు దిగులుగా చూసింది సౌందర్య.

"అమ్మాయి పెళ్ళికి తప్పకుండా రావాలమ్మా నువ్వు" అంటూ ఆయన సమతను ఆహ్వానించాడు.

చిరునవ్వే బదులుగా చెప్పింది సమత వెళ్తున్న వాళ్ళను చూస్తూ-

★ ★ ★

"చదువు ఏదో రేవున పడిందిగదా! దీని విషయంలోనయినా తొందరపడి ఈడు జారకముందే ఏదో ఒక జోడు వెతకండి" అంది మాష్టారుతో అందరూ కూర్చుని సంబరంగా కబుర్లు చెప్పుకుంటూ వున్నప్పుడు.

మాష్టారు నిస్సహాయంగా చూసి "నేనేమి చేయగలను లక్ష్మీ. పిల్లలముందు తలెత్తుకు తిరగడానికే సిగ్గుపడుతున్నాను నేను"

"అదేమిటి నాన్నగారు! అలాగంటారు. మీ ధర్మాన్ని మీరు నిర్వర్తించారు. మమ్మల్ని ప్రయోజకులుగా పెంచారు. ఇక పోతే మాకు పెళ్లి జరగకపోతే సిగ్గుపడవలసింది ఈ సమాజం. ఆడ, మగ అంతరం ఎంచి పెళ్లిని వ్యాపారంగా మార్చిన ఈ సంఘం సిగ్గుపడాలి" ఇంకా అనబోతున్న సమతని వారించి,

"నీ సంఘం కబుర్లు కాసేపు ఆపవే తల్లీ. మనకష్టం ఏదో మనమే తీర్చుకోవాలిగదా! సంఘం, సమాజం అంటే ఎవరైనా వచ్చి

ఆర్పుతారా? తీర్చుతారా?" చిరుకోపంగా అంది అమ్మ.

"ఎవరోవచ్చి తీర్చుతారని కాదు. మనం ఏవో చేయాలనుకున్నా మన చేతుల్లో లేదని నేననేది. అక్కడికి నాన్నగారికి మాకు పెళ్లి చేయటం ఇష్టంలేదేమో అన్నట్టు మాట్లాడ తావు. ముందు మన చేతుల్లో వున్నది మనం చేద్దాం. ఈ సంవత్సరం మున్సిపల్ స్కూల్లో టీచర్నుని తీసుకుంటారట. అదో, అదికాకపోతే మహిళామండలిలో ఏదో క్లర్కు పోస్టు వుందట. అక్కడో ఏదో ఒక ఉద్యోగం చూసుకుంటాను ముందు" అంది సమత.

"యూనివర్సిటీ మెడలు సాధించి మహిళామండలిలో లెక్కలు రాస్తూ కూర్చుంటావా? చాల్లేవూరుకో. హైదరాబాద్ వెళ్లి యం.యస్.సిలో జాయినవ్వు మాట్లాడకుండా" అంది ఝాన్సీ అందులో అసలు ఆలోచించటానికి ఏముంది అన్నట్లు.

"మంచిదమ్మా! నాకోసం నా చదువుకోసం నువ్వు కర్పూరంలా కరిగిపో, నేనేమో హాయిగా కూర్చుని చదువుకుంటాను. ఏం నువ్వు చేయగా లేనిది నేను చేయలేనా? నాన్నగారు మాత్రం ఉద్యోగం చేసుకుంటూ చదువుకొని ప్రైమరీ స్కూలు టీచరు నుంచి హైస్కూలు మాష్టరుగా ఎదగలేదా? నువ్వు ఉద్యోగం చేసుకుంటూ చదువుకొని నిన్న నేగా యమ్‌కామ్ పరీక్షలిచ్చి వచ్చావు. నేనూ అంతే. ముందు ఉద్యోగం దొరికితే ఆ తర్వాత ఏదో చూడవచ్చులే" అన్నది సమత అక్కకు అడ్డుపడి.

"ఎంతసేపూ ఉద్యోగాలు, వూళ్లేలటాలు అనుకోవడమేగానీ నేను చెప్పేది మీ బుర్రకు ఎక్కటంలేదేమే!" అంది తల్లి.

"నేను చెప్పేది నువ్వు అనేదాని దగ్గరకే వస్తుందమ్మా! ఈ సంవత్సరం అక్క పెళ్లి చేసేద్దాం. నేను ఇంట్లో వుంటాను. అక్క వెళ్లిపోతుంది. మన బాధ్యతలు అక్కమీద లేకపోతే పెళ్లి కావటం అంత కష్టంకాదులే" అంది సమత.

"నువ్వు చెప్పేది బాగానే వుందమ్మా. మళ్లీ ఈ ఇల్లు తాకట్టుపెట్టి అంతో ఇంతో తెస్తే ముందునాటికి ఇది కళకళలాడుతూ తిరుగుతుంది" ఝాన్సీ బుగ్గలు పుణికి మెటికలు విరుచుకొంది ఏవో కలలు, వూహలు పేర్చుకుంటూ.

రామారావుగారికి చిన్నకూతురు ఇంకా చదువుకోవాలని వుందికానీ ఎలా అవటం?

"చాల్లే వూరుకోండి. నా పెళ్లి గురించి దాని చదువు ఆపేస్తారా? " కసురుకొంది ఝాన్సీ. సమతవైపు తిరిగి "నేను ఉద్యోగం చేస్తూ చదువుకున్నానంటే కారణం ఆనాటి మన ఇంటి పరిస్థితులు. ఇవాళ ఆ స్థితిలే దుగదా! రెండేళ్లు కష్టపడితే నీ జీవితం చక్కగా మొదలవుతుంది. పెద్ద వాళ్లం వున్నాముకదా. ఆ బాధలేవో మాకు వదిలెయ్యి. నువ్వెళ్లి బుద్ధిగా చదువుకో! ఈసారి యూనివర్సిటీఫస్టు వచ్చావంటే అదేనాకు తృప్తి"

"చిన్నా చెప్పేది నువ్వు ఆలోచించు ఝాన్సీ. ఇంకా రెండేళ్లు అంటే మాటలా? ఇప్పటికే నువ్వు..." అన్నాడు తండ్రి.

"నా సంగతి వదిలెయ్యండి నాన్నగారూ! నా పెళ్లికీ దాని చదువుకు సంబంధం పెట్టకండి. ఈ సంవత్సరం తిరిగేలోపు పెళ్లి జరుగుతుంది. మొన్ననే వసంతతో అప్లికేషన్లు పంపమని చెప్పి వచ్చాను. రెండు మూడు రోజుల్లో రావొచ్చు అవి రాగానే అప్లై చేయి. సీటు రాగానే హైద్రాబాద్ వెళ్లు చిన్నా" అంది ఝాన్సీ ఇక చర్చించేది ఏదీ లేదన్నట్టు.

"అదికాదక్కా" అంటూ చెప్పబోయిన సమతని కోపంగా చూస్తూ "ఇంక ఈ విషయంలో ఏమీ మాట్లాడకు. నా మీద ఏదో బరువు పడిందని నేను ఏడుస్తున్నానా? చదువుకోవే తల్లీ అంటే ఏమిటే నీ గుంజాటన" పెడసరంగా అని లోపలకు వెళ్లిపోయింది ఝాన్సీ.

"సంవత్సరంలోపు పెళ్లి జరుగుతుందిలే"

అని ఏ ధైర్యంతో అన్నదా అక్క అని ఆలో చించసాగింది సమత. రాత్రికి అక్కను అడి గేసింది అంతా పడుకొన్నాక.

శర్మ విషయం టూకీగా చెప్పి "అతని చెల్లి పెళ్లి జరిగేవరకూ ఎవరికీ చెప్పదలచు కోలేదు. నువ్వు ఎవరితోనూ అనకు" అంది ఝాన్సీ. అక్క చెప్పిన విషయానికి సమ తకు చాలా ఆనందంవేసింది. గబుక్కున లేచివెళ్లి అక్కబుగ్గమీద ముద్దు పెట్టుకొంది. ఆడపిల్ల జీవితానికి పెళ్లే పరమార్థం అని సమతకు లేదుకానీ అక్క పెళ్లికోసం ఎంతగా ఎదురుచూస్తోందీ ఆమెకు తెలుసు. ఇంట్లో ఈ వార్త తెలిస్తే ఎంత పెద్ద పండగ అవుతుందో తెలుసు. అందుకే ఆ ఆనందం. ఆ సంతోషం అంతా ఒక్క చిన్న ముద్దులో ఇమిడ్చి చెప్పింది సమత.

ఆ ఆనందంలోనే తను హైదరాబాద్ వెళ్లి చదువుకోవటానికి ఒప్పుకుంది.

★ ★ ★

"అర్జెంటు, గాంధీచౌక్‌లో నాలుగు గంట లకు కలవండి" అని ధర్మతేజ పంపిన వర్త మానం అందుకుని టౌనుకు వచ్చింది సమత.

"మీరు ఎంతోకాలంగా ఎదురుచూస్తున్న వ్యక్తిని కలిసే అవకాశం ఈ రోజు వచ్చింది సమతా" అంటూ ధర్మతేజ ఆమెను కలి శాడు.

ఇద్దరూ ఏవో మాట్లాడుకుంటూ నాలు గైదు సందులు తిరిగి ఒక ఇంటికి వెళ్లారు. ఆ ఇంట్లోవున్న ఏభై సంవత్సరాల వ్యక్తిని పరిచయం చేశాడు తేజ సమతకి. "వీరే సత్యప్రసాద్‌గారు"

ఆమెలో ఏదో ఉద్వేగం చోటు చేసు కుంది. తెలంగాణా రైతాంగ పోరాటాల కాలం నుంచీ ఉద్యమాలతో పెనవేసుకున్న జీవితం ఆయనది. ధనిక రైతు కుటుం బంలో పుట్టిన ఆయన ఎన్నో ఎత్తుపల్లాలు చూశాడు. సమితి ప్రెసిడెంటుగా చేస్తూ ఆ ముఠా రాజకీయాలు నచ్చక సరిఅయిన విప్ల వోద్యమం నిర్మించాలని రాజీనామా చేసి ప్రజలలో కలిసిపోయాడు. నారాయణ వాళ్లు సత్తిరాజు మాష్టరని చెప్పుకునేది ఈయన్ని గురించే. కానీ సమత ఆయనని ఇంతవరకూ కలవలేదు. ఆయన ముందు కూర్చునేసరికి ఏమిటో అన్నీ మర్చిపోయిన ట్లయింది తనకు.

"తేజూ! నాకు కొంచెం కాఫీ తెచ్చి పెట్ట వయ్యా" అన్నారాయన మెత్తగా. తేజ ఫ్లాస్కు తీసుకుని బయటకు వెళ్లాడు.

"ఏమ్మా హైదరాబాదు వెళ్తున్నావటగా" అన్నాడాయన ఆప్యాయంగా.

"అవునండీ. అక్కడకు వెళ్లి చదువు కుంటూ ఏదైనా ఉద్యోగం చూసుకుంటాను" అంది నమ్రతగా సమత.

"నన్ను కలవాలని చాలా రోజులుగా అడుగుతున్నావటగదమ్మా! ఇక్కడిక్కడే తిరుగుతున్నా తీరిక లేకపోయింది, ఏమి టమ్మా విషయం? " అన్నాడాయన.

"మీ సలహాలు కావాలండీ! నాకు ఏమిటో అయోమయంగా వుంటోందీమధ్య. నా జీవి తానికి సంబంధించి ఏ నిర్ణయమూ చేసుకో లేకపోతున్నాను. ఈమధ్యకాలం వరకూ అయితే కలలు కనేదాన్ని. ఏదో పెద్ద సైంటి స్టునయినట్టు, ఏవో కొత్త కొత్త మందులు కనిపెడుతున్నట్టు. కానీ ఈమధ్య ఆ అభి రుచి చచ్చిపోతోంది. అలాగని పూర్తిగా చదువుమానేయాలని లేదు. నా చుట్టూ వున్న పరిస్థితులను చూస్తుంటే ముందు వాటిని మార్చటానికి ఏమయినా చేయాలని ఉత్సాహం, ఆరాటం కలుగుతోంది. ఏమిచే యాలో సరిగ్గా తెలీటంలేదు."

"చదువుకోవటం మంచిదే అందులోనూ నీవు రాంకు స్టూడెంటువు కూడానూ" అని మెల్లగా నవ్వి "ఏపనీ మనస్ఫూర్తిగా చేయా లనుకోకపోతే ఎంతోకాలం చేయలేవమ్మా! సమాజంకోసం ఏదో చేయాలన్న ఆరాటం వుంది నీకు. చదువుకుంటూ కూడా నీవు ఆ పని చేయవచ్చు అసలిప్పటికే నీవు ఒక




సరైన మార్గంలో ప్రయాణం మొదలెట్టావు. కావలసింది ఆ మార్గంలో గట్టిగా అడుగులు వేయటమే"

"సమస్యలపట్ల స్పందన అయితే వుంది కానీ ఆచరణపట్ల అవగాహన లేదండీ. పుస్తకాల జ్ఞానం కొంతమేరకు సంపాదిస్తున్నాను. కానీ నేను చదువుతున్న సిద్ధాంతాలూ, సాహిత్యమూ గందరగోళాన్నే కలిగిస్తున్నాయి. ఏది సరైనది అనేది తేల్చుకోవటం చాలా కష్టంగా వుంటోందండీ.

"ఉదాహరణకి స్త్రీల సమస్యనే తీసుకోండి. నాకు ఈ రంగంలో పనిచేయాలని గట్టిగా వుంది. ఏ వ్యాసం చదివినా పుస్తకం తెరిచినా కట్నాలు దురాచారమనీ, స్త్రీకి సమాన హక్కులు కావాలనీ స్త్రీ ముందుకు రావాలనీ వుంటుంది కానీ ఆచరణలో చూస్తే ఎవరూ కలిసి రారు. అందరూ అన్యాయం జరిగిపోతోందని గగ్గోలు పడుతున్నారు కానీ జరిగేది జరిగిపోతూనే వుంది" అర్థం కానట్టు అడిగింది సమత.

"స్త్రీల స్థానంలో మార్పు మొత్తం సాంఘిక ఆర్థిక విధానాలు మారినప్పుడే సిద్ధిస్తుంది. అంటే అర్థం ఇప్పుడు చేతులు ముడుచుకుని కూర్చోమనీకాదు. స్త్రీలని తమ సమస్యల మీద ఆందోళన చేయవద్దనీ కాదు. సాంఘిక వ్యవస్థను మార్చే కృషిలో అంతర్భాగంగానే మనుషుల ఆలోచనా విధానాన్ని మార్చే, మనం కోరే మార్పుల కనుగుణంగా ప్రభావితంచేసే భావ విప్లవం ఒకటి కొనసాగించాలి. ఈ సాంస్కృతిక విప్లవం బలంగా పెరుగుతున్నకొద్దీ స్త్రీ స్థానం కూడా కొంతమేరకు మెరుగుపడుతుంది. స్త్రీ ఉద్యమకారులకు ఈ స్పష్టత వుండాలి" అన్నాడాయన.

"ప్రతి సాంఘిక సమస్యకీ మూలం ఆర్థిక విధానంలోనే వుందని నేను కూడా అర్థం చేసుకున్నాను. కానీ ఆర్థిక చట్టాన్ని మార్చినంతమాత్రాన సమస్యలు తీరిపోతాయా? ఉదాహరణకి ఈనాడు ఎంతో మంది స్త్రీలు స్వంత సంపాదనలు కలిగివుంటున్నారు. ప్రభుత్వాలు కూడా స్త్రీకి ఆస్తి హక్కు కల్పించే ప్రయత్నాలు చేస్తున్నాయి. అయినా స్త్రీ సమస్యలు తీరినట్లు నాకు కనిపించటంలేదు" అనుమానంగా అడిగింది సమత.

"ఆర్థిక విధానం మూలం అంటే మిగతా వాటి ప్రభావం వుండదని కాదు సమతా. మతం, సంస్కృతి, ప్రాంతం, సంప్రదాయం ఎన్నో తమ ప్రభావాలు కలిగిస్తాయి. స్వంత ఆస్తులు వున్న స్త్రీలు కూడా సమానత్వాన్ని అనుభవించటంలేదంటే కారణం మన సమాజాన్ని ఆవరించివున్న భావ జాలం. ఒక హక్కు ఉండటం ఎంత ముఖ్యమో, దాన్ని సద్వినియోగపరుచుకొని తన స్థానం మెరుగుపరుచుకోవాలనే తపన, భావన వుండటం కూడా అంతే ముఖ్యం. మనదేశంలో కోట్లాదిమందికి ఓటు హక్కు వుంది. అంతమాత్రాన ఆ హక్కును అందరూ సక్రమంగా ఉపయోగిస్తున్నారంటావా? స్త్రీలూ అంతే. నేను అంటున్న భావ విప్లవం పనిచేయవలసింది ముఖ్యంగా ఇలాంటి అంశాలలోనే" అన్నాడాయన.

"అర్థమయ్యిందండీ! స్త్రీలు తమ సమస్యల్ని పరిష్కరించుకోవాలంటే ఒక వంక మగవాళ్లలోనూ, చట్టాలలోనూ తమకు అనుకూలమైన మార్పులు తెచ్చేందుకు ప్రయత్నించాలి. మరోవంక ఈ ఆర్థిక వ్యవస్థను పునాది నుంచీ మార్చే ఉద్యమాలలో పాల్గొనాలి"

"అవునమ్మా దోపిడిని రద్దు చేసి మానవులందర్నీ సమానంగా చూసే సోషలిస్టు సమాజం ఎంతో వున్నతమైంది. నిజమయిన మానవత నిండివున్నది. అన్ని అణగారిన జాతులలాగే స్త్రీకి తన స్థానం మెరుగుపరుచుకోవాలంటే ఆ సోషలిస్టు విప్లవం వైపు నడవక తప్పదు"

ఇంతలో ధర్మతేజ వచ్చాడు అరటిపళ్లు,

ఫ్లాస్కునిండా కాఫీ తీసుకుని. ముగ్గురికీ అవి పంచాడు. కాఫీ తాగుతూ అన్నాడతను "సమతను పార్టీలో చేరమని చాలా రోజులుగా అడుగుతున్నానండీ. కానీ తనకు పార్టీ జీవితం అంటే లోకాతీతమయిన భావాలున్నాయండీ! అందుకే వెనక ముందు లాడుతోంది"

"పార్టీ క్రమశిక్షణకు, కఠోరతకు, సమిష్టి జీవితానికీ నన్ను సిద్ధం చేసుకోకుండా ఆ సంస్థలో చేరటం ఆత్మ వంచన అవుతుందండీ. ఇంకా కొంతకాలం విద్యార్థి ఉద్యమాలకు పరిమితంగా పనిచేస్తానండీ. నేను నేర్చుకోవలసింది ఇంకా చాలావుంది" అంది సమత.

"అలాగేనమ్మా! తేజ నీకు నాలుగైదు అడ్రసులు ఇస్తాడు. వాళ్లను కలువు. హైదరాబాద్‌లో నీకు ఇబ్బందిలేకుండా సహాయం చేస్తారు" అన్నాడు సత్యప్రసాద్.

"అక్కడ ఏదైనా పార్టుటైమ్ జాబు విషయంలో సహాయం చేయగలరా!" అని అడిగింది సమత.

"రెండుమూడు స్కూళ్ళలో మన వాళ్లు కొందరు పని చేస్తున్నారు. బహుశా నీకు ఆ స్కూళ్ళలో ఏదయినా దొరకవచ్చు ప్రయత్నంచేయమ్మా"

"మంచిదండీ. నా అనుమానాలు చాలా తీర్చారు. మీ టైము చాలా తీసుకున్నాను. ఇక వస్తానండీ" అంది సమత.

"మంచిదమ్మా" అంటూ సమతను పంపి తాను ఏదో రాయడంలో మునిగిపోయాడాయన.

★ ★ ★

ఆ రోజే సమత హైదరాబాద్ ప్రయాణం. అంతకుముందే ఒకసారి ఝాన్సీ, సమత హైదరాబాద్ వెళ్లి వచ్చారు సమత ఎంట్రెన్సు రాయటానికి. ఝాన్సీ స్నేహితురాలు వసంత అక్కడే పనిచేస్తోంది గదా. సమత ఆమె దగ్గరే వుండటానికి నిర్ణయమైంది.

హాస్టలులో వుంటే ఖర్చు ఎక్కువ అవుతుందనుకున్నారు. అదీగాక హాస్టలులో అయితే సాయంత్రం వేళల్లో ఏదైనా ఉద్యోగాలు చేయాలంటే కుదరదు. ప్రతిరోజూ పర్మిషన్లు తీసుకుని వెళ్లటమూ జరిగేది కాదు. అందుకే వసంతతోనే వుండాలనుకొంది సమత. వసంతవుండే ఇల్లు మూడు గదుల పోర్షను. ఇంతవరకు మరో ఎయిర్ హోస్టెస్ వసంతతో వుండేది. ఈమధ్యనే వెళ్లిపోయిందట.

సమత తనతో వుండవచ్చనే ప్రపోజలు వసంతనుంచే వచ్చింది.

"చూడు సమతా! ఝాన్సీ, నేను ఎనిమిది సంవత్సరాలు కలిసి చదివాం. నువ్వు మరిచిపోయావేమోగానీ నన్ను కూడా నువ్వు అక్కా అని పిలిచే దానివి. నేను నిన్ను అప్పట్లాగానే చిన్నా అనిపిలుస్తాను. నువ్వు కాకపోతే ఇంకొకర్నయినా వెతుక్కోవాలి నేను.

"ఇంకోమాట. ఈ వంట, తంటా నా వొంటికి పడదు. అసలు వారానికి రెండు రోజులు నేను వుండనే వుండను. డ్యూటీలో ఏ బొంబాయో, ఢిల్లీనో వెళ్లాల్సి వస్తుంది. అయినా నేనూ ఆడదాన్నేకదా! వంటిల్లు అని అన్నీ చేర్చి పెట్టాను. నీకు చేతనయింది వండుకు తిను. నేను వున్న రోజున నాకింత పెట్టు" అంది వసంత.

నెలకో నూటయాభై రూపాయలు వసంతకిస్తే చాలు. ఇంక ఏ ఇబ్బందీ వుండదు. సమత ఎక్కడ ఉండటమా అన్న సమస్య ఇంత తేలికగా తేలిపోయినందుకు ముందు ఝాన్సీ వూపిరి పీల్చుకొంది.

'ఆడపిల్లవీ ఒంటరిదానివీ. అంత పెద్ద పట్నంలో ఎట్లానో ఏమిటో' అంటూ వరలక్ష్మమ్మగారు ఊరికే కంగారుపడసాగింది.

వసంతతో వుంటే నేను పక్కన వున్నట్లే అని ఝాన్సీ చెప్పినా తల్లికి స్థిమితం కలగలేదు.

మాష్టారు, "చిన్నా! ఈమధ్య కాలంలో

నీవు రాజకీయంగా ఆలోచిస్తున్నావు. నీ జీవితంకంటే ముందు సమాజ సమస్యలని పట్టించుకోవాలని ఉబలాటపడుతున్నావు. మనిషి జీవితం చాలా చిన్నది. అతని శక్తి పరిమితమైనది. మరి సమాజ ఉద్యమాలు, సుదీర్ఘప్రయాణాలు, కఠోరవ్రతాలు.

మీ ఆలోచనలూ, ప్రయత్నాలు అంత త్వరగానూ, తేలికగానూ విజయం పొందే వని నాకనిపించటంలేదు. మహాయజ్ఞంలో మనమో సమిధగా మారటం వేరు, మనమే యజ్ఞకర్తలుగా ముందు నిలవటం వేరు. అనవసర త్యాగాలతో ఒరిగేదేం వుండదు. కాస్త జాగ్రత్తగా వుండమ్మా. నువ్వు ఆడపిల్ల వని ఇలా చెప్పటంలేదు. కొడుకువయినా ఇదే చెబుతాను తల్లీ" అని కూర్చోపెట్టుకొని బోధించారు సమతకు.

ఆయన ఆలోచనలు, అనుమానాలు, అభ్యంతరాలు అన్నీ అర్థమయ్యాయి సమ తకు.

చూస్తూ వుండగానే సమత హైదరాబాద్ చేరి రెండు నెలలు పూర్తిఅయ్యింది. వసంత తనని హైదరాబాద్‌లో అనేకచోట్లకు తిప్పింది.

క్రమంగా ప్రాంతం, పరిసరాలు పాతబ డ్డాయి సమతకి. "అమ్మాయి ఇక నీ చదువు గిదువు నీది. నా వ్యవహారాలు నావి. నా గైడింగుకు ఇక ఫుల్‌స్టాప్. ఆ తర్వాత వసంతక్క నన్ను చదువుకోనీయటంలేదని ఝాన్సీతో కంప్లైంట్ చేస్తావు" అంటూ తన లోకంలో పడిపోయింది వసంత.

ఇటు కాలేజీలో పెద్ద చెప్పుకునేదేమీ లేదు. ఏవో పరిచయాలు, కొద్దికొద్ది స్నేహాలు. ఇంకా వొకళ్లనొకళ్లు తెలుసుకోవ టంలోనే సరిపోతోంది.

ఒకరోజు "నువ్వేనా సమతంటే" అంటూ ఒకమ్మాయి ఎదురయ్యింది. "అవును" అని సమత అనగానే, ఆమె రెండు చేతులూ పట్టుకొని వూపేస్తూ "నేను స్రవంతిని. బోట నీలో వున్నాను. నీ ఫ్రెండ్ సౌందర్యని మా కజినే చేసుకున్నాడు. నీ గురించి వొదిన చాలా చెప్పింది" అంటూ గడగడా మాట్లా డింది.

మొదలెట్టటమే 'నువ్వు' అంటూ పలకరిం చిన స్రవంతి కాస్త చెప్పుకోదగ్గ స్నేహితురా లయింది సమతకి. "నేను ఒకంతట నిన్ను వొదలనులే. ఛూయింగ్ గమ్‌ని" అంటూ రెండు మూడుసార్లు సమత రూముకు వచ్చింది అప్పుడే. సమతకూ సరదాగానే వుంది.

ధర్మతేజ ఇచ్చిన అడ్రసుల్లో వాళ్ళని కలి సింది తనే వెతుక్కుంటూ వెళ్ళి. వాళ్ళు నగ రంలో వున్న ఇతర కాలేజీల్లో చదువుతున్న వాళ్ళు. వాళ్ళందరూ అభ్యుదయ విద్యార్థి సంస్థలో పనిచేస్తున్నారు. వాళ్ళే ఒకరోజు చైతన్యభారతి స్కూలుకు తీసుకువెళ్ళారు సమతని. విషయం విన్న ప్రిన్సిపాల్ రఘు రామ్- "చూడండి నేను నిరుద్యోగిగా వుండీ వుండీ ఈ సంస్థను ప్రారంభించాను. పేరైతే ఘనంగా పెట్టాను. కానీ ఇది రెగ్యులర్ కాలేజీలాంటిది కాదు. ఏదో పదిమందిని చేర్చి ట్యూషన్ ఇవ్వటం లాంటిది. అంతా కలిసి ఒక పద్ధతి ప్రకారం నడుపుతున్నాం.

ఇక్కడ నెలజీతాలు అంటూ ఏమీలేవు. క్లాసుకు ఇంతని ఇస్తున్నా. ఇంటరుకు పిరి యడ్‌కు నాలుగురూపాయలు. టెన్త్‌కు మూడు, సెవెన్త్‌కు క్లాసు తీసుకుంటే రెండు రూపాయలు. మీరు ఎన్ని క్లాసులు తీసుకో గలిగితే అంత సంపాదన. మీరు సెలవు పెట్టదలచుకుంటే రెండురోజులు ముందు చెప్పాలి. మానేయదలచుకుంటే కనీసం నెల ముందు చెప్పండి" అంతా బిజినెస్ కాంట్రా క్టులాగ గడగడా చెప్పేశాడు.

"అన్నిటికంటే ముఖ్య కండిషను. విద్యా ర్థులకు మీ టీచింగు నచ్చకపోతే మాత్రం పనివుండదు. ఆ తర్వాత నన్నని లాభం వుండదు" అన్నాడు.

ఈ రఘురామ్‌కి ఇరవైఆరు, ఇరవైఏడు సంవత్సరాలుంటాయి. కానీ చాలా పద్ధతి



ప్రకారం నడిచే మనిషి అని అతని మాటలు విన్నా, అతని రూము చూసినా ఇట్టే తెలిసి పోతుంది.

సమత అన్నింటికీ వొప్పుకుని క్లాసులు తీసుకోవటం ఆరంభించింది. చక్కగా మాట్లాడే లక్షణం, మామూలు వాళ్ళకు కూడా తన అభిప్రాయాలు అర్థమయ్యేట్టు వివరించగల చాకచక్యం వున్న సమత స్టూడెంట్లను బాగా ఆకర్షించింది. అందులోనూ ఆమె కెమిస్ట్రీలో యూనివర్సిటీ ఫస్టు అని తెలిసి ఇంటరు విద్యార్థులు సైన్సు క్లాసులన్నీ తనే తీసుకోవాలని ప్రిన్సిపాలును అడిగారు. వాళ్ళకి రోజూ రెండు క్లాసులు తీసుకొంటోంది సమత. మధ్యలో ఒకగంట టెన్త్‌వాళ్ళకు. సాయంత్రం ఐదున్నరనుంచి తొమ్మిదివరకూ ఈ టీచింగుతోనే సరిపోతుంది సమతకు.

మొదటి పదిరోజులలోనే సమతకు ఇంకో విషయం అర్థమయ్యింది. రఘురామ్ కేవలం డబ్బు సంపాదించాలనే ఈ ట్యుటోరియల్స్ పెట్టలేదు. తన పోషణ ఏదో గడిచిపోతుంది. అతనికి ఈ విద్యార్థుల్ని తమ సంస్థ కార్యక్రమాలలోకి సమీకరించే లక్ష్యం కూడా వుంది. మిగతా టీచర్లు కూడా కొందరు విద్యార్థి సంస్థలో బాధ్యతాయుతమైన స్థానాల్లో వున్నవాళ్ళే. అంతా సబ్జెక్టులు చెబుతూనే తమ ప్రణాళికా అంశాలు బోధించటం గమనించింది సమత. దాంతో సాధ్యమయినంత ఎక్కువసేపు ఆ విద్యార్థులతో గడపనారంభించటంలో ఏదో పనిచేస్తున్నట్లుకాక సరదాగా గడిచిపోతోంది కాలం.

సమత అడ్రసు వెతుక్కుంటూ వచ్చాడొక వ్యక్తి ఒకరోజు. "నా పేరు రాకేష్. నా గురించి మీకు తెలియదు. మీ గురించి నాకు కొంచెం తెలుసు. ఎలానంటారా? సత్యప్రసాద్ గారు...." అంటూ పరిచయం చేసుకున్నాడు.

అతను ఎం.ఎ. పొలిటికల్ సైన్స్, ఎకనమిక్స్ రెండు డిగ్రీలు చేశాడు. జర్నలిజం డిప్లొమా తీసుకున్నాడు. ప్రస్తుతం 'లా' చేస్తున్నాడు. "యూనివర్శిటీ తో సంబంధం ఇప్పుడే తెంపుకోవాలని లేదండీ. ఏదో ఒక డిగ్రీలో చేరుతూనేవుంటాను. యూనివర్శిటీతో నా పెళ్లి జరిగిందండీ. ఒకరోజు కన పడకపోయినా ఆవిడ ఊరుకోదు" అంటాడ తను సరదాగా.

కానీ అతను వీళ్ల విద్యార్థి సంస్థకి మూల పురుషుడనీ, ఆ ఉద్యమం కోసమే ఇంకా విద్యార్థిగా కొనసాగుతున్నాడనీ సమత తెలుసుకుంది.

"అమ్మా నాన్నలకు ఒక్కడినేనండీ! ఏ పరీక్ష ఇచ్చినా పాసు అయిపోతూనే వున్నాను కదండీ! అందుకని అడిగినంత డబ్బు ఇచ్చేస్తూవుంటారండీ! అసలు తాత ముత్తాతలు వెనకేసిన పాపపు సొమ్ము చాలా వుందిలెండి. మనం దాన్ని ఇలా పుణ్యంగా మార్చేస్తున్నాం." అంటాడు తేలికగా. ఏ సమస్యనయినా అంతే తేలికగా తీసుకుంటాడనిపించింది సమతకు.

ఈ కొద్దిరోజుల పరిచయంతోనే అతను బాగా స్టడీ చేసిన వ్యక్తి అని అర్థమయ్యింది. పార్టీకి చెందినవికానీ, జీవితాలకి సంబంధించి కానీ ఏదడిగినా ఒక్కక్షణం కళ్లు మూసి తల పైకెత్తి చూసి, 'అదా!' అంటూ కళ్లలో కళ్లుగుచ్చి చూసి నవ్వుతూ సమాధానం చెబుతాడు. అతను ఎంత సింపుల్‌గా చెబుతాడంటే, అతని సమాధానం విన్నాక "ఇంత చిన్న విషయం మనకెందుకు తట్టలేదా!" అనిపిస్తుంది ప్రశ్నించిన వాళ్లకి.

ప్రతి ఆదివారం సాయంత్రం ఆరుగంటల నుంచీ ఎనిమిదిగంటల వరకూ వాళ్లు కలిసే టైముగా నిర్ణయించుకున్నారు.

★ ★ ★

ఆరోజు ఝాన్సీ చాలా సంతోషంగా వున్నట్లు కనిపిస్తోంది. శర్మ వాళ్ళ ఇంటికి వస్తానన్నాడారోజు. తమ నిర్ణయం గురించి అమ్మానాన్నలకు చెప్పాలని నిర్ణయించుకు




న్నాడు. అంతకు రెండురోజుల క్రితం అతను వాళ్ల వూరు వెళ్ళాడు. శ్రీలక్ష్మి పెండ్లి జరిగిపోయింది. ఇక మన సంగతి కూడా చెప్పేసి వస్తానన్నాడు.

"మనం చిన్న పిల్లలం కాదుగదా! సింపుల్‌గా మారేజి రిజిష్టరు చేయించి ఆఫీసులో చిన్న పార్టీ ఇద్దాం" అని చెప్పి వెళ్ళాడు. రాత్రి వచ్చేసి వుంటాడు. ఈరోజు ఇక్కడికి రావాలి. "ముందుగా నాన్నగారికి చెబుదామా" అని రెండు మూడుసార్లు అనుకొంది ఝాన్సీ. కానీ అంతలోనే "సాయంత్రం వచ్చాక ఇద్దరం కలిసే చెబుదాములే" అని ఆఫీసుకు బయలుదేరింది. వెళ్ళేముందు మాత్రం అమ్మతో "ఇవ్వాళ సాయంత్రం వచ్చేసరికి ఏమైనా టిఫిన్ చేసి వుంచవే. నాతో ఇంకొకరు వస్తారు. రాత్రి భోజనానికి కూడా ఇక్కడే వుండవచ్చు" అని చెప్పి వెళ్లింది.

ఆ పూట బస్సు లేటయి ఆఫీసుకు అర గంట ఆలస్యంగా చేరింది. గబగబా నడిచి వొచ్చిన ఆమె చెమటలు తుడుచుకుంటూ ఆఫీసులో అడుగుపెడుతూనే ఎవరూ లేక పోవటం చూసి ఆశ్చర్యపోయింది. అయినా అంతగా పట్టించుకోకుండా తన సీట్లో కూర్చుని టైపు చేయడం ఆరంభించింది అలవాటుగా.

"అదేమిటమ్మగారూ! మీరు ఆస్పత్రి కాడకెల్లలేదా?" అంటూ వచ్చాడు బీడీ ఆర్పుకుంటూ వాచ్‌మన్.

"హాస్పటలు ఏమిటి?" యథాలాపంగా అడిగింది ఝాన్సీ టైపు చేస్తూనే.

"మీకేమీ తెలీదా అమ్మగారూ! ఆఫీసు స్టాపంతా గవర్మెంటు ఆస్పత్రి కెల్లారుగదా. సి. సెక్షన్‌లో పనిచేసే శర్మగారు రాత్రి లారీకి స్కూటరు గుద్దేశారండీ. పాపం! అప్పుడే పాణాలు పోయాయిగదండీ" అన్నాడు.

ఎలా చేరిందో తెలీకుండానే హాస్పటలుకు చేరుకుంది ఝాన్సీ. ఆఫీసువాళ్ళంతా అక్కడే వున్నారు. చనిపోయిన మనిషి గురించి ఏవేవో మాటలు.

"ఎంత మంచివాడయ్యా శర్మ. అప్పుడే నూకలు చెల్లిపోయాయి"

"ఆ దేవుడు మరీ చెడ్డవాడండీ, మంచివాళ్ళనే ముందు తీసుకువెళతాడండీ" అని కొందరు "అసలు ఈ స్కూటరు మీద రాత్రికి రాత్రి ఎందుకు వచ్చినట్లు? పగలు వస్తే ఈ ఘోరం జరిగేది కాదు గదా" అని ఒకరు.

"ఎనిమిది గంటలంటే ఒక రాత్రిటండీ! కాలం- అలా తోసుకువచ్చింది అంతే" అని ఒకరు. కలగాపులగంగా మాట్లాడేస్తున్నారు.

ఆఫీసులోని ఆడవాళ్ళు ఒకవంక నిలుచునివున్నారు. ఝాన్సీ కూడా వాళ్ళతో చేరింది మాట, పలుకు లేకుండా. ఆమె మనసు ఎంత కొయ్యబారిపోయిందంటే ఆమెకేమీ అర్థం కావటంలేదు. వూరికే అలా గుడ్లప్పగించి చూస్తూ నిలుచుంది.

అనుకున్నట్లుగానే ఆ సాయంత్రం శర్మ ఇంట్లో పెళ్లి విషయం చెప్పి బయలుదేరి వస్తున్నాడు స్కూటరుమీద. టౌను చేరేసరికి ఎనిమిది కావొస్తోంది. ఎంత! ఇంకో మూడు కిలోమీటర్లు అయితే రూముకు చేరుకునేవాడే. టౌను లైట్లు మిణుకుమంటూ కనిపిస్తూనే వున్నాయి. "పదినిమిషాలు" అనుకుంటూ యాక్సిలరేటరు రైజు చేశాడు.

తమ వూరునించి వస్తున్న చిన్నరోడ్డు వదిలి హైవేమీదకు మలుపు తిరుగుతున్నాడు. అక్కడే ఒక లారీ ఆగివుంది. అప్పటిదాకా దాని లైట్లేమీ వెలిగిలేకపోవడంతో శర్మ చూడలేదు. తీరా పూర్తిగా దగ్గరకు వచ్చేసరికి, ఆ లారీలైట్లు వెలిగాయి. కళ్లు మిరుమిట్లు గొల్పాయి శర్మకు. లారీని తప్పుకోవటానికి బ్రేక్‌వేసి పక్కకు తిప్పేలోపుగానే లారీకి గుద్దుకొని దానికిందకు వెళ్లిపోయాడు.

వెనకనే వస్తున్న బస్సులో హాస్పిటలుకు

తెచ్చారు కానీ బస్సులోనే ప్రాణాలు పోయాయి. పోలీసు గొడవలు, పోస్టు మార్టం జరుగుతున్నాయి. రాత్రికిరాత్రే శర్మా వాళ్ళ నాన్నగారు వచ్చాడు. ఆఫీసు వాళ్ళే ఒక చిన్నవ్యాను మాట్లాడి శవాన్ని పంపించారు.

ఏదో అవాకులు చెవాకులు వాగటమేకానీ, ఆఫీసులో వాళ్ళకి నిజంగా శర్మ, ఝాన్సీల మధ్య పెనవేసుకున్న గాఢానురాగం గురించి తెలీదు. అందుకే ఝాన్సీ గురించి ఎవరూ ప్రత్యేకంగా పట్టించుకోలేదు. లోపల ఎన్ని అగ్నిపర్వతాలు పేలినా పైకి ఏమనగలదు ఝాన్సీ! ప్రాణంతో ప్రాణం కలిసిపోయిందనుకున్న మనిషి, ప్రాణాలు పోయి వెళ్ళిపోతుంటే- ఝాన్సీ పరాయిదానిలా అక్కడే మిగిలిపోయింది. తన మనసు స్మృతిని ఝాన్సీకి వదిలి ఆమె పంచప్రాణాలు తనతో తీసుకుని వెళ్ళిపోయాడు శర్మ.

సాయంత్రం ఎవరితోనో కలిసివస్తానన్న ఝాన్సీ మధ్యాహ్నమే అదోలా తిరిగి వచ్చేస్తుంటే వరలక్ష్మమ్మగారు అడిగింది. "ఎవరో వస్తారన్నావుగదే! ఏరీ? "

"ఇంక ఎవరూ రారమ్మా" ఏదో లోకంలో వున్నట్లు సమాధానం ఇచ్చి తన గదిలోకి వెళ్ళి కూలబడిపోయింది ఝాన్సీ.

కనీసం కంటివెంట నీళ్లు లేవు. ఆమె మనసే ఇగిరిపోయింది. కాదు అతనితో ఎగిరిపోయిందో, కాలేపోయిందో?

★ ★ ★

"అమ్మాయ్ ఝాన్సీ ఎందుకమ్మా ఇలా వుంటున్నావు. అసలే అంతగా మాట్లాడవు. ఈమధ్య మరీ మూగనోము పట్టావేమిటమ్మా" ఆందోళనగా, బాధగా అడిగింది వరలక్ష్మమ్మగారు.

"ప్రత్యేకంగా ఏమీ లేదమ్మా" అంది ఝాన్సీ.

కానీ ఝాన్సీ మామూలుగా లేదని గుడ్డి వాళ్ళకు కూడా తెలుస్తుంది. ఏదో అంతులేని బాధలో మునిగిపోయినదానిలా వుంది తను. అందుకే ఆ తల్లిమనసు మరీ ఆరాటపడుతోంది. ప్రతిక్షణం ఝాన్సీని శ్రద్ధగా పరికిస్తోందావిడ.

"అమ్మాయ్. నేనొకటి అడగాలనుకుంటున్నాను. నాకేదో అనుమానంగా వుంది. నీ నెలసరి..." చాలా సంకోచంగా తన అనుమానానికి తనే సిగ్గుపడుతూ అడిగింది వరలక్ష్మమ్మగారు.

"నీ అనుమానం నిజమేనమ్మా. నాకిప్పుడు మూడోనెల. నేనే చెబుదామనుకుంటున్నాను. నువ్వే అడిగేశావు" నిస్సంకోచంగా చెప్పింది ఝాన్సీ.

ఆ తల్లి కలలో కూడా వూహించని అనర్థం జరిగినట్లు ముందు నివ్వెరపోయి, ఏమనాలో తోచక పక్కకుర్చీలో కూలబడిపోయి వెక్కి వెక్కి ఏడవసాగింది. అంతలోనే గొంతు వినపడకుండా చెంగు కుక్కుకుంది. రెండు నిమిషాలు తల్లిని అలాగే వదిలివేసి "ఎందుకమ్మా! అలా దుఃఖపడతావు? " అని వూరడించబోయింది ఝాన్సీ. విసురుగా ఝాన్సీని నెట్టివేస్తూ "ఇన్నేళ్లుగా మేము పెంచుకున్న మంచితనాన్ని, పరువు ప్రతిష్టలను, మా కడుపున పుట్టిన నువ్విలా ఒక్కసారిగా ఎలా కూల్చేశావమ్మా? ఈ వయసులో మాకు ఎంతటి అప్రతిష్ట తెచ్చి పెట్టావే నువ్వు. నలుగురికీ ఈ సంగతి తెలిస్తే ఈ మాత్రం మంచినీళ్లు గూడా పుట్టవుగదే" అంటూ ఇంకా కుళ్ళికుళ్ళి ఏడ్చింది ఆ తల్లి.

"ఏమిటి లక్ష్మీ. ఏమిటా ఏడుపులు, ఏమి జరిగింది? " అంటూ వచ్చాడు రామారావుగారు.

ఆయనను చూసిన వరలక్ష్మమ్మగారు మరీ కంగారుగా ఆందోళనగా, కలగాపులగంగా "రెండోది మన కొంప ముంచిందండీ" అంటూ విషయం చెప్పింది. వింటూనే ఆయన నిర్విణ్ణుడైపోయాడు.

"ఈ ముసలితండ్రికి ఇంత శిక్ష వేశావే





మిటి తల్లీ- కాదు కాదమ్మా నీకు నీవే ఎంత ఘోరం చేసుకున్నావు ఝాన్సీ"

ఎందుకిలా జరిగింది? అని అడిగే అర్హత నాకు లేదు ఝాన్సీ. కానీ నీవు ఇంత అవివేకంగా ప్రవర్తిస్తావనుకోలేదమ్మా! తప్పు నీది కాదు తల్లీ నాది. ఏ వయసుకు చెందిన ముచ్చట ఆ వయసులో జరపాలి. నా బాధ్యత నేను నిర్వర్తించలేని అశక్తుణ్ణి. అయినా ఇంత శిక్ష తట్టుకోలేను తల్లీ... రాలిపోయే మా బతుకులకోసం నీ బతుకును ఆహుతి చేశానమ్మా" అంటూ ఏమనాలో, ఎవరిననాలో తెలియక తననుతనే నిందించుకుంటూ మెల్లగా గొణగసాగాడాయన.

"మీ ఇద్దరికీ ఎంత మనస్తాపం కలిగేదీ నేను వూహించుకోగలను నాన్నా. కానీ నేనేమీ అనాలోచితంగానూ, తొందరపాటుతోనూ ప్రవర్తించలేదు. అంతకుమించి అవినీతిగా వ్యవహరించలేదు" అంది ఝాన్సీ నిబ్బరంగా.

"ఏమిటీ నువ్వు చెప్పేది. ఏడేడు తరాలకి పుట్టగతులు లేకుండా చేసి పైగా ఏమీ తొందరపడలేదంటావు" అంది కటువుగా తల్లి.

"చూడండి. మీ దృష్టిలోనూ, లోకం దృష్టిలోనూ నేను చెడిపోయినదానినేమో, కానీ నేను నీ అంత పవిత్రంగానే వున్నానమ్మా. మనసా, వాచా కోరుకున్నవారికే సంతానాన్ని కంటున్నాను. మనసులు కలుపుకొని, కలిసి జీవించాలనుకున్న ఒక ఉత్తముడితో శరీరాన్ని పంచుకున్నాను. మా ఇద్దరి మమతల రూపం ఈ శిశువు. మా కలల సాకారంగా ఆ శిశువుకు జన్మనిస్తాను. కావాలని కోరుకుని ఇది ధరించాను. ఎంతటి కష్టమైనా భరిస్తాను" అంది ఝాన్సీ

"నీవు చెప్పేది మాకు బోధపడటంలేదమ్మా" అని తండ్రి, "పెళ్లి కాకుండా ఈ వ్యహారమేమిటే? ఇంతకీ ఎవరా ఉత్తమ పురుషుడు? " అని తల్లీ ఒక్కసారే అడిగారు.

"పెళ్లి అని నలుగురికీ చెప్పుకుని చాటింపు వేయడం కాదమ్మా. ఏ స్త్రీ పురుషుల మనసులు ఏకం అయ్యాయో, వాళ్ళిద్దరూ కలిసి వుండటమే దాని అంతరార్థం. పెళ్ళి అనే తతంగం లేదు. కానీ నేను కోరుకున్న మగవాడి సంతానానికి తల్లినవుతున్నాను. ఇందులో తప్పు, అవినీతి ఏదీ లేదు" అంది ఝాన్సీ తల్లి కంఠంలోని వెటకారాన్ని, తీవ్రతను గుర్తించి.

"చూడు ఝాన్సీ! మనం ఒక సమాజంలో బతుకుతున్నామమ్మా! ఈ సమాజం నలుగురి మేలు దృష్టిలో వుంచుకుని కొన్ని పద్ధతులు, నీతి నియమాలు, నిబంధనలు ఏర్పాటు చేస్తుందమ్మా. వాటిని కాదని ఎవరికివారు ఇష్టం వొచ్చినట్లు వ్యవహరిస్తే అరాచకమే ప్రబలుతుంది. ఏ సమాజంలో మనం సభ్యులంగా వున్నామో, ఆ సంఘ కట్టుబాట్లను కాలదన్నడం కూడనిదమ్మా"

"అంటే మనిషి తన ఆనందంకోసం, తన మనసుకు నచ్చినట్లు, తను కోరుకునే విలువల కనుగుణంగా బతకడం తప్పంటావా నాన్నా. కనపడని సమాజం కోసం, దాని నియమాలకోసం, తన మనసును చంపుకోవలసిందేనా? ఆపాటి స్వతంత్రం కూడా లేదా మనిషికి"

"అది కాదమ్మా- సమాజంలో ఏ నియమాలు, చట్టాలు మానవ అభివృద్ధికీ, అనేకుల క్షేమానికీ భంగకరంగా మారతాయో, మనిషి మనసును నలిపి వేస్తూవుంటాయో, వాటిని ఎప్పటికప్పుడు సంస్కరించాలి! అందుకోసం ప్రతి తరం ముందడుగు వేస్తూనే వుంటుంది. అయితే ఈ సంస్కరణ అనేది ఏ కొందరు వ్యక్తుల కోరికల కోసమో కాకూడదు. అలాంటి వ్యక్తిగత ధోరణులను పెడధోరణి అని సమాజం అణిచివేస్తుంది. ఆ వ్యక్తులను వెంటాడి వేధిస్తుందమ్మా!"

"ఏమిటండీ మీ ఉపన్యాసాలు...

చర్చలు... నెత్తిమీద ముంచుకొచ్చిన ఆపదను వొదిలి సమాజం, ప్రగతి అంటూ మాట్లాడుతారు" భర్తను ఎదుర్కొంది వరలక్ష్మమ్మగారు.

"నేను అసందర్భంగా ఏమీ మాట్లాడటం లేదు లక్ష్మీ, అమ్మాయి తను ఏ తప్పూ చేయలేదనీ, తన భర్తకే సంతానాన్ని కంటున్నాననీ అంటోంది. మనమో పెళ్ళి జరగకుండా సంతానాన్ని కనటం అవినీతిగా భావిస్తున్నాం. ఝాన్సీ సంగతి మనకు తెలియనిదా! ఏ విషయంలోనయినా అది నిప్పులాంటి పిల్ల.

మనవి నలభైఏళ్ళనాటి ఆలోచనలు. దానివి ఈతరం ధోరణులు- కాదు బహుశా రేపటి ఆలోచనలేమో!

ఒక విషయాన్ని అర్థం చేసుకోవటంలోనే మనం ఇంత విరుద్ధంగా వున్నపుడు ఆ సమస్యను ఎలా పరిష్కరించుతాము? "

"ఏమో! నాకీ తరాలు, ఆలోచనలూ తెలీవు. కానీ ఒక్కటి మాత్రం ఖచ్చితంగా తెలుసు. నీతి అనేది వొకటుంది. ప్రతి మనిషీ దాని ప్రకారం నడుచుకోవాలి. ఏ కాలం ఎటుపోయినా ఎప్పటికీ మారని విషయాలు కొన్ని వున్నాయి. అలాంటి శాశ్వత విలువలు కాపాడుకుంటేనే ఇహం, పరం దక్కేది. నా కూతురు పెళ్ళి కాకుండా కడుపు తెచ్చుకుందనేది నేను భరించలేను. కనీసం ఆ అబ్బాయి ఎవరో తెలుసుకోకుండా మాటలతో ఏమిటి మీరు చేయబోయేది? "

చూడు లక్ష్మీ... పిల్లలు ఎంత పెరిగినా ఇంకా చిన్న పిల్లలుగానే చూస్తాం మనం. ఇన్ని తెలిసిన ఝాన్సీకి నీకు తెలిసినంత తెలియదంటావా? పెళ్ళి అవసరం లేదని గదా దాని వాదన. ఆ అభిప్రాయం మారకుండా, మార్చకుండా మనం ఏం చేయగలం? " అన్నాడాయన. ఆయనతో లాభం లేదని వరలక్ష్మమ్మగారు కూతురువైపు తిరిగి, "చెప్పవే... అతనెవరో చెప్పు. ఇప్పటికయినా నాల్గు అక్షింతలు వేయించుకో. నలుగురిలో మమ్మల్ని నగుబాటు పాలు చేయకే. అంతగా కావాలనుకునేవాడు పెళ్ళి చేసుకోనంటాడా? నాన్నగారు మాట్లాడి వస్తారు చెప్పమ్మా" అని బతిమాలసాగింది.

"పెళ్ళి చేసుకునే అవకాశం నేను కావాలనుకున్నా లేదమ్మా" అంటూ శర్మ విషయం పూర్తిగా చెప్పింది ఝాన్సీ.

అంతా విన్నాక తల్లీదండ్రీ దీర్ఘ ఆలోచనలోపడ్డారు.

"పెళ్ళి తప్పనికానీ, అవసరం లేదని కానీ, ఈ సమాజాన్ని, పెళ్ళి వ్యవస్థనీ చక్కదిద్దాలనీ నా వుద్దేశం కాదు నాన్నగారూ! నేను మామూలు మధ్యతరగతి ఆడపిల్లనే. అందరిలాగే నాకూ ఆశలువుండేవి. పెళ్ళికి మనసులు కలవటం అనేది తప్ప ఇంకెన్నో షరతులు, వొప్పందాలు వున్న నేటి డబ్బు ప్రపంచంలో, మన బీదరికంవల్ల ఇంతవరకూ నాకు పెళ్ళికాలేదు. ఆ తప్పు మనది కాదు. మీరు చెప్పే ఈ సమాజానిదే నాన్నా.

"అయినా నేను నీతిగానే ఇంకా ఎవరో వస్తారని ఎదురుచూస్తూ వచ్చాను. నా ఆశలు నిరాశలయిన వేళ, నా బతుకు మోడవుతున్న దశలో ఒక వర్షామేఘంలా అతను కలిశాడు. మనసారా ఇద్దరం వొకరినొకరం కావాలనుకున్నాం. నేడో రేపో పెళ్ళి అని ఏర్పాట్లు కూడా చేసుకున్నాం. లోకానికి చెప్పకపోయినా అతను నా భర్త. అందుకే పవిత్రంగా అతనికి నన్ను సమర్పించుకొన్నాను. పెళ్ళితంతు జరగకముందే అతను దూరమయ్యాడు. నేను తల్లినవుతున్నాను. అతను దూరమయినంత మాత్రాన మామధ్య విరిసిన స్నేహం, దాని మాధుర్యం మరిచిపోయి ఏమీ తెలియనిదానిలా ఇంకోవ్యక్తికి భార్యను కాదలచుకోలేదు. దానివల్ల ఈ సమాజానికి ఏమిటి నాన్నా నష్టం? నేను ఏవిధంగా అవినీతి పరురాలినవుతాను? ఏవిధంగా చెడిపోయి

నదానినవుతాను"

రెండు నిమిషాలు తల్లీదండ్రీ ఎవరూ మాట్లాడలేదు.

"చూడు ఝాన్సీ నేను గడపదాటి కాలుబయట పెట్టకపోయినా లోకంలో జరిగే విషయాలు నాకూ తెలుసు. మీ తండ్రీ కూతుళ్ళంత అతిగా కాకపోయినా, నాకూ కొంచెం తెలివివుంది. అన్నింటికన్న ముందు నా వాళ్ళంతా సుఖంగా వుండాలనే కాంక్ష వుంది. ఆయమ్మ నోట , ఈ అమ్మ నోట వింటూనే వున్నాను. ఈ రోజుల్లో గర్భాలు తేలికగానే తీసివేస్తారట గదా! ఆ పని చేయించుకో తల్లీ... ఈ పిండం పోతే తర్వాత, ఏమో! ఎవరు చూడొచ్చారు, మళ్ళీ నీకు నచ్చే మరో మనిషి రాకపోడమ్మా" చాలా ఆర్ద్రంగా, అనునయంగా అంది వరలక్ష్మమ్మగారు.

"అది కుదరనిదిలే అమ్మా. నాకు ఈ సంతానం కావాలి. పెళ్ళి కాని తల్లిగానే నేను ఈ బిడ్డను పెంచుతాను. ఆత్మవిశ్వాసంతో బతుకుతాను. నా బిడ్డకు నేర్పుతాను" పట్టుదల ధ్వనిస్తూ అంది ఝాన్సీ.

"నలుగురి నోళ్ళలోనూ ఆడపిల్ల బతుకు నానటం అంత మంచిది కాదమ్మా, పరువుకు పెద్దపీట వేస్తుంది లోకం" అంది తల్లి.

"ఈ ప్రపంచానికి నా గురించి పట్టించుకోవటం తప్ప మరో పనేమీ వుండదా అమ్మా. అంతగా పట్టించుకునేవాళ్ళయితే పన్నెండు సంవత్సరాలనుంచీ పెళ్ళికోసం ఎదురుచూసిన నన్ను కట్టుకుంటామని ఎవరూ ముందుకు రాలేదేం? ఒక మంచి మాష్టారి కూతురికి పెళ్ళికావటంలేదని నలుగురూ సహకరించి సాయం చేసి ఆ సమస్యను తీర్చలేదే? ఎందుకమ్మా నలుగురి కోసం అని మనం లేని బాధలు తెచ్చుకోవటం? దేనికమ్మా నా జీవితానందం నేను చేతులార పాడుజేసుకోవటం!"

ఝాన్సీ ఎంత పట్టుదలగా, ఎంత ధీమాగా తన సమస్య గురించి ఆలోచించుకున్నదో మాష్టారికి బాగా అర్థమయ్యింది. కానీ ఆ తల్లికి ఇంక మాట్లాడే శక్తిపోయింది. వుక్రోషం ముంచుకొచ్చింది.

"ఏమిటే నీ మొండిపట్టు! దురదృష్టంకొద్దీ కావాలనుకున్నవాడు పోయాడు. అగ్ని చుట్టూ తిరిగి, ఏడేడు జన్మలబంధం అనుకున్నవాళ్ళే మొగుడు పోతే మళ్ళీ పెళ్ళిచేసుకుంటున్నారు. పెళ్ళీ పెటాకులు లేకుండా నువ్వేమిటి? లోకంలో అతనొకడే మొగవాడయినట్టు, బతుకంతా వాడి పేరు జపం చేస్తూ బతుకుతానంటావు!" విసవిసా నడిచి పోయి వంటింట్లో కూర్చుని ఏడవసాగింది వరలక్ష్మమ్మగారు.

రామారావుగారు ఝాన్సీని దగ్గర కూర్చోపెట్టుకుని ఏవేవో చెప్పసాగాడు. "ముప్పై ఏళ్ళకే బతుకంతా ముగిసినట్లు భావించటం మంచిది కాదమ్మా!" అన్నారు. "నువ్వు ఈ రోజున చాలా భావావేశంతో ఈ నిర్ణయం తీసుకుంటున్నావు. బాలవితంతువులు వుండేవారు నా చిన్నతనంలో. అలాంటి జీవితాన్ని ఎన్నుకొంటున్నావు. చాలా కష్టమమ్మా. ప్రకృతి నియమాలు, శారీరక అవసరాలు, ఏ తండ్రీ కూతురితో ఈ విషయాలు చెప్పలేడమ్మా. చాలా కఠోరమయిన జీవితాన్ని ఎన్నుకుంటున్నావు. అన్నింటినీ నిగ్రహించామనీ అరిషడ్వర్గాలను జయించామనీ ఎన్నో మాటలు చెప్పిన మహారుషులకే సాధ్యంకాలేదు తల్లీ. చివరకు అలాంటి మాటలు చెప్పి చాలా మంది ఎంత అవినీతి జీవితం గడిపారో, ఎంత అశ్లీలంగా వ్యవహరించారో నీకు తెలియనిది కాదు"

"మనిషిగా నా ప్రయత్నం చేస్తాను నాన్నా! కానీ ఏనాడూ అవినీతివైపు అడుగు పెట్టనని మాత్రం నమ్మండి"

"మా ముందు తరం నీవు. చిన్నదానివయినా జీవితంలో ఎన్నో అనుభవాలు ఎదుర్కొన్నావు. ఎంతో బాధ్యత మోస్తున్నావు.

అన్నీ ఆలోచించి నీవొక మార్గం ఎన్నుకొన్నాక, నేను అడ్డం నిలవనమ్మా. బతుకు నీది. ఎలా తీర్చిదిద్దుకొంటావో నీ యిష్టం తల్లీ... ఏదయినా, సుఖంగా వుండాలని కోరుకోవటం తప్ప నేను చేయగలిగింది ఏమీలేదు" బరువుగా మాట్లాడుతున్న ఆ కంఠం గద్గదికంగా మూగబోయింది.

చిన్నగా ఝూన్సీ తల నిమరసాగాడాయన.

★ ★ ★

ఆరోజు సమతకి రెండు ఉత్తరాలు వచ్చాయి. రెండూ ఇంటిదగ్గరనుంచే. ముందు ఝూన్సీ ఉత్తరం తీసి చదివింది.

"నా పెళ్ళి విషయంలో వూహించని విపరీతం జరిగింది. నేను హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ కోసం ప్రయత్నిస్తున్నాను. ఈ లెటరుతో పంపిస్తున్న ఉత్తరం ఇక్కడి మా ఆఫీసరు ఇచ్చింది. ఇది తీసుకుని నువ్వు సెక్రటేరియట్‌లో వున్న శంకరానంద్ అనే అడిషనల్ సెక్రటరీగారిని కలువు"

అంతే వుంది ఝూన్సీ ఉత్తరంలో "ఏమి జరిగిందా...? " అనుకుంటూనే ఏమీ అర్థం కాక రెండో ఉత్తరం తీసింది.

అది వరలక్ష్మమ్మగారు అతికష్టపడి రాసిన ఉత్తరం. అన్ని విషయాలూ పూసగుచ్చినట్లు రాసి "అది ఎవరిమాటా వినటం లేదు. అసలు మీ నాన్నగారు గట్టిగా మాట్లాడలేదు. నువ్వు ఒకసారి అర్జంటుగా ఇంటికి వచ్చి వెళ్ళు" అని రాసింది. సమత తన తెలివితేటలన్నీ ఉపయోగించి ఝూన్సీని మార్చాలని ఆవిడ తాపత్రయం.

ఆ ఉత్తరం అర్థమై ఏమైనా అనుకోవటానికి అరగంటపైనే పట్టింది సమతకు. పదహారు కళలతో వెన్నెల చిలకబోతున్న రేరాజుని రాహువు మింగి చీకటి మిగిల్చినట్లు అక్క బతుకులో ఈ గ్రహణం ఏమిటా అని మథనపడింది సమత. ఆలస్యంగానయినా బతుకో అందమైన మలుపు తిరిగిందని వూహల పల్లకిలో మనసు మల్లికై వూరేగుతుంటే, అక్క మనసును, ఎవరో నిర్దాక్షిణ్యంగా నేలకు విసిరికొట్టినట్లు, ఇలా జరిగిందేమిటా అని రెండు రోజులు అన్యమనస్కంగా గడిపింది.

హరిహరాదులు దిగివచ్చినా ఝూన్సీని మార్చటం కష్టం అని సమతకు తెలుసు. ఝూన్సీ వాదనలు వింటే కరక్టే అనిపిస్తోంది. కానీ అమ్మ చెబుతున్నట్టు బతుకంతా బండలు చేసుకోవటమేనా అని కూడా అనిపిస్తుంది. సవ్యమయినదా? కాదా? అనే దానికన్నా, అక్క నిర్ణయం చాలా బాధాకరమైన పరిణామం అనీ, ఆమె జీవితం అసహజమైన మలుపులోకి తిరుగుతోందనీ భావించింది.

అక్క అని చెప్పకుండా, ఒకరోజు ఈ విషయం రాకేష్‌తో ప్రస్తావించింది. అతను "నంబర్‌వన్... అలాంటి స్త్రీ మనోధైర్యానికి మెచ్చుకోవాలండీ, నంబర్ టూ సంఘంలోని కృత్రిమ విలువలమీద ఒక స్త్రీ తీస్తున్న దెబ్బగా దాన్ని అర్థం చేసుకోవాలండీ" అన్నాడు. ఆ వెంటనే "అయితే అలాంటి పరిస్థితిలో వున్న ప్రతి స్త్రీ ఇలాగే చేయాలా అంటే మాత్రం అవసరం లేదనే చెప్పాలండీ. ఈ అమ్మాయి నిర్ణయం వెనక సెంటిమెంటు, భావోద్రేకమూ బలంగా వున్నాయి. కొద్దికాలం పోయాక ఆవిడ మనసు మారుతుందని నా మనసులో ఒక భాగం భావిస్తోందండీ" అన్నాడు.

"సంఘంమీద దెబ్బ అంటూ తన బతుకును పాడుచేసుకుంటోందిగదా ఆ అమ్మాయి. వుదాహరణకి ఈరోజున ఎవరయినా స్త్రీ 'నా భర్తలేక ప్రియుడు లేకుండా నేను బతకలేనని' సహగమనం చేస్తుంటే నాగరిక సమాజం అంగీకరిస్తుందా? 'ఆవిడ భర్తను ఎంతగా ప్రేమించిందో' అంటూ చప్పట్లు కొట్టి, ఆవిడనో సతీమాతగా కీర్తించటం ఎంత అవివేకం? 'ఆమెదెంత పాతివ్రత్యం' అంటూ సర్టిఫికెట్లు ఇవ్వటం ఎంతటి ఆటవికం. అలాగే ఈ అమ్మాయి




బతికుండీ జీవచ్ఛవంలా గడుపుతానంటే, పాతకాలపు పతివ్రతారత్నాలకు దీటుగా, గంగాభాగీరథీ సమానురాలనే కీర్తిపతకాలకు అర్హత సాధిస్తానంటే అంగీకరించాలా" చాలా ఆవేశంగా అంది సమత.

ఏమిటింత ఆవేశపడుతోంది అన్నట్లు ఆమెనోక్షణం పరిశీలనగా చూసి, ఆమె కళ్ళల్లో కళ్ళుగుచ్చి "మీరు నన్ను అడవి మనిషిగా జమకట్టేస్తున్నారండోయ్! ఈ అమ్మాయి మరణాన్ని కాదండీ, రణాన్ని వరిస్తోంది. ప్రతి జీవితానికీ పెళ్ళే అంతిమ లక్ష్యం అని మనం ఎలా అనగలం! ఒక స్త్రీ పెళ్ళిచేసుకోకుండా తనకు నచ్చిన మార్గంలో సమాజసేవ చేస్తుంటే, నువ్వు ఎందుకు అందరిలా పెళ్ళిచేసుకోవు అని ఆమెను అమ్మమ్మల్లాగ పీక్కుతినటం న్యాయమా! అలాగే ఈ అమ్మాయి తనకు నచ్చిన మగ వాడికి సంతానంకని, మరో మగాడిని కోరు కోకుండా బతుకుతానంటే, ఆ బిడ్డను పెంచి పోషించటమే లక్ష్యం చేసుకుంటే మనం అభ్యంతరం పెట్టవలసింది ఏముందండీ? " అన్నాడు.

"అయితే ఇది ఆనందకరం కాదు అనే గుర్తింపు కలిగిననాడు, ఇంకేమో కావాలని కోరుకున్ననాడు, ఇలాంటి అమ్మాయి సమాజం ఏమనుకుంటుందో అని వెనక ముందులాడదు పతివ్రతల్లాగ. తనకు కావ లసింది ధైర్యంగా అందిపుచ్చుకుంటుంది కూడానూ"

"అలాంటి అవకాశం రావటానికి ఈ సంతానం అడ్డంకిగా వుండదా? " అంది సమత.

"అవకాశాలు పరిమితం అవుతాయంటే వొప్పుకుంటాను కానీ అసాధ్యం మాత్రం కాదు. మనసులో వొకటీ, బయటకు మరొ కటి కాని వాళ్ళు తమకు నచ్చిన విలువల కోసం ఏదయినా చేయగలరు. జీవితంలో ఈ నిజాయితీని పెంచుకోవలసిన అవసరం వుందండీ" అన్నాడతను.

సమత ఏవో ఆలోచనల్లో మునిగిపో యింది. అతని మాటలు వ్యతిరేకించటానికి ఆమెకు మాటలు దొరకడం లేదు. అలాగని అతని మాటల్ని పూర్తిగా అంగీకరించనూలే కపోతోంది. పరధ్యానంగా వున్న ఆమెను తట్టి పిలుస్తూ, "ఏమండోయ్. మన టైము అయింది. ఈ పూటకు సశేషం" అంటూ సెలవు తీసుకున్నాడతను.



స్వరాజ్యం ఇద్దరు పిల్లలనూ తీసుకుని పుట్టింటికి వచ్చింది. సమత కోసం ఎదురు చూస్తున్న వరలక్ష్మమ్మగారికి పెద్ద కూతురు రాక ఆశ్చర్యం అనిపించినా సంబరంగా మనవడ్ని ఎత్తుకుంది గేటులోకి ఎదురెళ్ళి. ఆడపిల్ల అమల ఐదేళ్ళు దానికి. రెండో సంతానం పిల్లవాడు మూడున్నరేళ్ళు ఇప్పు డువాడికి. వాడి పేరు రఘునాథ్. వీడికా న్నుకీ రాజ్యం పుట్టింటికి వచ్చి వెళ్ళింది. మళ్ళీ ఇప్పుడే రావటం.

వచ్చింది తాతగారింటికే అయినా పిల్లలి ద్దరికీ కొత్తగా వుంది. అందుకే అమ్మనే అంటిపెట్టుకు తిరగసాగారు. వాళ్ళు వుంటు న్నది పట్టణం. చిన్న యిల్లు. యింటి ముందు మురికి కాలవ. ఆడుకోవటానికి చోటేలేదు. తాతగారింటి ముందువున్నతోట,

చెట్లు చూడగానే వాళ్ళ మనసుకు రెక్కలు మొలిచినట్లయింది. కొత్త పోగానే తూనీ గల్లా ఎగిరిపోయారు.

ఆ పూటకి ట్యూషన్ కుర్రాళ్ళని పంపించే శారు మాష్టారు. ఝాన్సీ ఇంకా ఆఫీసు నుంచి రాలేదు.

రాజ్యం తన కాపురం కబుర్లు చెబుతోంది. "ఆయన చాలా జాగ్రత్త మనిషమ్మా. అప్పుడే అమల పేరున నెలకో యాభై రూపాయిలు డిపాజిట్లు కడుతున్నారు దాని పెళ్ళి నాటికని. మీ నాన్నకీ తెలివివుంటే మనం ఇంకా బాగుండి వుండే వాళ్ళం కదా అంటారు ఎప్పుడూ."

పెళ్ళి అయింతర్వాత కూతురిలో ఎంత మార్పు వచ్చిందో? ... వూహూ అల్లుడు ఆమెను ఎంతగా మార్చేశాడో అంచనావేస్తున్నారు మాష్టారు.

భోజనాలు చేస్తూ హఠాత్తుగా అడిగింది రాజ్యం. "ఏం నాన్నా ఝాన్సీకి ఇక పెళ్ళి చేయవా?"

"నా చేతుల్లో ఏముంది రాజ్యం" తలవొంచుకుని చూపులు తప్పిస్తూ అన్నాడాయన.

"అలా అంటే ఎలా నాన్నా! ఏదో గంతకు తగ్గ బొంత అని ఎవరో వొకరికి ముడిపెట్టాలి గదా! అన్నీ మనం కోరుకున్నట్లే జరగాలంటే కుదరదుగదా!"

"అది పెళ్ళిచేసుకోనంటోందమ్మా" అన్నారు అర్థసత్యం చెబుతూ.

"అదేం మాటలే నాన్నా! ఎల్లకాలం అదే మిమ్మల్ని పోషిస్తుందా! ఎవరి తిప్పలు వాళ్ళు పడాలి!" అంది ఎవరో పరాయి వాళ్ళను గురించి మాట్లాడుతున్నట్లు.

"అమ్మా! ఈమధ్య మా తోటికోడలు పోయిందని రాశానుగదా! బావగారు మళ్ళీ పెళ్ళిచేసుకునే ఉద్దేశంలో వున్నారు. ఆయనకే ఇద్దరే పిల్లలు. వయసు అయినా ఏమంత ఎక్కువ కాదు. మా ఆయనకన్నా ఏడెనిమిదేళ్ళు పెద్ద అంతే. అంతో ఇంతో కట్నం ఇచ్చి పెళ్ళి చేస్తామని అప్పుడే సంబంధాలు వస్తున్నాయి కూడాను. నేను ఆ విషయంతోనే వచ్చాను. ఇది ఉద్యోగం చేస్తోంది కదా, ఏదో తంటాలు పడి నచ్చచెబితే ఆయన వొప్పుకుంటారు. ఝాన్సీని ఇద్దామే. మనం తొందరపడకపోతే మాత్రం ఎవరో ఎగరేసుకుపోతారు" అంది తను వచ్చిన విషయం చెబుతూ.

వరలక్ష్మమ్మగారు ఈ మాటలు వింటూనే లేచి వెళ్ళి బాదం చెట్టు కింద కూర్చుని చిన్నగా ఏడవసాగింది.

"నేను పెళ్ళి మాటలు చెబుతుంటే అట్లా లేచి వెళతావేమిటే" అంటూ పళ్ళెంలో చేయి కడుక్కొని తల్లి వెంట వెళ్ళింది రాజ్యం.

వరలక్ష్మమ్మగారు చిన్నగా వొక్కటొక్కటీ ఝాన్సీ సంగతులన్నీ చెప్పింది. వింటూనే అవాక్కయిపోయింది రాజ్యం.

ఝాన్సీ వచ్చేసరికి అన్నీ ఆలోచించిపెట్టుకొంది రాజ్యం.

"ఎంత పనిచేశావే నువ్వు. నేనేమో ఇంకా పెళ్ళి సంబంధాలు వెతుకుతుంటే- అవ్వ! బయటకు పొక్కితే ఎంత పరువు నష్టం" అంది ఝాన్సీ రాగానే!

"పరువూలేదూ నష్టమూ లేదుగానీ ఇంక ఆ సంగతి వొదిలేయి నీ సంగతులు చెప్పు" అంది ఝాన్సీ మహాతేలికగా.

"చాల్లే సంబడం! నీకు తోచకపోతే ఇవతలి వాళ్ళు చెబుతున్నా వినిపించుకోవేమిటే?" అంటూ తన బావగారి సంగతి చెప్పి, "ఆలస్యం కాకుండా అబార్షన్ కానివ్వు. నెల జరిగేలోగా పెళ్ళి జరిపించేస్తాను. నీకు పిల్లలు కావాలంటే సంవత్సరం తిరిగేలోగా కనవొచ్చు కాలం గడిచేకొద్దీ అన్నీ మరిచిపోతావు" అన్ని సమస్యలు పరిష్కరించేస్తున్న పద్ధతిలో మాట్లాడింది రాజ్యం.

తల్లీదండ్రీ అక్కడే వున్నారు. మళ్ళీ అంతా వొకసారి ఝాన్సీని బలవంతం చేశారు.

"సరే మీరంతా ఇంతగా చెబుతున్నారుగ

నక పెళ్ళికి వొప్పుకుంటాను" అందరికీ పెద్ద రిలీఫ్‌గానూ, ఆనందంగానూ, అనిపించింది.

"అయితే నాది వొక షరతు. నేను చేసుకోబోయేది ఇద్దరు బిడ్డల తండ్రిని. అతని భార్యపోయింది. ఒకవిధంగా నేను భర్త పోయిన దానికిందనే లెక్క. అతనినీ, అతని పిల్లలనూ నేను అంగీకరిస్తున్నపుడు నా బిడ్డతోసహా నన్ను అతనూ స్వీకరించాలి. నేను బిడ్డలందర్నీ సమానంగానే చూస్తాను" అంది ఝాన్సీ.

రాజ్యానికి వొళ్ళు మండిపోయింది. "అసలు నీవు వొళ్ళు తెలిసే మాట్లాడుతున్నావా? నీలాంటిదానికి పెళ్ళి కావటమే కష్టం. ఏదో అవకాశం వస్తే అందిపుచ్చుకోకుండా, నీ బోడి షరతులు, కోరికలు ఏమిటే. మా బావగారు కాదుగదా, ఏ మగవాడూ నిన్ను చేసుకోడు. అట్లాంటి ఆడదానితో కాపురం చేయరు. మొగుడు చచ్చిన విధవకు కొంచెం సానుభూతయినా వుంటుంది. నువ్వేమిటి ఎవడితోనో కులికి కడుపు తెచ్చుకుంది చాలక ఆ పాపాన్ని ఇంకా ఎవరో భరించాలని అంటావు? "

"నేను అది పాపం అనటంలేదు. నాలో అపవిత్రం ఏమీలేదు. పెళ్ళి అంటూ చేసుకుంటే అలా వొప్పుకునే మగవాడయితేనే నేను వొప్పుకునేది. మామూలు అణా కానీ పురుషులను నా భర్తగా నేను స్వీకరించను. నా బిడ్డతోసహా నన్ను ఆదరిస్తే అతనికి కనీస సంస్కారం వుందని భావించి కొంతయినా అభిమానించగలుగుతాను" కుండ బద్దలు కొట్టినట్టు చెప్పింది ఝాన్సీ!

"రంకు నేర్చినమ్మ బొంక నేర్చిందని, మాటలు నేర్చావే నువ్వు. పెళ్ళి కాకుండానే కాలుజారిన దానివి, పెళ్ళి అయ్యాక సక్రమంగా వుంటావని ఏమిటి? ఛీ ఛీ... ఇలాంటి చెల్లెలు వుందని చెప్పుకోవటమే సిగ్గుచేటు. అమ్మా నేను రేపు ఉదయమే వెళ్ళిపోతాను" అని విసురుగా లోపలికి వెళ్ళింది రాజ్యం.

హైదరాబాద్‌నుంచి వస్తూ తెచ్చుకున్న రెండు చీరల్లో ఒకటి తల్లికిచ్చి 'అక్కయ్యకివ్వవే' అంది ఝాన్సీ

అన్నట్టుగానే ఉదయమే బయలుదేరింది రాజ్యం. కళ్ళనిండా నీళ్ళతో గేట్లోనే మిగిలిపోయింది వరలక్ష్మమ్మగారు ఎంత చెప్పినా వినకుండా వెళ్ళిపోతున్న రాజ్యాన్ని చూస్తూ. "ఏం పిల్లలో! చిన్న పిల్లలుగా కేరింతలతో గుండెల్లో తన్నారు. ఇవ్వాళ గుండెల్నే కాల్చేస్తున్నారు" అనుకుంది ఆమె.

★ ★ ★

చిట్టిముత్యంలా చిన్న ఇల్లు. ముందు క్రోటన్సు లైనుగా డిజైన్లలో కత్తిరించి వున్నాయి. ఒకవంక ఐదారు రకాల గులాబులు ఒత్తుగా పూసి వున్నాయి. మరోవంక మందారాలు, గుంపులు గుంపులుగా పూసిన రంగురంగుల పూలు. చూడగానే పద్ధతి ప్రకారం పెంచుకుంటున్న తోట అనిపిస్తుంది. తోటలో నాపరాళ్లు పరిచి దారులు కూడా ఏర్పరిచివున్నాయి.

సమత డోరుబెల్ నొక్కి ఎదురు చూడసాగింది. లోపల చిలకలు కిచకిచలాడినట్లు బెల్ శబ్దం వినిపించింది. తలుపులు తీసిన పనిమనిషిని 'మేడం వున్నారా? ' అడిగింది సమత.

"ఇలా కూర్చోండమ్మా! అమ్మగారికి చెప్పి వస్తాను" అంటూ ఆ అమ్మాయి లోపలికి వెళ్లింది.

డ్రాయింగ్ రూం ఎంత సాధారణంగా వుందో అంత హుందాగా వుంది. లేత ఆకుపచ్చరంగు గోడలు. ఒకవైపు విచ్చుకుంటున్న కమలాలతో నిండిన చెరువు. ఆ నీటి జాలువెనుక లోకాన్ని పలకరించటానికి నవ్వు మొహంతో ఉదయిస్తున్న సూరీడు వున్న వాల్ పేపర్ నిండుగా వుంది. అక్కడే పేము కుర్చీల సెట్టువుంది. అక్కడ కూర్చుంటే సిమెంటు గోడల మధ్యకాక ఏదో చెరువుగట్టున, అందమైన ప్రకృతి ఒడిలో కూర్చున్నట్టు వుంటుంది. ఆ వాతావర

ణాన్ని ఇంకా గంభీరం చేస్తున్న మౌనం.

"నమస్తే మేడం" లేచి నిలుచుంటూ అంది సమత.

"ఓ సమతా! కూర్చో కూర్చో... ఇన్నాళ్లకు తీరిందన్నమాట నా దగ్గరకు రావటానికి"

సమత కూర్చుంటూనే అరక్షణం ఆవిడను రెప్పవేయకుండా చూసింది. నలభై ఏళ్లు పైబడుతున్న వయసు. పొడవుగా, బొద్దుగా, పచ్చగా మెరిసి పోతోందావిడ. చురుకుగా కదిలే కళ్లు తేటగా, విజ్ఞానశాస్త్రపు పుటల్లా తళుకులీనుతున్నాయి. ఆవిడ డాక్టర్ జానకి. రీసర్చి లేబరేటరీలో సీనియరు సైంటిస్టు. నగరంలో కొంచెం నిజాయితీగా పనిచేసే స్త్రీల సంస్థలతో సంబంధం వున్న వ్యక్తి.

సమత వాళ్ల సంస్థ నిర్వహించిన 'మహిళల ఉద్యోగాలు' అనే గోష్ఠిలో పాల్గొన్నపుడు ఆవిడను సమత బాగా ఆకర్షించింది. ఆ తర్వాత యూనివర్సిటీలోనూ, అక్కడక్కడా మీటింగులలోనూ కలుసుకున్నారిద్దరూ. నిక్కచ్చిగా తన అభిప్రాయాలు వెలిబుచ్చే జానకిని చూస్తే సమతకు ఏదో గౌరవం కలిగింది.

నగరంలోని మహిళా ఉద్యమాలు, విద్యార్థుల ఆందోళనల గురించి కాసేపు ముచ్చటించుకున్నారు.

"మేడమ్! మీ నుంచి చాలా తెలుసుకోవాలని వచ్చాను నేనీ పూట. గత్యంతరం లేక కాదు, బై ఛాయిస్ అంటే తమంతట తాము ఇష్టపడి స్త్రీలు అవివాహిత జీవితం గడపవచ్చునీ, దానికి మీ జీవితమే ఒక ఉదాహరణ అనీ గోష్ఠిలో అన్నారు మీరు. స్త్రీకి పెళ్లి కంపల్సరీ అనే ఉద్దేశం నాకు లేదుగానీ వేరే విధంగా వుండటంమీద సరైన అవగాహన కూడా లేదు. ఇలాంటి స్థితిలో మా అక్క తీసుకున్న నిర్ణయం సరైనదా కాదా అని తేల్చుకోలేకపోతున్నాను" అంటూ ఝాన్సీ విషయం అంతా చెప్పింది. "ఈ విషయంలో మీ ఉద్దేశాలు, ఆలోచనలు కాస్త వివరంగా చెబుతారా" అని అడిగింది.

ఆ మాటల్లో జర్నలిస్టిక్ ఉత్సాహంకాక జీవితాన్ని తనకు తెలియని కోణంనుంచి అర్థం చేసుకోవటానికి పడుతున్న తాపత్రయం వినిపించింది జానకికి. ఆవిడ ఓ నిమిషం ఆలోచించి "జీవితాన్ని తమ మనసుకు నచ్చినట్టు గడపటం ఉచితం సమతా! ఇది మంచి చెడూ అని పక్కనుండి చూసే వాళ్లు విడమరచటం చాలా కష్టం. నా జీవితమే వినిపిస్తాను. దాని నుంచి నీ ఇష్టమొచ్చిన నిర్ణయం నువ్వు చేసుకో.

"మాది బాగా కలిగిన కుటుంబం. మా నాన్నగారు లా గ్రాడ్యుయేట్. అయినా స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనటానికి ఆ వృత్తిని వదిలేశారు. స్వాతంత్ర్యం వచ్చాక కూడా కాంగ్రెసులో తిరిగారు. కొంతకాలం పాటు యం.యల్.సి.గా వున్నారు. కానీ ఆ తర్వాత ప్రజాజీవితంలో వస్తున్న మార్పులు, రాజకీయాల్లో రౌడీయిజం, ముఠాలుకట్టి మూటలు వెనకేయటానికే పార్టీ వెనక చేరుతున్న వాళ్లను చూశాక అన్నీ వదిలేశారు.

చిన్నప్పట్నుంచీ ఆయన మాకు కావలసినంత స్వేచ్ఛ, స్వాతంత్ర్యం ఇచ్చారు. నేనూ మా బ్రదరూ ఇద్దరమే సంతానం. మేము ఆడింది ఆట, పాడింది పాట. ఆడపిల్లనని నన్ను మరీ గారాబం చేసేవారు. అయినా క్రమశిక్షణ విషయంలో నాన్నగారు చాలా స్ట్రిక్టుగా వుండేవారు. చిన్నప్పట్నుంచీ నేను క్లాసుల్లో చురుకుగా వుండేదానిని. అయితే ఏ మాటకు ఆ మాటే. ఒక్క చదువు విషయం తప్పించి మిగతా వేటిలో నాకు ఇంట్రెస్టు వుండేదికాదు. ఎంతో ఆనందంగా గడిచిపోయింది నా బాల్యం.

అలా అలా చదువుకుంటూ నాకు తెలీకుండానే యం.యస్.సి.లోకి వచ్చేశాను. అప్పుడే చిత్తరంజన్‌తో పరిచయం ఏర్పడింది. అతను నా క్లాస్‌మేట్. చాలా తెలివయినవాడు. సబ్జక్ట్ విషయాలు చర్చించు

కోవటానికి మొదలయిన మా పరిచయం క్రమంగా ఏదో కొత్త అర్థం వెతుక్కోసాగింది. ఒకరినొకరం గాఢంగా వాంఛించుకునే స్థాయికి పెరిగింది ఆ స్నేహం.

అతను మా ఇంటికి చాలాసార్లు వచ్చేవాడు. దాదాపుగా మా వివాహం స్థిరపడి పోయినట్లే అనుకున్నాం. పరీక్షలు పూర్తి చేసుకున్నాం. నేను గోల్డుమెడల్ సాధించాను. ఏం జరిగిందోకానీ చిత్తరంజన్‌కు రాంకు రాలేదు. ఇద్దరం పి. హెచ్. డి. చేద్దామన్నాను నేను. కానీ తను యూనివర్సిటీ మార్చుకుని ఢిల్లీ వెళ్లిపోయాడు. రీసెర్చి కాక ఐ. ఎ. ఎస్. చేస్తానన్నాడు. నేను ఇక్కడే జాయిన్ అయ్యాను. నాన్నగారు పెళ్లికోసం తొందరపడసాగారు. కానీ అతను ఏదో ఒకటి చెప్పి వాయిదా వేస్తూ వచ్చాడు. చివరికి తను ఐ. ఎ. ఎస్. థియరీ పరీక్షలు పాసయినాక వచ్చి ముహూర్తాలు పెట్టుకుందామన్నాడు.

ఇంతలో నాకు స్టేట్స్‌లో రీసర్చిచేసే అవకాశం వచ్చింది. అతను వోరల్సులో సెలక్టు కాలేదు. వయసు మించిపోయిందతనికి. మళ్లీ ఛాన్సు లేదు ఆ పరీక్షలకి.

నాన్నగారు "ఇద్దరూ స్టేట్స్ వెళ్లిపోండి. ఎవరి కాళ్లయినా పట్టుకుంటాను. నీకు సీటు వచ్చేట్టు చూస్తాను" అని సర్ది చెప్పారు. కానీ అతను మాట్లాడలేదు.

అతనిలోని మగ అహంకారం నా సక్సెస్‌ను సహించలేకపోతోందని నాకర్థమయ్యింది. కానీ నామీది ప్రేమతో తన అహాన్ని జయించగలుగుతాడని ఎదురు చూశాను. చివరకు ఒకరోజు నేనే తెగించి చిత్తరంజన్‌తో మాట్లాడాను.

"రంజన్, నీకు బాగా తెలుసు నాకు చదువుమీద ఎంత ఇంట్రెస్టు వున్నదీ. సైంటిస్టుగా బతకటమే నా ఆశయం అని నీకు తెలుసు. అసలు ఇద్దరం కలిసి సైన్సులో కొత్త ద్వారాలు తెరవాలని ఎన్ని కలలు కన్నాం. క్యూరీ దంపతుల్లాగా వుండాలని అనుకున్నాం. అయినా నువ్వు ఇదంతా వదిలేసి ఐ. ఎ. యస్. కు వెళతానంటే కూడా నా మనసుకు సర్ది చెప్పుకుని ఒప్పుకున్నాను. సరే అది పోయింది. ఒక్కసారి ఫెయిలయితే జీవితం అంతా ముగిసినట్లే అని ఎందుకు ఫీల్ అవుతున్నావు. స్టేట్స్‌లో ఎన్ని అవకాశాలయినా వుంటాయి. మనం ఇద్దరం వెళదాం" అన్నాను.

"జానీ! మీ నాన్నగారు ఇప్పించే సీటుతో నేను అమెరికా రాను. నా స్వంతంగానే సీటు తెచ్చుకోవాలి" అన్నాడతను.

"మరి నాకు సీటు వచ్చిందిగదా! నీకు వచ్చేవరకూ ఎలా దాన్ని ఆపి వుంచటం? పోనీ వూరికే నాతో వచ్చెయి. అక్కడకు వెళ్లాక నువ్వు స్వంతంగా ప్రయత్నాలు చేసుకుందువుగాని" అన్నాను.

"అంటే అంతవరకు నీమీద ఆధారపడి వుండమనా? "

"ఇందులో ఆధారపడేదేమిటి రంజన్. ఒకవేళ ముందు నీకు సీటు వస్తే నన్ను తీసుకు వెళ్లేవాడివికాదా? నీతో కలిసి రావటానికి నేను వెనకాడే దానినా? " అని అడిగాను.

"అది వేరు. ఇది వేరు. ఆడది మగాడి వెంట రావటం సహజం. నీ వెంట అమెరికా వచ్చి నువ్వు థీసిస్ చేస్తూ వుంటే నేను ఇంట్లో అంట్లు తోముతూ కూర్చోవటం... ఊహూ అది కుదిరేది కాదు జానీ" అన్నాడు.

ఆ మాటలకు నాకు చాలా కోపం వచ్చింది. అంతకంటే ఎక్కువ బాధ కలిగింది.

"ఓ మగాడా ఇదా నీ సంస్కారం" అని నా మనసు మూలిగింది. అయినా ఆవేశాన్ని అణచుకుని ప్రశాంతంగా అడిగాను "అయితే మనం ఏం చేద్దామిప్పుడు? "

"నువ్వు నిర్ణయించుకోవాలి జానీ! నీకు స్టేట్సు వెళ్ళటం ముఖ్యమో నేను ముఖ్యమో? ఏదికావాలో తేల్చుకో" అన్నాడ

తను.

"నాకు స్టేట్సు ముఖ్యంకాదు. నా విజ్ఞానం ముఖ్యం. నేను చదువుకోవడం ముఖ్యం. చిన్నప్పటినుంచీ కన్న కలలు నిజం చేసుకోవడం ముఖ్యం. పోనీ ఇక్కడే డాక్టరేట్ కంటిన్యూ చేస్తాను" అన్నాను సగం చచ్చి

"అది కుదరదు. మనకు పెళ్లి జరిగితే నువ్వు ఈ డాక్టరేట్‌లు, రీసెర్చిలు అంటూ తిరిగితే కుదరదు. నాకు నా ఇంటికి అంకితమయ్యే భార్యవు కావాలి" అన్నాడు మాట మారుస్తూ. ఇన్నాళ్లూ రంగులు పులుముకున్న అతని మనసు అసలు సమయంలో ఆ రంగులు విదిల్చి నగ్నంగా బయటపడిందప్పుడు.

"గుడ్‌బై" అని ఒక్క మాట మాత్రం అని వచ్చేశాను నేను. మళ్లీవెనక్కి తిరిగి చూడలేదు.

ఒక మనిషికోసం, తాళికోసం, ఆ బంధం ఇచ్చే సాంఘిక భద్రత కోసం, గుర్తింపు కోసం, కొద్దిపాటి సుఖం కోసం నా మేధస్సునంతా చంపుకోవాలనీ, నా భవిష్యత్తునంతా అతనికి తాకట్టు పెట్టాలనీ నాకనిపించలేదు.

నాన్నగారు పెళ్లి చేసుకోకుండా స్టేట్సుకి వెళ్లటానికి అభ్యంతరపెట్టారు. "నాన్నగారూ ఇదే తమ్ముడికి ఈ ఛాన్సు వస్తే పెళ్లి కాలేదని వాడినీ ఆపేవారా? " అని అడిగాను.

"వాడు మగాడు" అన్నారు.

ఆ ఒక్కవాక్యమే నాకు ఆడ, మగ అనే తేడాను కోట్ల గొంతులతో చెప్పినట్లయింది. తండ్రయినా తమ్ముడైనా ప్రియుడైనా ముందు మగాళ్లు, ఆ తర్వాతే మిగతా బంధాలు అనిపించింది. మా అమ్మ కూడా వాళ్ల పాటే పాడింది. ఆడది మగాడికి ప్రతిబింబంగా తప్ప మరోలా బతకడానికి ఇష్టపడటంలేదని ఆమె నిరూపించింది. నాలో మరీ పట్టుదల రగిలింది. మగవాడిమీద ఆధారపడని ఆడజాతి ప్రతినిధిగా బతకాలనే నిర్ణయం బలపడింది.

నేను మొండిగా స్టేట్సు వెళ్లిపోయాను. డాక్టరేట్, పోస్ట్ డాక్టొరల్ థీసిస్ పూర్తి చేసుకుని కొన్నాళ్లు అక్కడే పనిచేసి పది సంవత్సరాల తర్వాత తిరిగి వచ్చాను. ఎన్నో అంతర్జాతీయ సెమినార్లలో పాల్గొన్నాను. జాతీయస్థాయిలో సైన్సు అవార్డు పొందాను. ఎన్నో శాస్త్రీయ వ్యాసాలు ప్రచురించాను. వీటన్నింటినీ మించి నా కలలు పండించుకున్నానన్న తృప్తివుంది. నా కళ్ల ముందు ఎన్నో ద్వారాలు తెరవమని ఎన్నో శాస్త్రీయ సమస్యలు పరిష్కరించమని"... ఆగిపోయి ఏదో లోకపు అంచుల్లోకి చూడసాగింది డాక్టర్ జానకి.

"మరి ఏనాడూ మీ నిర్ణయం తప్పేమో అన్న ఆలోచన గానీ, కుటుంబ జీవితం పట్ల కోరికగానీ కలగలేదంటారా? " సంకోచంగా తన అనుమానం బయటపెట్టింది సమత.

ఈ ప్రశ్న జానకిగారు విన్నదో లేదో గానీ "నా తృష్ణ ఇంకా తీరలేదు. ఇంకా సాధించవలసింది ఆకాశమంత వుందని అనిపిస్తుంది. ఎంతగా సహకరించే భర్త దొరికినా కుటుంబ జీవితం ఏర్పరుచుకున్నట్లయితే ఈనాడు నేను చేసే పరిశోధనలో సగమే చేయగలిగేదానిని" అంది.

"అవుననుకోండి. కానీ జీవితంలో ఇంకేదో భాగం కోల్పోయిన భావం మీకు లేదా? " అడిగింది సమత.

"నా మనసంతా ఈ కెరీర్, పరిశోధనలతో నిండిపోయినా అప్పుడప్పుడూ నా మనసు మమతలకోసం తలెత్తి చూస్తూనే వుంటుంది. అందుకే నేను అనేక సాంఘిక సేవాసంస్థలతో సంబంధం పెట్టుకున్నాను. 'నిర్మల్ హృదయ్'లాంటి వృద్ధుల మందిరాలు, అనాథశిశుమందిరాలకు నేను ఎక్కువగా వెళ్తుంటాను. ఆ పసి పిల్లలతో, అలసిన మనసులతో కలిపి గడిపే సమ




యంలో నాలోని ప్రేమపిపాస తీరుతుంది. నా మమతలకు ఆ మందిరాలు పందిళ్లై నిలుస్తాయి. ఒక మనిషి మీద ప్రేమకంటే ఈ లోకం మీద ప్రేమ పెంచుకుంటే అది ఎంతో ఎక్కువ ఆనందాన్నిస్తుంది"అంది జానకి.

ఆవిడతో మాట్లాడాక అక్క ఎన్నుకొన్న జీవితంలో ఒక అర్థం గోచరించింది సమతకు.

★ ★ ★

"చిన్నాని ఒకసారి వచ్చిపొమ్మని ఉత్తరం రాశాను. ఇంతవరకూ రానేలేదు" అంది వరలక్ష్మమ్మగారు మాష్టారితో.

"ఇప్పుడెలా వస్తుంది లక్ష్మీ అది" అన్నాడు రామారావుగారు.

"ఇప్పుడు కాకపోతే ఇంకెప్పుడండీ. మీరేమో అలా బెల్లంకొట్టిన రాయిలా ఉలకరు పలకరు. రెండోదాని సంగతి ఏమి ఆలోచించాదు. ఇంకా విషయం నలుగురిలో పడలేదు. చిన్న పిల్లలు ఏదో ఆవేశంలో అన్న మాటలు పట్టుకొని పెద్దవాళ్లం వూరుకుంటామా? కాస్త నచ్చజెప్పండి. ఏ అచ్చటా ముచ్చటా లేకుండా అది మోడులా బతుకుతానంటే మీరు అలా వూరుకుంటారా? " దిగులుగా అన్నదావిడ.

"లాభంలేదు లక్ష్మీ. ఎంత చెప్పినా ఝాన్సీ మనసు మారదు. బలవంతంగా ఏమి చేయగలము చెప్పు. కనీసం దాన్ని వూరయినా మార్చితే కాస్త పరువు మిగులుతుంది. హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ చేయించుకోమని చెప్పాను.

"అది పెద్ద నగరం. మన వూళ్లల్లో లాగ కాకులు పొడిచినట్టు పొడవరు దాన్ని. ఎవరి లోకం వారిది అక్కడ" అని ఆగి,

"ఎన్నడూ లేనిది మొన్న యమ్మెల్యే దగ్గరకు వెళ్లి వచ్చాను. నీకు తెలుసుకదా. అతని తండ్రీ నేనూ ఆ రోజుల్లో నాలుగు నెలలు ఒకే జైలులో వున్నాం. వెంకటరామయ్యనే కలిశాను. 'చాలా ఇబ్బందిగావుంది. చిన్న పిల్ల అక్కడే చదువుకుంటోంది. ఇద్దరూ కలిసి ఒక చోటే వుంటే కాస్త ఖర్చు కలిసొస్తుంది" అని చెప్పాను.

కొడుకుని పిలిచి 'నీకు చేతనయ్యింది చేయరా' అని చెప్పాడాయన. అతనిదంతా కుర్ర వ్యవహారం. 'మీ చిన్నమ్మాయి ఒకపక్కన నాకు వ్యతిరేకంగా పేదల సంఘాలంటూ తిరుగుతుంటే నేను మీకు సహాయం చేయాలా' అంటూ అదోలాగ మాట్లాడాడు.

'ముందు నువ్వీ పని చేయరా. రామారావు ఇంటిగ్రిటీ వున్న మనిషి, మన మనిషి' అని వాళ్ల నాన్న వత్తాసు.

'మిమ్మల్ని చూసి చేస్తాను మాష్టారూ. కాస్త మా అవసరాలు కూడా మీరు దృష్టిలో పెట్టుకోండి. నేను ఈ రోజే హైదరాబాద్ వెళ్తున్నాను. పది రోజుల్లో పని పూర్తి చేయిస్తాను' అన్నాడు. "నేను మాత్రం సిగ్గుతో చచ్చిపోయాననుకో" అన్నాడు ఇంకా కించపడుతున్నట్టు మాష్టారు.

"పోనీలెండి. పద్దవాళ్లు ఎప్పుడూ చెడ్డవాళ్లుకాదు. ఎలాగైనా ఆ పని జరిగిపోతే కాస్త గుడ్డిలో మెల్ల" అన్నది వరలక్ష్మమ్మగారు.

వీళ్లు ఇలా మాట్లాడుకుంటూండగానే ఝాన్సీ ఆఫీసునుంచి వచ్చింది.

"నాన్నగారూ! నాకు హైదరాబాద్ ట్రాన్స్ఫరు అయ్యింది. పది రోజుల్లో వెళ్లి అక్కడ జాయిను కావాలి. మా ఆఫీసరుకి, అడిషనల్ సెక్రెట్రీ ఫ్రెండ్ అట. నేను రిక్వెస్టు చేస్తే రికమండేషను లెటరు ఇచ్చారు. మొత్తానికి పని జరిగింది" అంది ఝాన్సీ.

"మీ నాన్నగారు యమ్మెల్యేని కలిసి వచ్చారటలే. అందుకే ఇంత త్వరగా పని జరిగింది. కాస్త నోరుతెరిచి అడిగితే ఎవరయినా సాయం చేస్తారు" అని చెప్పింది తల్లి.

"నేను ప్రయత్నం చేస్తూనే వున్నాగదండీ. ఎప్పుడూ ఏదో వంకర మాటలు మాట్లాడతాడనీ, మనం ఎలక్షన్లలో ఆయనతో వుండ

మని, కోపం అనీ చెబుతారు. ఎందుకు ఆయన దగ్గరకు వెళ్లారు" అంది ఝాన్సీ తండ్రితో.

"పోనీలే అమ్మా! జీవితం అన్నాక అడగటాలు, అడిగించుకోవటాలు తప్పవు" అన్నాడాయన.

"ఈ ఇల్లు అదీ ఎవరికయినా అద్దెకివ్వటానికి చూడండి. మనం పది రోజుల్లో వెళ్లిపోదాం" అని లోపలికి వెళ్లింది ఝాన్సీ.

తల్లిదండ్రులిద్దరికీ ప్రాణాలు కాస్త కుదుటపడ్డాయి.

భోజనాలు చేస్తూ మాష్టారు "ఇల్లదీ వదిలి మేము కూడా హైదరాబాద్ ఎందుకులే అమ్మా. అక్కడ నలుగురం బతకటం అంటే మాటలా" అన్నాడు.

"దానిదేముందిలే నాన్నా. వున్నంతలోనే వుంటాము. మేమిద్దరం అక్కడవుంటే ఈ వయసులో మీరు ఇక్కడ ఎందుకు? "

"కాదులే అమ్మా! పుట్టినగడ్డ. పెరిగిన ఇల్లు. ఈ వయసులో ఎటూ మారాలని లేదు. ఈ ఇంట్లోనే హరీ అనుకుంటాము" అని ఖచ్చితంగా చెప్పారు ఇద్దరూ.

"మీ ఇష్టం నాన్నగారూ" అన్నది ఝాన్సీ ఇంకేమనలేక.

ఝాన్సీ హైదరాబాద్ వెళ్లేముందు తల్లి చెప్పింది.

"చూడమ్మా... ఎంత పెద్ద పట్నం అయినా ఇట్లాంటి విషయాలలో మనుషులు ఎక్కడయినా ఒక్కలాగే వుంటారు. పోయినవాణ్ణి ఎలాగూ మొగుడే అనుకుంటున్నావుకదా! కాస్త పిల్ల పుట్టి నలుగురూ మర్చిపోయేవరకూ ఆ బొట్టు తీసేయ్ తల్లీ. చూసేవాళ్లకు ఆక్షేపణ లేకుండా వుంటుంది. నాలుగు రోజులు పోయాక నీ ఇష్టం"

★ ★ ★

ఝాన్సీ హైదరాబాద్ వచ్చాక సమత, ఝాన్సీ వేరేగా గది అద్దెకు తీసుకున్నారు.





ఈ కొత్త ఇల్లు యూనివర్సిటీకి దగ్గరగా వుంది. సమత అవసరమైతే నడిచి వెళ్లిరావచ్చు.

ఆ ఇల్లు అద్దెలకివ్వటానికే కట్టారు. ఐదారు కుటుంబాలు కాపురం చేస్తున్నాయి. ప్రహరీ గోడమీదనుంచి రేకులు దించి వరసగా ఎనిమిది రూములు కట్టారు. ఒకటో రెండో రూములు తీసుకుని చిన్నచిన్న ఉద్యోగస్తులు, స్టూడెంట్లు ఆ రూముల్లో వుంటున్నారు. ఝాన్సీ వాళ్లు ఒక గది తీసుకున్నారు. అసలు ఇంటిలో ఇంటి ఓనరు, పక్క పోర్షనులో మరో లెక్చరరుగారి కుటుంబమూ వుంటున్నారు.

ఈ ఇంటి పక్కనుంచే పెద్ద మురుగు కాల్వ ప్రవహిస్తోంది. మంచినీళ్ల పైపుల్లో నీళ్లు గంటైనా రావుగానీ ఈ మురుక్కాలవ మాత్రం కుళ్లుకుళ్లుమంటూ నిత్యం పారుతూనే వుంటుంది. ఈ కాలవకి ఎడమ పక్కన ఏదో పెద్ద ఫ్యాక్టరీ వుంది. ఆ ఫ్యాక్టరీ ప్రహరీ గోడకు ఈ కాలవకూ మధ్య వున్న స్థలంలో ఒక వంద గుడిసెలు వుంటాయి. రేకులు అడ్డం పెట్టో, నాలుగు ఇటుకలు కట్టో, గోనెపట్టాలు కుట్టో, అట్టలో, తడికలో ఇంత చెత్తో ఏదో పైన వేసి ఇల్లు అనిపించారు. ఇటు కుడి పక్కన పాతిక బిల్డింగ్స్ వున్నాయి.

సమత వాళ్ల ఇంటిముందు కూర్చుంటే ఆ గుడిసెలవాళ్ల మాటలు వినపడుతూనే వుంటాయి. ఆ చిన్నచిన్న ఇళ్లల్లో రిక్షాలు లాగేవాళ్లు, పక్కనున్న ఫ్యాక్టరీలో పనిచేస్తున్న వాళ్లు, హమాలీలు, లాగుడు బళ్ల వాళ్లు ఎన్నెన్నో పనులు చేసేవాళ్లున్నారు. ఆడవాళ్లు కూడా ఏదో ఒక పని చేసేవాళ్లే. ఇవతలి బిల్డింగ్స్‌లో పని చేసేవాళ్లు కొందరు.

నీళ్లురాని పైపు దగ్గర పడిగాపులు, వచ్చే నాలుగు బొట్ల కోసం జగడాలు, తాగివచ్చే మగవాళ్ల వీరంగాలు, ఆడవాళ్ల తిట్లు, ఏడ్పులు ఏ డప్పు వాయిస్తూనో ఎవరో పాడే లొల్లాయి పదాలు. ఎవరికి ఏ కష్టం

వచ్చినా ఆ గుడిసెముందు అంతా పోగయి చేసే హడావుడి, చావైనా, పుట్టుకైనా సంతోషాలు, సంతాపాలు అంతా కలిసి వుండి పంచుకోవటం. రహస్యం అనీ వ్యక్తిగతం అనీ లేవక్కడ. అంతా బహిరంగమే.

సమిష్టి వ్యవహారానికి పెద్ద పీట వేసి వుంటుంది అక్కడ. అయినా నగర జీవితం లోని ఏదో వేగం, ఏదో స్వార్థం, వాళ్లనూ చుట్టుముట్టి, తన గుడిసెను పెంచుకునే పరుగులు, వురుకులు.

"ఇల్లు మారుతున్నామండీ" అంటూ కొత్త అడ్రెసు చెప్పగానే "అయితే నాకింకా దగ్గరకు వస్తున్నారన్నమాట" అన్నాడు రాకేష్.

"అంటే? " అంది అర్థంకాక సమత.

"నా రూమ్ కూడా అక్కడకు చాలా దగ్గరేనండీ. ఇప్పటిలా టైమ్‌టేబిలు ప్రకారం కాక మనం ఇక ఎప్పుడైనా కలుసుకోవచ్చన్న మాట" అన్నాడు. అలాగే ఎప్పుడంటే అప్పుడే వచ్చేవాడు.

ఆ ఇంటి వోనరు రాయుడుగారు రిటైర్డు ఆబ్కారీ ఇన్స్పెక్టరు. ఆయనకు పిల్లలు లేరు. భార్య చంద్రావతి ఎన్ని నోములో నోచింది కానీ ఫలితం లేకపోయింది. ఇంట్లో అద్దె కున్నవాళ్ళ పిల్లలనే దగ్గరకు తీస్తూవుంటుంది. సుల్తాన్ అనే కుక్క ఒకటి వుంది. ఏదో మేలుజాతి కుక్క. కొత్త మనిషి ఇంటి కొస్తే మహాగొడవ చేస్తుందది. దానికి రోజూ అరకిలో మాంసం వండిపెడ్తారు. ఇంట్లో అవీ ఇవీ అందించటానికి కోటేశు అనే పదేళ్ళ పిల్లవాడున్నాడు. వీడిని రాయుడుగారి వూరినుంచి తెచ్చారు. వాడికి తల్లీ దండ్రీ లేరు. మేనమామ దగ్గర పెరుగుతూ వుంటే "నా చేతికింద వుంటాడు పట్నం పంపరా" అని రాయుడుగారు వెంటపెట్టుకు వచ్చారు. కడుపునిండా తిండి పెడతారు కానీ వాడిని ఒక్క నిమిషం కూర్చోనీయదు చంద్రావతి.

రాయుడుగారికి పనేమీ లేకపోయినా పదిగంటలకు భోజనం చేసి బయటపడితే మళ్ళీ ఏ ఆరుగంటలకో ఇల్లు చేరతాడు రోజూ.

ఉదయం ఆయన అటు కాలుపెట్టడం ఆలస్యం, ఇటు చంద్రావతి ఇద్దరు ముగ్గుర్ని పోగుచేసి పదకొండుగంటల ఆటకు సినిమాలకు బయలుదేరేది. ఒక్కోసారి కోటిని తీసుకువెళ్ళేది. అలాంటప్పుడు వాడికి పండగే. కానీ ఎక్కువసార్లు "బార గొట్టేతలికి అయ్యొస్తనన్నడు. నువ్వు ఇంట్లనే వుండురా" అని చెప్పివెళ్ళేది. అద్దెకున్న వాళ్ళంతా రాయుడుగార్ని 'బాబాయి' అని పిలుస్తారు. ఈయన మామూలుగా ఎవరితోనూ అంతగా మాట్లాడేవాడు కాదుగానీ, మాట్లాడే రెండు ముక్కలు వాళ్ళమీద ఏదో అధికారం వున్నవాడిలాగ మాట్లాడేవాడు. ఎవరేం చెప్పినా, చేసినా "మీకేం ఎరిక. మా కాలంల డ్యూటీ ఎట్ల జేసెటోళ్ళం" అంటూ ఒక కథ వినిపించేవాడు. అప్పుడప్పుడు "దేశం జనం దిగజారిపోతున్నారయ్యా. ఒక్కడికీ దేశభక్తి లేదు. గవర్మెంటు అంటే బయంలేదు. అందరూ గవర్మెంటుని విమర్శించేవాళ్ళే. ఎవడూ ఆడిపని మాత్రం చక్కగా చేసి చావడు" అని ఉపదేశాలు చేసేవాడు. "ఈ ఇల్లు కట్టినందుకు నీళ్లనీ, కరెంటనీ, ఎన్ని సమస్యలు చూసుకోవాలి నేను. నాకు తల తిరిగిపోతోంది. గవర్మెంటు ఇంత దేశాన్ని ఎలా చూడగలుగుతుందయ్యా. మనకు మనమే చూసుకోవాల" అంటాడాయన. ఏ ఇద్దరయినా కీచులాడుకున్నట్లు కనిపించిందా ఆయనకు పండగ. తను కలగజేసుకుని ఇద్దర్నీ తిట్టి ఏదో తీర్పు చేసేవాడు. ఎప్పుడయినా, ఎవరయినా ఆయన మాట వినకపోతే "ఏందయ్యా ఈ లొల్లి. నువ్వు రేపే ఇల్లు ఖాళీ చేయి" అనేవాడు. చంద్రావతి కూడా అంతే. ఏ విషయంలోనయినాసరే వాళ్ళిద్దరిదీ ఒకటే మాటగా వుండేది. అసలు వాళ్ళిద్దరికీ వేరువేరు అభిప్రాయాలున్న విషయాలు ఏమయినా వున్నాయా అని సమత

ఒక పరిశోధన మొదలెట్టింది.

ఏ మాటకు ఆ మాటే చెప్పుకోవాలి. ఝాన్సీ గురించి వాళ్ళకు సూచాయగా విషయం అర్థమైనా ఏమీ చెడుగా అనలేదు. పైపెచ్చు ఆడపిల్లలిద్దరికీ తామే పెద్ద దిక్కు అన్నట్టు మాట్లాడేవాళ్ళు. వీళ్ళిద్దరి ప్రవర్తనా రాయుడుగారికి నచ్చింది. మొదటితారీఖున ఠంచనుగా అద్దె ఇచ్చే ఎవరయినా ఆయనకు బాగా నచ్చుతారు.

సమతా వాళ్ళ పక్కగదిలో సూర్యనారాయణ, సుభద్ర అని వుంటారు. వాళ్ళకి ఇద్దరు మగపిల్లలు. సూర్యనారాయణ ఏదో బాంకులో పనిచేస్తున్నాడు. సుభద్ర తల్లిదండ్రులు పల్లెటూరివాళ్ళు. ఆమె అంతగా చదువుకోలేదు. ఈమె పెళ్ళిచేసి పంపేసరికే వాళ్ళకు తాతలు దిగివచ్చారు. అతికష్టం మీద పత్రికలు, కథల పుస్తకాలు చదవగలుగుతుంది సుభద్ర. అందుకనేనేమో పిల్లలిద్దరినీ "చదువుకోండిరా, చదువుకోండిరా" అని తెగపోరుతూ వుంటుంది. సూర్యనారాయణకు పేకాటపిచ్చి. ఆదివారాలు, సెలవురోజులు అతను కంటికి కనిపించడు. అతనికి పేకాటలో డబ్బు రావటం అనేది లేదు. మరీ ఎక్కువ డబ్బు పోయినపూట మాత్రం చిరచిరలాడుతూ వుంటాడు. సుభద్ర కనక అతనికి అడిగినప్పుడల్లా డబ్బు సప్లై చేయగలిగితే ఆమెను పల్లెత్తుమాట అనని బాపతు. అయితే సుభద్ర మామూలు ఇల్లాలేకానీ, డబ్బులు కాసే చెట్టు కాదుగదా! అందుకని ఆవిడకు వారానికి రెండురోజులు మొగుడి చేతిలో తన్నులు తప్పేవి కావు. రాయుడుగారు ప్రతిసారీ కలగజేసుకుని ఏదో చెబుతూనే వుండేవాడు కానీ సూర్యనారాయణ పేకాట విషయంలో ఎవరినీ లెక్క చేయడు. "నాలుగురోజులు పోతే అతనే మారతాడు. నువ్వు కాస్త ఓపిక పట్టాలి సుభద్రా" అని తన్నులు తిని ఏడుస్తున్న సుభద్రను ఓదార్చేవాడాయన.

"జూదం ఆడినా భర్తమాట కాదనడానికి వీలులేదంటాడాయన. ద్రౌపది అడవుల పాలయ్యింది ధర్మరాజు జూదంవలనేగదా! అయినా మళ్ళీ మంచిరోజులు వచ్చి మహారాణి అయ్యిందా లేదా! ఆ మహాతల్లి కష్టాలతో పోలిస్తే నీదేముంది చెప్పు" ఈ ధోరణిలో సాగేవి చంద్రావతి, రాయుడుగారు సుభద్రకు చెప్పే మంచి మాటలు.

"అంతే బాబాయిగారూ! భరించటం తప్ప నేను చేయగలిగింది ఏముంది చెప్పండి" అని సుభద్ర కళ్ళనీళ్లు తుడుచుకునేది.

ఇటుపక్క రెండు గదుల్లో గోవర్ధనరావు, సుమలత అనే యువజంట వుంటారు. ఇద్దరూ ఒకే కంపెనీలో పనిచేస్తూ ప్రేమించి పెళ్ళి చేసుకున్నారు. ఆవిడ మేనేజరుకు పర్సనల్ సెక్రటరీ. ఇతను ఎకౌంటెంట్. సుమలత తల్లిదండ్రులు మంచి ధనవంతులు. గోవర్ధనరావు పేదవాడు. కష్టపడి చదువుకొని ఉద్యోగం సంపాదించినవాడు. సుమలత తల్లిదండ్రులలకు ఇతనంటే అస్సలు పడదు. పెళ్లై అయిదేళ్ళయినా, ఒక పిల్ల కూడా పుట్టినా కూతుర్ని భర్త నొదిలేసి రమ్మనే చెబుతుంటారు. గోవర్ధనరావుకి ప్రతీదీ అనుమానమే. పెద్ద ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సు. జీవితాలు నరకం చేస్తున్నాడతను.

వాళ్ళకి జ్యోతి అని పాప. నాలుగేళ్ళు దానికి. పెళ్ళి అయిన సంవత్సరంలోనే పుట్టింది. ఏ ఆనందాలు అనుభవించకుండానే పుట్టుకొచ్చిందని సుమలతకు జ్యోతి అంటే ఏ మూలో కొంచెం ద్వేషం వుండేది. తండ్రికి పాపంటే పంచప్రాణాలు. అసలు దాని పనులన్నీ అతనే చేస్తాడు. పళ్ళు తోమటం, స్నానం చేసి బట్టలు వేయటం, సైకిలుమీద కూర్చోపెట్టుకుని స్కూలుకు తీసుకువెళ్ళటం, 'మా బంగారు' అంటూ జ్యోతి స్మరణే చేస్తుంటాడతను. "అయిదేళ్ళు నెత్తిమీద కొస్తున్నాయి ఇంకా నువ్వు అన్నం తినిపించటం ఏమిటి దానికి, దాన్ని తిననీ" అంటుంది తల్లి. అతను బతిమాలి ఒక అర

గంట అన్నం తినిపిస్తాడు జ్యోతికి. "దానికి కాకపోతే నీకు పెట్టనా" అంటూ "మా బుజ్జి కదూ! ఇంకొక్క ముద్ద తిను తల్లీ" అని మరీ ముద్దు చేసేవాడు.

పగలంతా శుభ్రంగా వుండేవారు వీళ్ళి ద్దరూ. రాత్రి అయ్యిందంటే మాత్రం చిటప టలు. రవరవలు. చాలారోజుల వరకు సమతకు అసలు విషయం ఏమిటో అర్థం కాలేదు. చివరికి తెలిసింది. గోవర్ధనరావుకు సుమలతమీద ఏదో అనుమానం. మేనేజ రుకీ, ఆమెకీ సంబంధం వుందేమో అనే అనుమానం. అయితే సుమలత తనని ప్రేమించి ధనవంతులయిన తల్లిదండ్రులను ఒదిలేసివచ్చిందికదా, అలా చేయదు అని మరోపక్క నమ్మకం. అలా అనుమానిస్తు న్నందుకు తనమీదనే తనకు కోపం. ఈ నమ్మకం ఎక్కువగా వున్నప్పుడు భార్యను తెగముద్దు చేయాలని చూసేవాడు. అను మానం పెరిగినపూట అంటీముట్టనట్టు వుండేవాడు. సుమలతకు భర్తలో వున్న అనుమానం తెలుసు. అంతకుమించి అత నిలో వున్న ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ గురించి బాగా తెలుసు. అయినా ఆమె లెక్క చేసేది కాదు. ప్రేమతో అతన్ని లాలించేదికాదు. పైపెచ్చు అతన్ని ఇంకా రెచ్చగొట్టేది. "లోకంలో నువ్వొక్కడివేనా మగాడివి. నేను పదిమందితో పోతా! నువ్వేం చేస్తావు? " అనో "నిన్ను ఏంచూసి ప్రేమించానో తెలీటంలేదు" అనో అనేది ఒళ్ళుమండి. ఆ మానవుడు అదంతా నిజమే అనుకుని ఇంకా గింజుకునేవాడు. ఏదీ తేల్చుకోలేక సతమతమవుతున్నాడ తను. ఆ అంతస్సంఘర్షణ మరీ ఎక్కు వయిన పూట కాస్త తాగివచ్చేవాడు.

భర్త తాగి వచ్చిన పూట సుమలత, జ్యోతి ఒకగదిలో పడుకునేవారు. పక్కగ దిలో అతను. ఏ అర్ధరాత్రి టైములోనో సుమలత గదిముందు చేరి "ప్లీజ్ సుమా! తలుపు తెరు" అని చిన్నగా తలుపు తడు తూవుండేవాడు. ఆమె తెరిచేదికాదు. ఇతను ఒదిలేవాడు కాదు. కనీసం వెయ్యిసార్ల యినా ప్రాధేయపడేవాడు. అంతసేపు నిల బడి నిలబడి కాళ్ళెలా పీక్కుపోవటంలేదో సమతకు అర్థమయ్యేది కాదు. అలా ఏ రెండుగంటలో గడిచాక ఆమె "ఐయామ్ నాట్ ఎ బిచ్- నీకు ముద్దయితే పక్కలో దూరడానికి, వద్దంటే దూరంగా పోవటా నికి. మళ్ళీ రేపు అనుమానం వస్తే కుక్కను తరిమినట్లు డొక్కలో తంతావు" అనేది లోపలనుంచి.

"నో సుమా! పార్డన్‌మీ! ఓపెన్ ది డోర్... నాకేమీ వద్దు. ఒక్క నిమిషం. ఒక విషయం చెప్పాలి" అని అతను.

"నాకు తెలుసు నీ వేషాలు. అక్కడినుంచే చెప్పు అదేమిటో" అని ఈమె. ఇలా పదిహే నురోజులకొకసారయినా జరుగుతుంది. మళ్ళీ తెల్లారితే ఇద్దరూ మామూలుగా పనులు చేసుకుని చిలకల్లా కులుకుతూ ఆఫీ సుకు బయలుదేరి కలిసి వెళ్ళేవారు.

అతను రోజుకు పదిసార్లయినా "సుమ లత సుకుమారి, నామీది ప్రేమతో ఇంత కష్టపడుతోంది. అసలు ఏ దేవేంద్ర భవ నంలోనో వుండవలసిన అమ్మాయి. నన్ను చేసుకోబట్టి మీ రేకుల గదుల్లో వుంటోంది" అనేవాడు రాయుడుగారితో.

"ఏందయ్యా రాత్రంతా అంత లొల్లిసేసి నవ్ మరి" అంటాడాయన.

"అదేకదా బాబాయి నా వీక్నెస్. ఇంత డబ్బున్న అమ్మాయి ఏ సుఖమూ లేకుండా ఎన్నాళ్ళు పడివుంటుంది నా దగ్గర అని నా భయం" అనేవాడు ఏ దాపరికమూ లేకుండా.

"ఏమిటీ సుమలతా ఇదంతా" అంటే "గోవులాంటివాడు ఆయన. ఆ తాగినరోజే చిక్కు" అంటుంది ఆవిడ. అమ్మయ్య ప్రస్తుతం బాగానే వున్నారు అనుకునేలోపు మళ్ళీ రాత్రిపూట రభస మొదలయ్యేది.

వాళ్ళిద్దరూ లేనిసమస్యలు సృష్టించుకొని



బాధపడుతున్న మనుషుల్లా అనిపించేవారు సమతకి అసలు వాళ్ళిద్దరూ కూర్చుని గట్టిగా మాట్లాడుకొని, తమ మనసులు ఆరేసుకుంటే చాలు ఏ బాధా వుండదు అనుకుంటుంది సమత. రోజురోజుకీ ఇద్దరి మధ్యా పెరుగుతున్న ఈ విద్వేషం చిలికిచిలికి గాలివానయి చెరో పక్కకీ విసిరేస్తుందేమోనని కూడా అనుకుంటుంది సమత. సుమలత కూడా ఝాన్సీ, సమతలతో చాలా చనువుగా మాట్లాడేది. ఎన్ని కబుర్లో చెప్పేది. కానీ తన కాపురం గురించి వస్తే మాత్రం "అది చూసేవాళ్ళకు అర్థంకాదులే! నేనిలా వుండకపోతే, అతను దేనికీ పనికిరాకుండా పోతాడు. నేను ఎక్కడ జారిపోతానో అనే భయం అతనికి ఎప్పుడూ వుండాల్సిందే" అనేది.

"మధ్యలో మీ బతుకులు అవమానాల పాలుకావటం లేదా! ఇద్దరికీ ఇది ఏం సుఖం చెప్పు" అనేది ఝాన్సీ.

"ఈ జగడాలతో మీమధ్య ప్రేమ ఆవిరయిపోతుందేమో"! అనేది సమత.

"అంతదూరం రానివ్వనులే. అతని వీక్నెస్‌కు మందేమిటో నాకు తెలుసు" అనేది సుమలత.

మొత్తానికి ఈ కాపురం గురించి ఏమనుకోవాలో చివరికి తెలిసేది కాదు.

ఇంకో రెండుగదుల్లో కండక్టరుగా పనిచేస్తున్న కమలాకరరావు అతని భార్య సరోజినీ వుంటారు. కమలాకరరావుకి జీతం కంటే గీతం ఎక్కువ. ఎవరయినాపట్టుకుంటారేమో, ఉద్యోగం పోతుందేమో అని ఒకపక్క భయం. అయినా టిక్కెట్లు చింపకుండా పాసెంజర్లతో "ఫిఫ్టీ, ఫిఫ్టీ" మానడు. "కార్పొరేషను అంతా వుంది. నేను ఒక్కడ్నేనా ఏమిటి" అంటాడతను. వాళ్ళు మహా పొదుపుగా కాపురం చేస్తున్నారు. వాళ్ళకి ప్రస్తుతానికి ఒక్కడే కొడుకు. తనకో చెల్లెలుందనీ దాని పెళ్ళి అయ్యేవరకూ పిల్లల్ని కననని అనేవాడు. "ఈ పుట్టిన వాడు కూడా ఏమీ తెలియని కొత్తల్లో పుట్టుకొచ్చాడు" అంటాడతను.

కమలాకరరావు డ్యూటీ దిగివచ్చాడంటే ఇంట్లో పూచికపుల్ల పక్కన పెట్టడు. బజారుకెళ్ళి కూరగాయలు కూడా తెచ్చిపెట్టడు. నెలకొక్కసారే బియ్యం, పప్పులు, నూనె, ఇతర పచారిసామాన్లు అన్నీ కొంటాడు. రిక్షాలో తెచ్చి అన్నీ తనే మోసుకువెళ్ళి ఒక రూమ్‌లో పెట్టేవాడు. అంతే మళ్ళీ నెల తిరిగేవరకూ, ఏదున్నా లేకపోయినా సరోజిని చూసుకోవలసిందే. ఖాళీగా వుంటే అతను ఒక పడక్కుర్చీలో కూర్చుని, నాలుగేళ్ళ కొడుకుచేత తెలుగుపద్యాలు వల్లె వేయిస్తాడు. "శ్రీరాముని దయచేతను" అనో "అక్కరకు రాని చుట్టము" అనో నాలుగేళ్ళ నందా తండ్రిముందు చేతులు కట్టుకొని వీధిబళ్ళలో పాఠం ఒప్ప చెప్పే పిల్లల్లా గడగడ ఒణుకుతూ వుంటాడు. తండ్రి కన్నెత్తితే చాలు నందా జడుసుకుంటాడు. "వీణ్ణి మంచి డిసిప్లిన్‌గా పెంచాలండీ. చిన్నప్పుడు నన్ను ఎవరూ పట్టించుకోలేదు. మా అమ్మా నాన్నా చదువురానివాళ్ళు. అందుకే... ఇదిగో ఇలా కండక్టర్నయ్యాను కానీ నంద అలా కావటానికి వీలులేదు" అంటాడతను.

సరోజిని వీళ్ళ కాలనీలో వున్న చిన్నపిల్లల బడిలో టీచరుగా చేస్తుంది. నాలుగ్గెదు వందలు తెస్తోంది.

"అటు స్కూలులో, ఇటు ఇంట్లో చస్తున్నాను. కాస్త మీరు సాయం చేయకపోతే ఎలా? " అంటుంది భర్తతో.

"చాల్లే చెప్పొచ్చావు. పక్కింటికి వెళ్ళి పాఠాలు చెప్పిరావడం కూడా పెద్ద పనేనా? మా అమ్మావాళ్ళు గుండిగలు వండిపోసేవారు. నువ్వు నాలుగు మెతుకులు ఉడకెయ్యడానికి నీలుగుతున్నావు" అంటాడతను.

"ఏమో! నాకు తెలీదు. నాకంత ఓపిక లేదు. పోనీ ఆ స్కూలుకు వెళ్ళటం మానే

స్తాను" అంటుంది సరోజిని.

"మా అమ్మగదూ! అంత పని మాత్రం చేయకు. ఆ నాలుగువందలు లేకపోతే మహా ఇబ్బంది పడిపోతాం. ఇంకో సంవత్సరం పోతే నందూగాడ్ని మంచి స్కూలులో చేర్పించాలా? నా ఒక్కడి సంపాదన వల్ల ఏమవుతుంది చెప్పు" అంటాడు కమలాకరం.

"అయితే ఈ ఇంటిపన్లు నా ఒక్కదాని వల్ల కావు. మీరు కాస్త బజారుసామాన్లు తేవటం, నీళ్లు పట్టటం, నందూ పనులు చూడటం అన్నీ చేయండి. అన్ని పనులూ ఇద్దరం కలిసే చేసుకుందాం" అంటుంది సరోజిని.

"మా బంగారంగదూ! కాస్త ఓపికగా చేసేయ్ అమ్మా. గొడ్లను తోలినట్టు అన్నేసి గంటలు ఊపిరాడకుండా, కండక్టరుగిరీ చేసే సరికి నా తలప్రాణం తోకకు వస్తోంది" అనే వాడు.

"నేనూ ఇక్కడ గాడిదల్ని కాస్తూనేవు న్నాను. ముప్పైగాడిదల్ని" అనేది సరోజిని రోషంగా.

అతను ఇంకేవో కబుర్లు చెప్పేవాడు. లేదంటే "ఏమిటి సరోజినీ! నిన్నేదో కాల్చుకు తింటున్నట్టు మాట్టాడతావు. ఆ సూర్యనారాయణలాగ ఇల్లూవాకిలీ పట్టించుకోకుండా తిరుగుతున్నానా? పక్కగదాయనలాగ అనుమానంతో వేధించుకుతింటున్నానా? రెండు ముద్దలు ఉడకెయ్యటానికి ఏమిటి నీకొచ్చిన కష్టం" అని ఎగిరేవాడు.

అతనికి భార్యని కష్టపెట్టాలని ఏ కోశాన లేదుగానీ, 'ఆడపనులు' చేయటానికి 'మగ అభిజాత్యం' ఒకటి అడ్డువస్తోందని గమనించింది సమత. సరోజిని కూడా వూరుకునే రకం కాదు. తను కావాలనుకున్న దాని కోసం గట్టిగా నిలిచేది. అయినా తన కాపురంపట్ల చాలా సంతృప్తి కూడా వుంది ఆమెకు. 'ఆయన చాలా నయం' అనుకొంటుంది.

రోజులలా పరుగెత్తుతూనే వున్నాయి. ఝాన్సీ ఆఫీసులో చేరిన నాటినుంచీ, ఇప్పటివరకూ ఎవరితోనూ స్నేహాన్ని పెంచుకోలేదు. అసలే ముక్తసరిగా మాట్లాడేమనిషి. ఇప్పుడు మరీ మూగనోము పట్టినట్టు వుంటుంది. ఆఫీసులోనే కాదు, ఇంట్లో కూడా ఝాన్సీ అంతే.

అక్కకి ఏమైనా మానసికంగా జబ్బు చేసిందేమో అని అనుమానం కూడా కలిగింది సమతకు. ఈ లోకంలో లేనట్టు, తన మనో ప్రపంచంలో ఏవో స్వప్నాలు కంటున్నట్టు కనిపించేది ఝాన్సీ. అయితే అటు ఆఫీసులోగానీ, ఇటు ఇంట్లోగానీ మాటలో గాని, పనిలోగానీ, ఏమీ తప్పు పట్టటానికి వీలుండేది కాదు.

ఝాన్సీ అవుననీ, కాదనీ చెప్పకుండానే, ఆఫీసులో అంతా ఆమె భర్త పోయాడనీ, ఇంత చిన్న వయసులో వితంతువు కావడం వల్ల అలా నిరుత్సాహంగా తయారయ్యిందనీ అనుకోసాగారు. 'పోయిన మనిషి పట్ల ఈవిడకు ఎంత ప్రేమో' అని అనుకునే వారు. ఝాన్సీపట్ల చాలా సానుభూతి కూడా చూపేవారు.

కూతురి కాన్పుకని వరలక్ష్మమ్మగారు హైదరాబాద్ వచ్చింది. ఆవిడ వచ్చాక చంద్రావతికి మంచి కాలక్షేపం దొరికింది. వరలక్ష్మి తమ కుటుంబం గురించీ, మాష్టారి గురించీ ఏవో కబుర్లు చెబుతూనే వుండేది. ఆవిడ చెప్పేది అనటంకంటే చంద్రావతి మెల్లమెల్లగా అన్నీ రాబట్టేది అనడం ధర్మం.

తమ ఇంటికి దగ్గరలోనే వున్న ఆంధ్రమహిళాసభ హాస్పిటలులో పురుడుపోసుకుంది ఝాన్సీ. శర్మ కళ్ళు, వొంటిరంగు, అమ్మ పెదవులు పుణికి పుచ్చుకుని నిజంగానే ఇద్దరి కలయికలా పుట్టాడు చిన్నబిడ్డ. వీడు 'సుధాంశు' అన్నది ఝాన్సీ.

"బిడ్డల ఆరోగ్యం" గురించి సమత ఒక పుస్తకం కొనుక్కువచ్చింది.

"పుస్తకంలో ఏమి రాస్తరు బిడ్డా" అని చంద్రావతీ, "ముగ్గురు బిడ్డల్ని పెంచాను. మీరు నాకు పుస్తకం చూపిస్తారా" అని తల్లీ వాళ్ళ మాటల్ని కొట్టిపారేసి, సుధాంశు పొట్టమీద ఆముదం రాసి, తమలపాకులు వేసి, వసపోసి ఏవో చేస్తూనే వుండేవారు. పిల్లలిద్దరూ విసుక్కునే వాళ్ళు

చూస్తుండగానే సుధాకి మూడు నెలలు నిండాయి. ఝాన్సీ మళ్ళీ ఆఫీసుకు వెళ్ళసాగింది. పగలు పాలివ్వటం కుదరక "అమూల్ స్ప్రే" పట్టటం ప్రారంభించారు. రామారావుగారు వచ్చారు. ఆయనా, వరలక్ష్మమ్మగారు పుట్టిన మనవణ్ణి చూసి సంబరపడ్డారు. రాజ్యం పిల్లలు వీళ్ళ దగ్గర లేరు కదా! ఇన్నాళ్ళకు మళ్ళీ వాళ్ళ చేతుల్లో పసిబిడ్డ వుండేసరికి సంతోషం కలిగింది. తాత్కాలికంగా ఝాన్సీని గురించి మర్చిపోయారు.

"పిల్లవాడితో మాకు ఎలా కుదురుతుంది. అంతా ఇక్కడే వుందాం" అన్నారు కూతుళ్ళిద్దరూ.

తల్లీదండ్రీ వొప్పుకోలేదు. "సుధాని ఇంకో నెల పోయాక నేను ఇంటికి తీసుకెళ్తాను. వీడు మాతోనే వుంటాడు. ఎలాగూ నీ దగ్గర పాలు కూడా అలవాటు తప్పుతోంది గదా!" అంది తల్లి.

ఈ బిడ్డను తీసుకెళ్ళిపోతే ఝాన్సీ మళ్ళీ ఈలోకంలో పడుతుందనీ, పెళ్ళివైపు మనసు తిరుగుతుందనీ ఆవిడ తాపత్రయం.

మాట వింటూనే ఝాన్సీ ఉలిక్కిపడింది. ఎవరో పిల్లవాణ్ణి ఎత్తుకెళ్ళిపోతామన్నట్టు ససేమిరా వీల్లేదంది.

సైకిమాత్రం "నువ్వూ నీ కంగారు. వీడ్ని తీసుకువెళితే నీకొక్కపూట కూడా నిద్ర వుండదులే" అంది సైకి.

"చైల్డ్ సెంటర్లు చాలా వున్నాయి. అక్కడ యిచ్చి ఆఫీసుకు వెళతాను. సరిపోతుందిలే" అంది.

మూడు నాలుగు నెలలు ఆఫీసుకు వెళ్ళలేదు, డబ్బుకు ఇబ్బందిగానే వుంది. అందుకే మళ్ళీ తల్లీతండ్రీ ప్రయాణం అయ్యారు ఇంటికి.

రాజమ్మ అని పనిపిల్ల దొరికింది. పగలంతా ఇంట్లోనే వుండేట్లు మాట్లాడారు. గుడిసెల్లోనే ఈ అమ్మాయి వాళ్ళ యిల్లు. వాళ్ళమ్మ కూడా చుట్టుపక్కల ఇళ్ళల్లో పని చేస్తూ వుంటుంది. వీడికోసం అని సమత ఈమధ్య బయటి పనులు తగ్గించుకొంది. పగలు సాధ్యమయినంతసేపు ఇంట్లోనే వుంటోంది. అక్క ఆఫీసునుంచి వచ్చాక తను బయటికి వెళుతుంది. స్కూలు పని సంస్థ పని, ఏదైనా సాయంత్రాలే చేస్తోంది. పగలు రూములో వుండటంతో ఏవేవో పుస్తకాలు తెచ్చి చదువుతోంది. రాకేష్ కూడా చాలా సార్లు ఆ టైములో వచ్చేవాడు. స్రవంతి వీళ్ళతోనే వుండేది. ఏవో చర్చలు- వాదోపవాదాలు.

ఝాన్సీలో కొడుకు పుట్టాక చాలా మార్పు వచ్చింది. మునపటి వుదాసీనత మటుమాయమయ్యింది. ఆమె కళ్ళు ఏదో తేజస్సుతో వున్నట్టుగా వుంటున్నాయి ఆమెను చూస్తే. సమత ఝాన్సీని, సుధాని ఒకటి రెండుసార్లు డా. జానకిగారి దగ్గరకు తీసుకువెళ్ళింది. అక్క కూడా ఆమె నుంచి ప్రేరణపొందాలనీ, ఏదైనా కార్యక్రమాల్లో పాల్గొనాలనీ, జీవితాన్ని మరింత సంతోషదాయకం చేసుకోవాలనీ సమత ప్రయత్నం.

★ ★ ★

సమత కూడా మళ్ళీ తన కార్యక్రమాలలో పూర్తిగా మునిగిపోయింది. ఒకవంక చదువు, మరోవంక ఉద్యోగం, అన్నింటినీ మించి సంస్థ కార్యకలాపాలు. ఆమెకు క్షణం తీరిక లేదు. ఇంట్లో వున్న కొద్దిసేపూ "సుధాసుధా" అంటూ వాడిని తెగ ముద్దుచేసేది.

సమత కన్వీనరుగా ఏర్పడిన అభ్యుదయ మహిళా సంస్థకు అనేక శాఖలు ఏర్పడుతున్నాయి. స్రవంతి యూనివర్సిటీశాఖ

బాధ్యత తీసుకుంది.

విద్యార్థినులనేకాక, మహిళా వుద్యోగస్తులనూ, కార్మిక స్త్రీలను కూడా ఆయా శాఖల్లోకి సమీకరిస్తున్నారు. పదిహేను రోజులకొకసారి ప్రతిశాఖ చర్చలు నిర్వహించేది. సమతకు ప్రతి ఆదివారం ఏదో ఒక శాఖకు వెళ్ళవలసి వచ్చేది. స్రవంతి కూడా చాలా సార్లు సమతావాళ్ళ గదికి వచ్చేది. ఆమెకు కూడా సుధాని చూస్తే ముద్దుగా వుండేది. "హలో లిటిల్ మాస్టర్' అంటూ ఏ బిస్కట్లో వాడి చేతిలో పెట్టేది. వాడు కూడా స్రవంతిని గుర్తుపట్టినట్లు కేరింతలు కొట్టేవాడు.

"సమతా! మీ సిస్టర్‌కి ఎంత ధైర్యం. నేనయితేనా హార్టుఫెయిలయి చచ్చివూరుకునే దానిని" అనేది చాలాసార్లు.

స్రవంతిది అంతా చిన్నపిల్లల వ్యవహారం. మనసులో అనుకున్నది ముందు వెనకలు చూడకుండా అనేస్తుంది. తను హాస్టలులోనే వుంటుంది.

"అసలేమిటా తాటకేశ్వరి వుద్దేశం. పది నిమిషాలు ఆలస్యంగా హాస్టలుకు వెళితే ఎవరి పక్కలోనో పడుకుని వచ్చినట్లు మాట్లాడుతుంది. వార్డెన్ గిరీ నుంచి ఆవిడను తప్పించాలి. మనం ఏమైనా చేయాలి" అంటుంది ఆవేశంగా వొచ్చి ఒకసారి.

"మనం పనిగట్టుకొని, ఇంత కష్టపడి కరపత్రం తయారుచేశామా? నా పక్కరూము వాళ్ళు కనీసం అదేమిటో చదవకుండానే, నాకళ్ళముందే చించి ముక్కలు పోశారు. వీళ్ళనెవరు బాగుచేయగలరు" అని నిరాశగా వాపోయేది ఒకసారి.

"ఇవ్వాళేం జరిగిందో తెలుసా! నేను లైబ్రరీ నుంచి వస్తుంటే ఇంగ్లీషు డిపార్టు మెంటులో చేరిందే మిస్. పారిజాతం, తనంతటతనే పిలిచి, మన సంస్థ గురించి అడిగింది. యాభై రూపాయలు డొనేషను కూడా ఇచ్చింది" అని ఉత్సాహంగా పొంగి పోయేది ఒకసారి.

"ఆడవాళ్ళను అవమానించే మగవాళ్ళ లోకం అని మనం చెబుతున్నామా! ఇవ్వాళ గార్డెన్స్‌లో ఏం జరిగిందో వినండి. పది మంది అమ్మాయిలు ఎకనమిక్సు ఫస్టు సోమసుందరాన్ని పట్టుకుని, అతని నడకని, మాటల్ని ఎద్దేవా చేస్తూ ఎంత ఏడిపించారో! ఇక మన మాటలు ఎవరు నమ్ముతారు" అని దిగులు పడేది ఒకసారి.

ఏదైనా ప్రోగ్రాము తీసుకుంటే మాత్రం ముందుండేది. ప్రచారం చేసేది. చందాలు పోగుచేసేది. తన చేతిరాత కూడా చాలా అందంగా వుండేది. బ్యానర్లు, ప్లె కార్డులు లాంటివి చక్కగా తయారుచేసేది.

సమత, స్రవంతి ఎప్పుడూ జంటగా కనిపించేవారు. ఎప్పటికప్పుడు స్రవంతిలో వుత్సాహం నింపకపోతే, తను పనిచేయలేదు. సమతకు ఇదో అదనపు బాధ్యత. రాకేష్ వీళ్ళిద్దరినీ కూర్చోపెట్టి సంస్థ నిర్వహణ గురించి చాలా చెప్పేవాడు.

"చూడండి, మనం చేపట్టే ప్రతి ఆందోళనా, ఈ వ్యవస్థను మార్చే ఉద్యమంలో కలిసే పిల్ల కాలవలా నిర్వహించాలి. అది మనలక్ష్యం. అయితే మన వుద్దేశాలను కలగాపులగం చేయకూడదు. వినేవాళ్ళను కన్‌ఫ్యూజ్ చేయకూడదు. రోజువారీ పోరాటాల క్రమంలోనే కొన్ని సమస్యలు ఈ వ్యవస్థ వున్నంత వరకూ పోవని వాళ్ళకు అర్థమయ్యేట్లు చేయాలి. ఎంత ఎక్కువమందిని మనం సిద్ధంచేస్తే అంత త్వరగా మార్పు వస్తుంది"

"ప్రతి సందర్భంలోనూ కొంతమంది సిద్ధంకాని వాళ్ళు వుంటారు, కొంతమంది ఎంత పెద్దపోరాటానికయినా సిద్ధం అయ్యే వాళ్ళు వుంటారు. ఎప్పుడూ ఎడ్యుకేట్ చేయటంతోనే సరిపోతుంటే ఇక ఉద్యమాలు నిర్వహించేది ఎప్పుడు? " అడిగింది సమత.

"ఎడ్యుకేట్ చేయటం కూడా వుద్యమ నిర్మాణమేనండీ! తను నిర్వహించే వుద్యమాలలో పాల్గొనే ప్రజల సంఖ్య, స్థాయినీబట్టి



సంస్థ స్థాయి పెరుగుతూనే వుంటుంది. ఒకో సమస్య, ఒకో ఆందోళన ప్రజల్ని త్వర గానూ, వున్నతంగానూ పోరాటాలకు సిద్ధం చేస్తుందండీ. జనంతో సంబంధం లేకుండా ప్రతిచోట విప్లవం, విప్లవం అని జపం చేస్తున్నారు సోదరులు కొందరు. దానివల్ల వారిగేదేమీ వుండదండీ. విప్లవానికి షార్టు కట్సు ఏవీ లేవండీ"

సమతకు ఈ వ్యవస్థ స్వరూపం బాగా అర్థమవుతున్నకొద్దీ దీనిని తొందరగా, ఏదో వొకటి చేసి మార్చాలనే ఆరాటం కూడా బాగా పెరిగిపోతోంది. ఆ తొందరలో ఒక్కోసారి ప్రజల స్థాయినీ తను ఎవరితో కలిసి పనిచేయాలో, వాళ్ళనే గుర్తించని లక్షణం వొకటి పెరుగుతోంది. దానికితోడు స్రవంతిలాంటి వాళ్ళు వచ్చి 'ఈ జనంతో లాభంలేదు ఏమి చెప్పినా దున్నపోతుమీద వాన పడ్డట్టే వాళ్ళు కదలరు' అంటుండే వారు. స్రవంతిలాంటివాళ్ళు 'మనం మాత్రం ఏం చేస్తాములే' అని నిరాశపడితే సమత లాంటివాళ్ళు "కనీసం మనమయినా ముందుకు నడుద్దాం, అప్పుడైనా జనం కదు లుతారు" అని భావిస్తారు. రాకేష్ వీళ్ళిద్దరి మధ్యా నిలబడి "జనం గొర్రెలు, దున్నపో తులూ కారు ఓపికగా వాళ్ళను సిద్ధం చేసు కోవాలి. ఆ జనం లేకుండా ముందుకు నడిస్తే మనం నీళ్ళనుంచి బయటపడ్డ చేపల్లా గిజగిజలాడి చావటమే" అని గట్టి నమ్మకం కలిగించే వాడు.

★ ★ ★

"ఇప్పుడు ఈ గుడిసెలు వున్నాయే, ఐదు సంవత్సరాల క్రితం ఇదంతా ఖాళీయేనండీ. మొదట్లో వొకడు శ్రీనివాస హౌసింగ్ బోర్డు అని బోర్డు వొకటి కట్టి కూర్చున్నాడండీ. గజం పది, పదిహేనుకు అమ్ముతాననేవాడు. "ఈ బొందల్లో ఇళ్ళు ఏమి వస్తాయి" అని ఎవరూ ముందుకు రాలేదు. వాడు అలాగే ఓపికగా కూర్చుని ఒకటీ అరా చేసి నెమ్మ దిగా అమ్మకం సాగించాడు. ఇవిగో ఈ రెండు బిల్డింగులు అప్పుడు కొని కట్టిన బాపతే. ఇళ్ళు పడేసరికి జనం ఎగబడటం ప్రారంభమయ్యింది.

ఇంతలో మాకు ఇదసలు అతని స్థలంకా దనీ, పోరంబోకు లాండుకు ఏవో కాయి తాలు పుట్టించి సొమ్ము చేసుకుంటున్నాడని తెలిసింది. ఒకరోజు తెల్లవారేసరికి, నమ్మండి, నమ్మకపోండి, మేము కొంతమం దిని పోగుచేసి ఏభై గుడిసెలు వేయించా మండీ. బోర్డు మెంబర్లం అంటూ కొందరు తయారయి ఆ గుడిసెలు పీకాలని చూశారు. మేము "ఇది పోరంబోకు. ఇక్కడ గుడిసెలు వేసుకున్న వాళ్ళకే హక్కు" అని గట్టిగా నిలబడ్డాం. హౌసింగ్ బోర్డు వాళ్ళ చేత అడ్వాన్సులు తిరిగి ఇప్పించేశాం. సాయంత్రానికి పోలీసులు వొచ్చి గుడిసెలు పీకి పదిమందిని అరెస్టు చేశారు. మిగిలిన వాళ్ళు పోలీసులను చూసి భయపడి ఆగి పోయారు.

మేము చాలామంది స్టూడెంట్లనీ, కొందరు కార్మికులను పోగుచేసి ఆందోళ నకు సిద్ధమయ్యాము. కానీ మేము వచ్చేస రికే వేరే కొంతమంది గుడిసెలు వేశారు. వాళ్ళ వెనక అధికారపార్టీ, యమ్మెల్లే వున్నారు. కొత్తగా గుడిసెలు వేసుకున్న వాళ్ళు ఏనాడో ఆ భూమిని కొనుక్కున్న వాళ్ళని వాదం తెచ్చారు.

మేమంతా నాల్గురోజులు గట్టిగా ఎదు ర్కొన్నాం. కానీ వాళ్ళు తమ జండా పెట్టు కుని గజానికి ఐదు రూపాయలు ఇస్తే ఎంతకావాలంటే అంత జాగా ఇస్తామని ఎత్తువేశారు. మేము మొండిగా "మనం ఇంత మందిమి వున్నాం. డబ్బు ఇచ్చే పని లేదు. అవసరం అయితే కలెక్టరు దగ్గరకు వెళదాం" అని జనానికి చెప్పాము. కానీ ఎక్కువ మందికి ఈ తతంగం అంతా ఎందుకు ఎమ్మెల్లే బాబు పక్కన వుంటే దేని కయినా మంచిది అనే ఆలోచన కలిగి అంతోఇంతో ఇచ్చి భూమిని నిలుపుకు న్నారు. మేము "పేదల హక్కు-పోరాటం"




అని వేసే కేకలు జనం మాతో రాకపోవ టంవల్ల గాలిలో కలిసిపోయాయి.

ఆ తర్వాత ఈ కాలవకు రాళ్ళు కట్టి, ఒక వైపు వేశారు నీళ్ళకు. ఈ జనాన్ని తన గుప్పిటిలో పెట్టుకున్నాడు యమ్మెల్లే. పేదలు తమ హక్కుగా పొందవలసిన దానిని తాను ఏదో దయాదాక్షిణ్యాలతో ఇస్తున్నట్టు వందసార్లు తన చుట్టూ తిప్పు కుని కుక్కలకు బొక్కలు విసిరినట్లు ఏవో చేస్తుంటాడు ఎమ్మెల్లే"

అని ఒకరోజు ఆ గుడిసెల పురాణం విని పించాడు రాకేష్.

"మరి మళ్ళీ మీరు ఏ ప్రయత్నాలు చేయ లేదా? " స్రవంతి అడిగింది.

"ఎందుకు చేయటంలేదు. ఎన్నోసార్లు వాళ్ళని కలుస్తాం. ఎమ్మెల్లే సంగతి అంతా వివరంగా చెబుతాం. అయినా మొదట్లో మనం ఎత్తుగడ లేకుండా, జనాన్ని కలుపు కురాకుండా 'పోరాటం పోరాటం' అని కేకలు వేయటంతో ఇప్పటికీ మనమీద అనుమానం, ఎమ్మెల్లే ఏదో చేస్తాడని ఆశలు, భ్రమలు వున్నాయి ఈ జనానికి. ఈ నాయకమ్మన్యుడు తనో పెద్ద సోషలిస్టు నని కబుర్లు చెబుతాడు. అసలు మనదే శంలో "సోషలిజం, విప్లవం" అనే పదాలు తమ అర్థం కోల్పోతున్నాయండీ. ప్రతి వాళ్ళూ పదేపదే ఆ పదాలు వాగి 'సోష లిజం' అంటే ప్రజలకు ఏవగింపు కల్గించా లని ఏదో కుట్ర జరిగిపోయినట్లు నా అను మానం అండీ" అన్నాడు రాకేష్ కళ్ళు పెద్దవి చేసి తిప్పుతూ రహస్యం చెబుతు న్నట్లు.

సమత, స్రవంతి అతను చెప్పిన విష యమే ఆలోచిస్తూ కూర్చున్నారు. ఇంతలో గుడిసెల్లోంచి గోలగోలగా అరుపులు వినిపి స్తున్నాయి.

"చచ్చినోడా! పాలపొడి తెమ్మని పైసలిస్తే పీకల్దాక తాగి వస్తావా? నాకాడ పాలులేక ఇది నెత్తురు పిండుకుతాగుతోంది. గంజి పోద్దామంటే మూడు నెల్లు లేవు దానికి. నేనెట్టా చచ్చేదిరా? " కళ్ళల్లో నీళ్ళు, కంఠంలో ఆవేశం పొంగిపోతుంటే అడుగు తోంది ఒకమ్మాయి.

"సారాకొట్టు కనపడితే కాస్త పీక తడుపు కున్నానంతే. పైసలు నాకాడ బద్రంగా వున్నాయిలే! సాయంత్రానికి పాలడబ్బా పట్టుకొత్తా గదా! లేలే... బువ్వెయ్యి"

"దీని వుసురు కొట్టుకొంటావురా! ఎట్టా దిగుద్దిరా ముద్ద. ఇది ఇట్టా పీకలారి ఏడు త్తావుంటే"

"మా బంగారం గదూ! నేనెట్టా రెండు టిప్పులు ఏసి వచ్చానంటే ఒకటేంది, రెండు డబ్బాలొత్తాయి. అరవమాక రాయే"

"బంగారమూ లేదు సింగారమూ లేదు. పాలట్టుకొచ్చేకే నీకు ముద్ద ఏసేది పోరా!" అంటూ పిల్లను చంకనేసుకుని వీధిన బడింది ఆ అమ్మాయి. ఆ మగాడు రెండు నిమిషాలు బుర్ర గోక్కుని రిక్షా తీసుకు బయలుదేరాడు బీడీ అంటించి.

"నేను చాలా రోజుల్నుంచి చూస్తున్నాను. ఈ లేబరుక్లాసు ఆడవాళ్ళకి, మన మధ్యత రగతి ఆడవాళ్ళకంటే ఎక్కువ స్వేచ్ఛ, ఎక్కువ అధికారమూ వున్నాయనిపిస్తోంది. వాళ్ళను చూడండి నువ్వంటే నువ్వంటూ ఎట్లా కొట్టుకున్నారో! మళ్ళీ కాసేపటికి పిచి కల్లా కిచకిచమంటూ తిరుగుతారు" అంది స్రవంతి.

"నువ్వు చెప్పేది నిజమే స్రవంతీ! వాళ్ళల్లో ఆడ మొగలమధ్య మనమధ్య వున్నంత తేడా లేదు. ఇద్దరూ భుజంభుజం కలిపి రోడ్లు పోస్తారు, పూడుస్తారు. ఏడ్పుల్లో, నవ్వుల్లో, పనిలో పాటల్లో, దోపి డిలో, పీడనలో, ఇద్దరూ కలిసే వుంటారు. వాళ్ళిద్దరికీ ప్రపంచం సమానంగానే తెలుసు. అన్నం వొండటానికో ఇంటి పని చేయటానికో స్త్రీ తనను ఇరవై నాలుగు గంటలూ ఇంటికి కట్టివేసుకోదు. అందుకే వాళ్ళిద్దరికీ మనో ప్రపంచమూ, బయటి



ప్రపంచమూ సమంగా వుంటాయి. అదే మనిళ్ళల్లో స్త్రీలు ఇళ్ళకే అంకితం. అసలు మగాళ్ళు ఇంట్లో ఆడవాళ్ళతో మాట్లాడే మాటలకీ, తమ ఫ్రెండ్సుతో మాట్లాడే మాటలకీ ఎంత తేడా వుంటుంది. మనిళ్ళల్లో ఆడదంటే తక్కువ చూపు ఈ మిడిల్ క్లాస్ మగాళ్ళకే!" అంది సమత.

"బొమ్మ చూస్తే మీరు చెప్పేది నిజమే కానీండీ, బొరుసు చూస్తే పూర్తిగా నిజం కాదండీ" అన్నాడు రాకేష్. "ఆ ఇళ్ళల్లో కూడా స్త్రీ రెండోస్థానంలోనే వుందండీ. ఇద్దరూ బయట గొడ్లలా పనిచేసి వచ్చినా వంటావార్పూ, పిల్లా జెల్లా సంగతి పట్టించుకునేది ఆడదే కదండీ! మగాడు జల్సాగా తిరిగివొచ్చినా, పిల్లల తిండీ తిప్పలు ఆడవాళ్ల పాలేగదండీ! బయట మూటలు మోసినా, ఇంటికొస్తే 'నేను కుండలుకడుగుతానా' అనే అంటాడు ఆ మగాడు కూడా"

"అంటే ఆ స్త్రీలకున్న ఆర్థిక స్వాతంత్ర్యం వల్ల వాళ్ళల్లో ఏమీ మార్పు రాలేదంటారా? " నొక్కి పలుకుతూ అడిగింది సమత.

"ఏమీ మార్పు లేదని కాదండీ బాబూ! తోటల్లో, బాటల్లో, చివరకు పదిళ్ళలో పాచి పని చేసయినా సరే బతకగలను అనే ధీమా వుంది ఆ స్త్రీకి. తనకే కాదు, తన పిల్లలకీ ఇంత తిండి పెట్టగలుగుతుంది ఆమె. అందుకనే ధాటిగా మాట్లాడుతుంది. తనకోసం, తన పిల్లకోసం పోట్లాడుతుంది కూడా. మొగుడి దయాదాక్షిణ్యాలకోసం కాక కుటుంబంలో తనకున్న హక్కుకోసం జగడమాడుతుంది కూడా. ఇదంతా అచేతనంగా జరిగిపోతూ వుంటుంది.

"సంపాదనలేని మధ్యతరగతి ఆడవాళ్ళు తప్పనిసరిగా, గత్యంతరంలేక భర్తకు అణిగిమణిగి వుండవలసి వస్తోంది. ఆయన బయటికీడిస్తే నాగతేమిటి అనేది ఆవిడకు పెద్దభయం. అందుకే వాళ్ళు ఏమాత్రం ఇష్టంలేకపోయినా, నోరు మూసుకుని కాపురాలు చేస్తారు.

అదే పాటకజనంలో స్త్రీకి ఆ భయం లేదు. తమకు ఇష్టమైతేనే కాపురం చేస్తారు. మరీ కష్టమైతే పెళ్ళిని రద్దు చేసుకోవటానికీ, మారుమనువు పోవటానికీ కూడా వెనకాడరు. ఇదంతా ఆర్థిక స్వాతంత్ర్యం ఉండటంవల్లనే వస్తోందండీ!

"కానీ రోజువారీ జీవితంలో మొగాడు మంచి అథార్టీ చలాయిస్తూనే వున్నాడు. వాడికి తెలీకుండా స్త్రీ ఏ పని స్వతంత్రంగా చేయగలదు చెప్పండి? కుటుంబ సమస్యలనయినా మగవాడి ఇష్టానికి వ్యతిరేకంగా, స్త్రీకి నచ్చినట్టు పరిష్కరించే స్వేచ్ఛ వుందా చెప్పండి? " అడిగాడు రాకేష్.

"ఇది ఆలోచించవలసిన విషయమే నండీ? " అని ఒప్పుకుంటూ, "ఎందుకని అలా జరుగుతోందంటారు? " అడిగింది స్రవంతి.

"ఎందుకంటే వాళ్ళు ఈ సమాజంలోనే బతుకుతున్నారు గనక. ఆ ఆడది కూడా తను తక్కువ పుటక పుట్టాననే అనుకొంటోంది గనక. తాము చుట్టూ చూసే ప్రపంచంలో ఆడవాళ్ళు కిమ్మనకుండా వుండటమూ మగాళ్ళు మహారాజుల్లా తిరిగి రావటమూ చూస్తున్నారు కనక. కూలికి వెళితే 'ఆడదని' తనకి తక్కువ ఇస్తారు కనక. గోడకట్టే మగాడు తాను అసలు కూలివాణ్ణనీ, ఇటుకలు అందించే ఆడది 'చేతికింద మనిషి' అనీ అనుకుంటున్నాడు గనక.

"ఆడవాళ్ళ శ్రమను ఇంటిలోకానీ, బయటకానీ తేలికగా చూపటం, చవగ్గా కొనటం ఈ ధనస్వామ్య వ్యవస్థకే లాభం. ఇటు ఆర్థికరంగంలోనూ అటు భావరంగంలోనూ ఆడదాన్ని తక్కువచేసి చూపుతున్నారు కనకే, కొద్దోగొప్పో సంపాదించే స్త్రీలు కూడా ధైర్యంగా తమ హక్కుల్ని నిలబెట్టుకోలేకపోతున్నారండీ" అన్నాడు రాకేష్.

వీళ్ళిలా మాట్లాడుకుంటూ వుండగానే




ఇందాక గుడిసెల్లోంచి రిక్షా తీసుకువెళ్ళిన మగాడు వీళ్ళ పక్క ఇంటికి వచ్చి "అయ్యగారూ, అయ్యగారూ" అంటూ కేకేశాడు.

ఆయన బయటికొచ్చి "ఏమిటి బాలయ్యా" అని అడిగాడు.

"పది రూపాయలిప్పించండి అయ్యగారూ. ఆడదాని జీతంలో కోసుకుందురూ" అన్నాడు.

"నాల్గురోజుల క్రితం వచ్చి ఐదు రూపాయలు తీసుకువెళ్ళావు గదరా! నెలలో పది రోజులు గడవలేదు. ఇప్పుడేంలేవు పోరా" అన్నాడాయన.

"నెలల పిల్ల బాబూ! ధాని పాలకు లేవు. ఇయ్యాల డబ్బా కొనకపోతే అది రాత్రికి సచ్చేపోతది బాబూ! ఇయ్యాల నాపానం బాగలేదు. రిక్షా ఎక్కితే కళ్ళు తిరుగుతున్నాయి. ఎట్టాగైనా ఓ పది ఇప్పించండి బాబూ" బతిమాలుతున్నాడు బాలయ్య.

ఇంతలో అంట్లు తోమటానికి అతని భార్య ఆ ఇంటికే వచ్చింది. "రెండు టిప్పులు ఏస్తానని బయలుదేరి ఈడ కొచ్చాడయ్యగారూ! ఇయ్యాలాడికి మీరు డబ్బు లీయమాకండి. పాలడబ్బాకని పైసలిస్తే పొద్దున్నే సారా తాగి బయల్దేరాడు"

"అదిగాదు మానిక్యం, ముందు డబ్బు తెచ్చి నీకిద్దామని" ఏదో గొణిగాడు బాలయ్య.

మాణిక్యం ధుమధుమలాడిపోతూనే వుంది. " సిగ్గులేదురా నీకు. ఆడది అంట్లు తోమి తెచ్చే పైసలకాశపడుతున్నావు. మగ పుటక పుట్టలేదూ! థూ"

"ఏందే నీ మాటలు, నీ డబ్బులు నాకెందుకు? నా రెక్కల్లో బలం వుంది. అయ్యగారూ, మీరు పది ఇవ్వండయ్యగారు. పోనీ సాయంత్రానికి తెచ్చిస్తా గదా- ఇవ్వండయ్యగారూ" అడుగుతున్నాడు బాలయ్య.

"ఆడికిస్తే అంతా నాశనం చేసుకువస్తాడు. ఇవ్వమోకండయ్యగారూ!"

"పొగరు బట్టిందే నీకు. మొగుడని లేకుండా, ఇట్టా వాగుతున్నావు. గుడిసె కురా, నీపని చెబుతాను" అంటూ రంకెలు వేస్తూ వెళ్ళాడు బాలయ్య.

"ఏంచేత్తావురా గుడిసెకొత్తే, నేనే పంచాయతి పెడతాను పద, నాతప్పుంటే చెప్పుచ్చుకు కొట్టమను పడతాను. మీరు గిన్నెలెయ్యండమ్మగారు" లోపలికి వెళ్ళింది మాణిక్యం.

"ఏవిషయమైనా ఇంతే, సూటిగా తేల్చేసుకుంటారు వాళ్ళు. మనలో వుండే హిపోక్రసీ వుండదు వాళ్ల జీవితాల్లో. వాళ్ళ సమస్యలు సగపాలు డబ్బు అవసరానికి చెందినవే! ఆ డబ్బు ఇద్దరూ సంపాదిస్తారు గనక దాని మీద ఇద్దరికీ హక్కు వుంటుంది. ఆ హక్కు మీద నిలబడి తేల్చుకుంటారు ఏ విషయమైనా. అందుకే ఆ ఆడవాళ్లకు వాయిస్ ఎక్కువ వున్నట్లు కనిపిస్తుందండీ" అన్నాడు రాకేష్.

"అవునండీ ఈ మగాడు మగాడిలాగానే వున్నాడు. మాణిక్యం తన హక్కులు గుర్తించినట్లే కనపడుతుంది. దానికోసం గట్టిగా నిలబడటం కూడా చూస్తున్నాంకదా! మన ఇళ్ళల్లో స్త్రీలు ఇంత ఎదిరించి మాట్లాడలేరు" అన్నది స్రవంతి.

"మొన్నొకసారి చూశాను. ఈ పక్కగదిలో సూర్యనారాయణ సుభద్రని నానా మాటలూ అంటున్నాడు. ఆవిడ నోరెత్తి ఒకమాట కూడా అనలేదు" గుసగుసగా చెప్పింది స్రవంతి.

సమత అందుకుని "అవును, సుభద్రగారికి జీవితం నరకంలాగ వుంది. ముగ్గురు పిల్లలూ, తనూ "ఎవరు పోషిస్తారు చెప్పు" అంటుంది. పేకాటలో డబ్బు పోయిన చిరాకంతా భార్యమీద తీర్చుకుంటాడు సూర్యనారాయణ. సగం జీతమే ఇంట్లో ఇస్తాడు. మళ్ళీ రోజూ చేయి చాపుతాడు.

"ఎన్నాళ్ళు పడతారండీ ఈ నరకం. కనీసం నోరెత్తి మాట్లాడరు" అని అడిగితే

"ఏంచేయమంటావు సమతా! ఏమన్నా

అంటే ఇంకా రెచ్చిపోతాడాయన. కనీసం కంటికి కనిపిస్తున్నారిప్పుడు. ఇద్దరు పిల్లల్ని పెట్టుకుని ఎక్కడికి వెళ్లమంటావు. ఎవర్నడగమంటావు" అంటుంది ఆవిడ. "చదువా? వుద్యోగమా, ఏముంది నాకు? " అని వాపోతుంది.

'ఏ ఫ్యాక్టరీలో పనికి కుదిరినా ఇంతకంటే సుఖంగా వుంటారు. పోనీ నేను ప్రయత్నం చేయనా' అని అడిగాను చాలాసార్లు.

"ఇంటి ఇల్లాలిని కూలిపనికి వెళ్లమంటావా? అట్లాంటి పరువు తక్కువ పనులు మా ఇంటా ఒంటా లేవు" అంటుంది.

"పనిచేసుకోవటం, పొట్టపోసుకోవటంలో పరువుతక్కువేమిటండీ! మీ బతుకు మీరు బతకగలుగుతారు. అణిగిపడివున్నంతకాలం ఆయనలో ఏ మార్పూ రాదు. మీరు కాస్త ధైర్యంచేస్తే, బెదిరిస్తే ముందాయనలో కాస్త దూకుడు తగ్గుతుంది" అంటాను నేను.

"ఎందుకులే అమ్మా నలుగురిలో నానటం. కొట్టినా, తిట్టినా మొగుడుచాటున బతకడమే ఆడదానికి పరువు, క్షేమం. పిల్లలు పెద్ద వాళ్ళవుతున్నారా! ఇక ఆయన మారకేం చేస్తారు? ఎంతకాలం వుంటాయిలే ఈ కుర్ర చేష్టలు? పిల్లలు బుద్ధిచెప్పే వరకూ నా బతుకిలా వెళ్ళమారి పోవాల్సిందే" అంటుంది.

సుభద్ర, సూర్యనారాయణల సంగతి పూర్తిగా చెప్పింది సమత. స్రవంతి మహా వుత్సాహంగా విని "ఇట్లాంటి సుభద్రలు లోకంమీద ఎందరో వున్నారు సమతా! మనం ఏంచేయాలి ఇలాంటి కేసుల్లో" అని అడిగింది.

"ఇట్లాంటి కాపురం జైలుకన్న అధ్వాన్నం అని ఆవిడకు గుర్తింపు కలగాలి! జైలునుంచి తప్పించుకోవాలనుకునేవాళ్ళకు ఏమైనా సహాయం చేయగలంకానీ, బయటి స్వేచ్ఛ కంటే కాపురం అనే ఈ జైలు జీవితం నయం అనుకునేవాళ్లకు మనం ఏంచేయగలం? నేను ఆవిడకు సంవత్సరం నుంచీ చెబుతున్నాను. ఏ పరిష్కారం చూపబోయినా పరువు తక్కువ అని తీసేస్తుందావిడ"

"మార్పులు అంత తేలికగా రావు స్రవంతీ! వచ్చినా కనపడవు. సమత కలవకముందు తన బతుకు ఇంతే అనే భావంలో వుండేది ఆవిడ. కానీ ఇప్పుడు తను తెగిస్తే మార్గాలు వున్నాయనీ, ఆ కొత్త మార్గంలో నడవటానికి చేయూతనిచ్చే వాళ్ళూ వున్నారనీ ఆవిడకు తెలుసు. ఇన్నాళ్ళూ కర్మ అనుకునేది. ఇప్పుడు తన పిరికితనం కూడా కారణం అనుకుంటోంది.

"గదిలో పెట్టి బాధిస్తే పిల్లి కూడా ఎదురు తిరుగుతుంది ఒక లెవెల్లో. మనిషీ అంతే. ఆంతరంగిక వత్తిడి ఎక్కువైతే తెగిస్తాడు" అన్నాడు రాకేష్.

"ఈలోగా ఆ సూర్యనారాయణను మార్చటానికి ఏమైనా చేయాలి రాకేష్. నా పెళ్లాం నా యిష్టం, కొట్టుకుంటాను, ముద్దు పెట్టుకుంటాను మీకెందుకు అంటాడు ఎవరు కలగజేసుకోపోయినా. ఈమధ్య కమలాకరం ఒకటి రెండుసార్లు సూర్యనారాయణని ఆపితే, సుభద్రని ఇంకా కొట్టాడు 'వాడు నీకు వత్తాసుగా ఎందుకు వచ్చాడని'. రాయుడుగారు కూడా పట్టించుకోవటం లేదిప్పుడు" అన్నది సమత.

"ఎంతయినా సుభద్రగారు కొంత సహకరిస్తేనే మనం ఏదయినా చేయగలిగేది. అంతవరకూ మీరున్నది చీకటి లైటు వెలిగిస్తే పోతుంది అని చెప్పటమే మనం చేయగలిగింది"

★ ★ ★

మళ్లీ కాలేజీలు తెరిచారు.

సమత, స్రవంతి ఫైనలియరులో ప్రవేశించారు. రాకేష్‌కు లా పూర్తి అయ్యింది.

"ఈ సంవత్సరం ఏ కోర్సులో చేరుతున్నారు మహానుభావా!" అడిగింది స్రవంతి, అందరూ కలిసి కూర్చుని వుండగా.

"కాలేజీ జీవితానికో సెమికోలన్ వేస్తున్నా

నండీ. ఎప్పుడైనా మళ్లీ వీలు చూసుకొని ఫ్రెంచి కోర్సు చేస్తాను. ఈ సంవత్సరం బోర్డు పెట్టేస్తానండీ. జీవితపు రైలు బండిని ఒక స్టేషను దాటించేస్తాను" అన్నాడు రాకేష్.

"ఇందుగలడందు లేడని సందేహం లేకుండా నగరమంతా దున్నేస్తున్నారు. మీ బోర్డు చూసి వచ్చే పార్టీలు ఎవరండీ? అధవా ఎవడైనా వచ్చినా లాయరు గారి కోసం వెతుక్కునేసరికి వాడికి చెప్పులరిగిపో తాయి" అంది స్రవంతి.

"ఈ లాయరుగారి కోసం తిరిగితే ఫర్వా లేదండీ. కోర్టుల చుట్టూ తిరగడాన్ని తగ్గిం చేస్తానుకదా? మా సీనియరు వుద్దండ పిండమండీ బాబూ! లా పుస్తకాలు కరకర నమిలి జీర్ణం చేసుకున్నాడు. ఎదుటి వకీ లుని, ఏ కీలుకాకీలు విరుచుకు తింటాడు" అంటూ సమతవైపు తిరిగి "రమణమూర్తి గారు! నీకు తెలుసుకదా హైకోర్టు లాయరు. ఆయన దగ్గిరే జూనియరుగా చేరాను"

"నా రూము దగ్గిరే రోడ్డుమీద షాపొకటి ఖాళీ అయింది. అది తీసుకుంటున్నాను ఆఫీసుకని. అక్కడ కొట్టాలండీ బోర్డు. మేకులు జేబులో వేసుకు తిరుగుతున్నా. వస్తానండీ" అంటూ వెళ్లాడతను.

"ఏమిటి సమతా! ఏమనుకున్నారు మీరి ద్దరూ! ఎప్పుడు పెళ్లి" అడిగింది స్రవంతి.

"పెళ్ళేమిటి? అనుకునేదేమిటి" సమత త్రోసిపుచ్చుతూ అంది.

"ఇన్నాళ్ళు దాస్తారులే! చెబితే నోటి ముత్యాలు రాలిపోవులే అమ్మా" చనువుగా చుబుకం పట్టి ఆడిస్తూ అడిగింది స్రవంతి.

"నిజంగా స్రవంతీ! మామధ్య అలాంటి మాటలు ఎప్పుడూ రాలేదు. ఎందుకలా అనుకుంటున్నావు నువ్వు" కొంచెం ఆసక్తిగా, అంతకంటే సీరియస్‌గా అడిగింది సమత.

స్రవంతి కూడా గంభీరంగా మారిపోయి, "సారీ సమతా! నేనే పొరబడ్డానేమో! కానీ మీ ఇద్దరినీ చూస్తుంటే నాకలా అనిపిం చింది. నీ దగ్గర వున్నప్పుడు చూడు రాకే ష్‌ని, దీపాలు పెట్టిన ఇళ్ళలా ఆ కళ్ళలా మెరిసిపోతాయో! నువ్వు మాత్రం. రాకే ష్‌తో కలిసి వుంటే ఏ పూల తెప్పలోనో తేలి పోతున్నట్లుండవూ"

"ఏమో స్రవంతీ! నాకు నిజంగా ఏమీ అర్థం కావటంలేదీ విషయం. మామూలు ఫ్రెండుకంటే ఏదో ఎక్కువ అనిపిస్తుంది" నిజాయితీగా అంది సమత.

★ ★ ★

నిజంగానే సమతా, రాకేష్‌ల మధ్య కేవలం స్నేహాన్నిమించిన అనురాగం ఏదో చివురిస్తోంది. అతను సమతమీద ప్రత్యేక శ్రద్ధతీసుకున్నాడు. ఏ విషయమైనా ఒక సారి చెబితేచాలు వెంటనే గ్రహిస్తుంది సమత. ఆమెకు చెప్పటంకోసం అతను కూడా ఇంకా పుస్తకాలు చదవవలసి వచ్చేది. తన అనుభవాలన్నీ విశ్లేషించి చెబుతూ, సామాజిక జీవితం గురించి సమ తకున్న ఎన్నో అనుమానాలు తొలగిం చాడు. అభ్యుదయ మహిళా సంస్థ రాష్ట్ర స్థాయిలో ఏర్పడటంతో సమత రాష్ట్ర కార్య వర్గానికి ఎన్నుకోబడింది. రాకేష్ విద్యార్థి ఉద్యమ బాధ్యతలు వేరే వాళ్లకి బదలా యించి తను ఎక్కువగా పార్టీ పనిలో నిమ గ్నమవుతున్నాడు.

ఈమధ్యలో ధర్మతేజ హైదరాబాద్ చేరాడు. అతను విద్యార్థి సంస్థకు ప్రస్తుతం రాష్ట్ర కార్యదర్శి. స్రవంతి కూడా మహిళా సంస్థలో పని చేస్తున్నా, ఆమెది యూనివ ర్సిటీ శాఖ కావటంతో ఆమె పని ప్రధా నంగా విద్యార్థి సంస్థతో మంచి సంబం ధాలు ఏర్పరచటంగా వుండేది.

స్రవంతిలోని ఉత్సాహం, గలగలపారే సెలయేరులాంటి స్వభావం ధర్మతేజను బాగా ఆకర్షించాయి. సంస్థల పనుల దృష్ట్యా వాళ్లిద్దరూ చాలాసార్లు కలుసుకోవ లసి వచ్చేది. మొదట్లో సమత రూము దగ్గిరే ఇద్దరూ కలిసేవారు కానీ ఈమధ్య

ధర్మతేజ డైరెక్టుగా స్రవంతి హాస్టలుకు వెళ్లటం, కాలేజీలో కలవటం చేస్తున్నాడు. స్రవంతికి కూడా ధర్మతేజలోని మెత్తదనం, ఇతరులు చెప్పే విషయాలను శ్రద్ధగా వినటం, సెక్రటరీగా అతనిలోని చాకచక్యం అన్నీ నచ్చాయి. మొత్తానికి ఆరేడు నెలలు గడిచేసరికి వాళ్లిద్దరూ పెళ్లిచేసుకుందాం అనే నిర్ణయానికి వచ్చారు. ఇద్దరికీ ఫ్రెండు సమత. ఆమెకే చెప్పారు మొదట. స్రవంతి తొందరపాటు గురించి తేజకు చెప్పింది సమత. ఆమె ఉద్యమాలలో తిరగటమే తేజకు ఆమె మీద ఇష్టం కలగటంలో ఒక ముఖ్య కారణం. "నువ్వు ప్రతిక్షణం ఆమెకు ప్రోత్సాహం ఇచ్చి నడిపించకపోతే స్రవంతి వూరికినే నిరుత్సాహపడిపోతుంది" అని చెప్పింది సమత.

మరో నెల గడిచేసరికి స్రవంతి, ధర్మతేజ దండలు మార్చుకుని భార్యాభర్తలయ్యారు. స్రవంతీ వాళ్ల ఇంట్లో ఒప్పుకున్నారుకానీ తేజా వాళ్ల ఇంట్లో అంత సుముఖంగాలేరు. అయినా వీళ్లిద్దరూ ఇక్కడ పెళ్లి చేసుకున్నారు. స్రవంతి హాస్టలు వదిలేసింది. ఇల్లు తీసుకుని ఇద్దరూ కాపురం మొదలెట్టారు. ఇద్దరూ కాస్తో కూస్తో వున్నవాళ్లే. ఇంటి దగ్గరనుంచి డబ్బులు తెప్పించుకుని కాలక్షేపం చేస్తున్నారు. తేజ ఏదో 'నామ్‌కే వాస్తే' జర్నలిజం కోర్సులో వున్నాడు కానీ అది అంత పట్టించుకునే విషయం కాదు. రాష్ట్రంలో అన్ని జిల్లాలకూ తిరుగుతూ వుంటాడు విద్యార్థి ఉద్యమం పనులతో.

"కొత్తగా పెళ్లయ్యిందికదా కాస్త నాలుగు రోజులు మనిద్దరం సరదాగా గడుపుదాం" అంటుంది స్రవంతి.

"రాష్ట్ర సెక్రెటరీని నేను వెళ్లకపోతే ఎలా" అని తన ప్రోగ్రాం ప్రకారం వెళ్లి వస్తూ వుంటాడతను. స్రవంతి కాస్త అలకలు, కలహాలు సాగిస్తోంది. అతను కాసేపు బతిమాలుకోవటం, సంజాయిషీ చెప్పుకోవటం మామూలయిపోయింది. కొత్త కాపురంలో ఇవన్నీ మామూలే. నాలుగు రోజులుపోతే తనే సర్దుకుంటుందిలే అని తేజ తోసేసుకు పోతూ వుంటాడు.

సమతతో అతనిమీద ఏదో ఒకటి చెబుతూ వుంటుంది స్రవంతి. బొత్తిగా తనను పట్టించుకోవటంలేదనీ, ఒక్కత్తినీ వదిలేసి తను ఎక్కడెక్కడో తిరిగివస్తున్నాడని, ఎవడైనా ఇంట్లో దూరి ఏ అఘాయిత్యం చేసినా దిక్కులేదు అంటుంది ఆమె. స్రవంతి స్వభావం తెలిసిందే అవటంతో సమత ఏదో సర్ది చెప్పేదికానీ స్రవంతి సమాధానపడేదికాదు.

"రాత్రి ఏ పన్నెండు గంటలకో ఇల్లు చేరతాడు. మళ్లీ తెల్లారక ముందే ఉరుకులు పరుగులు. కంటినిండా నిద్రయినా పోడు. ఇద్దరం ఇంట్లోనే వున్నా ఒక్కోసారి పలకరించుకోవటానికే వీలుండటం లేదు తెలుసా" అంటుంది ఒక్కోసారి.

"పెళ్లికాకముందే నయం. కాస్త హాస్టలుకు వచ్చినపుడు నాలుగు కబుర్లు చెప్పేవాడు. ప్రేమించి పెళ్లిచేసుకున్నానుకదా! అందుకే అలుసయ్యాను" అని బాధపడేది ఒక్కోసారి.

"తేజకు నువ్వు అలుసేమిటి స్రవంతీ. అతనికి ఆడవాళ్లంటే ఎంతో అభిమానం. మామూలు గౌరవమేకాదు. స్త్రీలను ప్రత్యేకంగా జాగ్రత్తగా చూడాలని చెబుతాడు. అతని సంగతి నాకు బాగా తెలుసు. ఆడవాళ్లు తప్పుగా, పరుషంగా మాట్లాడినా, మగవాళ్లే సర్దుకుపోవాలంటాడు. నేను ఎన్నోసార్లు చూశాను కూడా. అతను పొరపాటున మగవాడిగా పుట్టిన స్త్రీమూర్తి" అంటుంది సమత.

"అదంతా పెళ్లి కాకముందులే సమతా! లేదంటే పెళ్లామేగదా అన్న భావమో! నన్ను మాత్రం పట్టించుకోవటంలేదు. అతని జీవితంలో పార్టీపనులు, సంఘం పనులు తప్ప భార్యకోస్థానం వుందని గుర్తించినట్లు కనపడటంలేదు. అసలు అతను ఎక్కడికి వెళు

తున్నాడో ఎప్పుడు వస్తాడో కూడా నాకు తెలీదంటే నమ్ము"

"అతని కార్యక్రమాలు, పనులు అన్నీ నీకు తెలుసుకదా! ఇప్పుడు రాష్ట్ర సదస్సు జరగబోతోందా! మరీ హడావిడిగా తిరుగుతుండి వుంటాడు. ఇదివరకు నువ్వు యాక్టివ్‌గా తిరిగే దానివి. అందుకే మీరు కలిసి వున్నట్లు అనుకునే దానివి. ఈమధ్య నువ్వు అసలు సంస్థ పనుల్లోకే రావటంలేదు అంతగా. అందుకే మరీ దూరంగా వున్నట్టు కనిపిస్తుందేమోలే" అని సర్ది చెప్పేది సమత.

స్రవంతిలో వచ్చిన మార్పుకు కారణం లేకపోలేదు. చిన్నచిన్న చినుకులుగా ప్రారంభమయిన వీళ్ల ఉద్యమాలు, సంస్థలు బలంగా పెరుగుతున్నాయి. ప్రభుత్వానికి గంగవెర్రులెత్తుతోంది. ఈ విద్యార్థి సంస్థలు, మహిళా సంస్థలు, పేదల సంఘాలు అన్నీ ఒకటేననీ ప్రభుత్వాన్ని కూల్చటానికి ప్రయత్నించే సంఘవిద్రోహశక్తులు వీటి వెనుక వున్నాయని పెద్ద ఎత్తున ప్రచారం చేసింది ప్రభుత్వం. ఒక్కోసారి మీటింగు పెట్టటానికో, వూరేగింపు తీయటానికో పర్మిషను కోసం పోలీసు స్టేషనుకు వెళితే అక్కడికక్కడే అరెస్టు చేసి రెండు మూడు రోజుల తర్వాత ఒదులుతున్నారు. ముఖ్యంగా చిన్న చిన్న గ్రామాలలోనూ టౌన్లలోనూ ఎక్కువగా ఇలా వేధిస్తున్నారు. మామూలు వాళ్లని భయపెట్టి దూరం చేస్తే పెద్దపెద్ద నాయకులు కింద పనిచేసే సైన్యంలేని జనరల్స్‌లాగ మిగిలిపోతారని పోలీసుల ఎత్తుగడ. జిల్లాలనుంచి విద్యార్థులను ఏవిధంగా పోలీసులు వేధిస్తున్నదీ, తేజ దగ్గరకు రిపోర్టులు వచ్చేవి. అవన్నీ చూసి స్రవంతి చాలా భయపడింది.

హైదరాబాద్‌లో అంతగా అరెస్టులు చేయలేదుగానీ ఏ టైములోపడితే ఆ టైములో పోలీసులు ఇళ్లమీద దాడిచేసి పుస్తకాలు పట్టుకెళ్లటం, ఇంటరాగేషన్ పేరుతో స్టేషన్ల చుట్టూ తిప్పుకోవటం చేస్తున్నారు. స్కూలు మీద కూడా దాడిచేసి డూప్లికేటింగ్ మిషను ఎత్తుకెళ్లారు పోలీసులు.

స్రవంతికి పెళ్లి కాకముందు ఇవన్నీ థ్రిల్లింగ్‌గా అనిపించేవి. కానీ ఒక భార్యగా మారింతర్వాత తేజకు ఏమవుతుందో తనేమయిపోతుందో అనే భయం పట్టుకొంది. అయితే ఆ భయాలు పైకి చెప్పుకోవటం ఆమెకు నామోషీగా అనిపించింది. ఒకవేళ ఆమె భయం చెప్పినా ఎవరూ పట్టించుకోరు. వాళ్లకు సిద్ధాంతాలు చెప్పి ఆపలేదు. అందుకని పైకి ఏమీ చెప్పకుండానే తేజను తనకు సాధ్యమయినంతవరకూ ఈ కార్యక్రమాలకు దూరం చేయాలని నిర్ణయించుకుంది ఆమె.

"ఆలుమగలన్నాక కొద్దిగానయినా ఖుషీలు, కులాసాలూ వుండొద్దా! కనీసం రోజుకు ఒక గంటయినా మేమిద్దరం కలిసి వుండొద్దా" అని కంప్లైంట్ చేయసాగింది. స్రవంతిలోని మార్పును ఎవరూ సరిగ్గా గుర్తించలేదు. పైపెచ్చు కొంతమంది బాధ్యులు తేజకే చెప్పసాగారు.

"స్రవంతి కొద్దోగొప్పో మనతో కలిసి వస్తున్న కార్యకర్త. అలాంటి అమ్మాయిలో కుటుంబ జీవితంలో అసంతృప్తి ఏర్పడితే క్రమంగా అది ఉద్యమం పట్లనే వ్యతిరేకతగా మారుతుంది. వీలుచూసుకుని సరదాగా తిప్పవయ్యా! కాస్త ఆమెపట్ల సఖ్యతగా వుండు"

కావాలని చేసుకున్న వాళ్లయినా, తమ మధ్య కలతలు ఎందుకు కలుగుతున్నాయా అని తల్లడిల్ల సాగాడు తేజ. తన కాపురం అనేది సంస్థలో ఒక ఆలోచించవలసిన విషయంగా మారటం అతనికి చాలా చిన్నతనంగా అనిపించింది. తనలో తప్పేమిటా అని ఆలోచించేవాడు. రోజులు గడిచేకొద్దీ స్రవంతి ఒక కొత్త ఆయుధం కనిపెట్టింది.

"నాకంటే పక్క ఇంటి విశాల నయం. వాళ్లాయనకు ఈ విప్లవాలు, ఆడవాళ్ల హక్కులు తెలియకపోయినా భార్యను ప్రేమించటం చేతనవును. ఎంత సుఖంగా కాపురం చేస్తోంది. మీలాంటివాళ్లు చెప్పే స్త్రీలు, స్వేచ్ఛ అనే కబుర్లు విని మోసపోయాను. ఆడవాళ్ల మనసు మీకేం తెలుసు?" ఇలా దడదడ లాడించేది.

దాంతో తేజ నిజంగానే తను తప్పుచేస్తున్నాననుకోసాగాడు. చిన్నప్పటినుంచీ భార్యాభర్తల సంబంధం గురించి అతను ఎంతో వున్నతంగా వూహించుకుంటూ వచ్చాడు. తన తండ్రిలాగో పినతండ్రిలాగో స్త్రీలను అవమానపరచగూడదని ఎన్నో అనుకునేవాడు. "చివరకు ఒక మామూలు మగవాడు భార్యకు ఇచ్చేంత సుఖం కూడా ఇవ్వలేకపోతున్నాను" అని మథనపడేవాడు.

"మాటలకేమి ఎన్నయినా చెప్పవచ్చు ఆచరించాల్సి వచ్చినపుడు కదా అయ్యగారి సంగతి తెలిసేది" అనేది స్రవంతి అతను కాస్త మెత్తపడుతున్నాడని అర్థం కాగానే. అతను ఇంకా నీరుకారి పోయేవాడు.

స్రవంతి నిరాధారంగా తన మీద నేరారోపణ చేస్తోందని అతను మర్చిపోయాడు. తనని భర్తల ప్రతినిధిగానూ, ఆవిడను భార్యల ప్రతినిధిగానూ వూహించుకొని స్రవంతికి సంతోషం కలిగించాలని, తన సంస్థ పనులు పక్కనపెట్టి మరీ ప్రయత్నించసాగాడు. సాధ్యమయినంత ఎక్కువసేపు స్రవంతితో గడపటం ఆరంభించాడు.

ఎప్పుడైతే స్రవంతికిది అర్థమయ్యిందో ఆమెలో విజయగర్వం మొలకెత్తింది., ధర్మతేజ వీక్నెస్ ఆమెకు తెలిసిపోయింది. "నువ్వు మగాడివి కనక అహంకారంతో ఇలా చేస్తున్నావు. నేను ఆడదాన్ని కనక అనుభవించక చస్తానా? తరతరాల ఆడవాళ్లగోడు ఇది" అని అంటే చాలు, తేజ తన వాదనలన్నీ కట్టిపెట్టి స్రవంతి చెప్పినట్టు చేసేవాడు. అలా అతను క్రమంగా ఆమెకు కావలసినట్లుగా మారిపోసాగాడు. కానీ అతని మనసు లోతుల్లో ఏదో అసంతృప్తి మండసాగింది. తను స్రవంతిని సంతోషపెట్టటం కోసం ఉద్యమాలను ఒదులుకోవటం సరైన పని అనిపించటంలేదు. కానీ ఆమెను సంతోషపెట్టకుండానూ వుండలేకపోతున్నాడు. ఈ రెంటినీ ఎలా సమన్వయపరచాలో అతనికి అర్థం గాకుండాపోయింది.



"ఎక్కడికెళ్లావు సమతా! మూడు రోజులయ్యింది నువ్వు ఇంటికి వచ్చి కాస్త చెప్పిపోవచ్చుగదా. నేనెంత కంగారుపడ్డానో తెలుసా" ఆతృతగా అడిగింది ఝాన్సీ. "రాకేష్ కూడా ఇటు రాలేదు. స్రవంతికోసం వెళితే తనూ కనిపించలేదు"

"వెళ్లేది తెలిస్తే చెప్పనా ఏమిటి? అత్తగారింటికి వెళ్లివచ్చాను" అన్నది చిరునవ్వుతో సమత.

"అత్తగారిల్లేమిటే?" తెల్లబోయింది ఝాన్సీ

"సెక్రెటేరియట్ దగ్గర ధర్నా చేస్తుంటే పోలీసులు అరెస్టు చేశారు పర్మిషను తీసుకోలేదని. 'కడుపుమండి మేము ధర్నా చేస్తుంటే ఆ విషయం ఏమిటో తెలుసుకునే

దిపోయి తీరికగా వచ్చి పర్మిషను లేదంటూ రేమిట్రా మీ మొఖం' అని కాస్త దులిపేశాను. అందుకే అందర్నీ ఆ పూటే ఒదిలేసినా మనకు కాస్త స్పెషల్ మర్యాద చేశారులే" అన్నది నవ్వుతూ సమత.

"ఆ నవ్వులేమిటే నాకు గుండెలు పీచుపీచుమంటుంటే. అనుకుంటూనే వున్నాను... ఇట్లాంటిదేదో కొంపమీదకు వస్తుందని. నీకీమధ్య ఈ తిరుగుళ్లు మరీ ఎక్కువయ్యాయి" సన్నగా చివాట్లు వేయసాగింది ఝాన్సీ.

"ఇది మరీ బాగుందమ్మోయ్! చదువుకునే ఆడపిల్లలం. వీధిలో నిలబడి అరిస్తే తప్ప ఏ పనీ జరగడంలేదు. ఎందుకనా అని ఆలోచించడం పోయి, అడిగేవాళ్ల భరతం పడుతున్నావే. ఎందుకమ్మా సర్కారంటే అంత ప్రేమ" నవ్వులతో విషయాన్ని ఎగరగొట్టాలని అంది.

"నాకెవరిమీదా ప్రేమ లేదులేగానీ పరీక్షలు వాకిట్లోకి వచ్చాయి. కాస్త ఈ కార్యక్రమాలు పక్కనపెట్టి చదువు మొదలెట్టు.ఏదో మామూలుగా పాసుకావటం కాదు. ఈసారి యూనివర్సిటీ ఫస్టు రావాలని చెప్పాను నువ్వీ కోర్సులో చేరేముందే. గుర్తుందా? " అడిగింది ఝాన్సీ.

"ఫస్టు రావాలని నేనెప్పుడూ చదవనక్కా. చెప్పేది వినటం, పరీక్షల్లో తెలిసింది రాయటం అంతే" అంది సమత.

"అదే కాస్త ఎక్కువ తెలుసుకోమంటున్నాను"

అక్కాచెల్లీ ఇలా మాట్లాడుకుంటూ వుండగానే రాకేష్ వచ్చాడు.

"ఏమిటండోయ్! పరీక్షలు, ఫస్టు రావటం అంటున్నారు" అంటూ

"చూడండి రాకేష్. పరీక్షలు దగ్గరపడుతున్నాయిగదా! కాస్త ఆ పుస్తకాల సంగతి కూడా చూడమని చెప్పండి. నాలుగు రోజులు మీ కార్యక్రమాలు ఆపితే లోకం మునిగిపోదులెండి" అంది ఝాన్సీ.

"ఆయన రికమెండేషనా మధ్యలో నీకు" అని అక్కను తెచ్చిపెట్టుకున్న చిరుకోపంతో చూసి ఉపన్యాస ధోరణిలో మాట్లాడసాగింది సమత గొంతుమార్చి

"అసలు యూనివర్సిటీల్లో చదువుకునే వాతావరణం వుందా? చదువుకొనే పరిస్థితే వుండదక్కడ. ప్రొఫెసర్ల బంధుప్రీతి, కుల పిచ్చి, రిజిష్ట్రార్ల కుంభకోణాలు, మార్కుల అవకతవకలు, రోజురోజుకీ అన్యాయాలు పెచ్చుమీరిపోతున్నాయి. విద్యార్థులు వీటన్నింటికీ కళ్లు మూసుకొని ఎలా చదువుకోవటం? "

మళ్ళీ తన గొంతుతో అమాయకంగా అక్కవైపు తిరిగి, "అవునూ ఎలా చదూకోవటం? " అంది.

"అలా అడిగితే ఝాన్సీగారేం చెబుతారు సమతా! అన్నింటినీ పట్టించుకోవలసిందే. పరీక్షలనీ ఓ పట్టు పట్టాల్సిందే" అన్నాడు రాజీ ధోరణిలో రాకేష్.

"అలా చెప్పండి మీరయినా. ఈ నెలన్నర అయినా అది గట్టిగా కూర్చుంటే చాలు. ఆ స్కూలు పనికూడా మానేయమని చెప్పండి" అంది ఝాన్సీ.

"ఆర్డర్లన్నీ అమలుపరుస్తాను మేడం" తల వొంచింది సమత.

★ ★ ★

పరీక్షలు రానూ వచ్చాయి. పోనూ పోయాయి. ఫలితాలు కూడా తెలిశాయి. ఆ సంవత్సరం రిజల్ట్సులో ముగ్గురమ్మాయిలు యూనివర్శిటీ రాంక్సు సాధించారు. ఎం.ఎ. తెలుగులో రెండోస్థానం, యం.యస్.సి. బోటనీ, కెమిస్ట్రీలలో ప్రథమస్థానం అమ్మాయిలకే వచ్చింది. ఎం.యస్.సి. కెమిస్ట్రీలో ఫస్టు వచ్చింది సమత.

'విశ్వవిద్యాలయంలో మహిళాతరంగం' అంటూ ఒక దినపత్రికలో ముగ్గురి ఫొటోలు, ఇంటర్వ్యూలు వేశారు. 'పాఠాలు చెబుతూ, పాఠాలు నేర్చుకుని ఫస్టు వచ్చిన యువతి' అని రాసిందా పేపరు సమత



ఫొటో కింద.

"మీ విజయం వెనక రహస్యం ఏమిటి?" అంటే... ఒకమ్మాయి రోజుకు ఎనిమిదిగంటలు చదువుతాననీ, మరో అమ్మాయి చదువంటే ఫాసినేషన్ అనీ చెప్పింది.

"కాలేజీలో చెప్పేది వినటం, లెక్చరర్లు చెప్పిన రిఫరెన్సుల నొకసారి చూడటం తప్ప, పరీక్షలకోసం నేను ప్రత్యేకంగా ఏమీ తయారుకానండీ" అంది సమత.

"అదేమిటండీ అలా అంటారు. మీ పద్ధతులు చెబితే మిగతా విద్యార్థులకు ప్రోత్సాహంగా వుంటుందికదండీ" అన్నాడా విలేఖరి.

"నేను నిజమే చెబుతున్నానండీ. గంటలు గంటలు కూర్చుని రుబ్బటం నాకు తెలీదండీ. క్లాసులో చెబుతున్న విషయాలను తార్కికంగా అర్థం చేసుకోవటం. అనేక సూత్రాలమధ్య వున్న సంబంధాన్ని గతితార్కికంగా అన్వయించుకోవటం అదే నా పద్ధతి.

"నిజం చెప్పాలంటే ఈ కెమిస్ట్రీ పరీక్ష ముందురోజు రాత్రి అంతా నన్ను అడిక్‌మేట్ పోలీసుస్టేషనులో వుంచారు. మా హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంటుకావిషయం తెలిసి స్వయంగా వచ్చి జామీనుమీద విడిపించారు. ఆయనకు నా కృతజ్ఞతలు. లేకపోతే నేనీ పరీక్ష రాయగలిగేదానినే కాదు" అంది సమత.

విలేఖరి అదిరిపోయాడు.

"మీలాంటి స్టూడెంటును లాకప్పులో వుంచారా? ఎందుకండీ" అంటూ ఆ వివరాలు సేకరించసాగాడు.

"అనుమానమండీ! మా పరీక్షలు జరుగుతున్నప్పుడే ఎవరో కొందరు వి.సి. ఇంట్లో బాంబు పేలుస్తామని బెదిరిస్తూ ఉత్తరం రాశారని గొడవ అయ్యింది మీకు తెలుసు కదా. మేం డిగ్రీ పరీక్షల్లో జరిగిన అన్యాయాలు, అందులో రిజిస్ట్రారు పాత్ర గురించి కరపత్రాలు పంచి ఎంక్వయిరీకి డిమాండ్ చేశాం, అభ్యుదయ విద్యార్థి సంస్థ తరఫున. ఇదంతా యూనివర్శిటీ అధికారులకు ఇబ్బందిగా వుంది. అందుకని ఈ బాంబు ఉత్తరం ఆధారంగా మాలాంటి వాళ్ళను ఏరిపారెయ్యాలని చూశారు" చెప్పింది సమత.

"విద్యార్థుల ఆందోళనలు చదువూ సంధ్యా లేకుండా జులాయిగా తిరిగే అల్లరి చిల్లరి స్టూడెంట్లు నడిపేవి అని అందరూ అనుకుంటారు. కానీ ఇలాంటి తెలివయిన విద్యార్థులూ, ఉన్నతశ్రేణి మేధావులు కూడా ఉద్యమాల బాటలో నడవవలసి వస్తోందంటే మన విద్యారంగం ఎంత భ్రష్టుపట్టిందో తెలుస్తుంది" అంటూ రాసిందా పేపరు.

★ ★ ★

ఝాన్సీకి సమతను చూస్తే చాలా గర్వంగా వుంది. తనకేదో మహామంత్రి పదవి దొరికినట్లు సంబరపడిపోయింది. రెండు కిలోలు స్వీట్సు తెచ్చి రాయుడుగారింట్లో వున్న వాళ్ళందరికీ పంచింది.

రాయుడుగారికి సంతోషం వేసింది. "ఇది అచ్చి వచ్చే ఇల్లు. ఇన్లవుండి పరీక్ష రాసినోళ్లు మంచిగ పాసవుతరు" అని చంద్రావతి చెప్పుకోవటం మొదలెట్టింది.

"మిమ్మల్ని చూస్తే చాలా సంతోషంగా వుందండీ. సాయంత్రాలు స్కూలులో పాఠాలు చెప్పి మరీ చదువుకున్నారు. మా చెల్లెలికి నెలకి నూటయాభై పంపిస్తున్నాను. బి.యస్.సి. ఫెయిలైకూర్చుంది. ఇటు డిగ్రీ రాక, అటు పెళ్ళికాక గుండెలమీద కుంపటై కూర్చుంది. ఏదో చదువుకుని, ఉద్యోగం చేస్తుంటే తన పెళ్లి తనే చేసుకుంటుందని ఆశపడ్డాను ఇన్నాళ్ళూ. దేనికయినా అదృష్టం వుండాలండీ" అన్నాడు కండక్టరు కమలాకరరావు.

సరోజిని, సుభద్ర సమత విజయం ఆడవాళ్ళందరికీ ఏదో గొప్ప జరిగినట్లుగా




భావించారు.

స్రవంతి మలక్‌పేటలో పెట్టిన ఒక కొత్త కాలేజీలో పదివేలు డొనేషను ఇచ్చి జూనియర్ లెక్చరరుగా చేరే ప్రయత్నం చేస్తున్నట్లు చెప్పింది. "పెళ్లికి పైసా ఖర్చు పెట్టలేదుగా మావాళ్లు. ఈ ఉద్యోగం సంగతి చూడమని ఆర్డరు వేసేశాను. ఒక సంవత్సరం ఖాళీగా వున్నాననుకుంటే సరి. సిటీలో సెటిల్ అయిపోవచ్చు కాలేజీ దగ్గరలోనే ఇల్లు కూడా వెతుకుతున్నాం. ఈ వారంనుంచి తేజకు అదేపని" అంది.

ఝాన్సీ చెల్లిని రీసెర్చి స్కాలరుగా చేరమని సలహా ఇచ్చింది.

"నువ్వేమంటావు రాకేష్. ప్రస్తుతం డబ్బుకయితే ఇబ్బంది లేదు. ఏదో సర్దుకుపోవచ్చు నాకూ పి.హెచ్.డి. చేద్దామనిపిస్తోంది. మరోవంక ఉద్యమాలు తీవ్రమవుతున్నాయి. నేనిలా చదువులో కూరుకుపోవటం న్యాయమా? రెండూ నిర్వహించాలంటే అది ఒకేసారి రెండు పడవలమీద ప్రయాణం చేయాలని కోరుకోవటం కాదంటావా? " అడిగింది సమత.

అతనో రెండు నిమిషాలు ఆగి, "ఏకతార మీటుతూ బైరాగి వచ్చేవాడు చిన్నప్పుడు. ఆ సంగీతం వినటానికి తినే అన్నం వదిలి పరిగెత్తేవాణ్ణి. ఎన్నో తీగల సితార్‌ని రవిశంకర్ వాయిస్తుంటే వినటానికి చెవులు కోసుకుంటాను. తీగవొకటా, ఎక్కువా అనేది ప్రసక్తి కాదు. సమర్థుడు ఏదైనా పలికిస్తాడు. సంగీతం పుట్టిస్తాడు. జీవితమూ అంతే" అన్నాడు. మళ్ళా కొంచెం ఆగి, "రెండు పడవలమీద కాళ్ళు పెట్టడం అని ఎందుకనుకోవాలి! జీవితపు రైలుబండిని నడిపే రెండు పట్టాలనుకోవచ్చుగదా ఈ రెండింటినీ" అన్నాడు.

"అవి సమాంతరరేఖలు. ఈ ఉద్యమాలు, చదువులు విభిన్న ధృవాలకు లాగుతాయేమో" అంది సమత.

"ఇది ఎవరికి వారు తేల్చుకోవలసింది సమతా. పదేళ్ళు యూనివర్సిటీలో కాపురం పెట్టిన నన్ను చదువుకోనా, వద్దా అని అడుగుతారా ఎవరైనా" అన్నాడు రాకేష్ సమాధానంగా.

"అలా కాదు రాకేష్. బి.యస్.సి. అయిపోయాక టైమంతా ఉద్యమాలకే ఉపయోగిద్దాం. చదువు అనవసరం అనిపించింది. ఎటూ తేల్చుకోకముందే ఇక్కడకు వచ్చి చదువు మొదలెట్టాను. ఈ రెండు సంవత్సరాల అనుభవంలో రెండింటినీ సర్దుకుపోవచ్చని అర్థమయ్యింది.

కానీ ఇలా ఎంతకాలం సాగుతుందని? " అనుమానంగా అడిగింది. రాకేష్ కూడా సీరియస్‌గా మారిపోయాడు. "ఎంతకాలం అనేది మనం చెప్పలేం సమతా. ఉద్యమాల అభివృద్ధిని బట్టి, ప్రభుత్వ రిప్రెషన్‌ను బట్టి వుంటుంది. నా సంగతే తీసుకో. విద్యార్థి ఉద్యమ అవసరం దృష్ట్యానే నేను ఇన్నాళ్ళూ యూనివర్సిటీలో వున్నాను. ఈ రోజున మనకు మంచి కార్యకర్తలున్నారు. విద్యార్థి ఉద్యమం బలపడింది. ఈలోగా మన కార్యక్రమాలు ఇతర రంగాలకు విస్తరిస్తున్నాయి. అందుకని నేను షిఫ్టు అయ్యాను. ఇవాళ మన ఉద్యమాలు వున్నస్థాయిని బట్టి చూస్తే చదువుకుంటూ పనిచేయటం తప్పని నేననుకోవటం లేదు" అన్నాడు.

సమత మళ్ళీ యూనివర్సిటీలో చేరింది.

★ ★ ★

రాత్రి పదకొండు గంటలవేళ. అక్కడో రిక్షా, ఇక్కడో స్కూటరు తప్ప రోడ్డు నిర్మానుష్యంగా వుంది. చల్లగా కదిలే గాలికెరటాల్లా కదిలిపోతున్నారు రాకేష్, సమత. చిక్కడపల్లి చౌరస్తాలో మహిళా సంస్థ వాళ్ళు ఒక నాటకం ప్రదర్శించారు.

అధిక ధరలతో నలిగిపోతున్న జీవితాలను చిత్రించే నాటకం అది. ఈరోజు ఆరో ప్రదర్శన వాళ్ళకి. ప్రతి ప్రదర్శనలోనూ ఏవో మార్పులు చేస్తూనే వున్నారు. వరకట్నం రేట్లను ఈ నిత్యావ



సర వస్తువుల ధరలతో పోల్చమని సలహా ఇచ్చాడు రాకేష్. ఈరోజే మరో సన్నివేశం జోడించారు. "అన్నింటికంటే అధికంగా పెరిగిపోతున్నాయి పెళ్ళి కొడుకుల రేట్లు" అంటూ రోదిస్తుందో తల్లి.

"జీవితానికి పప్పు, ఉప్పు, బియ్యం, నూనె ఎంత అవసరమో, పెళ్ళి కూడా అంతే అవసరంకదా. అవసరం కనకే అందుబాటులో లేకుండా పోతున్నాయి"

"అయితే మగవాడికి పెళ్లి అవసరం కాదా? వాడు ఆడవాళ్లను కొనుక్కోవటం లేదుగదా!"

"ఆడపిల్లల నెత్తిన డబ్బుల మూటలు పెడుతున్నా అమ్ముడుపోవటం లేదేమిటి? ఎదురు డబ్బులిచ్చి వదిలించుకోవలసిన కుళ్లుజాతా ఆడదంటే" ఇలా మాట్లాడతాయి నాటకంలో పాత్రలు. ప్రజలనుంచి మంచి రెస్పాన్సు వచ్చింది ఈ సన్నివేశానికి.

ప్రదర్శన గురించీ, పెళ్ళి గురించీ మాట్లాడుకుంటూ నడుస్తున్నారు సమతా, రాకేష్.

"కొంతకాలంనుంచీ నాలో నీ గురించి ఏదో భావం బలపడుతోంది సమతా! అయితే అదొక సమస్యగా మారుతుందేమోనని కొంచెం దిగులు కూడా" అన్నాడు రాకేష్.

"ఏమిటాభావం? " అడిగింది సమత, ఓరగా తలెత్తి రాకేష్ కళ్లల్లోకి చూస్తూ. అతని కంఠంలో పలికిన ఏదో విచిత్రభావాన్ని ఆమె గుర్తించింది.

"మనం కలిసి తిరుగుతున్నంతసేపూ ఏదో సుఖంగా వుంటుంది. నిన్ను వదిలి రూమ్‌కు వెళ్ళగానే ఏదో అర్థంకాని చిరాకు కలుగుతుంది నామీద నాకే! ఆ గొడవ పడలేకనే పనిలేకున్నా పనికల్పించుకుని మరీ నీ దగ్గరకు వస్తున్నా నీమధ్య. ఎంత దగ్గరగా వున్నా ఇంకా దగ్గరకు రావాలనిపిస్తోంది. నాకు నువ్వు కావాలి సమతా"

నడుస్తున్నవాళ్ళు ఎప్పుడు ఆగిపోయారో ఇద్దరూ గమనించలేదు. సమత చేయి పట్టుకొని చిన్నగా నొక్కుతూ, "నాకు నువ్వు కావాలి సమతా" మళ్ళీ అన్నాడతను.

"ఇలాంటి భావాలు నీలోనూ సుళ్లు తిరుగుతున్నాయనిపిస్తుంది, నీ కళ్లు చూస్తుంటే. ఏమో... నిజమో... నా వూహాలో..." తన లోతాను మాట్లాడుకుంటున్నట్లు.

అతని ఆలోచనలు, స్పష్టంగా రూపుదాల్చకపోతే అలా మాట్లాడతాడని సమతకు తెలుసు.

ఇలాంటి ప్రస్తావన ఏదో తమ మధ్య రాకుండా ఎంతోకాలం సాగదని ఆమెకూ అనిపిస్తోంది ఈమధ్యనే.

"అవును రాకేష్. మన సంస్థల్లో ఎంత మందితోనో పరిచయాలు ఏర్పడ్డాయి. ఎవరెవరితోనో ఎక్కడెక్కడో తిరుగుతున్నాను. కానీ నీ దగ్గర ఉన్నప్పుడు మాత్రం 'ఇదీ' అని చెప్పలేని ఏదో భావం నన్ను ఆవరిస్తోంది. ఇంకా నీతో వుండాలనిపిస్తోంది" తన గుండెలోతుల స్పందనల్ని అతనికి వినిపించింది సమత.

"దీన్నే ప్రేమంటారేమో" అన్నాడు రాకేష్.

"ప్రేమో, భ్రమో! పేర్లెందుకు. మనసుల్లో ఏదో సంచలనం. మనుషుల్ని దగ్గరగా లాగే పాశం" అంది సమత.

"ఇద్దరం ఒకరికొకరు ఇంకా చేరువకావాలని భావిస్తున్నాం. మనిద్దరం ఎందుకు కలిసి జీవించకూడదు? " ఆనందంగా అడిగాడు రాకేష్.

"పెళ్ళంటావా" చిర్నవ్వుగా అడిగింది సమత.

"పేరు ఏదయినాసరే. మనం బతుకుల్ని ముడివేసుకుందాం. ఒకటిగా బతుకుదాం" రాకేష్ కంఠంలో పున్నమి పూస్తోంది.

ఇద్దరూ మళ్ళీ నడుస్తున్నారు.

"మన కార్యక్రమాలకూ, కుటుంబ జీవితానికీ కుదురుతుందంటావా? " మెరుపు మెరిసినట్లు వాస్తవ స్పృహతో సమత ప్రశ్నించింది.

"ఎందుకు కుదరదు సమతా! ఇంకా నిండుదనం వస్తుంది నిజానికి. మనిద్దరి లోనూ వున్న ఆశయాల్ని సాధించటానికి నాకు నీవు ప్రేరణ. నీకు నేను చేయూత అవుదాం" ఏవో భావిజీవితం కలలు కదులుతున్నాయి అతని మనసులో.

"నేను పెళ్ళి చేసుకోకుండా వుండిపోవాలని అనుకోలేదుగానీ, చుట్టూ వున్న కాపురాలు చూస్తుంటే మాత్రం పెళ్ళి అనేది ఒక అడ్డంకిగానే అనిపిస్తోంది. డా. జానకిగారిలాగ ఒంటరిగా వున్నవాళ్ళే తమ ఆశయాలు సాధించుకోగలరేమో!"

"మనలాగ ఇద్దరికీ ఒకే ఆశయాలు వుంటే ఇబ్బంది ఏముంటుంది సమతా! ఏవైనా వొచ్చినా, మనమధ్య వుండే అవగాహన, ఆలోచనలతో ఆ ఇబ్బందులను తొలగించుకోలేమంటావా? " మరోక్షణం ఆగి రాకేష్ మళ్ళీ అన్నాడు. "నీవు అనేదే నిజం అని ఒప్పుకుంటే కాస్త భిన్నంగా ఆలోచించే ఎవరూ పెళ్లి చేసుకోకూడదని అనాల్సివస్తుంది. అలా వుండిపోవటం సహజమూ కాదు. స్వాభావికమూ కాదు"

"అంటే జానకిగారిలాగ, మా అక్కలాగ వుండిపోవడం సహజమైనది కాదంటావా? పెళ్లి లేకున్నా వాళ్ళు ఆనందంగానే వున్నారుగదా"

"కొంతమంది కోరుకుని తమ స్వభావాల కనుగుణంగా ఒంటరిజీవితం గడపటం తప్పని నా ఉద్దేశం కాదు సమతా. కానీ సమాజ జీవితానికది సహజం కాదని మాత్రం అంటాను. వాళ్ళు ఆనందంగా లేరని నేననను. కానీ సృష్టిలో ఏ జీవికయినా 'పుట్టటం, పెరగడం, సంతానోత్పత్తి చేయటం, నశించటం' అనేది సహజ జీవిత చక్రం" అన్నాడు రాకేష్.

"నాకు మొదట్నుంచీ నా బతుకుమీద అంత పట్టింపు లేదు రాకేష్. సహజజీవితం అంతా అనుభవించాలనీ లేదు. పెద్ద పెద్ద మాటలెందుకుగానీ, నా చుట్టూ వున్న చీకటిని తొలగించటంలో నేనో అగ్గిపుల్లనై మండిపోయినా నాకిష్టమే. అలాగని నాకు ఈ మమతలన్నా, బతుకన్నా తీపిలేదని కాదు"

మధ్యలోనే అందుకున్నాడు రాకేష్, "మనం బతుకును ప్రేమిస్తాం. జీవితాన్ని ఉదాత్తంగా ఎంచి ప్రేమిస్తాం. సంఘజీవితం అంతా ఉత్తమంగా వుండాలని భావిస్తాం. సంపాదించటం, తినటం, తిరగడం కాక జీవితంలో వున్న రసానందం అంతా అందరికీ అందాలని ఆరాటపడతాం. మొత్తం సమాజానికి, సమగ్రమైన జీవితాన్ని కోరుకుంటాం కనకనే దాన్ని సాధించటానికి మన వ్యక్తిగత జీవితం ఆహుతి చేయటానికి సిద్ధపడతాం. బతుకంటే మృతి కంటే ఎంతో విలువైన అమృతం. ఆ అమృతాన్ని అందించటానికి అవసరమైతే మృతినీ లెక్కచేయం మనం" అతను చాలా ఆవేశంగా అన్నాడు.

ఆ కంఠంలో పలుకుతున్న విశ్వప్రేమ గాన రవళికి విస్తుపోయింది సమత. అతన్ని గురించి అంతా తెలుసనుకుంటున్నా తెలుసుకోవలసిన మనసు మూలలు మిగిలే వుంటున్నాయి సమతకి.

అతనే తేరుకుంటూ మళ్ళీ అన్నాడు, "పెళ్లి అనేది అడ్డంకి కాదు సమతా. స్త్రీని కాపురానికి కట్టేయడంవల్ల నీకలా అనిపిస్తోంది. కానీ మనం చైతన్యంతో, సంస్కారంతో మన మధ్య స్నేహాన్ని సరిఅయిన ఆలుమగల సంబంధంగా మలుచుకోగలుగుతాం. భర్త నైనంతమాత్రాన నేను నీ అభివృద్ధికి ఆటంకంగా మారిపోతానా? " కొంచెం దిగులుగా, అవమానంగా ఫీలవుతూ అన్నాడు రాకేష్.

ఇద్దరూ మళ్ళీ ఆగిపోయి నిలబడి ఆలోచనల్లో మునిగిపోయారు. "రిక్షా కావాలా సార్" గంట మోగిస్తూ అడుగుతుంటే ఈ లోకంలోకి వచ్చారు. "వద్దు భాయ్" అంటూ రాకేష్ నడవసాగాడు. సమత



అనుసరించింది. వాళ్ళ మధ్య మౌనంలో ఏవో భావాలు అలల్లా లేచి పడుతున్నాయి ఇద్దరిలో.

"నన్నింకాస్త ఆలోచించుకోనీ రాకేష్... వస్తా" అంటూ తమ ఇంటివైపు మలుపు తిరిగింది సమత.

"వుంటా" అంటూ సమత చేయి మెల్లగా నిమిరి వదిలివేశాడు రాకేష్.

ఆమెలోని ఏదో జీవశక్తి అతని అంతరంగలోకాలను వేయిదీపాలతో వెలిగించింది. ఆ వెలుగులనే ప్రణయదీపికలుగా ఎత్తిపట్టి, ఆ లోకానికి రాణివి కమ్మని ఆహ్వానించాడ తను సమతను. పిల్ల తెమ్మెరై పలకరించిన ప్రియబాంధవి వడగాడ్పై విసిరికొడుతుందా! సమత కనుమరుగయినా ఆ మలుపులోనే నిలబడ్డాడు రాకేష్.

★ ★ ★

సమత ఇంటికి చేరాక ఆలోచించడం మొదలు పెట్టింది.

ఎంత సూటిగా అడిగేశాడు రాకేష్. "నాకు నువ్వు కావాలి సమతా" అతని మాటలు ఆమెకు పదేపదే వినిపిస్తున్నాయి.

మెదడు, మనసు కలిపి ఆలోచించాలి. ఏవో శంకలూ, అనుమానాలు. తనకు తెలిసిన ఎందరో 'భర్త'లు ప్రేమించి చేసుకున్నామనే ఎన్నో జంటలు కళ్ళముందు తిరుగుతున్నాయి. అంతలోనే అమాయకంగా నవ్వే రాకేష్. సంశయాలు తీర్చే రాకేష్. ఆశయాలు వృద్ధిపించే రాకేష్. నాకు నువ్వు కావాలంటున్న రాకేష్. కళ్ళల్లో కాపురం పెట్టినట్లు అనేక రూపాలతో కనిపిస్తున్నాడు రాకేష్.

"మీ గురించి నాకు కొంచెం తెలుసు" అంటూ అతను వొచ్చి పరిచయం చేసుకున్న నాటినుంచి, నేటివరకూ జరిగినవి ఎన్నో తలపుకు వచ్చాయి.

అతని ఊహలతో ఆమె చిన్ని గుండె వుల్లాసంతో వూగులాడింది. తన పరిధులు అతిక్రమించి ఏవో లోకాలకు పరుగుతీసింది. మేమిద్దరం ఒక్కటి అనే భావం కలిగి అనుకంపంతో, అనిర్వచనీయమైన ఆనందాన్ని పల్లవించింది.

అరక్షణమో, అర్ధజీవితమో, అతని భావంలో భాగంగా, జీవంలో జవంగా, అనుభవంలో అనుభూతిగా కలిసిపోకపోతే 'ఈ జీవితం అర్ధరహితం' అనిపించింది ఆమెకా క్షణంలో. కావాలని కదిలివచ్చే కావేరిని కలుపుకునే కడలిలా ఆమె మనస్సు పరవళ్ళు తొక్కింది.

అప్పటికప్పుడే అక్కను లేపి రాకేష్ విషయం చెప్పి ఆమె అభిప్రాయాన్ని అడిగింది. విషయం విన్న ఝాన్సీ కూడా సమత మనోభావాల్ని, వాటితో కలిసిపోయే రాకేష్ ఆలోచనల్ని బేరీజు వేసి రాకేష్‌తో సమత పెళ్లికి గ్రీన్‌సిగ్నల్ ఇచ్చింది.

★ ★ ★

సమత, రాకేష్ వొక్కటౌదామనుకున్నాక ముందు రాకేష్ వాళ్ళ వూరికి వెళ్ళాడు. ఇంట్లో చెప్పాడు. వాళ్ళమ్మ ఇంతెత్తున ఎగిరిపడింది.

"కులంగాని పిల్లను తెచ్చి కోడలంటావా? " అంది. "పూటకు గతిలేని వాళ్ళతో నాకు వియ్యమా" అని ఏడ్చింది.

"నీకు కోడలు అంటే ఎట్లా వుండాలని వుంటుందో నాకు తెలుసు. బంగారం దిగేసుకునే ఆ గంగిరెద్దుల్ని నేను ఈ జన్మకు చేసుకోను అని వందసార్లు చెప్పాను. ఈ అమ్మాయి నాకు నచ్చింది. ఆవిడే నా భార్య. మీ పరువు పోకుండా మీకు చెప్పటానికి వచ్చాను కానీ మీ అనుమతికోసం కాదని తెలుసుకో" అన్నాడు రాకేష్. అతని తండ్రి రఘునాధరెడ్డిగారు సమత వివరాలన్నీ తెలుసుకున్నాడు "ఇన్నాళ్ళకి వీడసలు పెళ్ళంటూ చేసుకుంటానని వచ్చాడు. చిన్నవాడా ఏమన్నానా, చెంపలు నెరుస్తున్నాయి. ఏదో మన పెద్దరికం నిలబెట్టుకుందాం. ఆ పూటకు వెళ్ళి అక్షింతలు జల్లి




వస్తే సరి. నువ్వు గొడవ చేసినా వాడు మానడు. ఈ మాత్రానికి మనం చెడ్డ కావటం ఎందుకు. ఆ పిల్ల కూడా చాలా తెలివయిన దానిలా వుంది. ఈ పెళ్ళితోన యినా వీడు లోకంలో పడతాడు" అని భార్యకు నచ్చచెప్పాడు.

"పై శనివారం రాత్రికి హైద్రాబాద్ రండి మీరిద్దరూ! పెళ్ళి అని పదిమందినీ పిలిచే దేమీ లేదు" అని చెప్పివచ్చాడు రాకేష్.

ఆ తర్వాత ఒకరోజు సమత రాకేష్‌ని తమ వూరు తీసుకెళ్ళింది. ఈ సంఘాలలో తిరుగుతూ వుంటుంది కదా, ఎవరో స్నేహి తుడు అయ్యుంటాడనుకొంది వరలక్ష్మమ్మ గారు.

"ఈయన పేరు రాకేష్. వృత్తికి లాయరు. హైద్రాబాద్ వెళ్ళిన మొదటివా రంనుంచి నాకు పరిచయం" అని పరి చయం చేసింది సమత.

రామారావుగారు ఏదో పెద్దమనిషి తర హాగా ఏమి చదివిందీ ఎక్కడ చదివిందీ, ఏవూరు, తల్లిదండ్రులేం చేస్తున్నారులాటి ప్రశ్నలు అడిగారు.

"అమ్మా, నాన్నా హైద్రాబాద్ దగ్గర్లోనే వుంటారండీ. ద్రాక్షతోటలు వేశారు. పదెక రాలు వరి పొలం కూడా వుంది. నాకా పొలం తూర్పు పడమరలు తెలీవు" అని చెప్పాడు రాకేష్.

కాసేపు ఇద్దరూ లోకాభిరామాయణం చెప్పుకున్నారు. వరలక్ష్మమ్మగారికి ఇంత చదువుకున్న మనిషి కూడా పార్టీలు, సంఘాలు అని మాట్లాడుతుంటే చాలా ఆశ్చర్యం వేసింది. పని లేనివాళ్ళు, పనికిరా నివాళ్ళు అలా తిరుగుతారని ఆవిడకో వుద్దేశం. తన కూతురే అలా తిరుగుతున్నా ఏదో చిన్న పిల్ల అనుకునేది.

ఇప్పుడు ఆమె 'తనకు తెలీకుండా జీవి తాలు మారిపోతున్నాయి' అనుకుంది.

"ఈయన్ని గుర్తుపట్టలేదా అమ్మా. మన రూముకు చాలాసార్లు వచ్చారు కదే" అంది సమత.

"ఏమిటోనమ్మా. గుర్తే లేదు. పెద్దతనం వస్తోందా" అంటూ ఎంతో నొచ్చుకుంది వరలక్ష్మమ్మగారు.

"నేనూ, ఈయనా పెళ్ళి చేసుకోవాలను కుంటున్నాం నాన్నగారూ" అంది సమత కాసేపయ్యాక.

తల్లిదండ్రులిద్దరికీ కాసేపు ఆనందంతో నోటమాటరాలేదు. ఝాన్సీయే అలా కూర్చుందిగదా! ఉద్యమాలు, ఆందోళనలూ అంటూ సమత ఏ అడవులు పట్టుకుపో తుందో అని అనుకుంటున్నారు ఇంతకాలం.

"ఆదివారం పెళ్ళిరోజు" అంది సమత.

"మరీ అంత గడువు లేకుండా ఎట్లాగే! నాలుగు మావిడి మండలు కట్టటానికీ, గుమ్మాలకు పసుపు రాయటానికి కూడా టైము చాలదు కదే! కాస్త అనుకూలంగా మూహూర్తం చూడొద్దూ" అభ్యంతరంగా విసుక్కొంది తల్లి.

"ముహూర్తాలు, మంచిరోజులు కాదు. మిమ్మల్ని హైద్రాబాద్ తీసుకువెళ్దామనే వచ్చాను. అక్కడే పెళ్ళి" అంది సమత.

"ఇల్లూ వాకిలీ లేనట్టు అక్కడెందుకే! ఇక్కడైతే నలుగురూ తెలిసినవాళ్ళు. నలు గురు వచ్చినా, వెళ్ళినా అనుకూలంగా వుంటుంది గదా" అంది తల్లి.

"నా పెళ్ళి అంటే ఏమనుకుంటున్నా వమ్మా! పెద్దక్కయ్యకు చేసినట్టు పదివేలు ఖర్చుపెట్టి చేస్తే నేను చేసుకుంటానా? ఎవర్నీ పిలిచేదీ లేదు. పెట్టేదీ లేదు. ఆ పూటనుంచీ మేమిద్దరం ఒక ఇంట్లో వుంటాం. అంతే" అంది సమత.

"మరీ ఇంత చోద్యమేమిటే! కాస్త పెద్దల ఆశీర్వాదాలు, అక్షింతలు" ఇంకా ఏదో అన బోయింది తల్లి.

"రాకేష్ వాళ్ళ తల్లీదండ్రీ వస్తారు. మీరి ద్దరూ వుంటారు. ఎవరో నలుగురు ముఖ్య మైన ఫ్రెండ్సు వస్తారు. ఇక వూరంతా చాటింపులు, బాజాభజంత్రీలు. ఇవేవీ

మాకు నచ్చవు" అంది సమత.

ఇక వరలక్ష్మమ్మగారు ఏమనలేకపో యారు.

మరునాడు అంతా కలిసి హైద్రాబాద్ వెళ్ళారు. స్వరాజ్యానికి రమ్మని టెలిగ్రాం ఇచ్చారు. వాళ్ళ కుటుంబమంతా వచ్చారు.

"ఈ టెలీగ్రాం పిలుపులేమిటండీ! ఏ చావు కబురుకో ఇస్తారు. పెళ్ళికి టెలీగ్రాం ఏమిటీ" ఎగిరిపడ్డాడు అల్లుడు రాగానే.

వాళ్ళు దిగటమే ఏకాఏకిన హోటలులో దిగారు.

ఝాన్సీ వరలక్ష్మమ్మగారు మాట్లాడుకుని, పెద్దల్లుడికి, కూతురికి బట్టలు కొన్నారు. ఇన్నేళ్ళ తర్వాత వచ్చాడు అల్లుడు ఇవ్వక పోతే బావుండదనుకున్నారు.

అతను ఝాన్సీని కన్నెత్తి చూడలేదు. సుధాంశునితో రాజ్యం కొడుకు 'తమ్ముడు తమ్ముడు' అంటూ ఆడుకోబోతే "ఎవర్రా తమ్ముడు- ఇటురా" అంటూ పిల్లల్ని కూడా కలవనీయలేదు.

"అసలొచ్చాడు అదే పదివేలు" అనుకుంది వరలక్ష్మమ్మగారు. నాలుగు రోజులుండి, నగరమంతా తిరిగి చూసి వెళ్ళాడు అల్లుడు ఆ బిల్లులన్నీ మామగారి మొఖాన కొట్టి. అసలతను ఈ పెళ్ళివంకన హైద్రాబాద్ చూడటానికే వచ్చాడు.

"ఈ పెళ్ళిళ్ళేమిటి? ఈ పద్ధతులేమిటి? చెల్లెళ్ళు అని అనుకోపటానికి కూడా మొఖం చెల్లటంలేదు. మళ్ళీ చదివారు అంతంత చదువులు" అంటూ ఏదో సణుగుతూనే వుంది రాజ్యం వున్న నాలుగు రోజులు.

అసలు పెళ్ళి అనేదే జరగలేదు వాళ్ళ దృష్టిలో.

మట్టెలు మంగళసూత్రాలు లేకపోతే పోనీ, కనీసం రెండుదండలయినా మార్చు కోలేదాయే మరి.

ఆదివారం సాయంత్రం రాకేష్ కుటుం బమూ, సమతా వాళ్ళు కొత్తగా అద్దెకు తీసు కున్న ఇంటిదగ్గరకు వచ్చారు. తేజ, స్రవంతి, జానకి మేడం, ఇంకో నలుగురైదు గురు అమ్మాయిలు- రాకేష్ బాస్ రమణ మూర్తిగారు మరో నలుగురు ఫ్రెండ్సు వచ్చారు. కాసేపు కబుర్లు చెప్పుకున్నాక రాకేష్ అందరికీ 'గోల్డుస్పాట్' సీసాలు పంచాడు.

"పాత రోజుల్లో పెళ్ళికి సువర్ణదానాలు చేసేవారట. కరువు రోజులు కదా! మేము ఈ సువర్ణ బిందువులు మాత్రం పంచు తున్నాం" అంటూ జోక్ చేశాడు.

ఫ్రెండ్సంతా వెళ్ళిపోయాక ఇంట్లో వాళ్ళు మాత్రం మిగిలారు. భోజనాలుచేసి వీళ్ళూ వెళ్ళారు రాకేష్‌నీ, సమతనీ కొత్త ఇంటిలో వొదిలి. వాళ్ళిద్దరూ వొంటరిగా మిగిలిపో యారు.

వాళ్ళిద్దరూ వొంటరిగా కూర్చుని ఎన్ని సార్లో గంటలుగంటలు చర్చించేవారు. కానీ ఈ వొంటరితనం వేరు. వాళ్ళిద్దరూ జంటగా ఎన్ని చోట్లో తిరగారు. కానీ జంట తనానికి ఈరోజు అర్థంవేరు.

కోరికలకు ఏరువాకలై, ప్రణయపతాకలై రెపరెపలాడాయి వారి మనసులు. ఇద్దరిలో ఏవో చిరునగవులు, ఇద్దరం వొక్కటన్న భావనలు. మౌనరాగాలాపన, మాటల బంధాలు తప్పించుకొన్న సుతిమెత్తని భావాలు కళ్ళనుంచి గుండెల్లోకి దారులు తీస్తున్నాయి.

"నువ్వు అందవేమోనని దిగులుపడ్డాను" అన్నాడు రాకేష్ ఆమె జుట్టు నిమురుతూ గుసగుసగా.

"నిన్ను పొందాలని నేనూ ఆరాటపడ్డాను" అంది సమత అతని గుండెల్ని మీటుతూ ముసిముసిగా.

అంతే... ఆనాటినుంచీ వాళ్ళ వైవాహిక జీవితం ఆరంభమయ్యింది.

★ ★ ★

మరునాడు రాకేష్ తండ్రి రఘునాధరెడ్డి గారు వచ్చారు. రాకేష్ తల్లి రూమ్‌లోనే వుండిపోయింది.




"చూడమ్మాయ్! మాకు ఇష్టంవుందో లేదో ఇక అనవసరం. ఎంతెంత పెద్ద సంబంధాలు వొచ్చినా వాడు ససేమిరా మా మాటా వినలేదు. నిన్ను తీసుకొచ్చి నా భార్య అంటే కాదనడం లేదు మేము. ఇవ్వాళ పెళ్ళిచేసుకున్నాడు. ఇక లోకంలో పడతాడని ఆశ.

వాడు చిన్నప్పటినుంచీ ఇంతే. ఎవరి మాట లెక్కచేయడు. తనకు తోచిందే వేదం. పెడసరం మనిషి. నువ్వయినా కాస్త వాడిని దారిలోకి తీసుకురామ్మా, వున్నది వాడొక్కడు. మాకోసం కాకపోయినా నీకోసం అయినా వాడ్ని దారిలో పెట్టాలమ్మా! ఒక మనవడ్నో మనమరాలినో కని ఇచ్చావంటే మీ అత్తగారి కోపం గాలికి ఎగిరిపోతుంది" అంటూ సమతకు చెప్పాడాయన.

"ఇంటికొచ్చి నాలుగు రోజులుండిపోండిరా. మీ అమ్మ మాటలు నీకు కొత్తకాదు గదా" అన్నాడు రాకేష్‌తో.

"వీలుచూసుకుని ఎప్పుడో వస్తాములే" అన్నాడు రాకేష్.

ఆ సాయంత్రం మాష్టారు, వరలక్ష్మమ్మ గారు వచ్చారు. సమత లేకుండా చూసి వరలక్ష్మమ్మగారు కళ్ళ నీళ్ళు పెట్టుకుంది. "మీరిద్దరూ కావాలనుకొని చేసుకున్నారు. అసలు దానికి పెళ్ళవుతుందని నేను కలలో కూడా వూహించలేదు నాయనా! చిన్నప్పటి నుంచీ దానికి తండ్రిగారాబం. దానికి ఎంత తోస్తే అంతే, పట్టువిడుపు లేని పిల్ల, నువ్వే కాస్త సర్దుకుపోవాలి బాబూ! మాటా మంచీ నేర్పుకోవాలి బాబూ దానికి" అంది రాకేష్‌తో ఆవిడ.

"మన ఇంటికొచ్చి పదిరోజులుండి రండమ్మా" చెప్పారు మాష్టారు.

"వీలు చూసుకుని వస్తాములెండి" అన్నారిద్దరూ.

★ ★ ★

స్రవంతి లెక్చరరుగా జాయినయి సంవత్సరం దాటుతోంది. ఆమె పోరుపడలేక ధర్మతేజ తన రాష్ట్రకార్యదర్శి పదవిని వదిలేశాడు. రాష్ట్ర సదస్సుదాక బాధ్యతలు నిర్వహించాక సదస్సులో కొత్త కార్యదర్శిని ఎన్నుకొన్నారు.

ఒకరోజు రాకేష్ తేజను "ఎందుకు బాధ్యతలనుంచి తప్పుకుంటున్నావు" అని అడిగాడు.

తేజ మొహమాటపడుతూ ఏవో మాటలు మింగి, చివరకు అసలు విషయం చెప్పాడు. "స్రవంతి పెళ్ళి అయిన తర్వాత చాలా మారిపోయింది. తనసలు చాలా భయపడుతోందనిపిస్తోంది. అందులోనూ ఇప్పుడు ఐదోనెల. ఇలాంటి టైములో ఆమెను బాధపెట్టడం ఎందుకులే అని పదవినుంచి తప్పుకున్నాను. అంతేకానీ బాధ్యతలనుంచి కాదు" అన్నాడు.

"నాకు తెలిసినంతవరకు స్రవంతి కొంచెం తొందరపాటు అమ్మాయేగానీ చెడ్డదేమీ కాదు. ఆమెకు ప్రతిదానిమీద అనుమానం ఎక్కువ. ఆత్మవిశ్వాసం తక్కువ. నువ్వే ఆమెను చైతన్యవంతం చేయాలి. నువ్వు ఆమెలో ధైర్యం నింపితే, నీ కృషికి ఆమె ఏమీ అడ్డంకి కాదు" అన్నాడు రాకేష్.

"నా ప్రయత్నం నేను చేస్తూనే వున్నాను రాకేష్" అన్నాడు తేజ. కానీ అతను ఒకవిధంగా స్రవంతి నోటికి భయపడసాగాడు. తన కాపురంలో కలతలు బయటకు తెలిస్తే, ఇటు ఫ్రెండ్సుముందు, అటు తల్లిదండ్రులను ఎదిరించి చేసుకున్నందుకు వాళ్ళముందు పరువుపోతుందని, అసలు ప్రేమవివాహాలంటేనే చులకన భావం ఏర్పడుతుందని కించపడసాగాడు. అందుకే అతను పూర్తిగా స్రవంతికి లొంగిపోయాడు.

"పనీపాటు లేకుండా తిరుగుతున్నావు. కాస్త ఆ గాస్ సిలెండరు తీసుకురావటానికి తీరిక లేకపోయిందా?" విరుచుకుపడుతుంది స్రవంతి కాలేజీ నుంచి రాగానే.

"తీరిక లేకపోవటమేమిటి! వాడి చుట్టూ

మూడుసార్లు తిరిగానివ్వాళ ఇదిగో... అదిగో... అంటూ ఎల్లుండికి వాయిదా వేశాడు"

"ఏమో ఎవరు చూడొచ్చారు. నా కళ్ళ నీళ్ళు తుడవటానికన్నట్లు ఆ కార్యదర్శి పదవి వొదిలావు కానీ నీ టైమంతా అక్కడే తిరుగుతావు. అక్కడికి నేనేదో చెడ్డ దానినయినట్లు, విప్లవ ప్రతీఘాత శక్తయి నట్లు మాట్లాడుకుంటారు కాబోలు మీరంతా" అంటుంది స్రవంతి.

తనకు చేతనయినంత వరకూ ఏదో ఇంటిపని చేస్తూనే వుంటాడు తేజ. అతను మొదట్నుంచీ తల్లిదండ్రులతోనే వుండ టంతో ఏ రకమయిన పనులూ చేసే అవ సరం కలగలేదు. అతనికీ పనులు బొత్తిగా చేతకావు. కానీ ఇవేం బ్రహ్మవిద్యలు కావు గదా, అని స్రవంతికి సాధ్యమయినంత రెస్టు ఇవ్వటానికి వంట పనులన్నీ తనమీదే వేసుకున్నాడు. అయితే ఏవో పొరపాట్లు చేస్తుండేవాడు. దానికి తోడు స్రవంతి అన్ని టికీ వొంకలు పెట్టేది. "తెలియనివి చెబుతు న్నాను అంతేకదా" అనుకునేది తను. కానీ వొంకలు పెట్టే అత్తగారిముందు కొత్తకోడ లిలా తేజ మనసు ముడుచుకుపోయేది.

నెలలు నిండుతున్న కొద్దీ స్రవంతి ఆప సోపాలుపడుతోంది.

"ఉద్యోగానికి సెలవుపెట్టెయ్యి స్రవంతీ" అన్నాడు తేజ.

"ఇది ప్రయివేటు కాలేజి, అంతంత మాత్రం ఉద్యోగం అప్పుడే సెలవు ఎలా కుదురుతుందిలే" అని స్రవంతి అభ్యం తరం.

"అందుకే కదూ, ఇంకో రెండేళ్ళు పోయాకే పిల్లల్ని కందాం అన్నాను"

"ఇంకా నయం! ముట్లు పోయాక కందాం అనలేదు. మనమేం పసిపిల్లలమా! ఈ వయసుకు మా అమ్మకి ముగ్గురు పిల్లలు" అంటుంది స్రవంతి.

"పోనీ పుట్టింటికి వెళతావా? నేను సాయంచేసినా నీకు హైరానగానే వుంటోంది" అనేవాడు తేజ.

"నేను పుట్టింటికి వెళితే ఇల్లు పట్టకుండా, ఏ అడ్డంకీ లేకుండా తిరుగుదామనా? నేను ఎక్కడికీ వెళ్ళను. ఇక్కడే ఏదో హాస్పిట లులో కంటాను" అనేది స్రవంతి.

తేజ అన్నీ ఓపికగా సర్దుకుపోయేవాడు. కాన్పు ముందు మాత్రం వాళ్ళమ్మను పిలి పించాడు.

ఆడపిల్లను కన్నది స్రవంతి. ఆమెకు మగపిల్లవాడే కావాలని వుండేది. కానీ తేజ వాళ్ళ ఇంట్లో అంతా ఆడపిల్లే కావాలనుకు న్నారు. తేజ కూడా కూతుర్ని చూసి మురి సిపోయేవాడు.

"కూతుర్ని చూసే ఇంత మురిసిపోతు న్నావు. కొడుకయితే ఇంకెంత పొంగిపోయే వాడివో" అంటుంది స్రవంతి.

"అలా అంటావేమిటి? కూతురికి కొడు కుకీ తేడా ఏముంది"

"కబుర్లకేంలే! నీకు తెలీదా ఆడదానికీ మగాడికి వున్న తేడా"

"ఏమో! నా దృష్టిలో ఏమీ తేడా లేదు" అనేవాడు అతను.

"కనపడుతూనే వుందిగా! నువ్వేమో మగాడివి. రాజకీయాలు, ఉద్యమాలు అని తిరిగిరా. కట్టుకున్న నేరానికి, కన్న పాపా నికీ నేను ఉద్యోగం చేసి మీ ఇద్దర్నీ పోషిస్తా. చదువుకున్న ఆడదాన్ని కావటంవ ల్లనేగా నాకీ కర్మ. ఏ చదువులేని పిల్లనో అయితే మొగుడికింత వుడికేసి పడేస్తే సరి పోయేది"

తేజకు ఈ మాటలతో మతిపోయేది. అసలెలా మాట్లాడగలుగుతుందిలా? అతని కెంతో ఆశ్చర్యం. ఎంత సరదాగా వున్న సమయంలోనయినా ఏదో పుల్లవిరుపు మాట విసరటం స్రవంతి పట్టుదలగా ప్రాక్టీసు చేస్తోంది.

"పిల్లా జెల్లా పుట్టుకొచ్చినా బాధ్యత తెలీ దేంరా? ఇంటి దగ్గరనుంచి డబ్బులు పట్టు




కుపోయి ఎన్నాళ్ళు వెలిగిస్తావు. కోడల్ని చూడు, చిన్నతనంలో ఏవో సంఘాలని తిరిగింది నీలాగే. ఇప్పుడు ఉద్యోగం చేసుకుంటూ కష్టపడటంలా! ఎల్లకాలం వొక్కలా సాగాలంటే ఎలా" అని తేజ వాళ్ళ నాన్న ఉత్తరాలు రాసేవాడు.

పెళ్ళప్పుడు తమ పెద్దరికం పోయిందని ఎగిరిపడ్డా, ఇప్పుడు తేజ వాళ్ళ యింట్లో స్రవంతి అంటే గౌరవం, ఆప్యాయత. కట్నం లేకుండా చేసుకున్నాడని పెళ్ళప్పుడు తేజ అంటే స్రవంతివాళ్ళ ఇంట్లో అభిమానం వుండేది. ఇప్పుడో... బాధ్యత తెలీని మనిషని ఈసడింపు.

తేజ తల్లీదండ్రీ వచ్చిపోతూనే వుంటారు ఎప్పుడూ. వాళ్ళు వున్నపుడు స్రవంతి ఎంతో ఓపిక వున్నట్టు ప్రవర్తించేది. "అదే మావగారూ నేను చెప్పేది. కొండలయినా కరిగిపోతాయి కూర్చుని తింటే. మనకేం అంత తరగని ఆస్తులు వున్నాయా? ఈ బుజ్జి ముండకు ఏమయినా మిగల్చాలా వద్దా? " అని అంటించేది.

"కాదుటమ్మా మరీ! మేమంతా ఏదో ఆడవాళ్ళని మూలని కూర్చోపెట్టి పీక్కుతినే మగవెధవలమంటాడు. ఆడదానివి నీ సంపాదనమీద బతికేమగపీనుగ వాడు వుద్ధరించేదేమిటి లోకాన్ని" అని ఆయన తగులుకునేవాడు.

మొత్తానికి తేజ పని అడకత్తెరలోపడ్డ పోకచెక్కలా తయారయింది. అతను క్రమంగా, విద్యార్థిసంస్థ పనులలో పాల్గోవటం కూడా తగ్గించాడు.

"ఏమిటి తేజా, రోజురోజుకీ ఇలా దూరమైపోతున్నావు" అని సమత అడిగింది.

"నేనేం చేయను. స్రవంతి నన్ను కూర్చోనీయడంలేదు. నిలబడనీయడంలేదు. ఇంట్లో వొత్తిడి మరీ ఎక్కువయ్యింది. తట్టుకోలేకపోతున్నాను.

నేనేదయినా గట్టిగా మాట్లాడితే మగ అహంకారం, పురుష పెత్తనం అని కేకలు వేస్తోంది. ప్రేమించి చేసుకున్నామని చెప్పుకుంటే సిగ్గుచేటు. ఎంతసేపూ నేను తన మాట వినటంలేదనీ, తన వుద్దేశాలను గౌరవించటం లేదనీ యాగీ చేస్తుంది. కానీ అసలు మా ఇద్దరినీ దగ్గరికి తెచ్చిన సంస్థనూ, వుద్యమాల నీడల్లో పెరగాలనుకున్న ఆశలూ అన్నీ మర్చిపోయింది. తను మారిపోయి నన్ను తనతోపాటు మారమని నిర్బంధిస్తోంది. భార్యగా తనను సంతృప్తి పరచాలో, వ్యక్తిగా నా దారిన నేను పోవాలో ఏదీ అర్థంకావటంలేదు సమతా" అన్నాడు తన పరిస్థితినంతా పూసగుచ్చినట్లు వివరిస్తూ.

"నువ్వు కాస్త కరకుగా వుండాలి తేజా! కాపురాల్లో అయితే మగాడూ లేకుంటే ఆడదీ ఎవరో ఒకరు పెత్తనం చేయవలసిందేనా? ఇద్దరూ సమభావంగా సహజీవనం సాగించలేరా? నీ ఆశయాలు అమలుపరచుకునే స్వేచ్ఛ, అధికారం నీకు వుంటుంది. ఆ హక్కు నువ్వు నిలబెట్టుకోవాలి తేజా" అంది సమత.

"నేను నోరు విప్పితే చాలు, నాకంటే ముందే తను సిద్ధాంతాలు వల్లెవేస్తుంది 'కుటుంబబాధ్యతలు, సిద్ధాంతాల ఆచరణల సాధ్యాసాధ్యాలు' మీద పెద్ద ఉపన్యాసం ఇస్తుంది. ఎవరన్నా విన్నా తనదే కరెక్ట్ అంటారు. అందరికీ నేనో వాజమ్మననీ, పెళ్ళాంపిల్లల్ని పోషించడం చేతకానివాడ్నని అనిపించేలా మాట్లాడుతుంది. ఏమనబోయినా "ఏ మగాడు ఆడదాని సలహాలు విన్నాడు, ఏ మగాడు భార్యను సమానంగా చూసి ఆమె మాటలు ఆదరించాడు, ఆచరించాడు? " అంటుంది.

"నోనో... ఇది ఆడ-మగ సమస్యకాదు. మీ అమ్మ ఆడదికాదా? ఆమె నీ కార్యక్రమాలను ఆమోదించలేదా. అయినా నీవు నీ వుద్యమాలు వదులుకోలేదుగదా 'ఆమె ప్రజల్లోని వెనకబాటు చైతన్యానికి ప్రతినిధి. రాజకీయంగా ఆ చైతన్యాన్ని వ్యతిరేకించవ

లసిందే. ఆడదని చెప్పి ఆమెకు కన్సెషన్ ఇవ్వనవసరంలేద'ని వాదించేవాడివి. మరి స్రవంతి కూడా అంతేకదా. ఇప్పుడెందుకని మారిపోయావు తేజా" అడిగింది సమత.

"తల్లిదండ్రుల్ని, సమాజంలోని అన్నిర కాల తప్పుడు అభిప్రాయాల్ని వ్యతిరేకించ డానికి నాకు సంకోచం కలగలేదు సమతా. కానీ స్రవంతి నా భార్య. ఆ భార్యను కాదని తిరస్కరించి ముందుకుగాలేక పోతున్నాను. అందులోనూ స్రవంతి మన ఉద్యమాల నుంచి వచ్చినమనిషి. మన లోటుపాట్లన్నీ బాగా తెలుసు. ఆమెను వారించటం, శత్రు వులలాగా వాదించడం నాచేత కావటంలేదు సమతా. నేనెంత ఓపికగా ఆమె మనసు మార్చాలని చూస్తున్నానో, తను అంతకు పదిరెట్లు పట్టుదలగా తన మాటలు పట్టుకు కూర్చుంటోంది"

"తప్పుడు భావాలు తల్లిలోకానీ, చెల్లిలో కానీ, భార్యలోకానీ ఎక్కడ వున్నా ఎదిరిం చక తప్పదు. ఆ విషయంలో ఆడహక్కు, మగ అహంకారం అనే ప్రశ్నే వుదయిం చదు. తమ వుద్దేశాలను మనస్ఫూర్తిగా ఆచ రించే స్వాతంత్ర్యం లేకపోతే స్త్రీకయినా, పురుషుడికయినా ఆ కాపురం నరకం" అంది సమత.

"నరకమో, స్వర్గమో చేసుకున్నాక అనుభ విస్తాను. నా ఓపిక వున్నంత వరకూ భరి స్తాను. తనో, నేనో ఎవరో ఒకరు మారక తప్పదు. లేకపోతే ఈ జీవితానికి శాంతి లేదు సమతా" అని లేచి వెళ్ళిపోయాడ తను.

స్రవంతితో మాట్లాడితే ఏమీ ప్రయోజనం లేదనిపించింది సమతకు. తేజ మొదటి నుంచీ లొంగుబాటు చూపించాడు. అందుకే స్రవంతి తన పరిధి మీరిపో యింది. తన కుతర్కాలతో తేజను కేవలం భర్త అనే స్థానానికే పరిమితం చేసివేసింది. మనిషిగా అతనికున్న ఇతర బాధ్యతలని కత్తిరించివేసింది.

తనే మారిపోయి కాపురంలో శాంతిని తెచ్చిపెడుతున్నాడు తేజ. కాస్త ఆప్యా యంగా మాట్లాడేటప్పుడు కూడా స్రవంతి, "ఆ జర్నలిజం ఏదో పూర్తి చేసేయ్ తేజా. నువ్వు కూడా ఏదయినా వుద్యోగంలో చేరి పోదూ! మీవారేం చేస్తారంటే చెప్పుకోవడా నికి కూడా సిగ్గుగా వుంది" అనేది గోముగా.

ఇంటిపోరు తట్టుకోలేకపోయాడు తేజ. బుద్ధిగా కాలేజీకి వెళ్ళి చదువుకోవడం మొద లెట్టాడు. కూతురికి రెండు సంవత్సరాలు వచ్చేసరికి వుద్యోగంలో చేరిపోయాడు.

ఇప్పుడు స్రవంతి ముచ్చటైన కాపురం చేస్తున్న యిల్లాలు. వాళ్ళమధ్య ఏ పోట్లాటలూ లేవు. కూతుర్ని కేర్ సెంటర్లో ఇచ్చి ఇద్దరూ వుద్యోగాలకు వెళతారు. మళ్ళీ సాయంత్రం వచ్చేటపుడు తెచ్చుకోవటం. వారానికో సినిమా, నెలకో పిక్నిక్. కొద్దికొ ద్దిగా పెరుగుతున్న బ్యాంకు బాలెన్స్. స్రవంతికి జీవితం చాలా సంతృప్తిగా వుంది.

"ఆ అమ్మాయి కనక వాణ్ణి దారిలో పెట్టింది. ఇంకొకరయితేనా ఈ పాటికి వాణ్ణి పోలీసులు ఏ నట్టడవిలోనో చెట్టుకు కట్టి కాల్చేసేవాళ్ళు" అంటాడు తేజ తండ్రి.

"అమ్మాయి, చిన్న దానికో గొలుసు చేయించమ్మా" అనో, "అందరిళ్ళలోనూ వుంటోంది. మీరు కూడా ఈసారి పంటల్లో ఫ్రిజ్ కొనుక్కోండే! మీ మావగారినడుగు డబ్బులిస్తారు" అనో అత్తగారూ సలహాలి స్తుంది.

మొత్తానికి ఆ ముచ్చటైన కాపురాన్ని చూసి అంతా మురిసిపోతున్నారు. తను ఏం కావాలనుకున్నాడో, ఏమై మిగులుతాడో అర్థంకాక తేజ మాత్రం నిద్రలేని రాత్రులు గడుపుతాడు అంతరాత్మ మేల్కొన్నప్పుడు. పాత ఫ్రెండ్స్‌కు దూరంగా, రాజకీయాలకు మరీదూరంగా, సిగ్గుపడుతూ బతుకుతున్నా డతను. కానీ అతనికీ తన అంతరాత్మను

జోకొట్టడం క్రమంగా పట్టుబడుతోంది.

★ ★ ★

సమత, రాకేష్ కాపురం చేస్తున్న ఇల్లు వాళ్ళకు అనుకూలంగా వుందనే చెప్పాలి. మూడు గదులు మొత్తం. ముందుగది రాకేష్‌కి ఆఫీస్ రూం, స్టడీరూమ్. అతని లా పుస్తకాలు, సమత పుస్తకాలు అనువుగా సర్దుకున్నారు. మరో బీరువానిండా రిఫరెన్స్‌లు, పార్టీ సాహిత్యమూ, పేపర్లు, కరపత్రాలు ఇత్యాదివి వున్నాయి. ఆ గదిలో ఒక టేబిలు, నాలుగు కుర్చీలు వేశారు. ఎవరైనా వస్తే మాట్లాడేదీ, చర్చలు సాగించేదీ అక్కడే.

రెండోగది సమతగది, అదే బెడ్‌రూం కూడా. ఇక మూడోది కిచెన్ అటాచ్డ్ బాత్‌రూం.

రాకేష్ ఒక్కడూ వున్నపుడు కూడా చాలా సరంజామా చేర్చాడు. దాదాపు పది సంవత్సరాలు అతను అదే రూమ్‌లో వున్నాడు. హోటలు భోజనం సహించదని మొదటి నుంచీ వండుకుతినేవాడు. రాకేష్ వాళ్ళమ్మగారు కూడా ఆ రూములో చాలారోజులు వుంది. కొడుకు మరీ రాజకీయాల వెంట పడి, ఆమెమాట వినటం పోయాక, మనసు విరిగిపోయి అంతగా వచ్చేదికాదు. వారానికొకసారయినా ఏవో వండి పంపించేది. వాళ్ళుండేదీ హైద్రాబాద్ దగ్గరే కనక రఘునాధరెడ్డిగారు వూరినించి ప్రత్యేకంగా మనిషినిచ్చి కూడా ఈ వంటసరకులు కొడుకు గదికి పంపేవారు. అసలు రాకేష్‌కి కూడా నిమిషాల్లో ఏదో చేసుకుతినటం అలవాటయిపోయింది. అందుకే ఒక సంసారానికి కావలసిన సరుకులన్నీ అతని దగ్గరవున్నాయి.

"ఇద్దరు ఆడవాళ్లం మా దగ్గరే లేవు ఇన్ని గిన్నెలు, వస్తువులు చాలా చేర్చావే" అనేది సమత.

"అంతా అమ్మ చాదస్తం. ఇవన్నీ నేను వాడానా పెట్టానా!" అంటాడతను. పెళ్లికి ముందే ఇద్దరూ కలిసివెళ్లి తమ కొత్తకాపురానికి కావలిసిన వస్తువులు కొనేశారు ఒక్కసారే.

రాకేష్‌కి ఏ విషయంలోనైనా ఒక పద్ధతి ప్రకారం నడవటం అలవాటు. పెళ్లప్పుడే వరలక్ష్మమ్మగారు అల్లుడికి పెద్ద సర్టిఫికెట్ ఇచ్చింది మంచి పద్ధతి వున్న మనిషి అని. ఆ మూడు గదుల్నీ, ఆ సామాన్లనీ అతను సర్దిపెట్టిన తీరు చూసి ఆమె చాలా సంతోషించింది.

"అంతా ఆయన గొప్పేంకాదు. నేనూ అన్నిట్లో వేలు పెట్టాను. " అంది బుంగ మూతితో.

"పోవే! నీ సంగతి నాకు తెలియదా? అతన్ని బాధ పెట్టకు చిన్నా. నీ పద్ధతులు మార్చుకుని అతనికి కనీసం రెండుపూటలా తిండయినా పెట్టు. అంతా అమ్మానాన్నల దగ్గర జరిగినట్టుగానే జరగాలనుకోకు" ఎంతో ఆరాటంగా చెప్పి వెళ్లింది తల్లి సమతతో.

సమత యం. యస్. సి పరీక్షలకు కొంచెం ముందే స్కూలుకి వెళ్లడం మానుకొంది. పెళ్లయ్యాక పూర్తిగా మానేసింది. "డబ్బు కోసమని ఉద్యోగం చేయనక్కరలేదు. పనీ పాటా మనకి తక్కువేమీ లేదు" అన్నాడు రాకేష్ మొదట్లోనే.

"ఇంటి దగ్గరనుంచి డబ్బు తెప్పించుకోవడం సిగ్గుగా వుండదూ? " సంకోచంగా అడిగింది సమత.

"అదేం మా అబ్బ సొమ్మా? "

"కాదు వాళ్లబ్బ సొత్తు... మన తిప్పలు మనం పడటం మంచిది కదా!"

"జరుగుతున్నంతకాలం కొన్ని చిన్నచిన్న విషయాలు పట్టించుకోవడం అనవసరం సమతా! ఆ ఆస్తి వొద్దన్నా నాకే కట్టబెడతారు. దాన్ని ఏదోవిధంగా పార్టీకింద ఖర్చు చేస్తాను నేను. ఇప్పుడు... యువకులు-వ్యక్తిత్వం అంటూ డబ్బు సంపాదనకి టైము వేస్టు చేయడం ఎందుకు చెప్పు. ఈ

టైము కూడా పార్టీ పనులకే వినియోగిద్దాం. డబ్బున్న ఇంట్లో పుట్టటం నా నేరం కాదుగదా? " అన్నాడు రాకేష్.

"ఈ పెద్దవాళ్ళు వూరుకోరుగదా! ఆస్తులు, కరిగించడాలు అంటూ కథలు చెప్పి సూటిపోటీ మాటలంటారు. ఎందుకదంతా పడటం"

"నువ్వు చేసేదానికీ, చేయనిదానికీ కూడా వాళ్ళు ఏదో అంటూనే వుంటారు. అవన్నీ మనం పట్టించుకోకూడదు. మనం అక్కడి నుంచి డబ్బులు తెప్పించుకుంటూ వుంటేనే వాళ్ళకో తృప్తి, వాళ్ళదారికి వస్తామని ఆశ. అదీ వద్దన్నామనుకో మనం బైరాగుల్లో కలిసిపోయామని పెద్ద గొడవ చేస్తారు. ఎలాంటి స్థితిలోనయినా జీవించడానికి మనం సిద్ధంగా వున్నప్పుడు, ఆస్తిమీద మనకు ఆశ లేనప్పుడు ఎవరేం అంటే మన కేమిటిలే" అన్నాడు రాకేష్.

రీసర్చి వర్క్‌కీ, అంతకుముందు కాలేజీ జీవితానికీ సాపత్యమే లేదు. సమత ప్రొఫెసర్ ప్రత్యేక శ్రద్ధతో ఆమెకేవో చాలా విషయాలు నేర్పుతున్నాడు. ఆమెకు ఎన్నో ప్రోబ్లమ్స్ ఇచ్చి సాల్వు చేయమనేవాడు. "చూస్తూవుండు. నిన్నీ దేశానికే జమ్‌లాగా చేస్తాను" అనేవాడాయన. రోజురోజూ సమతకీ తన వర్క్‌మీద ఇంట్రెస్టు పెరుగుతోంది. అందుకని రాకేష్ వాళ్ళకో ప్రోగ్రాం నిర్ణయించాడు.

ఉదయం పదిగంటలకు కాలేజీకి వెళ్ళేవరకూ ఆమెకు చదువుకు సంబంధించినపని. తను ఎప్పుడు యూనివర్సిటీనుంచి వస్తే అప్పటినుంచీ రాత్రి పదిగంటలవరకూ పార్టీ పని. మధ్యలో ఆమెకు తీరినప్పుడు ఇంటి పని. అతనికి ఉదయం తొమ్మిది, పదిగంటలవరకూ ఇంటిపని. ఆపైన ఆఫీస్‌లో కూర్చుంటాడు. సాయంత్రం అతను ఎప్పుడు ఇంటికి చేరేది పార్టీపనులు నిర్ణయిస్తాయి.

రాకేష్‌కి పొద్దున్న నాలుగున్నరకల్లా నిద్ర లేవటం చిన్నప్పటినుంచీ అలవాటు. అప్పుడు చదివితే ఏదైనా వెంటనే తలకెక్కుతుందంటాడు. పార్టీ సాహిత్యమయినా ఆ టైమ్‌లో చదువుతాడతను. సమతకేమో కాస్త పొద్దెక్కాకనే లేవటం అలవాటు.

సమత నిద్రలేచేసరికి అతను కాఫీ టిఫిన్ తయారు చేస్తాడు. రాత్రి గిన్నెలు కడిగేస్తాడు. కూరగాయలు ముక్కలు తరిగి అన్నీ గిన్నెల్లోపెట్టి రెడీ చేసేస్తాడు. సమత లేచి కాఫీతాగి, గదులు క్లీన్ చేసి ఉప్పూ కారం చూసి చెబితే కుక్కర్ పెట్టేస్తాడతను. రెండుగంటలు ఖచ్చితంగా ఏవో రిఫరెన్స్‌లు, రికార్డులూ చూసుకుంటుంది సమత. ఈలోగా అతను బట్టలుతకడమో, గిన్నెలు శుభ్రం చేయటమో చేస్తాడు.

తొమ్మిది గంటలకు ఇద్దరూ తయారై భోజనం చేసి బయట పడతారు. మళ్ళీ అతనిరాక రాత్రి ఏ పదకొండు గంటలకో.

సాయంత్రం పనులు సమత చూసుకుంటుంది. కూరగాయలు, సరుకులు తెచ్చి పడేస్తుంది. సాయంత్రం వంట కార్యక్రమం లేనట్టే. ఇంట్లో ఎప్పుడూ గుడ్లూ, బ్రెడ్డూ, ఏవయినా ఫ్రూట్స్, రడీమేడ్ ఫుడ్స్ వుండేలా చూస్తాడు. "ఇంటిపనులు సాధ్యమయినంత సింప్లిఫై చేయాలి! అంతరిక్ష రాకెట్లు నడిపే రమణీమణిని పట్టుకొని, అంట్లు తోమటం సరిగ్గా రాదేం" అని అడగడం బుద్ధి తక్కువ అంటాడతను. అసలు వాళ్ళ మధ్య ఈ పని నీది, ఈ పని నాది అని విభజన లేదు. ఎవరికి వీలుగా వుంటే వాళ్ళు చేసేయటమే.

రాకేష్ పైకి చాలా ఈజీ గోయింగ్ అనిపిస్తాడు కానీ ఏ విషయమైనా పట్టుకుంటే దాని అంతు తేల్చేవరకూ అతనికి నిద్రపట్టదు. అతనికి చిరాకు కలిగేకొద్దీ అది బయటపడకుండా ఇంకాఇంకా హాస్యంగా మాట్లాడతాడు.

"నీకసలు కోపం వస్తుందా రాకేష్" అనేది సమత.




"ఎంతకోపం లేకపోతే విప్లవ రాజకీయాల వెంట తిరుగుతాను" అనేవాడతను.

ఆ ఇద్దరూ గడియారాల వెంట పరుగెత్తే వాళ్ళు. బద్ధకంగానీ, అలసటగానీ వాళ్ళను అంటుకున్నట్లు కనిపించేదికాదు. ఉదయం లేచి దుప్పటి దులిపి, పరుపు మడిచిపెట్టారా! మళ్ళీ పక్కమీద వాలేవరకూ వూపిరి పీల్చుకోవడం మరిచిపోయారేమో అన్నట్టు పనిలో నిమగ్నమయ్యేవారు. అలాగని తొందరపాటు, హడావుడి ఏమీలేవు. ఆపరేషన్ చేసే డాక్టర్ చేతి కదలికల్లా అన్నీ క్రమబద్ధంగా జరిపేవారు.

ఇక రాత్రిళ్ళు తమ ఇద్దరికీ చెందిన వూహలు, వూసులు, భవిష్యత్ ప్రణాళికలు, ఆర్థికాలు, హార్దికాలు... అంతరంగాలను విప్పుకోవడం, సహజత్వాలను పంచుకోవడం... అది వేరే లోకం.

★ ★ ★

ఏడెనిమిది నెలలు పోయాక ఒకసారి వరలక్ష్మమ్మగారు హైదరాబాద్ వచ్చింది. ఆమెకు ఈమధ్య ఒంట్లో ఏమీ బాగుండటం లేదు. జబ్బు ఏమిటో తెలీదు.

"రోజూ చేసే వంటే చేయలేకపోతున్నానే! ఆ తోటపనీ, నీళ్ళు అన్నీ మీ నాన్నగారే చూసుకుంటున్నారు ఈ వయసులో. నాలుగు మెతుకులు వుడకెయ్యలేకపోతే ఇంక నేను బతికెందుకు" అంటూ బాధపడింది. పదిరోజులు వుంచి ఇటు ఝాన్సీ, అటు రాకేష్ ఆమెను డాక్టర్ల దగ్గరకు తిప్పారు. ఏవేవో పరీక్షలు చేయించారు. ఐదారువందలు ఖర్చయ్యాక "ఏమీలేదు, పెద్దతనం, కాస్త రెష్టు తీసుకుంటే చాలు" అని తేల్చి ఏవో టానిక్కులు రాసి ఇచ్చారు డాక్టర్లు.

"ఇంక ఈ వయసులో నేను టానిక్కులు తాగుతాను" అని మూతి తిప్పిందావిడ.

"ఎందుకు అక్కడ. ఇద్దరూ ఇక్కడకు వచ్చేయండి. సమత వెళ్ళాక సుధాని చూసుకోవడం కష్టంగా వుంది నాకు. రాజీని జుట్టుపట్టి పీకి వొదులుతున్నాడు. ఆఫీస్‌లో వున్నంతసేపూ వీడిమీదే ప్రాణాలన్నీ. మీరేమో వూరు, ఇల్లు అంటూ అక్కడి నుంచి కదిలిరారు" అంది ఝాన్సీ.

"ఆ ఇంటికి బేరం పెట్టి వదిలించుకుంటే గానీ మేం ఎక్కడికీ కదలలేం తల్లీ. ఇల్లు ఇల్లని భ్రమేగానీ మీరులేకుంటే అది ఇల్లులాగా లేదు ఝాన్సీ. మీరే కళ్ళల్లో మెదులుతున్నారు. ఈ కొసరు మరీనీ" అంటూ సుధాంశు బుగ్గలు పిండింది ఆమె.

సమత కాపురం చూస్తుంటే ఆవిడకు ఆనందంగానూ, ఆశ్చర్యంగానూ అనిపిస్తోంది. వాళ్ళ పిలుపులు, పలకరింపులు, పనులు చేసుకునే పద్ధతీ ఆమెకు కొత్తగా అనిపిస్తున్నాయి. "నేనూ అదీ కూర్చుని మాట్లాడుతూనే వున్నాం. ఎప్పుడు వెళ్ళాడో నేను గమనించనే లేదు. చటుక్కున కాఫీ చేసి తెచ్చి యిచ్చాడు. తాగాలంటే నాకెంత సిగ్గేసిందో" అని ఝాన్సీకి చెప్పింది ఆమె.

పదిరోజులు ఇద్దరు కూతుళ్ళ దగ్గరా వుండి, ఇంటికి ప్రయాణం కట్టిందామె!

"సమత ఇంట్లో వుందాండీ"

ఏదో లా పుస్తకం చదువుతున్న రాకేష్ తలపైకెత్తి "రండి లోపల వుంది" అని ఆమెను ఆహ్వానించి 'సమతా' అని కేకేశాడు ఇంట్లోకి. పిలుపు విని ముందు గదిలోకి వచ్చిన సమత "ఓ... సుభద్రక్కయ్యా, రండి రండి" అంటూ లోపలకి పిలిచింది. "నీకు గుర్తుందా రాకేష్ రాయుడుగారింట్లో అద్దెకు వుండేవారు. సూర్యనారాయణగారని బాంకులో పనిచేసేవారే ఆయన ఈవిడ భర్తే" అంది సమత.

"ఆ నాకు గుర్తు లేకపోవడమేమిటి. చాలాసార్లు చూశానుకదా" అన్నాడతను.

ఆడవాళ్ళిద్దరూ రెండో గదిలోకి వెళ్ళారు. కాసేపు అవీ ఇవీ మాట్లాడి సుభద్ర "భరించినన్నాళ్ళూ భరించాను సమతా, ఇక నాకు ఓపిక అయిపోయింది. నువ్వే ఏదో దారి చూపించి పుణ్యం కట్టుకోవాలి" అంది ప్రాధే

యపడుతున్నట్లు.

"ఏమిటక్కయ్యగారూ! ఏమిటి విషయం" ఆదరంగా అడిగింది సమత.

"పాత కథేనమ్మా. ఆయన ఈమధ్య మరీ బరి తెగించారు. ఇన్నాళ్ళూ కొద్దో గొప్పో ఇంట్లో ఇచ్చి మిగిలినదాంతో చీట్ల పేక సేవ చేశారు. ఈమధ్య నా చేతికి బొత్తిగా ఏమీ ఇవ్వటంలేదమ్మా. వుద్యోగాని కయినా సరిగ్గా వెళుతున్నారో లేదో తెలియదు. క్లబ్బులవెంట తిరగడం ఎక్కువయ్యింది. "ఏమిటండీ ఇది? యిలాగైతే యిల్లు గడవడం ఎలా" అని అడిగితే, "చూస్తూవుండు. పోయిందంతా సంపాదిస్తాను. ఇంక నా జాతకం మారిందిలేవే. ఎలక్ట్రానిక్ జాతకచక్రం వేయించాను. ఈ సంవత్సరం నేను పట్టిందల్లా బంగారమే" అంటారు.

"బంగారాల సంగతి దేవుడెరుగు. రెండు పూటలా పిల్లల కింత తిండికి లేకుండా పోతోంది" కళ్ళు తుడుచుకుంది సుభద్ర.

"నన్నేం చేయమంటారు" సమత అడిగింది యధాలాపంగా.

"ఏం చేస్తావోనమ్మా నా కుటుంబాన్ని నిలబెట్టు. పెద్దాడికి పన్నెండేళ్ళు వస్తున్నాయి. వాళ్ళ నాన్నకోసం పాపిష్టిదాన్ని, నేనే వాడ్ని ఆ క్లబ్బుల చుట్టూ తిప్పాను. రోజూ చూసి చూసీ వాడికీ పురుగు తొలిచింది. ఈమధ్య ఆ గుడిసెల వాళ్ళతో కలిసి బీడీలు కాల్చడం, రోడ్డుపక్కన కూర్చుని చీట్లాడడం నా కళ్ళారా చూశాను. ఇన్నాళ్ళూ పిల్లలు పెరుగుతున్నా ఆయన మారతాడనుకునేదాన్ని. ఇక నాల్గురోజులు పోతే పిల్లలు దక్కకుండా పోతారు. ఆయన నీడ పడకుండా పెంచాలి" కళ్ళనిండా నీళ్ళతో ఎక్కిళ్ళతో చెప్పింది సుభద్ర.

"మీరు గట్టిగా నిలబడకపోతే నేను మాత్రం ఏం చేయగలనక్కయ్యా" ఈసారి ఆవిడ స్వయంగా ఏదైనా అడిగితేనే చేద్దామనుకుంది సమత.

"నిలబడక చస్తానా సమతా! మీ ఆయన లాయరుకదా, మీరు ఏం చేయమంటే అది చేస్తాను. చివరకు నాలుగిళ్ళలో అంట్లు తోమడానికి కూడా సిద్ధంగా వున్నాను నేను" అంది సుభద్ర ముక్కుచీదుతూ.

కుటుంబ మర్యాద అనీ, పరువుప్రతిష్ట అనీ పాకులాడే సుభద్ర ఆ విధంగా అనేసరికి సమతకు అంతవరకూ తెచ్చిపెట్టుకున్న బిగింపుపోయి జాలేసింది. "మగాడా! చూడు నీ మూర్ఖత్వం, అహంకారం, ఆడవాళ్ళను ఎలా వీధులపాలు చేస్తోందో" అనిపించింది.

ముందుగదిలోకి వెళ్ళి రాకేష్‌కి చెప్పింది.

"మీరేం భయపడకండి. కోర్టుల విషయం నాకొదిలేయండి. అసలు కోర్టు దాకా వెళ్ళకుండానే ఏదో ఒక ఏర్పాటు చూద్దాం" అన్నాడతనితో.

కోర్టులు లాయర్లుదాకా ఆలోచిస్తున్నానంటే ఆయనకి విడాకులు ఇవ్వాలని కాదు లాయరుగారూ. కాస్త నలుగురు పెద్దవాళ్ళు చెబితే వింటారేమో అనే ఆశ. మంచిమాటలు ఆయన చెవికి ఎక్కటంలేదు. కాస్త బలంగా, జబర్దస్తీగా అయినా, చట్టరీత్యా అయినా ఆయనకు ఎవరైనా చెప్పాలనీ" అంది సుభద్ర.

"నాకు తెలుసండీ. లాయర్లంటే కాపురాలు విడదియ్యడమే కాదు, కలిసి కాపురాలు కూడా చేయిస్తారు. ఆయన జీతం మీ చేతికందే ఏర్పాటు చూద్దాం. కాస్త బెదిరింపు అంతే... మా మగవాళ్ళ సంగతి మీకు పూర్తిగా తెలియదులెండి. అంతా మేకపోతు గాంభీర్యం. అయితే మీరు మాత్రం గట్టిగా వుండాలి. ఆయనమీద ఆధారపడకుండా నిలబడగలనని రుజువు చేయాలి. అవసరం అయితే విడిపోవడానికి సిద్ధంగా వున్నారని ఆయనకు అర్థంకావాలి. అప్పుడే ఆయన రాజీకి వస్తాడు" అని ధైర్యం చెప్పాడు రాకేష్.

"నేనీలోగా బాలవిహార్ వాళ్ళతోగానీ,




సిగరెట్ల ఫ్యాక్టరీలోగానీ మాట్లాడి ఏదో పని చూస్తాను మీకు. అప్పుడే మీరు ఆయనతో గట్టిగా పోట్లాడగలరక్కయ్యా" అంది సమత.

తన సమస్య తీరబోతున్న సంతోషంతో సుభద్ర వాళ్ళిద్దరికీ చేయెత్తి దండం పెట్టి వెళ్ళింది. "వీళ్ళు చెప్పిన మాట వింటే కనీసం పిల్లలిద్దరికీ తిండి పెట్టగలుగుతాను. రోజూ తన్నులు తప్పుతాయి. ఆపైన నా అదృష్టం" అనుకుంది సుభద్ర.

★ ★ ★

"ఝాన్సీ! నీకు టెలిగ్రాం" అని కేకవేస్తూనే పోస్టతనికి ఝాన్సీ గది చూపించాడు రాయుడుగారు.

సంతకంచేసి, టెలిగ్రాం తీసుకుని చూస్తూనే, "మా అమ్మ పోయింది బాబాయిగారూ" అంటూ కూలబడిపోయింది ఝాన్సీ.

"ఎంత కష్టమొచ్చింది బిడ్డా" అంటూ చంద్రావతి ఏడవసాగింది. వరలక్ష్మమ్మ గారు ఆవిడకు బాగా తెలుసుకదా! "ఎంత మంచిది మీ యమ్మ... ఈ డాక్టర్లు ఏమీ లేదని చెబితిరి చూడు. ఆ దేవుడు చెప్పి తీసుకపోయిండు" అని రాగాలు తీస్తుండగానే రాయుడుగారు

"ఏందే నీ ఏడుపు... అమ్మాయికి గుండెలు జారిపోతయ్. నువ్వు లొల్లిజేయకు" అని కసురుకుని, "వూరికి పోయేటందుకు ఇప్పుడు బస్సులుంటయా, లేకుంటే రేత్రిబండికి పోవల్నా" అని అడిగాడు ఝాన్సీని.

"బస్సులుంటాయి బాబాయిగారూ" అని గబగబా రెండు చీరలు, బాబు బట్టలు బ్యాగులో పెట్టుకుని "చెల్లి దగ్గరకు వెళ్ళి వెళతాము" అంటూ తాళం వేసింది ఝాన్సీ.

"పసిబిడ్డకు జర పాలు తీస్కపో జాన్సి" అంటూ చంద్రావతి సీసాలో పాలుపోసి ఇచ్చింది.

"నేగూడ వస్త పద చెల్లిదనక" అంటూ రాయుడుగారూ వెంటనడిచాడు.

ఇద్దరూ ఆటోలో సమత ఇంటికి వచ్చేసరికి ఆమె అప్పుడే బయటకు వెళ్ళబోతోంది. రాకేష్ వూళ్ళో లేడు కరీంనగర్ వెళ్ళాడు. ఇంకాసేపటికో, సాయంత్రానికో వచ్చేస్తాడు అని "మా అమ్మ పోయింది. అక్కా, నేనూ ఇంటికి వెళుతున్నాం" అని అతనికి రాసి పెట్టి, అదే ఆటోలో బయలుదేరింది.

"ఈ పైసలు తీస్కపో జాన్సీ" అంటూ రాయుడుగారు ఒక వొంద రూపాయలు చేతిలో పెట్టాడు. "ఫర్వాలేదండీ. మా దగ్గర వున్నాయి" అని ఆమె అంటున్నా వినిపించుకోలేదు.

ఝాన్సీ, సమత ఇల్లు చేరేసరికి వూరువూరంతా అక్కడే వుంది. రెండుమూడు గంటలయ్యేప్పటికి రాజ్యం పిల్లలతో వచ్చింది. సాయంత్రానికి రాకేష్ చేరాడు. రాజ్యం వస్తూనే,

"ఏమిటి నాన్నా నేను అంత కానిదానినయ్యానా! అమ్మకు జబ్బుచేస్తే కనీసం నాకు ఉత్తరం ముక్కయినా రాయలేదు. ఏ మందో మాకో ఇప్పించి బతికించుకునే దాన్ని" అంటూ తండ్రిమీదపడి ఏడ్చింది.

"ఒక్కరోజు దగ్గేనమ్మా. డాక్టరు దగ్గరకు వెళదామా లక్ష్మి అంటే "మీదంతా చోద్యం... దగ్గుకు డాక్టర్లెందుకు? మిరియాల కషాయం తాగితే తెల్లారేసరికి పోతుంది అంది. ఆ రాత్రికి ఒక్కసారే ఇంత రక్తం కక్కి పోయిందమ్మా. ఎవరినీ కేకవేసే టైము కూడా లేదు" అంటూ ఆయనే కూతుళ్ళను ఓదార్చసాగాడు రామారావుగారు.

"ఆఖరి నిమిషందాకా భర్తకు వొండిపెడుతూనే పోయిందమ్మా"

"ఒకరోజు ముక్కకుండా మూలగకుండా పోయింది. ఎందరి కొస్తుందమ్మా ఇలాంటి చావు" అని అంతా ముక్కులు ఎగబీల్చారు.

"పుని స్త్రీ చావు. ఎంతటి పుణ్యాత్ములకో



స్తుంది ఈ చావు" అంటూ వూళ్ళో ఆడంగులంతా చేరి ఏవేవో తతంగాలు చేశారు. ఇంత పసుపు, కుంకుమ తీసుకెళ్ళారు.

చివరికా కట్టెను కాల్చివచ్చారు. ఝాన్సీ ఈ మూడేళ్ళలోనూ ఇక్కడకి రానేలేదు. ఏదో కర్ణాకర్ణిగా వినటమే తప్ప ఝాన్సీ సంగతి సరిగ్గా ఎవరికీ తెలీదు. ఈ బిడ్డ సంగతేమిటా అని ఆడంగులు అంత ఏడుపుల్లోనూ చెవులు కొరుక్కున్నారు.

"ఇప్పట్నుంచీ ఎందుకులే! నేను వస్తేగిస్తే కర్మనాటికి వస్తానన్నారాయన" అంది రాజ్యం.

పదకొండు రోజులుదాకా ఎందుకని ఐదో రోజు అన్ని లాంఛనాలు పూర్తిచేశారు. అన్నిటికీ రాకేష్ అండగా నిలిచాడు. కుటుంబయ్యగారికి ఇంటి బాధ్యత అప్పచెప్పి మావగారిని హైదరాబాద్ ప్రయాణం కట్టించాడు.

"అమ్మ గుర్తుగా వుంచుకుంటాను" అని వరలక్ష్మమ్మగారి రెండు బంగారం గాజులు, సూత్రం బిళ్ళ రాజ్యం తీసుకుంది. "అమ్మ పోయింది. ఇక ఇంటితో రుణం తీరిపోయింది. ఆ హైద్రాబాద్ నేను వచ్చేదా పెట్టేదా... నాన్న జాగ్రత్త ఝాన్సీ, ఇక నీవే దిక్కు" అని రాజ్యం అప్పగింతలు పెట్టింది. "అప్పుడప్పుడూ నా దగ్గరికీ వస్తుండు నాన్నా" అని చెప్పి రాజ్యం వెళ్ళిపోయింది.

తండ్రిని చూస్తే ఝాన్సీకి, సమతకీ చాలా ఆశ్చర్యంవేసింది. అసలాయన ఈ లోకంలో వున్న మనిషిలాగలేడు. రోజులు గడిచినా ఆయన షాకు నుంచి తేరుకోలేదు.

"ఈ ఇంట్లో వుంటే ఈయన తట్టుకోలేరు" అని రాకేష్ వెంటనే అందర్నీ హైదరాబాద్ ప్రయాణం చేయించాడు.

★ ★ ★

సుధాంశుకిప్పుడు మూడేళ్ళు దాటాయి. పట్టపగ్గాలు లేకుండా ఉన్నాడు. ఝాన్సీకి వాడిని చూస్తే ఎంత మురిపెమో. తన కూతురు ఝాన్సీకి, ఈ తల్లి ఝాన్సీకీ పోలికే కనిపించేది కాదు రామారావుగారికి. ఆ ఝాన్సీ సీరియస్‌గా ఏదో చదువులో కంగా వుండేది. ముక్తసరిగా మాట్లాడేది. ఈ ఝాన్సీ కొడుకుతో ఎన్ని కబుర్లు చెబుతుంది. ఎన్ని కథలు చెబుతుంది. వాడే లోకంగా బతుకుతుంది. "వీడికేమయినా అయితే ఝాన్సీ బతుకుతుందా" అని అనిపించేది మాష్టారికి. వెంటనే తన పాడు ఆలోచనలకు తనమీదే కోపం వచ్చేది ఆయనకి.

ఝాన్సీ రేకుల గదిలోంచి డాబా పోర్షనులోకి మారింది. తండ్రి ఏ నాలుగింటికో లేచి, కాసిని నీళ్ళు పట్టి, ఒక పాలసీసా తెచ్చిపెట్టి మనవడు లేవటంకోసం ఎదురు చూస్తూ కూర్చుంటాడు. వాడికి పొద్దున పూట తెగ బద్ధకం. ఒకపట్టాన లేవడు.

వాడ్ని లేపి, పళ్ళు తోమి, కాస్త స్నానం చేయించేసరికి ఒక యజ్ఞం చేసినంత పని అవుతుంది ఝాన్సీకి. వాడికి బూస్ట్, తండ్రికి కాఫీ ఇచ్చి తను వంట పనిలో పడిపోతుంది. వాడి అల్లరి మరీ ఎక్కువగా వుంటే తీసుకెళ్ళి కిటికీలో కూర్చోపెడుతుంది "కిందికు దిగావంటేనా" వేలు చూపి వాడ్ని బెదిరించి ఇటుతిరిగి నవ్వుకుంటూ వంటయింటిలోకి వెళుతుంది ఝాన్సీ.

పది నిమిషాలు బిక్కమొఖం వేసుకుని అక్కడ కూర్చుంటాడు. ఆ తర్వాత "తాతా! వూ... వూ... ఇక దించులే" అంటాడు.

"అమ్మ పెద్దా, నువ్వు పెద్దా! నువ్వు అమ్మకు చెప్పు" అని డిమాండ్ చేస్తాడు. మొత్తానికి తాతామనవళ్ళ ముచ్చట్లతో మళ్లీ మామూలుకు వస్తుంది స్థితి. ఏ రకం బిస్కెట్లు ఏ డబ్బాలో వున్నదీ, చాక్లెట్లు ఎక్కడ పెట్టిందీ అన్నీ తెలుసు వాడికి. "చాక్లెట్లు ఎక్కువ ఇవ్వకండి నాన్నా, అన్నం సరిగ్గా తినడు" అని ఝాన్సీ అంటే.

"చాక్లెట్లు ఇవ్వవా! నేను అన్నం అసలే తిననుపో" అంటాడు వాడు. వంటచేసి,

తనింత బాక్సులో పెట్టుకుని, ఏవి ఎక్కడ పెట్టిందీ, సుధాకి ఏమి ఇవ్వాల్సిందీ తండ్రికి పదిసార్లు చూపించి ఆఫీసుకెళుతుంది ఝాన్సీ.

ఆమె వెళ్ళాక పగలంతా వాళ్ళ ఇష్టం. ఇంట్లో గంతులువేస్తారు. ఇంటిముందు ఆడుకుంటారు. సుల్తాన్, కోటీలతో కలసి ఎగురుతాడు. సాయంత్రం ఝాన్సీ వచ్చేస రికి మాత్రం ఇద్దరూ నీటుగా స్నానం చేసి కూర్చుంటారు. అమ్మకు ఎదురు పరుగెత్తు కుంటూ వెళ్ళి,

"పండులాగ వున్నానా? నేను పండా, తాత పండా" అని అడుగుతాడు. ఝాన్సీ వాడిని ఎత్తుకుని లోపలకి తెస్తూ, "నువ్వు రాంపండు, తాత జాంపండు" అంటుంది.

వాడు బుంగమూతి పెట్టి "ఉహు వుహూ... ఇది రాంపండు, ఇది జాంపండు" అంటూ రెండు బుగ్గలూ చూపి స్తాడు.

బుగ్గలమీద ముద్దుపెట్టుకుంటూ, "బుగ్గలే విరా ఇక్కడ. అప్పడాల్లాగ అయిపో యాయి. ఇవ్వాళ అన్నం తినలేదా" అంటుంది ఝాన్సీ.

"అప్పలం ఏసుకుని తిన్నాను. పెరు గన్నం... చెప్పనా... సుల్తాన్‌కి పెట్టాను" అంటాడు.

ఆఫీసులో ఏ గొడవలున్నా ఈ పదినిమి షాలు చాలు ఝాన్సీకి అవన్నీ మర్చిపోవ టానికి. అమ్మ పెట్టింది ఏదో తిని ఒక అర గంట వాకింగుకు వెళతారు తాత మనవడు కలసి. అప్పుడే కూరగాయలో, రేపటికి కావ లసిన సరుకులో తెస్తారు.

సుధా అన్నింటికీ పోటీ... వాడికి ఇష్టం లేని కూరగాయలు కొంటూ వుంటే "ఇదెం దుకులే... అమ్మ చెప్పలేదుగా" అంటాడు వాడు. తనకు కావలసినవి కారో, బంతో కొనమంటే తాతగారు కూడా "అమ్మ చెప్ప లేదుగా" అంటారు.

"మర్చిపోయిందిలే" అని చెప్పి, కొనేదాకా ప్రాణాలు తీస్తాడు.

మాష్టారికి జీవితమంతా పిల్లలతోనే గడి చినా సుధాతో గడిపే ప్రతిక్షణం అమూల్య మైన ఆనందం పొందుతున్నాడాయన. ఆ వయసులో వాళ్ళమ్మ ఎంత మౌనంగా వుండేదో వాడంత వసపిట్ట.

ఐదారు నెలలక్రితం అంటే మాష్టారు హైద్రాబాద్ వచ్చిన కొత్తలో ఆ ఇళ్ళల్లో శంకరం అనే అతను వచ్చి చేరాడు. చాలా కాలం సైన్యంలో పని చేశాడతను. అందు కనే అతన్ని "పేరేమిటి?" అంటే "సిపాయి శంకరాన్నండీ" అంటాడు.

ఈ సిపాయి శంకరానికీ, పాపాయి సుధాకి మంచి స్నేహం ఏర్పడింది.

శంకరం దిగులుగా, ఏదో పోగొట్టుకున్న వాడిలా వుంటాడు. ఎప్పుడూ ఏదో వెతుకు తున్నట్టు వుంటాయి అతని చూపులు. ఈమధ్యే అతను పుస్తకాలు అద్దెకిచ్చే షాపొ కటి పెట్టాడు. ఎనిమిది గంటలకే వెళ్ళి పన్నెండుగంటలకి తిరిగివస్తాడు. మళ్ళీ సాయంత్రం ఐదు గంటలకు వెళ్ళి రాత్రి తొమ్మిదింటిదాక షాపులో కూర్చునేవాడు. అందుకే ఝాన్సీకి అతను అంతగా తెలీదు కానీ సుధా మాత్రం పగలంతా అతనితో ఆడుకునేవాడు.

రూములో వున్నంతసేపూ శంకరం కిటికీ ముందు కుర్చీ వేసుకుని వూరికే అలా దిక్కుల్లోకి చూస్తూ కూర్చుంటాడు. సుధాంశు ఆ కిటికీ ముందు చేరి "గుడ్ మార్నింగ్" అంటాడు. అతనిటు తిరిగి నవ్వగానే "అమ్మ తిత్తిందా, కిటికీలో కూర్చు న్నావు" అనేవాడు "అమ్మ లేదుగా... రా" అని పిలిచేవాడు.

"సిపై" "సిపై" అని పిలిచేవాడు సుధా శంకరాన్ని.

సుధాని "ఛోటేలాల్" అని పిలిచేవాడు శంకరం.

ఇంట్లో ఎవరూ అలా పిలవరుగదా, వీడికి మహాసరదాగా వుండేది అలా పిలిపించుకో

వటం. శంకరాన్ని ఎప్పుడూ ఏదో వాగి స్తూనే వుంటాడు.

"మరి నీకు యుద్ధం అంటే భయంలేదా" అనో.

"నన్ను కూడా టాంకుమీదకి తీసుకెళ్తావా" అనో అడిగేవాడు. ఎప్పుడూ యుద్ధం కథలు చెప్పించుకుని వినేవాడు.

శంకరం కూడా రకరకాల శబ్దాలు చేస్తూ, "ఇంతలో బొంయ్ మని. పైన... అలా ఏరోప్లేను వచ్చింది. కింద మేమంతా టాంక్‌లో కూర్చుని, ఆకులు కప్పుకుని బెకబెకమనే కప్పల్లాగా అటూ ఇటూ కదులుతూ 'ధనాధన్'మని విమానాన్ని కూల్చేశాం" అని చెబుతూ వుండేవాడు.

"మరి నీకు దెబ్బలు తగల్లేదా" అనేవాడు కథంతా విన్నాక.

"ఇదిగో ఈ కాలు విరిగిపోయింది కదా" అని తన కుంటికాలు చూపించేవాడు శంకరం.

ఆ కాలుమీద అరచేత్తో రాస్తూ "ఇప్పుడు నొప్పి పోయిందా" అంటాడు వాడు.

కళ్ళల్లో నీళ్ళు తిరుగుతుంటే సుధాని ఎత్తుకొని గుండెలమీద కూర్చోపెట్టుకునేవాడు శంకరం.

"ఏడుత్తున్నావా? నేను చిన్నవాడిని గనుక ఏడుత్తాను. నువ్వు ఇంత పెద్దవాడివి ఏడుత్తారా? ఏక్కిలాయిలే!" అనేవాడు సుధా ఆ కన్నీళ్ళు తుడుస్తూ.

పిల్లవాడు మాటిమాటికీ శంకరం గదిలోకి పరుగెత్తటం, కాసేపయాక మాష్టారు వెళ్ళి వాణ్ణి తీసుకురావటం జరుగుతుంది. ఏదో పలకరింపులుగా మొదలై పదిమాటలుగా పెరిగింది వాళ్ళ పరిచయం.

ఎవరి పనులమీద వాళ్ళు వెళ్ళిపోయిన మధ్యాహ్నాలు ఈ మగవాళ్ళిద్దరూ కూర్చుని ఏదో గతం గురించి చెప్పుకునేవారు. అప్పుడప్పుడూ రాయుడుగారూ కలిసేవాడు వీళ్లని.

"మా నాయిన చిన్నప్పుడే పోయాడండీ. నేనూ, అమ్మ మేనమావగారింటో వుండేవాళ్ళం. ఇంటరు తప్పానని మా మావ నానామాటలు అన్నాడు. అంతే పౌరుషం పొడుచుకువచ్చి, ఏమీ ఆలోచించకుండా పారిపోయి సైన్యంలో చేరానండీ. ఎప్పుడో రెండేళ్ళ తర్వాత మా అమ్మకోవుత్తరం రాశాను.

అసలే మొదట్నుంచీ బుర్ర తక్కువా, ఈ మిలట్రీలో చేరాక అసలు దేన్ని గురించీ ఆలోచించే పనే కలగలేదు మాష్టారూ! పై ఆఫీసరు ఏది చెప్పినా మిషనులా చకచకా చేసేయటమే. అప్పుడు తెలీలేదుగాని బాబాయ్, ఇప్పుడు ఆలోచిస్తుంటే అనిపిస్తోంది అక్కడ వున్న పన్నెండేళ్ళలోనూ నన్ను ఎవడూ మనిషిగా చూడలేదని. ఎంతసేపూ రాంకులు, నంబర్లు, అటెన్షన్‌లు, సెల్యూట్‌లు... అంతే అది వేరే ప్రపంచం.

ఎప్పుడన్నా సెలవుపెట్టి ఇంటికి వచ్చేవాడ్ని. ఇంటికంటే ముందు జనం మధ్య, అలా దేశంమీద తిరిగేవాడిని. ఎక్కడా సైన్యం అంటే గౌరవంకానీ, మర్యాద కానీ నాకు కనిపించేదికాదు.

రోజులట్లా గడుస్తూ వుండగానే నన్ను కొత్త ప్రాంతానికి పంపారు. అంత గడ్డుపోస్టింగు అంతవరకూ చేయలేదు నేను.

అక్కడినుంచి చూస్తుంటే పాకిస్థానీ లోయలు, వాళ్ల మిలట్రీ కాంపులు కనపడుతూవుంటాయి. ఇక అక్కడ రోజూ కాల్పులు. మనిషి మాట వినిపించని ఆ మంచుకొండల శిఖరాల మీద తుపాకీల మోతలు మారుమోగేవి. బయటి ప్రపంచానికి ఏమీ తెలియదు. తెలియనివ్వరు. ఒక రోజు అలాగే ఆ మంచు కొండల మీద కూర్చుని ఎనిమిది గంటలు కాల్పులు సాగించాను. చలికి గడ్డకట్టుకు పోతున్నాను ఒకవైపు. ఈ ఒంటిలో దేనిమీదా స్వాధీనం లేదు. నరాలు, ఒంట్లో రక్తం అంతా గడ్డక

ట్టుకు పోయిందనుకుంటా. చివరికి నాకు స్పృహ పోయింది. ఒకరోజంతా అలాగే ఉన్నానట.

హెలికాప్టరు వొచ్చి నన్ను పెద్ద హాస్పిట లుకి తరలించేసరికి ఈ కుడికాలు చచ్చి పోయి కుళ్లిపోయింది. లాభంలేదని డాక్టర్లు ఇదిగో... మోకాలి కింద వరకూ తీసేశారు. ఆరునెలలపాటు నానా వైద్యాలు చేశారు. చివరికి జయపూర్ నుంచి ఈ కృత్రిమ కాలు తెచ్చి పెట్టారు. నా కాళ్లమీద నేను నిలబడ్డాక మిలట్రీ వొదిలేసి వచ్చేశాను. నే వచ్చి కూడా రెండేళ్లు దాటిపోయింది."అని ఒక రోజు చెప్పాడు శంకరం.



మాస్టారికీ శంకరానికీ రోజురోజుకీ స్నేహం పెరుగుతోంది. శంకరానికి వేరేద యినా పనివస్తే మాస్టారు వెళ్లి షాపులో కూర్చుంటున్నాడు కూడా. మంచిమంచి బొమ్మల పుస్తకాలు తెచ్చి శంకరం సుధాకి చూపిస్తూ కథలు చెప్పేవాడు. "నేను పెద్ద య్యాక విమానం నడుపుతా." అని చెప్పే వాడు సుధా.

క్రమంగా శంకరానికి జీవితంమీద ప్రేమ కలగసాగింది.

"నడివయసు కూడా లేదు శంకరం నీకు. ఏ వరదో వడగళ్లో వచ్చి ఒకసారి ఇల్లు కూలిపోతే ఎప్పటికీ చెట్టుకిందే వుంటామా? మళ్లీ పుల్లాపుడకా చేర్చి గూడు కట్టుకోవాలి నాయనా." అని పదేపదే చెప్పే వారు మాస్టారు, నాయుడుగారు.

"వద్దు మాస్టారూ! పెళ్లి మాట తలచేదే లేదు." అనేవాడు శంకరం. కానీ సుధా తేనె పలుకులు, చిలిపి పనులు చూసినప్పుడు అతని మనసూ ఏవో కలలు కననా రంభించేది.

"మీ తరం వాళ్లు జీవితాన్ని సరిగ్గా అర్థం చేసుకోవడంలేదు శంకరం. అటు ఝాన్సీ అంతే, ఇటు నీవూ అంతే. ఆ కష్టాలకు లొంగిపోయి, వోడిపోయి, బతుకులు ఎందుకు నిస్సారంగా గడుపుతారు. ఆ సమ స్యల్ని గుండె ధైర్యంతోనూ, వివేకంతోనూ ఎదుర్కొని కొత్త మొలకల్లా మళ్లీ బతకా లయ్యా." అనేవాడు రామారావుగారు.

ఝాన్సీకి కూడా ఆయన అలానే చెబు తాడు. శంకరం కథ విన్నాక అతని పట్ల సానుభూతి, ఏదో అనురక్తి కలగసాగింది ఝాన్సీకి. ఝాన్సీ అంటే మర్యాద, అభి మానం కలగసాగాయి శంకరానికి. సుధాంశు ఆ ఇద్దరికీ కేంద్రం. 'సిపాయి' గురించి అమ్మకు, అమ్మగురించి 'సిపాయి'కి ఏదో చెబుతూనే వుండేవాడు. వాడిమాట లతో, శంకరానికి సుధా అంటే ఎంతప్రేమో ఝాన్సీకి అర్థమయ్యింది. అప్పుడప్పుడూ శంకరానికి తమ ఇంట్లో భోజనం పెట్టేది. ఒకరికి ఒకరు అర్థమయినా, గిరి గీసుకున్న తమ పరిధినుంచి బయటపడేవారు కాదు ఎవరూ! ఇప్పుడిప్పుడే ఇక్కడోమాట... అక్కడో పలకరింపు...

మాస్టారు వాళ్లిద్దరి మధ్య ఏదో బంధాన్ని ఆశించసాగాడు. కానీ గట్టిగా అనుకోవడానికే ఆయనకు భయం వేసేది. "ఇద్దరికిద్దరూ నారికేళాలు... పీచుతీసి పెంకు పగలకొడితేగానీ, మృదువైన కొబ్బరీ, మధురమైన జీవజలమూ అందిరావు" అను

కునేవాడాయన. ఒకవేళ శంకరం మెత్త బడ్డా, ఝాన్సీని ఎలా కదిలించాలో ఆయ నకు అర్థం కావడంలేదు. అయినా అవకా శాలు కల్పించుకొని మరీ ఆయన ఇద్దరికీ బోధ చేయసాగాడు. "ఇంత వయసు వచ్చిందా! ముగ్గురు బిడ్డల తండ్రిని. మను మలు, మనమరాళ్ళు. నా వరకూ నాకు ఏ భయమూ బెంగా లేవుగదా అయినా లక్ష్మి పోయాక నా కాలూచేయి విరిగినట్టే అనిపి స్తోందయ్యా. ఇందరున్నా లక్ష్మి లేకపోతే నాకు ఒంటరిగానే అనిపిస్తుంది. కొన్ని ఆలో చనలు, అభిప్రాయాలు పంచుకోవడానికి ఆమె లేదే అని అనిపిస్తుంది శంకరం" అనే వాడు.

"మనిషికి అంతరంగాన్ని పంచుకునే తోడు అవసరమమ్మా. ఎల్లకాలం ఒక్క లాగా సాగదు. బంధాలు, అనుబంధాలు, ఆత్మీయతలు లేకపోతే మనిషి జీవితానికి అర్థమే లేదు తల్లీ" అని కూతురికి నచ్చచె ప్పేవాడాయన.

మొత్తానికి అగ్గిసెగ దగ్గరపెట్టిన వెన్నగి న్నెల్లా శంకరం, ఝాన్సీ ఇద్దరూ కరగసా గారు. కమ్మని నేతిపరిమళాలు ఇంకా పుట్ట లేదు.

మాష్టారు సమతతో శంకరం గురించి పూర్తిగా చెప్పాడు. తను పెంచుకుంటున్న ఆశలు చెప్పాడు. సమత సంతోషంగా "అక్కసంగతి నాకు వదిలేయండి. మీరు ఆ శంకరంగారిని అవుననిపించండి" అంది.

సమత అక్క దగ్గరికి రోజువిడిచి రోజ యినా వచ్చేది. అసలు తాత, మనవడు కలిసి సమతా వాళ్ళింటికే వెళ్ళేవారు కానీ ఆ భార్యాభర్తలు ఎప్పుడు ఇంట్లో వుండేదీ నమ్మకం లేదుగదా! మూడు నాలుగురో జులు కనిపించకపోతేమాత్రం,

"సుద్ధబాబుగారు ఏం చేస్తున్నారు? " అంటూ వచ్చేది సమత.

"నా పేరు సుద్ధకాదు. చుధ" అనేవాడు కోపంగా.

"అబ్బో ఇదంతా కోపమే" అంటూ ఎత్తు కుని చక్కిలిగిలి పెట్టేది.

"చిన్నా చిన్నా" అంటూ వాడు ఇక మాటలు రాల్చిపోసేవాడు.

"చిన్నా ఏమిట్రా. పిన్నీ అని పిలువు" అనేది ఝాన్సీ.

"మరి తాతగారు ఏమంటారు. చిన్నా అంటారు కదా! అసలిది చిన్నా. నేనంతే పిలుస్తా" అనేవాడు వాడు.

"చిన్నా... రాకేష్‌తో పనివుంది. సర్వీసు మాటర్సులో కేసువుందట. ఆఫీస్ వాళ్ళు లాయరుకోసం చూస్తున్నారు. రేపుదయం ఎనిమిది గంటలకు రమ్మని చెప్పనా" అంటూ ఝాన్సీ ఏదైనా అడుగుతుంటే,

"ఆగు... ఆగు చూడు" అంటూ గడ్డం పుచ్చుకొని "ఇప్పుడు నువ్వు చిన్నా అన్నా వుగా నన్ను అనొద్దంటావే" అని అమ్మకు అడ్డం తగులుతాడు.

"మాకు చిన్నా... నీకు పిన్నిరా" అంటూ ఝాన్సీ వాడ్ని ముద్దాడేది.

సమత వీలు చూసుకుని అక్కతో నాన్న గారి ఆశలగురించి, శంకరం గురించీ చెబు తూనే వుండేది. సమత ఇచ్చిన ధైర్యంతో మాష్టారు శంకరాన్ని డైరక్టుగా అడిగేశాడు.

"ఆడపిల్ల తండ్రిని శంకరం! ఝాన్సీ గురించి ఏ దాపరికమూ లేకుండా చెప్పాను. మీరిద్దరూ పెళ్ళి చేసుకుంటే నాకు సంతోషమయ్యా"

"నాలో పెళ్ళిమీద ఇప్పుడిప్పుడే ఆశలు కలుగుతున్నాయి. దానికి కారణం మీరే మాష్టారూ! సుధలాంటి పిల్లవాణ్ణి ఎత్తుకో వాలని కలలు గంటున్నాను. కానీ ఝాన్సీ లాంటి గొప్ప మనిషికి భర్తనయ్యే అర్హత నాకు లేదు మాష్టారూ! ఆవిడ యం.కాం. అయితే నేను ఇంటరు తప్పినవాణ్ణి. సున్ని తమైన భావాలకోసం బతుకంతా బలి చేయడానికి సిద్ధపడ్డ కోమలమూర్తి ఆవిడ. కొండల్లో తిరిగి బండబారిన కండ లతో,మనసు, మమత మర్చిపోయిన మొర

టువాణ్ణి నేను. అపరంజి బొమ్మలాంటి అందం ఆమెది. కాలులేని అవిటివాణ్ణి నేను. మా ఇద్దరికీ ఎలా కుదురుతుంది మాష్టారూ! నాకు అంత గొప్ప ఆశలు లేవు మాష్టారూ" అన్నాడు శంకరం.

"నీలో మంచితనం వుంది శంకరం. మొరటువాణ్ణి అనుకుంటున్నావుగానీ, మన సును బతికించుకోవడానికి, మమతలు పంచుకోవడానికీ నువ్వెంత ఆరాటపడుతు న్నావో నాకు బాగా తెలుసు. అసలు దాంప త్యంలో కావలసింది ఒకరిని ఒకరు అర్థం చేసుకుని సానుభూతి చూపుకునే లక్షణం. అది నీలో పుష్కలంగా వుంది"

"నేను వూహించని విషయం అడిగారు మాష్టారూ. నాకు ఏమీ అర్థంకావడంలేదు. తర్వాత చెబుతాను" అన్నాడు శంకరం.

అటు సమత కూడా ఝాన్సీని సూటిగా అడిగింది.

"నిన్ను పిల్లవాడితో సహా ఆదరించే మనిషి కావాలన్నావు ఒకప్పుడు. శంకరంగా రిని చూస్తున్నావు కదా! నిన్ను చాలా గౌర విస్తారు. సుధా అంటే ప్రాణం పెడతారు. ఆయనను పెళ్ళి చేసుకోవడంలో ఏమిటి నీ అభ్యంతరం? "

"శంకరంగారి గురించి నాకు తక్కువ అభిప్రాయంలేదు. కానీ నా రోజులు సుఖం గానే గడిచిపోతున్నాయికదా. మళ్ళీ ఈ కొత్తబంధాలు, కాపురాలు ఎందుకు అనిపి స్తోంది" అంది ఝాన్సీ.

ఆ మాటలతో, అక్క మనసు మునపటి కాఠిన్యాన్ని చాలావరకు కోల్పోయిందని సమతకు అర్థమయ్యింది.

"జానకిగారిని చాలాసార్లు కలిశావుగదా! ఆమె అసిధారావ్రతం చేస్తోంది. నాకంత మనోధైర్యం లేదేమో! అన్నావు ఒకసారి. ఇలాంటి అవకాశాలు అన్నప్పుడల్లా రావు. బాగా ఆలోచించు అక్కా" అంది సమత.

"ఏమో నా మనసింకా సమాధాన పడ డంలేదు. తర్వాత చూద్దాం" అంది ఝాన్సీ.

★ ★ ★

"నేను ఒకసారి మనూరు వెళ్ళిరావా లమ్మా"

"దేనికి నాన్నా" అంది ఝాన్సీ.

"అదేనమ్మా! ఈ వర్షాలకీ వరదలకీ ఇల్లు ఒకపక్క కూలిపోయిందట. స్థలంలో కూడా పోషణ లేక, అడవిలాగా తయారయ్యిం దట. కుటుంబయ్య వుత్తరం రాశాడు. నేను వెళ్ళి కాస్త సరిచేయించి వస్తానమ్మా. ఇల్లు కాస్త జాగ్రత్తగా చూసేవాళ్ళకిద్దాం ఈసార యినా"

"వీలుంటే అది అమ్మేసి వచ్చేయండి నాన్నా. అద్దె డబ్బులు కూడా సరిగ్గా అంద టంలేదు. ఇక్కడే ఏదో చూసుకోవచ్చు" సమత కూడా ఏవో సభలని చెప్పి ఊరె ళ్ళింది అంతకుముందే. సుధని ఝాన్సీ తన తోపాటే ఆఫీస్‌కు తీసుకువెళ్ళింది మొదటి రోజు. రెండో రోజు వాడు "నేను నీతోరా నుపో. అక్కడేమీ బాగోలేదు" అని మారాం చేశాడు.

"పోనీ శలవు పెడదాం" అని ఝాన్సీ అనుకునేంతలో వాడు "నేను సిప్పాయితో ఆడుకుంటాను. నువ్వుపో" అంటూ శంక రందగ్గరికి పరుగెత్తాడు.

"పోనీ వుండనివ్వండి. నాకు అలవాటే గదా" అన్నాడు శంకరం. ఝాన్సీ చాలా మొహమాటపడింది.

"సంవత్సరం నుంచీ మేమిద్దరం ఫ్రెండ్స్‌మి. ఇవ్వాళ కొత్తగా ఫీలవుతున్నారే మిటి? " అన్నాడు శంకరం.

"రోజూ నాన్నగారు వుంటారు. రోజంతా వీడి అల్లరి భరించడం మాటలా"

"అల్లరికాదు. మేం ఆడుకుంటాం. అసలు షాపుకి వెళతాం" అని పట్టుబట్టాడు సుధాంశు.

సరే అనక తప్పలేదు ఝాన్సీకి. వాడి పాలు, అన్నం అవీ చూపించబోతుంటే 'నాకన్నీ తెలుసండీ' అన్నాడు శంకరం.

"కోటీ! బాబు ఇంట్లోనే వుంటాడు. వాడు



దొడ్డికదీ వెళితే చూడు" అని కోటేసుతో కూడా చెప్పింది ఝాన్సీ.

సాయంత్రం ఝాన్సీ వచ్చేసరికి రోజూ లాగే స్నానంచేసి కూర్చుని వున్నాడు బాబు. "సిపాయి నీళ్ళు పోశాడు" అనిచెప్పాడు. మధ్యాహ్నం పాలు వొలకబోశాడట. ఆయనే అంతా క్లీన్ చేశాడు.

"ఎందుకండీ... నేను వచ్చి చూసుకునేదానిని కదా" నొచ్చుకుంది ఝాన్సీ.

"భలేవారే... అమ్మ వచ్చేసరికి బాబు పండులా వుండొద్దూ... కదూ ఛోటేలాల్" అన్నాడు శంకరం.

"అవును మరి... ఇదిగో రాంపండు... జాంపండు వూరికెళ్ళింది" అంటూ బుగ్గలిచ్చాడు వాడు.

ఆ రాత్రికి శంకరానికి కూడా వంట చేసింది ఝాన్సీ. కానీ పిలవాలంటే 'ఏమిటోగా' అనిపించింది. నలుగురూ ఏమనుకుంటారో అని మాత్రం కాదు. ఆమెకే మనసులో ఇది అని చెప్పలేని భావం. చివరికి కోటిని పిలిచి శంకరం రూమ్‌కే పంపింది భోజనం. మరునాడూ అంతే... పగలంతా శంకరంతోనే వున్నాడు ఛోటేలాల్.

ఝాన్సీ వచ్చేసరికి వాడికి కాస్త వొళ్ళు వెచ్చబడింది. "పగలంతా ఎగిరి వుంటాడులే" అనుకొని క్రోసిన్ బిళ్ళ ఒకటి వేసింది.

కానీ అర్ధరాత్రయేసరికి వాడి ఒళ్ళు విపరీతంగా కాలిపోతుంటే లేచి లైటు వేసి చూసింది. జ్వరంతో వొణికిపోతున్నాడు. "సుధా సుధా" అని కేకేసినా పలకటంలేదు వాడు. ఝాన్సీకి భయంవేసి "బాబాయిగారూ బాబాయిగారూ" అంటూ రాయుడు గార్ని లేపింది. ఆయన, చంద్రావతి వచ్చి యింకా కంగారుచేశారు. తడిసీళ్ళ గుడ్డ వాడిముఖంమీద వేసి ఒళ్ళంతా తుడుస్తూ కూర్చుంది ఝాన్సీ.

చంద్రావతి గబగబా ఇంట్లోకి పోయి ఉప్పు, మిరపకాయలు తెచ్చి వాడి మంచం చుట్టూ తిప్పి తీసుకెళ్ళి నిప్పుల్లో వేసింది.

"దఫ్తర్‌కు తోలుకపోతివి నిన్న. ఎవని కండ్లుబడ్డాయో" అంది.

ఇంతలో పిల్లవాడికి చిన్న బిడ్డ మూర్ఛలు లాగ వచ్చాయి. వొళ్ళు బిగుసుకుపోయి, మూతి, కళ్ళు ఎగరేస్తున్నాడు. రాయుడు గారు సిగరెట్ అంటించి వాడినొసలమీద కాల్చబోయాడు. హడావుడిగా వచ్చిన శంకరం "కాల్చకండి బాబాయి! ఇది ఏం జబ్బో ఏమిటో. హాస్పటల్‌కు తీసుకువెళదాం. సాయంత్రం దాకా బాగానే వున్నాడు. ఇంతలో ఇలా ముంచుకువచ్చిందేమిటో మాయగా" అంటూ గబగబా వాడిని ఎత్తుకొని బయటకు నడవసాగాడు.

ఝాన్సీ, రాయుడుగారు తాళంవేసి అతని వెంటపడ్డారు. "కోరంటి ఆస్పత్రికి రండి" అంటూ కేకవేసి, సెకండ్ షోనుంచి వస్తున్న రిక్షా ఒకటి పట్టుకుని శంకరం ముందుగా వెళ్ళిపోయాడు.

ఝాన్సీ, రాయుడుగారు వచ్చేసరికి బాబు ప్రశాంతంగా నిదరపోతున్నాడు ఫిట్స్ ఆగిపోయి, డ్యూటీ డాక్టర్ ఇచ్చిన ఇంజెక్షన్‌కి.

"జ్వరం విపరీతంగా వుంది. చిన్నపిల్లలకి ఇలాగే ఫిట్స్ వస్తాయి. కంగారేమీలేదు" అని చెప్పి "సంవత్సరంలోపు ఎప్పుడయినా ఇలా జరిగిందా? ఎప్పట్నుంచీ జ్వరం?" అంటూ ఏవేవో ప్రశ్నలు వేశాడు డాక్టరు.

"ఇదే మొదటిసారి డాక్టర్. ఇంతవరకూ వాడికి ఏ జబ్బూ చేయలేదు" ఝాన్సీ ఏడుస్తూ చెప్పింది.

అడ్మిషన్ ఛార్ట్ రాసి వార్డులోకి పంపాడు డాక్టర్. "నేను ఇక్కడే వుంటాను. మీరు వెళ్ళండి బాబాయి" అని రాయుడు గార్ని పంపి శంకరం వార్డుముందే పచార్లు చేయసాగాడు.

తెల్లవారేసరికి ముఖం అంతా వుబ్బి కళ్ళు ఎర్రబడ్డాయి సుధాకి. పెద్దడాక్టరు వచ్చి చూసి "ఇది మీజిల్స్" అని చెప్పి మరో వార్డుకి మార్పించాడు. కంగారేం

లేదు. జ్వరం తగ్గటానికి వారం పడుతుంది అని చెప్పాడాయన.

ఏం ఫర్వాలేదని డాక్టర్లు చెబుతూనే వున్నారు. వాడికి జ్వరంలోనే వాంతులు, విరోచనాలు, దగ్గు, పడిశం అన్నీ పట్టుకున్నాయి. రెండుమూడురోజులు గ్లూకోజ్ సెలైన్ సీసాలు ఎక్కించారు. శంకరం, ఝాన్సీ పడ్డ కంగారుకు అంతులేదు. అతని కంటే ఝాన్సీయే కొంచెం ధైర్యంగా వుంది కనీసం పైకి.

మూడోరోజు సమత వచ్చింది. సమతను చూడగానే శంకరం కాస్త స్థిమితపడి ... "అమ్మయ్య మీరు వచ్చారు. నాన్నగారు కూడా ఊళ్లోలేరు. ఎలాగా ఏమిటా అని చాలా కంగారుగా ఉంది నాకు. ఝాన్సీ ఏమీ తినడంలేదు మూడురోజుల్నుంచీ. ఇక ఫర్వాలేదు." అంటూ కాస్త బరువు దించుకున్నవాడిలా అయ్యాడు. అయినా సుధాకి జ్వరం పూర్తిగా జారిపోయి ఇంటికి వచ్చేవరకూ శంకరం ఇంటికీ హాస్పటలుకీ కాలుగాలిన పిల్లిలా తిరిగాడు.

వొళ్లంతా రాష్ (తడపర) వచ్చి తగ్గాక గానీ వాడిని డిస్చార్జి చేయలేదు. ఈ పది రోజుల్లో శంకరం రెండుపూటలు కూడా షాపు తెరవలేదు.

"ఇప్పుడు బాగానే వున్నాడు కదా! మీరు షాపుకి వెళ్లండి శంకరంగారూ" అని ఝాన్సీ చెప్పినా, "షాపుదేముందండీ. ఛోటేలాల్ ఇంటికి వచ్చాకే నేను షాపుకి వెళ్లేది." అన్నాడతను.

ఇల్లు బేరం కుదిరిందని అమ్మివచ్చారు మాస్టారు. ఆయన వచ్చేసరికి పదిరోజులు పట్టింది. ఆయన వచ్చేసరికి జబ్బుతగ్గి మాటల్లో పడ్డాడు సుధా.

"ఏదో మాటవరసకు అంటున్నాడేమో కానీ పిల్లవాడిని పెళ్లి చేసుకున్నాక ఆదరిస్తాడా అని ఝాన్సీలో ఏ మూలో ఉన్న అనుమానం ఈ పదిరోజుల్లో పటాపంచలయ్యింది. శంకరానికి సుధా మీద అంత అభిమానం ఏమిటో అర్థం కాలేదామెకు.

ఈ లోకంమీదే ఆసక్తి కోల్పోయిన రోజుల్లో శంకరాన్ని తన వచ్చీరాని మాటలతో చిరునవ్వులతో ఆకర్షించి లోకంమీద ఆనందాలు కూడా వున్నాయన్న గుర్తింపుని చ్చాడు సుధా. అందుకే శంకరానికి వీడంటే అంత ఇది. ఇది కొంచెమే అర్థం చేసుకుంది ఝాన్సీ.

ఝాన్సీని కాస్త పెడసరం మనిషిగా అర్థం చేసుకున్నాడు శంకరం. అంత పట్టుదలతో అంటీముట్టనట్టు వుండే స్త్రీని చూడటం అతనికిదే మొదలు. ఆమె మనసు శిలాసదృశం అనుకున్నాడు. కానీ ఆమె ఎంత బేలగా విలపించేదీ, ఆపదలో ఆసరాకోసం వెతుక్కునేదీ తెలిసిందతనికి ఈ పది రోజుల్లో. ఆమె మౌనం ఒక రక్షణ కవచంగా ఏర్పరచుకుందేగానీ ఈమెలోనూ స్పందనలు ఇంకా సజీవంగా వున్నాయని అతనికి అర్థమయ్యింది. పెళ్లి అయితే తనను ఏమయినా చిన్నచూపు చూస్తుందేమో అని అతనిలో వున్న అనుమానాలు నివృత్తి అయ్యాయి.

★ ★ ★

ఆ రోజు ఝాన్సీ డా. జానకిగారికి ఫోను చేసి "రేపు ఆదివారం మీరు ఇంట్లో వుంటారా మేడం! కొంచెం మాట్లాడాలి" అని అడిగింది.

ఆవిడ అరక్షణం ఆగి "ఎటూ వెళ్లటంలేదమ్మా. పది గంటలకల్లా వచ్చేయి. కలిసి లంచ్ చేద్దాం" అని ఆహ్వానించింది. సుధాని తీసుకుని బయలుదేరింది ఝాన్సీ.

"రండి, రండి! మీకోసమే చూస్తున్నాను" తలుపులు తీస్తూ అన్నది మేడం "నమస్తే మేడం" అంటున్న ఝాన్సీతో. "నమస్తే మేడం" అన్నాడు సుధా వాళ్లమ్మని అనుకరిస్తూ.

వాణ్ణి తీసుకుని ఎత్తుకుంటూ "ఈమధ్య వీడికి ఏదో జబ్బు చేసిందన్నది సమత. ఇప్పుడు హెల్త్ బావుందా?" అడిగిందా

విడ.

"మీజల్స్ వచ్చి తగ్గిపోయింది మేడం. ఇప్పుడు ఫర్వాలేదు" ఏదో మాట్లాడుకోసా గారు.

రెండు నిమిషాలు సైలెంటుగా కూర్చుని సుధా లేచి, చిన్నగా పచార్లు మొదలెట్టి, ఇంటిముందు గార్డెన్‌లోకి వెళ్లి పూలు చూడటం, గదుల్లోకి వెళ్లి ఏమున్నాయో వెతకటం ఆరంభించాడు. జానకిగారు లేచి వెళ్లి ప్లేటునిండా బిస్కట్లు వేసి తీసుకొచ్చి మధ్యలో పెడుతూ "తీసుకోండి" అంది.

"నాకొద్దు... నేను ఆడుకుంటా" అని తోటలోకి వెళ్లి ఒక్కడే కాసేపు ఏవో పాటలు పాడుకుంటూ ఆడుకున్నాడు. పది నిమిషాల్లో తిరిగివచ్చి "ఇప్పుడు తింటా బిస్కెట్లు" అని నాలుగైదు తిన్నాడు. మంచినీళ్లు తాగుతూ "మీకు నా అంత బాబులేడా? నేను ఆడుకుంటా" అన్నాడు వాడు సడెన్‌గా.

"నాకు ముప్పైమంది బాబులున్నార్రా. అంతా స్కూలుకు వెళ్లారు" అంటూనే డా. జానకి పనిమనిషిని పిలిచి "బాబును తీసుకెళ్లి మిసెస్ రేఖావాళ్ల పిల్లలతో కాసేపు ఆడించి తీసుకురాపో" అంటూ పంపింది.

వాళ్లటు వెళ్లగానే "మేడం, పిల్లల ముద్దు మొహాలు, చిలిపి మాటలు మనలో ఏదో తెలియని ఆనందం నింపుతాయి. నా వరకూ నాకు ఆఫీసులో ఏమి జరిగినా ఇంటికి వచ్చి పది నిమిషాలు వీడితో ఆడితే మనసంతా హాయిగా అనిపిస్తుంది. మీకు అలా పిల్లలు కావాలనిపించదా మేడం" అంది ఝాన్సీ చర్చకునాందిగా.

"పువ్వుల్లాంటి పిల్లల నవ్వులు ఎవరికి ఆనందాన్నివ్వవు ఝాన్సీ. నాకు పుడితేనే పిల్లలా? పక్క ఇంటి తోటలో గులాబీలు మనకి ఆనందాన్నివ్వవా?" అడిగింది డా. జానకి.

"ఏమో మేడం. ఎంతమంది పిల్లలనో చూశాను. ఆ క్షణంలో ముద్దు వస్తారు. కానీ వీడు నా రక్తంలో రక్తం. వీడికీ లోకంలో వున్నదల్లా నేను. వీడి బాధ్య తంతా నాది. వీడిమీద వున్నంత ప్రేమ పక్క ఇంటి పిల్లలమీద ఎలా కలుగుతుం దండీ?"

"ప్రేమనేది ఎవరికి వారు పెంచుకునేది ఝాన్సీ. మన మనసుకు మనం నేర్పుకునే భావం అది. ఇంకో నలుగురు పిల్లలను దగ్గరకి తీసి వాళ్ల బాధ్యతంతా నీదే అను కుంటే నాలుగు రోజులయిపోయాక వాళ్లం దరిమీదా నీకు వీడిమీదిలాగ ప్రేమ కలుగు తుంది. ఇప్పుడు శిశుమందిరంలో పిల్ల లంతా నావాళ్లనే అనిపిస్తుంది నాకు. అసలు పిల్లలదాకా ఎందుకు? ఏ పిల్లినో, కుక్కనో పెంచినా దానికేదయినా అయితే ప్రాణం విలవిలలాడిపోతుందిగదా!"

"పరాయివాళ్లకీ, నా అనే వాళ్లకీ తేడా లేకపోతే జనమంతా ఎందుకు నా పిల్లలు, నా వాళ్లు అంటూ కుటుంబాలు ఏర్పరచు కుంటున్నారు?" ఆసక్తిగా అడిగింది ఝాన్సీ.

తేడా మన దృష్టి నుంచి ఏర్పడుతుందం టాను ఝాన్సీ. నా అనే దగ్గరినుంచి మన అనేంతగా మనిషి పెరిగితే, సమిష్టి వాటిని స్వంతంగా భావించేంతగా మనిషి ఎదిగితే, తమ పరిధిని విశాలం చేసుకోగలిగితే ఆ తేడా పోతుందంటాను"

"సరిగ్గా అర్థం కాలేదు మేడం" అంది ఝాన్సీ.

"ఒక ఉదాహరణ చెబుతాను విను. ఒక మనిషి స్కూటరో, సైకిలో కొనుక్కున్నాడ నుకో. మొదట్లో దాన్ని ప్రాణంలా చూసు కుంటాడు. రెండు పూటలా శుభ్రం చేయటం, ఆయిలువేసి కండీషనులో వుండేలా చూడటం ఏవేవో చేస్తాడు. అదే ప్రభుత్వం ఒక కొత్త బస్సును ప్రవేశపెట్టిం దనుకో ఆ కొత్త సీట్లను బ్లేడుతో కోయటం, చక్కగా వున్న పెయింటును గీరి ఏవో పిచ్చి

 

రాతలు రాయటం, ఏ సమ్మెలో వస్తే ఆ అద్దాలను రాళ్లువేసి బద్దలుగొట్టడం జరుగుతోంది. కారణం ఏమిటి? ఆ బస్సు తనది కాదనుకోవడమే. నిజానికది అతను, అతని లాంటి పదిమంది ఇతరులూ కట్టిన టాక్సులతో కొన్న బస్సు. ప్రభుత్వ ఆస్తి అంటే దానిలో నాకూ వాటావుంది అనే గుర్తింపు వున్న సమాజంలో ఆ బస్సునూ తన స్వంత సైకిలంత జాగ్రత్తగా చూస్తారు ప్రజలు. అక్కడ స్వంతం, పరాయి అనే భావం నశించిపోతుంది. ఈ ప్రేమలూ అంతే! ఒక్క వ్యక్తి చుట్టూ పెరగటంకాక పదిమంది వైపూ అల్లుకుంటాయి"

"అంటే భార్యాభర్తలూ, తల్లీ పిల్లలు అనే బంధాలు పోతాయంటారా? "

"అవిపోవు. సరికొత్త అర్థాలు తెచ్చుకుంటాయి. భార్యాభర్తలు అంటే ఒకరిమీద ఒకళ్లు ఆధారపడేవాళ్లుగాకాక మానసిక సహచరుల్లా వుంటారు. నీ పిల్లలమీద నీకే కాక ఈ సమాజానికే ప్రేమ కలుగుతుంది. నీవు, నీ పిల్లలనే కాక పిల్లలందరినీ ప్రేమించటం నేర్చుకుంటావు"

"అయితే ఈ పెళ్లిళ్లూ కుటుంబాలు నశించిపోతాయా? "

"మార్పు చెందుతాయంటాను. పెళ్లి అనేది మొదటినుంచీ ఇవ్వాళ మనం చూస్తున్నట్టుగానే లేదు. మనుషుల అవసరాలు మారేకొద్దీ ఈ కుటుంబాల స్వరూపాలు, ఈ పెళ్లిళ్లు అన్నీ మారుతూ వుంటాయి. మన కళ్లముందే సమిష్టి కుటుంబాలు పోయి వ్యక్తిగత కుటుంబాలు పెరగటం చూస్తూనే వున్నాంకదా"

"నాన్నగారూ, సమతా నన్ను పెళ్లి చేసుకోమని చెబుతున్నారు. మీరు ఒంటరిగా బతకడం లేదా? నాకు కనీసం సుధా అయినా ఉన్నాడు. నేను మీలాగ బతకలేనా అనిపిస్తుంది. ఒక్కోసారి వాళ్లమాటలూ నిజమేననిపిస్తుంది. ఎటూ తేల్చుకోలేకపోతున్నాను" అని ఝాన్సీ శంకరం సంగతి అంతా చెప్పింది.

డా. జానకి కొంచెం ఆలోచించింది. "మనం ఎలా బతకాలి అనేది ఒకర్ని చూసి అలా, ఇలా అనుకోవడం తప్పు ఝాన్సీ. ప్రతి మనిషీ తన ఆలోచనలూ, స్పందనలూ, అవసరాలూ దృష్టిలో ఉంచుకుని నిర్ణయించుకోవాలి. లేకపోతే శాంతి వుండదు. నేను పెళ్లి చేసుకోవద్దు అని ఎవరికీ చెప్పను. అలాగే పెళ్లి తప్పనిసరిగా చేసుకోవాలి అనీ చెప్పను. తిండీ తిప్పల కోసమో, నలుగురూ ఏమనుకుంటారో అనో, ఎవడినో ఒకడిని పెళ్లి కంపల్సరీగా చేసుకోవాలిగదా అనో మాత్రం పెళ్లి చేసుకోవద్దంటాను.

"ఫలానా మనిషితో బతుకు పంచుకోవాలి, ఈ మనిషితో అనుబంధం కావాలి అనే మానసిక అవసరం నుంచి పెళ్లి జరగాలి స్త్రీకయినా, పురుషుడికయినా"

"అయితే మరి మీరు...." అర్థంతరంగా ఆగింది ఝాన్సీ.

"ఈ మనిషికి అర్పించుకోవాలి అనే భావం నాకింతవరకూ కలగలేదు. అదీకాక ఇన్నాళ్లూ ఒంటరిగా బతికానా, నాకంటూ కొన్ని పద్ధతులు ఏర్పడ్డాయి. ఒక పట్టాన వాటిని వదులుకోవడం కుదురుతుందనుకోను. ఇక నేను ఇంకో మనిషితో అడ్జెస్టు అయ్యి ఒక కప్పు కింద బతగగలనని నాకనిపించడం లేదు"

"క్షమించండి మేడమ్! పెళ్లికి కేవలం మానసిక అవసరాలేనా, శారీరక సౌఖ్యాలు, అవసరాలు...? ముందుముందు సమాజాల్లో ఏమోకానీ కనీసం ఇప్పుడు మనిషి శృంగారజీవితాన్ని, వైవాహిక జీవితంతో ముడి పెట్టింది గదా సమాజం. అలా కానప్పుడు అది అవినీతి అవుతుందా? " అడిగింది ఝాన్సీ.

"నీ ప్రశ్న అర్థమయ్యింది ఝాన్సీ. నా మేధస్సునూ, మనస్సునూ నా ఆత్మనూ, నా ఆత్మ గౌరవాన్నీ గుర్తించని మొగవాడికి ఈ

శరీరం ఎలా లోబర్చను? అది నాపట్ల నేను చేసుకునే పెద్ద అవమానం. ఇక ఆ అవమానంలో ఈ శరీరానికి సౌఖ్యం ఏమిటి?

"తలెత్తే కోర్కెలను మరో మార్గంలో మళ్లిస్తే, మనసును మరోదానిమీద కేంద్రీకరిస్తే నిగ్రహంగా బతకటం అంత దుస్సాధ్యమేమీ కాదమ్మా" అంది డా. జానకి.

"అందరికీ అది సాధ్యమంటారా? అంత అవసరం అంటారా? ఈ శరీరాన్ని శుష్కింపచేసుకోవటం" అంది ఝాన్సీ.

"అది మనిషినిబట్టి వుంటుందని ముందే చెప్పానుకదా ఝాన్సీ. మనిషికి అన్నీ దొరకాలనుకోవటం పేరాశ. కోట్లాదిమంది ఆత్మల్ని చంపుకుని, ఆత్మ గౌరవాల్ని కోల్పోయి శరీరాలకు సుఖం తెచ్చుకుంటూ వుంటే, కేవలం ఆ సుఖంకోసం పెళ్లికి తలపడుతుంటే, ఏ కొద్దిమందో శరీరాల్ని కష్టపెట్టుకుని అయినా తమ ఆత్మల్ని బతికించుకుందామనుకునేవారు వుండరా? " అంది మేడం.

ఝాన్సీ వెళ్లేముందు డా. జానకి మళ్లీ అంది "నీ మాటల్నిబట్టి చూస్తే నీకూ, ఆ శంకరానికీ ఒకరిపట్ల ఒకరికి అభిమానం వుందని అర్థమవుతోంది. నిన్ను, నీ వ్యక్తిత్వాన్నీ, నీ బిడ్డను ఆదరించే మనస్తత్వం వున్నవాడిలాగానే వున్నాడు తను. మీరు పెళ్లి చేసుకోవటంలో నాకు అభ్యంతరం ఏమీ కనిపించటం లేదు ఝాన్సీ"

★ ★ ★

శర్మ జ్ఞాపకాలు ఝాన్సీలో తగ్గిపోతున్నాయి. నిజం చెప్పాలంటే తనకి సుధా ప్రాణమయ్యాడు, కానీ వాణ్ణి చూసినప్పుడల్లా శర్మ స్మృతి తళుక్కుమనటం మానేసి చాలాకాలమయ్యింది. కానీ ఈ సిపాయితో ఏదో అనుకుంటూ వుంటే మళ్లీ శర్మ కనబడసాగాడు ఆమె మనోవీధిలో. కలలు రేపిన శర్మ ఒకపక్క, వాస్తవ జీవితం పంచుకోవటానికి సిద్ధమవుతున్న శంకరం మరోపక్క. తనని అపరంజి బొమ్మగా భావించిన శర్మ, ఆత్మగౌరవం దెబ్బ తీయడనిపించే శంకరం, మనసులో మధురిమలు నింపిన శర్మ, మమతలు పంచుతానంటున్న శంకరం.

వూహలకన్నా, కలలకన్నా జీవిత వాస్తవాలు బలమయినవి. ఎంత కాలం కాల్పనిక ఆవేశంతో బతుకుతుంది తను.

"నన్ను క్షమించు శర్మా! నా మనోధైర్యం సడలుతోంది. ఈ మనసూ, శరీరమూ మరో మనిషిని కోరుతున్నాయి. సుధాకి తండ్రి ఆదరం పంచే శంకరాన్ని నా జీవితంలోకి ఆహ్వానిస్తున్నాను. నీ మీది ప్రేమంతా సుధా మీదికి మరల్చుకున్నాను. వాడిమీద నాలో పెరుగుతున్న ప్రేమలన్నీ శంకరంతో కలిసి పంచుకుంటాను" అనుకున్నది ఝాన్సీ. తన అంగీకారం తండ్రికి తెలిపింది.

ఝాన్సీ, శంకరం ఒక్కటయ్యారు.

సుధాకి అంతా సంబరంగా వుంది. రామారావుగారికి అంతకంటే ఆనందంగా వుంది.

సిపాయి తమ ఇంట్లోనే వుండటం, తమతోటే అన్నం తినటం సుధాకి చాలా నచ్చాయి. ఒకపూట "మళ్లా యుద్ధం కథ చెప్పు సిపాయి" అని కూర్చున్నాడు వాడు.

"ఇకమీద సిపాయి అనిపిలిస్తే నేను కథ చెప్పను. నా పేరు మారిందికదా అన్నాడు" శంకరం.

"పేరు మారిందా? నాకు తెలీదే ఏమిటి నీ పేరు"

"నాన్న... నాన్న అని పిలిస్తేనే కథ చెబుతాను" అన్నాడు శంకరం.

"నాన్న, నాన్న" అని రెండుసార్లు అని "ఈ పేరు బాగుంది. సిపాయికంటే బాగుంది. చిన్నా, అమ్మ తాతగారిని నాన్న అంటారుకదా! నువ్వు నాకు నాన్న" అని వాడు సంబరంగా గంతులేశాడు.




ఆరు నెలల్లో ఇల్లు, ఇల్లాల్ని ఏర్పరుచుకుని సుధాలాంటి కొడుకు కాదు, సుధానే కొడుకుగా చేసుకుని ఆనందంగా పొంగిపోయాడు శంకరం. ఇప్పుడతనికి జీవితం మనసున్న మనుషులు వీచే మలయమారుతం. అలాగే గ్రహణం విడిచిన నాటి చంద్రబింబంలా వెన్నెలై వెలుగుతోంది ఝాన్సీ మానసం.

ఇల్లు అమ్మిన విషయం తెలిసి, రాజ్యం తండ్రికో ఉత్తరం రాసింది. "నేను దూరంగా వున్నానని నన్ను అన్యాయం చేయకండి. మీకు ముగ్గురు కూతుర్లని మరిచిపోకండి. ఆ ఇంటిమీద నాకూ హక్కువుంది" అని.

మాష్టారికి చాలాకోపం వచ్చింది.

"నువ్వు ఒక్కత్తివేకాదు. నీకు ఇద్దరు చెల్లెళ్లు వున్నారన్న జ్ఞానం వుందా? పదిహేను సంవత్సరాలనుంచీ నేను ఝాన్సీ రక్తం తాగి బతికాను. ఇంకా దాని చెమట పిండుకు తాగుతున్నాను. ఆ ఇంటి మీద హక్కంటూ వుంటే దానికొక్కదానికే వుంది.

"నీ పెళ్లి కట్నం ఎవరు ఇచ్చారు? నేను కాదు. ఝాన్సీ ఇచ్చిందని తెలుసుకో. అమ్మ జ్ఞాపకం అంటూ మీ అమ్మబంగారం నువ్వు తీసుకువెళ్లిన రోజున, నీ చెల్లెళ్లు కనీసం మనసులో కూడా చెడుగా అనుకో లేదే! నీకు చేతులెలా వచ్చాయి. ఇలాంటి ఉత్తరం రాయటానికి. ఎంతగా నువ్వొక మగాడి భార్యవయినా మరీ ఇంతగా స్వంత ఆలోచనలు మర్చిపోయి మొగుడికి తాళం వేస్తావని నేను వూహించలేదు" అని ఘాటుగా సమాధానం రాశాడాయన. అంతే మళ్లీ రాజ్యం దగ్గరినుంచి ఏ కబురూ లేదు.

ఇటు ఝాన్సీ బతుకు వెన్నెట్లో బీరపువ్వులా మారింది. అటు సమత, తనకు కావలసిన వాడిని కట్టుకొని కళకళలాడుతూ తిరుగుతోంది. "లక్ష్మి నువ్వుంటే ఇంకెంత సంతోషించే దానివో" అని తల పోస్తూ మనవణ్ణి ముద్దులతో ముంచేస్తాడాయన.

★ ★ ★

ఒకరు రాగమైతే ఇంకొకరు రంజిమ. ఒకరు వూపిరి అయితే ఇంకొకరు వుత్సాహం. ఒకరు ఉదయమైతే ఇంకొకరు కిరణం. సమత, రాకేష్‌లిద్దరూ మనుషులుగా ఇద్దరూ ఒక్కటయ్యారు. తమ ఆశయాలు సాధించటానికి ఒకరికి ఇద్దరయ్యారు. ఒక మనిషికున్న రెండు చేతుల్లా పనిచేస్తున్నారు వాళ్లు.

"నువ్వు చేస్తున్న పని నాకు నచ్చటంలేదు సమతా" అన్నాడొకరోజు రాకేష్.

"ఏం పని" ఆశ్చర్యంగా అడిగింది సమత.

"అదే నువ్వు కరపత్రాలు పంచటం, ఇంటింటికీ తిరగడం, ప్రూఫులు చూడటం, ధర్నాలలో కూర్చోవటం. రాష్ట్రమండలి సెక్రటరీవి. నాయకత్వం అంటే మనం పనిచేయటమేకాదు. పదిమందితో పని చేయించగలగాలి. రోజువారీ కార్యక్రమంలోపడి నీ సిద్ధాంతాన్ని పదును పరుచుకోవడం విస్మరిస్తున్నావు" అన్నాడు.

"ఏమో రాకేష్, నాకు ఈ చర్చలు, సిద్ధాంత రాద్ధాంతాలు అంటే అంత మనసుకు పట్టదు. పదిమందితో కలిసి పనిచేయటం అంటే ఎక్కువ ఉత్సాహంగా ఉంటుంది"

"నీ ఉత్సాహంకోసం, ఆనందం కోసం కాదుగదా పనిచేసేది. మన శక్తియుక్తులు ఎక్కడ ఎక్కువగా ఉపయోగపడతాయో, అక్కడ పనిచేయాలి. మన ఉద్యమాలు గడ్డురోజుల్ని ఎదుర్కోబోతున్నాయి. చురుకుగా తిరిగే వాళ్లందర్నీ మింగడానికి జైళ్లు నోళ్లు తెరుచుకోబోతున్నాయి. రెండుమూడు నెలల్లో పోలీసులు గందరగోళం చేయటానికి పెద్ద ఎత్తున ప్లాన్లు వేస్తున్నట్టు తెలిసింది. నువ్వు కాస్త జాగ్రత్తగా వుండాలి" అన్నాడు.

"భయపడుతున్నారా రాకేష్! మనం ముందు లేకపోతే ఇంకొకర్ని పట్టుకుంటారు. పోలీసులు పట్టుకుంటారని మనం

పనులు మానేసి కూర్చుంటామా? " చిరుకో పంగా అడిగింది సమత.

రాకేష్ ఆమెను కొంచెం ఆశ్చర్యంగా చూసి ఏ ఉద్యమానికయినా కార్యకర్తలు ఎంత అవసరమో, నాయకత్వమూ అంతే అవసరం. ప్రతి ఉద్యమం తన నాయకత్వాన్ని కాపాడుకోవాలి. కాపాడుకుంటుంది. దానికి తగిన జాగ్రత్తలు తీసుకోవాలి. నీ పని విధానం మార్చుకోవాలి. అన్నీ మానేసి ఏదో రీసెర్చి చేసుకుంటోందిలే" అనే భావం కల్పించు.

"నాలుగు అరెస్టులు జరిగేప్పటికి బెంబేలెత్తితే ఇక మనలో మిగిలేది ఏమిటి? " సమత ఇంకా దూకుడుగానే అన్నది.

"నీలో కాస్త తొందరపాటు ఎక్కువవు తోంది సమతా! నా మాటలు సరిగ్గా అర్థం చేసుకోవటంలేదు నువ్వు" అన్నాడు కొంచెం బాధగా.

"అయితే మీరు సవివరంగా తెలియపర్చండి సంపాదకవర్యా" అంది సమత.

"మనం క్రమంగా ఈ బహిరంగ పద్ధతులుమాని, రహస్య పనివిధానానికి అలవాటు పడాలి. నువ్వు ప్రధానంగా ప్రజాసంస్థల్లోనే పని చేస్తున్నావు. పార్టీలో నీ పాత్ర ఇంత వరకూ అంత బహిరంగం కాలేదు. జాగ్రత్తగా వుండాలి నువ్వు. నా భార్యవని చెప్పటంలేదీ విషయం. ఉద్యమంలో నీ స్థానం అది. ఏ ఉద్యమమూ సాధారణ కార్యకర్తనీ, నాయకుణ్ణీ ఒకే విలువతో అంచనావేయదు. ఉదాహరణకి సత్యప్రసాద్‌గారి లాంటి నాయకుణ్ణి కాపాడటానికి నా ప్రాణం పోయినా లెక్కలేదు. ఇందిర, లక్ష్మి లాంటి కార్యకర్తలు అరెస్టయితే జరిగే నష్టం తక్కువ. నీలాంటి నాయకులు పోలీసుల బారిన పడితే ఉద్యమానికి జరిగేనష్టం ఎక్కువ. సాధ్యమయినంత తక్కువ నష్టం జరగాలని మనం ఏర్పాట్లు చేసుకుంటాం" చిన్నపిల్లలకు చెప్పినట్టు చెప్పాడు రాకేష్.

"ఇప్పుడు మాకు పూర్తిగా బోధపడింది సంపాదకా"

ఈ సంభాషణ జరిగిన ఇరవై రోజులకు రాకేష్ గుంటూరు వెళ్ళాడు. ఆ సమావేశం చాలా ముఖ్యమైనది. నలుగురైదుగురు అగ్రస్థాయి నాయకులు, ముఖ్యమైన కార్యకర్తలూ పాల్గొన్నారు. అయితే...

ఎవరూ ఊహించని రీతిలో పెద్దయెత్తున పోలీసులు దాడిచేసి పదిమందిని అరెస్టు చేశారు. ఒక నాయకుడు మరో ఇద్దరు ప్రముఖులు మాత్రం తప్పించుకోగలిగారు. రాకేష్ అరెస్టయిన వాళ్ళల్లో వున్నాడు. సమావేశంలో పాల్గొంటున్న ఒక ముఖ్యమైన కార్యకర్తే పోలీసులకు సమాచారం అందించి, అందర్నీ పట్టించాడని ఆ తర్వాత తెలిసింది.

సమత దగ్గరకు ఒకతను వచ్చి రాకేష్ అరెస్టు సంగతి చెప్పాడు. ముందు జాగ్రత్త చర్యగా ఆమెను రహస్యస్థావరానికి తప్పుకోమని పార్టీ ఆర్డర్ అని చెప్పాడు. ఎక్కడికి వెళ్ళాలో అడ్రసు చెప్పాడతను.

క్షణం ఆలస్యం లేకుండా సమత అక్క దగ్గరకు పరుగెత్తింది.

"ఇల్లు ఖాళీ చేసేయి. పుస్తకాలు మాత్రం జాగ్రత్త. రాకేష్‌ని అరెస్టు చేశారు. నేను తర్వాత కనిపిస్తాను. కంగారుపడకండి" అని చెప్పి వెళ్లిపోయింది.

"ఏమిటమ్మా! ఇలా వచ్చి అలా వెళ్లిపోతున్నావు" అడుగుతున్న తండ్రికి,

"ఏం లేదులే నాన్నా. కాస్త అర్జంటు పని" అని తను చీకట్లో కలిసిపోయింది.

సమత వెళ్లాక తండ్రికీ, శంకరానికీ విషయం చెప్పింది ఝాన్సీ! తండ్రికది అశనిపాతమయ్యింది. అంతా చాలా కంగారుపడ్డారు. శంకరం అయితే మరీను.

"అయ్యో మనతో ఇక్కడ వుండకుండా తను ఇంకెక్కడికి వెళ్లింది. ఎక్కడ వుంటుంది. అసలే ఆరో నెల కూడానూ" అంటూ కంగారు పడుతుంటే ఝాన్సీకీ అది వాళ్లమ్మ కంఠంలా వినిపించింది.




ఆ తెల్లవారే పోలీసులు రాకేష్ ఇంటి మీద దాడిచేశారు. ఆ సమయంలో ఝాన్సీ అక్కడేవుంది. వచ్చినవాళ్లు ఝాన్సీనే సమత అనుకున్నారు. పార్టీ పుస్తకాలు, ఎరుపు అట్ట లున్న పుస్తకాలన్నీ తీసుకున్నారు. ఎంత వెతికినా వాళ్లకు రహస్య పత్రాలేవీ దొరక లేదు. అంతకుముందే రాకేష్ వాటిని తర లించాడు.

కొంత సామాను, పుస్తకాలు తమ ఇంటికి తెచ్చింది ఝాన్సీ. కానీ ఇల్లు ఖాళీ చేస్తానని చెప్పలేదామె. "పదిరోజుల్లో అన్నీ సర్దుకుం టాయిలే. ఈ భాగ్యానికి ఇల్లు ఖాళీ చేస్తే మళ్లీ దొరకవద్దూ" అనుకుంది ఝాన్సీ. కంగారు ఏమీ వద్దని చెప్పిందిగదా సమత. అదే నమ్మి కూర్చుంది ఝాన్సీ. కానీ మాష్టారు మాత్రం ఇదేదో చాలాకాలం సాగే వ్యవహారం అనుకున్నాడు.

ఝాన్సీ అనుకొన్నట్లు పది రోజుల్లో కొంత సర్దుకుంది. పోలీసులు పట్టుకుపోగా మిగిలిన వాళ్లంతా గ్రూపులు గ్రూపులుగా సమావేశమయ్యారు. ఈ పరిస్థితి వాళ్లకు అనూహ్యంకాదు గనుక దానికి తగిన ఏర్పా ట్లలో వున్నారు. సమతకాక మరో ఆరు గురు లేడీస్ వున్నారు. ఒకళ్లిద్దరిని సిటీలో మామూలుగా పనిచేయమన్నారు. కొందర్ని వేరే ప్రాంతాలకు పంపించారు. సమతను మాత్రం డెలివరీ అయ్యేవరకూ సిటీలోనే వుంచి, ఆ తర్వాత మరో ప్రాంతానికి తీసు కువెళ్లాలని నిర్ణయించారు.

సిటీ అవుటర్ లిమిట్స్‌లో వున్న ఒక వర్కరు ఇంటికి తీసుకువెళ్లారు సమతను.

"మా చుట్టాలమ్మాయి కాన్పుకని వచ్చింది. ఇంతకుముందు ఇద్దరు బిడ్డలు పుట్టి పోయారు. ఈసారయినా జాగ్రత్తగా మందులు ఇప్పించాలని పిలిపించాము" అని చెప్పేవారు ఆ కార్మిక దంపతులు.

"అసలే అంతంత మాత్రం బతుకులు వాళ్లవి. తను వాళ్లమీద బరువైపడ్డానే" అనుకునేది సమత. కానీ వాళ్లు మాత్రం ఈమె ఎవరో తెలియకపోయినా తమ ఆడ బిడ్డలాగ చూసుకునేవారు. నిజంగానే మందులు, మంచి ఆహారం ఇవ్వాలని ప్రయత్నం చేసేవాళ్లు. సమత ఖాళీగా కూర్చోలేక వాళ్ల పనుల్లో కల్పించుకుని చేయబోయినా "ఇదేమిటి మేము మనుష లంకామా? ఈ స్థితిలో మీరు పనిచేయటం ఏమిటి? " అని వారించేవాళ్లు.

రాకేష్‌ను సికిందరాబాద్ సెంట్రల్ జైలుకు తెచ్చారని తెలిసింది. వెళ్లిచూసి రావాలని ఎంతగానో అనిపించేది సమతకి. కానీ ఎలా సాధ్యం అది? ఒక వూళ్లోనే వున్నా యోజనాల దూరం ఏర్పడింది భార్యాభర్తల నడుమ.

సమత వుంటున్న ఇల్లు సైదయ్య అనే కార్మికునిది. ఆమె పేరు సావిత్రి. సిమెంటు పైపులు తయారుచేసే కంపెనీలో పని చేస్తున్నాడతను. సైదయ్య పైకి చాలా తెలివి తక్కువవాడిలా కనిపిస్తాడుకానీ ఎప్పుడు మాట్లాడాలో ఎప్పుడు నోరు మూసుకోవాలో అతనికి బాగా తెలుసు. సావిత్రి చాలా అమాయకురాలు. వాళ్ల కాపురం చూస్తుంటే సమతకు ఆనందం, ఆసక్తి కలిగేవి. తాము ఎన్నో పుస్తకాలు చదివీ, రాజకీయ చైతన్యంపొందీ పెంచు కున్న జ్ఞానంలో సగం ఈ కార్మికుల్లో అప్ర యత్నంగానే వుందనిపించేది ఆమెకు.

జరుగుతున్న సంఘటనల మీద, సంస్క రణలమీద సైదయ్య ఎంత సూటిగా తటప టాయింపులు లేకుండా కామెంట్లు చేసేవా డంటే సమతకు శ్రామికవర్గ చైతన్యం అంటే ఏమిటో అర్థమవ్వసాగింది.

అతను రోజూ పేపరు చదివేవాడు. 'నా ప్రాణం వుండగా కార్మికులకు అన్యాయం జరగనివ్వను' -ముఖ్యమంత్రి ఉవాచ. అని చదివితే "అ' అనే అక్షరం ఎక్కువ పడిందే మిత్రా? " అనే వాడు. 'సంఘవిద్రోహుల మీద పోలీసుల కాల్పులు'- అని కనపడితే, "ఆ కాల్చినవాళ్ల సంఘానికి విద్రోహం

అంటే, ప్రజలకి పనికొచ్చే పనేదో చేసి వుంటారు వాళ్లు" అని ఆ వార్తంతా ఆసక్తిగా చదివేవాడు.

"మా చుట్టాలమ్మాయి అని చెబుతున్నాం. నిన్ను చూస్తే చదువుకున్న దానిలాగ కనపడుతున్నావులే" అని మెడలో ఇన్ని నల్లపూసలు, కాళ్లకు మట్టెలు పెట్టింది సావిత్రి. సమత చేతులనిండా పచ్చరబ్బరు గాజులు వేయించింది.

"ఎవరొచ్చినా నువ్వు మాట్టాడమాకు. అసలు మంచం దిగొద్దు. ముసుగు కప్పుకొని అటు తిరుగు. జబ్బు మనిషని చెబుతాను" అని జాగ్రత్తలు చెప్పేది.

ఒకసారి సైదయ్యను ఝాన్సీ దగ్గరికి పంపింది సమత. ఆమె తను రాకేష్‌ని చూసివచ్చానని, రాకేష్ వాళ్ల నాన్నగారు కాంగ్రెసులో తమ పలుకుబడిని ఉపయోగించి కొడుకును విడిపించే ప్రయత్నాలు చేస్తున్నారని చెప్పింది. సమత బట్టలు కొన్ని బాగులో పెట్టి ఇచ్చింది. ఐదు వందలు సైదయ్యకిచ్చి "దానికేమీ తక్కువ కాకుండా చూడండి" అని కళ్ల నీళ్లు పెట్టుకుంది ఝాన్సీ.

ముందు సైదయ్య డబ్బు తీసుకోలేదు. "అన్నీ పార్టీ చూసుకుంటుందమ్మా" అన్నాడు.

"కాదులే తీసుకో. పార్టీకిమాత్రం మన లాంటివాళ్ళం ఇస్తేనేగదా డబ్బు వుండేది. నా చెల్లిని నేను చూసుకోలేనా" అంది ఝాన్సీ.

వాళ్ళ ఇల్లు, ఆ కుటుంబం అంతా చూసి వచ్చాక సైదయ్య సమతను ఇంకా జాగ్రత్తగా చూడసాగాడు. "అంతంత చదువుకున్నోళ్లు. ఇలా పేదోళ్ళ పార్టీలవెంట తిరుగుతున్నారంటే ఎంత గొప్ప మనసులమ్మా మీవి" అనేవాడు.

సమతను కలవటానికి ఆ ఇంటికి ఇద్దరు, ముగ్గురే వచ్చేవారు. తన పనులన్నీ మళ్లీ మామూలుగా చేయసాగింది సమత. ఇదివరకు అన్నింటికీ తనే పరుగులు తీసేది. ఇప్పుడు ఎవరిని కలవాలో, ఏమి మాట్లాడాలో చెప్పి ఇతరులతో చేయిస్తోంది పని.

పార్టీ సూచనలు అందించే మనిషి ఒకతను ప్రత్యేకంగా వచ్చి కలిసేవాడు. ఈమెనుంచి రిపోర్టులు తీసుకువెళ్ళేవాడు. అప్పుడే రెండు నెలలు గడిచాయి సైదయ్య ఇంటికి వచ్చి

సమతను కలవటానికి వచ్చేవాళ్ళల్లో లక్ష్మీప్రసాద్ అని ఒక స్టూడెంటు వుండేవాడు. అతను ఒకరోజు ఏదో రోడ్డు సైడు గొడవలో ఇరుక్కున్నాడు. తమ పరిస్థితిని మరిచిపోయి ఆవేశంగా, అతను పోలీసులకు వ్యతిరేకంగా పెద్దపెద్దగా మాట్లాడసాగాడు. "లాఠీ గోలీకీ యహ్ సర్కార్ నహీ చలేగీ" అని పిచ్చిపిచ్చిగా కేకలు వేశాడు. వెంటనే అతన్ని అరెస్టు చేసి తీసుకువెళ్ళారు. 'ఎవరితను? ఏమిటి కత' అని మొదలంటా ఆరాలు తీశారు పోలీసులు. పోలీసు దెబ్బలకు తట్టుకోలేక తనకి తెలిసినవన్నీ చెప్పేశాడు ఆ కుర్రాడు.

సమత గురించీ, ఆవిడ వుంటున్న ఇంటి గురించీ ఈ కుర్రాడు పోలీసులకు చెప్పే వుంటాడని అంతా భయపడ్డారు. ఆవిడను రక్షించాలని హుటాహుటి నిర్ణయం తీసుకుని, ఆమెను ఒక కొత్త ప్రాంతానికి పంపేశారు. ఇంకా నెలో, ఇరవై రోజులో పోతే ఆమెకు ప్రసవించే టైము. అయినా పార్టీ సమతని దూరప్రాంతానికి పంపే నిర్ణయం చేసిందంటే అర్థంలేకపోలేదు. హైదరాబాద్‌లో ప్రతి సాధారణ కార్యకర్తనూ కేవలం అతను ఎప్పుడో సమ్మెలో గట్టిగా నినాదాలు ఇచ్చాడనే సాకుతోసహా స్టేషన్‌కు పిలిపించి వేధించసాగారు పోలీసులు ఇన్ఫర్మేషన్ కోసం. ఈ రెండు నెలల్లో అటు గ్రామీణ ప్రాంతాల్లో నిర్మాణాన్ని పటిష్టపరిచింది పార్టీ. ఉన్న పరిస్థితుల్లో ఏ కార్యక్రమాలు




చేయలేకపోయినా, రక్షణకి మాత్రం పక డ్బందీగా ఏర్పాట్లు జరిగాయి. అందుకే సమతను ఇంకో ఏరియాకు తీసుకువెళ్ళారు.



రాకేష్‌ను విడిపించటానికి రఘునాథరెడ్డిగారి శక్తి చాలటంలేదు. హోంమంత్రిని కలిస్తే

"అతన్ని అప్రూవర్‌గా మారమనండి. ఏమీ లేకుండా వొదిలేసేట్లుగా నేను చూస్తాను" అన్నాడు మంత్రి. అదే పెద్ద సహాయం అనుకుంటూ రాకేష్ దగ్గరికి వచ్చాడు తండ్రి "ఏ జన్మకీ అలా జరగదు" అన్నాడు రాకేష్.

'అరెస్టయితే చేశారు కానీ వాళ్ళమీద ఇంతవరకూ కేసు నిర్ధారించలేదు. కుట్ర కేసు పెట్టాలా? జాతీయ భద్రతకింద ఏ కేసు లేకుండా వాళ్ళని ఇలాగే వుంచాలా? టెర్రరిస్టు చట్టంకింద కేసు చేయాలా' అని తలలు బద్దలు కొట్టుకొంటున్నారు. అసలింతవరకూ పోలీసులకు గట్టికేసు పెట్టటానికి ఆధారాలు ఏమీ దొరకలేదు. అందుకే అరెస్టయినవాళ్ళనే పీడించి, ఏవైనా స్టేటుమెంట్లు తమకు కావలసినట్టు తీసుకోవాలని పోలీసులు ప్రయత్నాలు మొదలెట్టారు. రాకేష్‌మీద చాలా వొత్తిడి తెచ్చారు.

రాకేష్‌ని ఇంతవరకూ పోలీసులు "ఏదో విద్యార్థి నాయకుడు" అని మాత్రమే గుర్తించారు. పార్టీ ప్రముఖుల్లో అతనొకడు అని వాళ్ళకింకా పూర్తి సమాచారం లేదు. మిగతావాళ్ళంతా పార్టీకి మూలస్తంభాలు. అందుకే ఇతనిమీద వొత్తిడిచేస్తే వొంగుతాడని ఆఫీసర్లు భావించారు.

ఏ అర్ధరాత్రిపూటో వచ్చి అతన్ని తీసుకెళ్ళేవాళ్ళు. సగం నిద్రలో జోగుతుండగా ఏవేవో సంబంధంలేని ప్రశ్నలు వేసేవారు. కాసేపు కుటుంబ విషయాలు, కాసేపు కాలేజీ కబుర్లు అడిగి సడన్‌గా పార్టీ విషయాలు అడిగేవారు. కళ్ళల్లో పెద్దపెద్ద ఫోకసు లైట్లు వేసి నిద్రపోకుండా చేసేవారు. మనసంతా చికాకు పరిచేవారు.

"డబుల్ యం.ఎ.వి. లాయరువి. ఎంత మంచి భవిష్యత్తు నీకుంది. అదంతా పాడు చేసుకుంటావా" అని హితవచనాలు చెప్పేవారు. "పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గానో, ఏదైనా కమీషను ఛైర్మన్‌గానో వేయిస్తాం" అని ఆశలు చూపేవాళ్ళు.

"ఫలానా నాయకుడు అన్నీ ఒప్పుకున్నాడు. నువ్వు కూడా సరేనంటే మీ ఇద్దరినీ వొదిలివేస్తాం" అనేవారు.

ఇవేవీ పనిచేయకపోయేసరికి శారీరకంగా బాగా హింసించారు. వేళ్ళల్లో సూదులు గుచ్చటం, సిగరెట్లతో కాల్చటం అతి తక్కువస్థాయి చర్యలు. కీళ్ళమీద కొట్టటం, కోదండాలు వేయించటం చేశారు. "అసలు కోర్టు లేదు, కేసులేదు. నిన్నేపూటయినా తీసుకువెళ్ళి కాల్చేయగలం" అని బెదిరించారు.

అన్నిటికీ రాకేష్ సమాధానం ఒక్కటే "నేను చెప్పవలసింది పబ్లిక్‌లోనే చెప్పాను. పత్రికల్లో రాశాను. చేసిందంతా ప్రజలలోనే చేశాను. ప్రజల కోసమే చేశాను. మీరేం చేస్తారనేది మీ ఇష్టం"

రాకేష్‌మీద అందరిమీదకంటే ఎక్కువ వొత్తిడి వుందని అందరికీ తెలుసు. అతను ఏమయినా నోరు జారతాడేమోనని

కొందరు అనుమాన పడ్డారు కూడా. అలాంటివాళ్ళను పట్టుకొని 'రాకేష్ అంతా చెబుతున్నాడు. మీరూ అతనిమీద చెప్పండి' అనేవారు లేదా 'రాకేష్ ఇలా చెప్పాడు మీరు వొప్పుకోండి' అనేవారు పోలీసులు. అయినా పోలీసులకు కావలసిన సమాచారం దొరకలేదు.

ఇలా లాభం లేదని జైలులో వున్నవాళ్ల ఆత్మవిశ్వాసం చెడగొట్టేలా కథలల్లి ప్రచారం చేశారు. ఇంకా ఇరవైమందిని అరెస్టు చేశామనీ, అడవిలో ముప్పైమందిని కాల్చేశామని, బయట నాయకుడెవరో తమ సిద్ధాంతం తప్పని ప్రకటనలు చేశాడనీ, పోలీసులే కొన్ని కరపత్రాలు పార్టీ పేరున ప్రచురించి, తెచ్చి వాళ్ళకు చూపించేవారు. ఏమిచేసినా వాళ్ళ ఆటలు సాగలేదు. పోలీసులు పట్టుకొన్నది పట్టు వొదలని వుడుముల్ని, దేనికీ లొంగని చలిపిడుగుల్ని.

పట్టుబడిన వాళ్ళల్లో ఒక మహిళ కూడా వుంది. ఆమెను చెప్పరానివిధంగా అవమానించేవారు. ఆమెకు వొళ్ళు మండి "మీకు తల్లీ, చెల్లీ లేరా ఇలాంటి మాటలు ఒక స్త్రీతో ఎలా అనగలుగుతున్నారు" అనేది ఆఫీసర్లతో.

ఆఫీసర్లంటే మామూలు వాళ్ళేకాదు, ఉన్నతస్థాయి డిగ్రీలున్న ఆఫీసర్లు వాళ్ళు.

"మా తల్లీ చెల్లీ నీలా బరితెగించినవాళ్ళు కాదే... అసలు మాటలేమిటి అవన్నీ చేసి చూపిస్తాం కూడా" అని ఇంకా అవమానించేవాళ్ళు.

"ఇప్పుడు నిన్ను గుంపుగా మేమంతా అనుభవించినా నీకు దిక్కులేదు పో" అనే వాళ్ళు.

"ఇది ఎంతమందితో పడుకుందో... వాళ్ళకు సిగ్గా, శరమా. వాళ్ళదంతా సోషలిజమూ, స్వేచ్ఛా ప్రపంచం కదా" అని వొంకరగా నవ్వేవాడు ఒక ఆఫీసరు.

"ముద్దుముద్దు లేమిటీ... నాలుగు గుద్దక" అని వెళ్ళి రొమ్ములమీద గుద్దేవాడు ఒక ఆఫీసరు.

ఇలాగే నాలుగు నెలలు గడచిపోయాయి. ఆ తర్వాత వీళ్ళమీద కేసు ఫైల య్యింది. వీళ్ళని రెండు గ్రూపులుగా చీల్చి కొందరిమీద కుట్రకేసు, కొందరిని టెర్రరిస్టు చర్యలు సాగించారనీ కేసులు పెట్టారు. రాకేష్‌ని కుట్రకేసులో ఇరికించారు. ఇక కోర్టులు... కేసులు... వాయిదాలు... వాదాలు, ప్రతివాదాలు.

అయితే, కుట్రకేసు పెట్టటంతో వీళ్ళకి 'రాజకీయ ఖైదీల' హోదా ఇవ్వవలసి వచ్చింది. కొన్ని సౌకర్యాలు కలిగాయి. దగ్గరి బంధువులకు ఇంటర్వ్యూలూ, అప్పుడప్పుడూ ఈ పదిమందీ ఒక్కచోట కలిసే అవకాశం వుండేది. కొన్ని పుస్తకాలు, పేపర్లు ఇచ్చేవారు.

క్రమంగా రాకేష్ జైలు జీవితానికి అలవాటుపడ్డాడు.

రాకేష్‌కి అంతకుముందునుంచీ పరిచయం వున్న పోలీసు ఆఫీసర్లు, అతని సీనియర్ లాయరు రమణమూర్తిగారి ద్వారా తెలిసిన వాళ్ళు అప్పుడప్పుడూ డ్యూటీలో వుండేవారు. మామూలు పోలీసు జవాన్లతో పరిచయాలు ఏర్పడ్డాయి. వీళ్ళకి డబ్బు వెదజల్లితే జైలులోకి కూడా అన్ని రకాల సుఖాలు నడచి వొచ్చేవి. ఒక బీరుసీసాకు డబ్బులో, ఒక సిగరెట్టు పాకెట్టో ఇస్తే వీళ్లకు అనుకూలంగా పనులు చేసే జవాన్లు కొంతమంది తయారయ్యారు. ఎవరికోసం ఈ త్యాగం? మాలాంటి బక్కబతుకుల వాళ్ళకోసమే కదా!" అని వాపోయేవాళ్ళు బయటపడకుండా ఏదో సహాయం చేసేవారు. ఇంటిదగ్గరినుంచి ఒక వుత్తరమో, కావలసిన సమాచారమో, పుస్తకమో తెచ్చి ఇవ్వటం జైలులో వున్న వాళ్ళకి పెద్ద సహాయంగా అనిపించేది.

తమకు అనుకూలంగా వున్న పోలీసుల ద్వారా బయటి సమాచారం జైలులోకి రావటం, వీళ్ళ సూచనలు బయటకు

వెళ్ళటం ఆరంభమయ్యింది. కొద్దిగా ఫర్వా లేదని వీళ్ళు అనుకునేలోగానే మళ్ళీ ఏ ఆఫీ సరో వూడిపడటం, ఇంటరాగేషన్ అని నానాయాతనా పెట్టటంసాగేది. కొంత మంది పోలీసాఫీసర్లు వీళ్ళ తెలివితేటలు, రాజకీయస్థాయి, పరిజ్ఞానం చూసి గట్టిగా మాట్లాడలేకపోయేవారు. "ఉద్యోగాలు చేసు కోవాలి గదండీ ఏవో మీకు ఇబ్బంది లేనివి చెప్పండి సార్" అని వెంటపడేవాళ్ళు.

మాష్టారుకానీ, ఝాన్సీకానీ ఎప్పుడు వీల యితే అప్పుడు వచ్చే వారు. రఘునాథరెడ్డి గారు కొడుకుకి చెప్పీచెప్పీ విసుగొచ్చి ఆయనే రాజీపడ్డాడు. కొడుకుకి జైలులో ఎంత సుఖం కలిగించవచ్చో అంత చేద్దా మని డబ్బు విరజిమ్మసాగాడాయన.

పార్టీ సర్కిల్సునుండి వచ్చే వార్తలనుబట్టి సమత ఎక్కడ వుందో అతనికి తెలుసు. కానీ దూరం కావటాన ఆమె విషయాలు త్వరగా తెలిసేవికావు. బయట వాళ్ళకు సమత సంగతే తెలియదు. రాకేష్ అప్పుడ ప్పుడూ ఝాన్సీకి కబురు చెప్పేవాడు.

"ఈ పాటికి ప్రసవించి వుంటుంది. తల్లీ బిడ్డా ఎలా వున్నారో" అని ఆరాటపడేవాడు.

ఝాన్సీ కూడా రోజులు లెక్కపెట్టుకుం టోంది.

★ ★ ★

నెలలు నిండిన సమత అడవితల్లి వొడి లోకి చేరింది. ఖమ్మం, ఇల్లెందుల మధ్య వున్న గ్రామీణ ప్రాంతం అది. బొగ్గుట్ట కార్మిక యూనియన్ వీళ్ళ చేతుల్లో వుంది. అటు పల్లెల్లో కూడా కొద్దికొద్దిగా వుద్యమం నిర్మిస్తూ వచ్చారు చాలాకాలంగా.

ఈ గ్రామాలు అటు పూర్తిగా ట్రైబల్ గ్రామాలు కావు, ఇటు పూర్తిగా మైదానాల గ్రామాల్లానూ వుండవు. వర్షాలమీద ఆధార పడి కొద్దోగొప్పో వ్యవసాయం చేస్తారు. అడవిలో కట్టెలు కొట్టి అమ్మటం, బొగ్గు కాల్చటం, కలప తరలించటం, ఏదో చేతికం దిన పనిచేసి పొట్టపోసుకుంటారు. మేలు జాతి విత్తనాలు, ఎరువులు, పచ్చవిప్లవం, బోర్డులు, ఫ్యామిలీ ప్లానింగు ప్రకటనలు. కాంగ్రెసు హస్తం, రామన్న సైకిలు, సుత్తీ కొడవలి జండాలు అన్నీ ఆ గ్రామాల్లో కూడా ఏనాడో ప్రవేశించాయి. మొదటిసారి చూస్తే పరమ ప్రశాంతంగా, ప్రకృతి వొడిలా వొదిగున్న పసిపాప నవ్వుల్లా కని పిస్తాయి ఆ గ్రామాలు.

కానీ రెండురోజులు తేరిపార చూస్తే ఎన్నో ఘర్షణలు కనిపిస్తాయి. గిరిజనులకు, మైదానాలనుంచి వచ్చి సెటిల్ అయిన ధనిక రైతులకూ మధ్య నిత్యం ఘర్షణలు. ఇదివరకన్నీ వ్యక్తిగత పోట్లాటలుగా వుండేవి. ఇప్పుడో, ఈ సహజ ఘర్షణలని ఒక ఉద్యమంగా మలుచుతున్నారు. పేదల సంఘాల నాయకత్వంలో పల్లె ప్రజానీకం. ఒక సంఘర్షణ శక్తిగా రూపుదిద్దుకుం టోంది.

అయినా ఈ ఉద్యమం ప్రభుత్వ దృష్టిని ఆకర్షించేంత బలంగా లేదు ఇంకా. ధనిక రైతులు కూడా ప్రభుత్వంమీద ఆధారపడ టంకంటే తమ గూండాగిరీతోనూ, కిరాయి మనుషులతోనూ, వీళ్ళను ఎదుర్కొందామ నుకుంటారు.

సమతకిది పూర్తిగా కొత్త వాతావరణం. అదివరకు విన్నది కానీ ఇప్పుడు తనే అక్కడ వుంది. ఆమె పుట్టి పెరిగింది పల్లె టూరే అయినా, వాళ్ళ ఇంటి వాతావరణం, చదువులు, ఆమెను ఒకరకంగా పట్నవాసినే చేశాయి. ప్రస్తుతం ఆమె విశ్రాంతిగా కూర్చొని వుంటోంది. జైలులో వాళ్ళ కబుర్లు కూడా బాగానే తెలిసేవి.

ఆమె హైదరాబాద్‌లో వుండగానే డాక్టర్లు అంతా సరిగ్గానే వుందనీ, కాన్పు మామూ లుగా అవుతుందనీ చెప్పారు. దాన్ని గురించి ఏ భయమూ లేదుగానీ ఈ పరిస్థి తుల్లో పుట్టిన బిడ్డను ఎలా పెంచాలా అని కొన్నిసార్లు ఆరాటపడేది.

"మామూలుగా అయితే బిడ్డకు తల్లి

ఒక్కటే. ఇక్కడ మేమంతా కళ్ళ దీపంగా చూసుకుంటాము. నీకెందుకు భయం" అనే వారు తోటివాళ్ళు. వీళ్ళ ఏరియాలోనే శేష గిరి కూడా చేరాడు. సత్యప్రసాద్ జిల్లా బాధ్యతంతా తీసుకున్నాడు. శేషగిరిని చిన బాబు అనీ, సమతను చిన్నమ్మ అనీ పిలవ సాగారు.

వేగుచుక్క పొడిచాక సూర్యోదయం ఆగు తుందా? రాత్రి పది గంటలప్పుడు సన్నగా మొదలైన నొప్పులు కేకలుగా మారి సమ తను హైరానచేశాయి అర్ధరాత్రయ్యేసరికి. ఊళ్ళో కాన్పులు చేసే ముసలమ్మ వొచ్చింది.

"చిన్నమ్మా... ఏం భయంలేదు. కాస్త వోరుసుకో అమ్మా" అంటూ పొట్టమీద నిమురుతూ వుండేది సమత ఎగిరిపడ్డప్పు డల్లా.

"ఏదైనా అడ్డం తిరిగిందో ఏమిటో" అని సమత భయపడింది. అక్క కాన్పు అప్పుడు తను పక్కనే వుంది. అక్కకు ఇంత బాధ కలగలేదే అని ఆలోచించసాగింది. కానీ ఝూన్సీకి డాక్టర్లు ఏదో ఇంజక్షన్లు ఇచ్చారన్న విషయం మర్చిపోయింది. నరాలన్నీ చచ్చు బడిపోయినట్లు కాళ్ళంతా తిమ్మిరెక్కిపోయి, కడుపంతా కత్తులతో కోస్తున్నంత బాధ కలి గింది సమతకు.

ముసలమ్మ "ఎంత... ఇంకెంత... అరగ డియ" అని ధైర్యం చెబుతూనే వుంది. సమ తకు ఏదో కళ్ళమీద మగతలాగ వచ్చే సింది. ప్రాణాలన్నీ బిగపట్టుకొని, పెద్దపె ద్దగా వూపిరి తీస్తూ బిడ్డను కిందకి నెట్టసా గింది.

కెవ్వుమని ఏడుస్తూ ఆడపిల్ల బయటప డింది. సమతకు దూరంగా తొలికోడి కూత వినిపిస్తోంది. ముసలమ్మ బొడ్డుకోసి, నీళ్ళతో కడిగి, వెచ్చటి పొత్తిళ్ళలో చుట్టి సమతకు అందించింది బిడ్డను "చూడమ్మా... లచ్చిం తల్లి పుట్టిందం"టూ.



లేపచ్చిక తలలెత్తుతుంటే ఆనందంతో గుండెలు పొంగే నేల తల్లిలా నవ్వింది సమత బిడ్డను అందుకుని. భాషాతీతమ యిన ఏవో భావనలుదయించాయి. చిన్ని కళ్ళను ఆరుస్తూ అమ్మను చూస్తోంది ఆ బాలకిరణం. ఆ కళ్లల్లో రాకేష్ నవ్వులు పొంగినట్లనిపించింది సమతకు. ఉజ్వల కాంతి పుంజాలను మూటగట్టి తన చేతికం దించినట్లు పులకించింది సమత మాతృహృ దయం. ఆ తొలిభావనే పాపకు పేర య్యింది 'ఉజ్వల'.

ఉజ్వలనే దీక్షగా చూస్తోంది సమత. ఒక్క చిన్న బిడ్డ పుడుతుంటే తల్లికి ఎంత యాతన. ఎంత రక్తపాతం. కొత్త జీవితం పుట్టాలంటే పుడమి తల్లికి మాత్రం ఈ పురిటి నొప్పులు వుండవూ. చిరశాంతిని ప్రభవించటానికి ఈ సమాజం కొంతకాలం అంత యాతనా అనుభవించక తప్పదు, అనిపించిందామెకు.

క్రమంగా మళ్ళీ కార్యక్రమాలు వుధృతమ య్యాయి సమతకి. పక్కపక్క గ్రామాలు కూడా తిరగటం ఆరంభించింది. అత్తాకో డళ్ళ తగాదాలనుంచి, అంతర్జాతీయ రాజకీ యాలవరకూ అన్నీ ఓపికగా పట్టించుకోవ లసి వచ్చేది.

సమత వేషం పూర్తిగా మారిపోయింది. ముతక నూలు చీరలు మడాలకు అరడుగు పైకి కడుతుంది. కాళ్ళకు వెండి కడియాలు, మట్టెలు, ముక్కుకు ఇత్తడివత్తు, చెవులకు పిచ్చిరాళ్ళ దిద్దులు, నడినెత్తిన కొప్పు, చేతు లకు రబ్బరు గాజులు, ఉజ్వలను వీపుకు కట్టుకుంటుంది. ఎవరైనా చూస్తే అడవుల్లో ఆకులు ఏరుకునే పల్లెటూరి అమ్మాయి అనుకుంటారు. ఇంట్లో వున్నపుడు మామూ లుగా వుండేదికానీ అడుగు బయటపెడితే ఇదే పద్ధతి. వేషం మారినా, భాష ఆమెను పట్టియిచ్చేది. అప్పటికీ వాళ్ళలాగ మాట్లాడా లని ప్రయత్నించేది. కొన్ని పదాలు నేర్చు కుందేమోగానీ, ఆ పలుకుబళ్ళు పట్టుబడ లేదు.

అటవీ సంపద తరలిస్తున్నారనీ, రిజర్వు ఫారెస్టులో అడుగు పెట్టారనీ, ఫారెస్టుగార్డులు ప్రజలను బాధించేవాళ్ళు. "అడవి మా యమ్మ. ఆ అమ్మ దగ్గరికి పోనీయక పోతే ఎట్లా" అని జనం ఎదురు తిరిగే వాళ్ళు. వాళ్ళని అడవిలోకి పోనీయకపోతే చేపలను నీళ్ళనుంచి తీసి బయటవేసినట్లే. అందుకే ఫారెస్టు ఆఫీసర్లు వాళ్ళ పాలిటి యమకింకరులయ్యారు. ఆ జనానికి ప్రభుత్వం అంటే ఈ ఫారెస్టు గార్డులూ, ఆఫీసర్లే.

కలప కంట్రాక్టర్లు పెద్దఎత్తున లంచాలిచ్చి, లారీలకు లారీలు కట్టి తరలించుకుపోతుంటే, వీళ్ళు నిస్సహాయులై చూసేవారు. కొంతమంది ఈ గార్డులకి రెండు కోడిపెట్టలిచ్చో, ఇంత పుట్ట తేనెపెట్టో, బతిమాలుకునో, పని గడుపుకునేవాళ్ళు. ఈ సంఘం వచ్చాక అలాంటివి మానేశారు.

ఎటుపోయినా పదిమందీ ఒక మాట మీద వుండటం, ఏ వివాదం వచ్చినా సంఘం దృష్టికి తేవటం మొదలయ్యింది. కొన్ని గ్రామాల్లో సంఘం ఎంత చెబితే అంత. చిన్నమ్మ పేరు అందరికీ తెలిసింది.

సమతకు కూడా ఇది పెద్ద అనుభవం అయ్యింది. తన నాగరిక సమాజానికీ, వీళ్ళ ఆదిమ సమాజానికీ ఎంతో తారతమ్యం కనిపించేది. సంస్కారం ఉందనుకున్న ఆధునిక సమాజాలలోకన్నా ఈ అడవి మనుషులలోనే ఆడ, మగ సమానత్వం అధికంగా వుందనీ, మనుషులు పరస్పరం మమకారంతో మనుషుల్లా ప్రవర్తిస్తున్నారనీ గుర్తించింది. వాళ్ళమధ్య ఆస్తి సంబంధాలు, వ్యాపార బంధాలుకాక మమతలు, మనసులు కలిసిన అనుబంధాలున్నాయని గమనించింది. ఈ నాగరిక సమాజాలు వీళ్ళనుంచి చాలా నేర్చుకోవాలనీ, పట్టణ జనం తమ పద్ధతులు మార్చుకోవాలనీ. గట్టిగా అనిపించింది సమతకు.

అక్కడ ప్రతిదానికీ భయమే. ప్రాణాలంటే ఎంత తీపి. పోలీసులు, కోర్టులు అంటే వొణికిపోతారు. ఇక్కడ క్షణక్షణం ప్రాణాలతో జూదమాడుతారు. పోలీసులు, కోర్టులు నిత్యజీవితంలో ఒక భాగమయ్యాయి. అక్కడ అడుగడుగునా ఓటమితో రాజీ. ఇక్కడ పదపదాన ఎదిరింపు పోరాటం.

వాళ్ళతో తిరుగుతున్నకొద్దీ సమతకు వుత్తేజం, ఇలాంటి అమాయకులను సైతం పీక్కుతింటున్న ప్రభుత్వాలమీద, పెత్తందార్ల మీద క్రోధం రోజురోజుకూ ఎక్కువ కాసాగింది. ఇలాంటి వాళ్ళకోసం ప్రాణాలు పోయినా, అది ఎంతో విలువైన మరణం అనిపించేది ఆమెకు.

"మా వాళ్ళు కూడా కొంచెం కొంచెంగా మారిపోతున్నారు. పట్నాలకు పోవటం, రావటం, ఈ వస్తువులు అమ్మటం, నిత్యం పోలీసులు, ఫారెస్టుగార్డులు వాళ్ళకు లంచాలు. ఈ అమాయకుల్లో కూడా మోసం, దగా ప్రవేశించాయి. ఇదివరకు ఎంతో నిక్కచ్చిగా వుండే వారు. ప్రస్తుతం వీళ్ళూ ప్రలోభాలకు గురి అవుతున్నారు. కొంతమంది పెద్ద రైతులు తమ మాట సాగించుకోవటానికి కొందర్ని ప్రత్యేకంగా పోషిస్తున్నారు. మీరు అందర్నీ అమాయకంగా నమ్మకండి" అని లోకల్ కార్యకర్తలు ఆమెకు జాగ్రత్తలు చెప్పేవాళ్ళు.

ఉజ్వలకు పది నెలలు నిండుతుండగా సమత వొకసారి హైదరాబాద్ వెళ్లింది. ఆసరికి పోలీసుల హడావుడి చాలావరకు తగ్గిపోయింది. అంతా మామూలుగా పనులు చేసుకుంటున్నారు. సమత మీద ఏ రకమయిన వారెంటూ లేదని తెలిసింది. తను వొక హోటలులో దిగింది. ఝాన్సీ దగ్గరికి పాపను ఎత్తుకొని వచ్చింది.

ఆ పూట ఆ ఇంట్లో పెద్ద పండగ. అయినా బాజా భజంత్రీలు బయటకు వినపడే వీలులేదు. అప్పుడప్పుడే సుధా పిన్నిని మరిచిపోతున్నాడు. ఏ జన్మలోనో చూసిన

# స చి త్ర వి చి త్రం




## హైటెక్ గడియారం

ఇటీవల జపనీస్ కంపెనీ కేసియో మార్కెట్‌లోకి కొత్తగా ఓ గడియారాన్ని ప్రవేశపెట్టింది. ఇందులో ప్రపంచంలోని 24 పెద్ద నగరాలలో టైము ఎంతైందీ తెలుసుకోవచ్చు.అలారం క్లాక్‌గా కూడా ఉపయోగించే దీన్లో ఫలానా సిటీలోని ఫలానా టైముకి అలారం మోగే ఏర్పాటు చేసుకోవచ్చు. మన టైం ముఖ్యం కాక ఇతరుల టైం ముఖ్యం అనుకునే ఈ రోజుల్లో ఈ పద్ధతివల్ల అర్ధరాత్రి నిద్రలేచి ఏదో చోట మధ్యాహ్న సమయంలోని వారితో ఫోన్‌లో ముచ్చటించవచ్చు. ఇది శాటిలైట్‌కి అనుసంధానం అవడంతో ఏ క్షణంలోనయినా ఆ 24 నగరాల్లోని వాతావరణాన్ని కూడా చూపిస్తుంది. పేబాక్ కంపెనీల ప్రసారాల్లో వెదర్‌ని కూడా చేర్చడంతో ఇది సాధ్యం అవుతుంది. ఈహైటెక్ గడియారం వెల 400 డాలర్లు.

ట్టువుంది వాడికి. అయినా
"నన్ను వొదిలిపెట్టి ఎక్కడికి వెళ్ళావు" అన్నాడు.
"పాపను తీసుకురావటానికి వెళ్ళానురా" అంది సమత.
తను మళ్ళీ వెళుతుంటే "ఎక్కడికి" అన్నాడు వాడు.
"యుద్ధానికి వెళుతోందిరా పిన్ని" అంది ఝాన్సీ.
"యుద్ధమా అయితే నేనూ వస్తాను. నాన్న ఎన్నిసార్లో చెప్పాడు ఎలా యుద్ధం చేయాలో" అన్నాడు వాడు.
"మరి నువ్వు యుద్ధానికి వెళ్ళిపోతే చెల్లిని ఎవరు ఆడిస్తార్రా" అని తాతగారు అడ్డు తగిలాడు.
"అయితే యుద్ధం వద్దు. నాకు చెల్లి కావాలి" అని వాడు వప్పుకున్నాడు.
తండ్రీ, అక్కా ఉజ్వలను తీసుకువెళ్ళడానికి ఎంతమాత్రం వీలులేదన్నారు. "ఇక్కడుంచితే తండ్రికి చూపిస్తూ వుండవచ్చుకదా"అని శంకరం పట్టుబట్టాడు. మొత్తానికి సమత ఉజ్వలను అక్కడగ్గరే వదిలి వెళ్ళడానికి వప్పుకుంది.
"ఎలా బతకవలసినవాళ్ళు ఎలా బతుకుతున్నారు? దేనికోసం ఇదంతా? మీరు చదువుకున్నవాళ్ళు. నేనేం చెప్పను? బయటి శతృవులను చంపటానికి చలికొండల్లో తిరిగాను నేను. సైన్యంలో ఎంత వుత్సాహంగా పాల్గొంటారో నాకు తెలుసు. దేశం లోపలి శతృవులను నాశనం చేయడానికి మీరు అడవుల్లో తిరుగుతున్నారు. మీరెంత దీక్షతో వుంటారో నాకు అర్థమవుతోంది. కానీ ఏ జనంకోసం ఇదంతా చేస్తున్నారో ఆ జనమే ఏమీ పట్టకుండా తిరుగుతున్నారు. సహాయం చేయరుగదా మీలాంటివాళ్లను శతృవులుగా చూస్తారు. ద్రోహం చేస్తారు" అని శంకరం తెగ బాధపడిపోయాడు.

"జనం అంటే ఎవరో వేరేలేరు శంకరం గారూ! నేనూ, మీరూ జనంలో భాగమే. ఎవరికోసమో ఇది చేస్తున్నాను అనే భావం నాకు లేదండీ. నాకోసం, నా చెల్లికోసం, నా ఉజ్వలకోసం, నా సుధాంశుకోసం ఇంకా అలాంటి అనేకమంది మనలాంటివాళ్ళ కోసం..." అంది సమత.
"ఏమో! తలుచుకుంటే బాధగా వుంటుంది మాకు" అందరి అభిప్రాయం చెప్పాడతను.
రాకేష్ కబుర్లన్నీ తెలిసాయి. ఇదివరకటి చలాకీతనం పోయి చాలా గంభీరంగా మారిపోయాడుట. ఏదో మారుపేరు మీద వెళ్ళి రాకేష్‌ని చూసి రావాలనిపించింది సమతకు. కానీ అతనే "జైలు పరిస్థితులు ప్రస్తుతం అనుకూలంగా లేవు. ఇంటర్వ్యూలప్పుడు చాలా సోదా జరుగుతోంది ఇప్పుడు రావొద్దని" కబురుపెట్టాడు ఝాన్సీ వెళ్ళివస్తే.
తప్పదు నిరీక్షణం...
ఒకపూట తేజను పిలిపించింది సమత.
"నీకు కొత్తగా చెప్పాల్సిందేముంది తేజా! మేం ఎంత విపత్కరస్థితిలో వున్నదీ నీకు తెలుసుకదా! ఆర్థికంగా చాలా ఇబ్బందిగా వుంది. పార్టీ నీనుంచి కనీసం ఈ పని ఆశించటం ఎక్కువ కాదనుకుంటాను" అతను చాలా సిగ్గుపడ్డాడు.
"స్రవంతి నాకు వొక వీక్‌నెస్ అనుకున్నాను కానీ... ఆ మెత్తదనం ఏదో నాలోనే వచ్చింది సమతా! నేను ఎక్కడికి జారిపోతానో అని తలుచుకుంటే భయమేస్తుంది. ఏదో చెయ్యాలని వుంటుంది కానీ ఏమీ చేయలేకపోతున్నాను. మీరంతా నన్ను పోయిన వాళ్ళ లిస్టులో వేసేసి వుంటారని నాకు తెలుసు" అన్నాడు
"అదేంలేదు తేజా, నీకు ఎంత వీలయితే అంత, ఏ రూపంలో చేయగలిగితే ఆ రూపంలో మాకు సాయంచేయి. కోర్టులు, డిఫెన్స్ కమిటీలు, రహస్య జీవితాలు ఎంత అవసరం వుంటుందో నీకు తెలుసుకదా"

అంది.

"ఈసారి స్రవంతికి ఏమీ తెలియనివ్వను సమతా. ఇప్పటికే సగంచచ్చి బతుకుతున్నాను. ఈసారి తాను ఏదైనా అడ్డు తగిలితే తాడో పేడో తేల్చుకుంటాను" అన్నాడు తేజ సమతతో.



రాకేష్ వాళ్ళ కేసు విచారణ సాగుతోంది జోరుగా. రాకేష్‌వాళ్ళ సీనియర్ లాయరు వీళ్ళకు డిఫెన్స్‌గా వాదిస్తున్నాడు. ఆయనేకాక పేరుమోసిన ఇంకో ఇద్దరు లాయర్లు కూడా వీళ్ళకోసం పనిచేస్తున్నారు. అసలు ముద్దాయిలలోనే రాకేష్ కాక మరో లీడరు స్వయంగా ప్లీడరు. జడ్జీలు పోలీసు ఆఫీసర్లను నీళ్ళు తాగిస్తున్నారు. వాళ్ళుపెట్టిన కేసంతా తప్పుల తడక, ఆధారరహితం అని వూరికే తెలిసిపోతుంది. చూస్తే చాలా మందిని ఏ నేరంలేదని వొదిలేసేట్లుగా వుంది పరిస్థితి.

అందుకని పోలీసులు పదేపదే వాయిదాలు కోరి, కేసును నాన్చుతున్నారు. జైలులో వీళ్ళను విచక్షణారహితంగా బాధించడం ఎక్కువ అయింది. శారీరకంగా చాలా హింస పెడుతున్నారు. ఆసనాల్లో కారం కూరటం, రోలర్ ట్రీట్‌మెంటని పేరు పెట్టి పెద్ద కొయ్యదుంగను వీళ్ళ వంటిమీద వేసి దానిమీద నలుగురు మనుషులు ఎక్కి తొక్కటం లాంటి అమానుష చర్యలు కూడా మొదలెట్టారు. జబ్బుచేసినవాళ్ళని కూడా హాస్పిటల్‌కు తీసుకువెళ్ళటం మానేశారు. అరెస్టు అయిన వాళ్ళలో ఒక లీడర్‌కి తీవ్రమైన ఆస్మా వుంది. ఆయనకు మామూలుగానే రోజూ ఇంజెక్షన్లు అవసరం. అడ్రినలిన్ ఇంజక్షన్లు స్వంతంగానే చేసుకుంటాడాయన. ఈ మానసిక ఒత్తిడి, జైలులో వున్న అపరిశుభ్ర వాతావరణంతో ఆయనకు ఈమధ్య ఉబ్బసం మరీ ఎక్కువయ్యింది. ఆయన్ని హాస్పిటలుకు తీసుకువెళ్ళడం మానేశారు. కనీసం ఇంజెక్షన్లయినా తెచ్చి యివ్వమంటే ఎప్పుడో వాళ్ళ దయ కలిగినప్పుడు రెండు ఇచ్చేవారు.

ఇంటర్వ్యూలు ఆపేశారు. ఏ పుస్తకాలు రానివ్వటంలేదు. పేపర్లు కూడా సెన్సారు చేసి, రాకేష్‌వాళ్ళకు ఉపయోగపడే వార్తలేమన్నా వుంటే వాటిని కొట్టేసి, కట్ చేసి ఇచ్చేవారు. అంతకుముందు వీళ్ళు తమంతట తామే వంట చేసుకునే ఏర్పాటు జరిగింది. ఇక ఇప్పుడు తినటానికి వీలుకాని ముక్కిపోయిన ధాన్యం, మురిగిపోయిన కూరగాయలు, పనికిరాని రేషన్ ఇవ్వటం మొదలెట్టారు.

జైలు పరిస్థితిని మార్చాలని ఈ పది మందీ చాలా ఆందోళన చేశారు. వీళ్ళేకాక ఇంకా ఇతర గ్రూపుల రాజకీయ ఖైదీలు కొందరుండేవాళ్ళు. వాళ్ళూ కలిశారు. రాకేష్, మరో ఇద్దరు ఖైదీలు పదిహేనురోజులపాటు నిరాహార దీక్ష చేశారు. కోర్టుకు తీసుకు వెళ్ళినప్పుడు అసలు కేసు సంగతి వదిలి ఈ విషయాలమీద వాదించడం, నినాదాలు ఇవ్వటం చేసేవారు. జడ్జీలు చట్టపరంగా కల్పించవలసిన సౌకర్యాలన్నీ గ్రాంటు చేసేవారు. అమలుపర్చవలసిన ఆఫీసర్లు వాటిని హుళక్కి చేసేవారు. వీళ్ళు





మళ్ళీ కోర్టులో గొడవ చేసేవారు. ఫలితంగా జైలరును, మరో ఇద్దరు ముగ్గురు ఆఫీసర్లనూ మార్చారు. జైలులో పరిస్థితులు మళ్ళీ కొంచెం మామూలయ్యాయి.

ఈలోగా మంత్రివర్గంలో మార్పులు వచ్చి హోంమినిష్టరు మారాడు. మళ్ళీ రఘునాథ రెడ్డిగారు రాజకీయ రికమెండేషను ప్రయత్నాలు ఆరంభించారు. కనీసం జామీను మీద కొడుకును విడిపించాలని ఆయన ప్రయత్నం. "ఎలాగూ కేసు పూర్తవ్వబోతోంది. ఈలోగా నేను బయటకు వెళ్ళటం మాత్రం ఎందుకు. అందరం కలిసే అనుభవిద్దాం" అన్నాడు రాకేష్.

"సెంటిమెంటల్ గా ఆలోచించకు. ఎవరికి వీలయితే వాళ్ళు బయటకు వెళ్ళటం మంచిది. బయట వుండటం మన కేసుకే ఉపయోగపడుతుంది. ఆయన ప్రయత్నాలు ఆయన్ని చేయనీ" అన్నాడు వీళ్ళ నాయకుడు.

కానీ రాకేష్ జైలులో కూడా సైలెంటుగా కూర్చోకుండా ఈ నిరాహారదీక్షలవీ చేశాడని జామీను కూడా ఇవ్వలేదు.

వీలు చూసుకుని సమత హైద్రాబాద్ వచ్చిపోతూనే వుంది. కేవలం పోలీసుల దృష్టికి, ప్రభుత్వ దృష్టికీ ఆమె రహస్యంగా వుంది కానీ, మిగతా కార్యక్రమాలన్నీ యధాప్రకారం సాగిస్తోంది. రహస్య జీవితం అంటే ఎవరికీ కనపడకుండా ఒక మూల కూర్చోవడం కాదనీ, ప్రభుత్వ పంజాకు అందకుండా ఉద్యమం నిర్మించటమే అనీ ఆమెకు బాగా తెలిసింది. ఒకసారి తను ఇంట్లో వుండగా, రాయుడుగారు వచ్చాడు మాష్టారితో కబుర్లు చెప్పుకుందామని.

రాయుడుగారు సమతను చూడగానే ఆశ్చర్యపడ్డాడు. ఆ తర్వాత ఎంతో బాధగా ఆమెకు ఏదో బోధ చేయసాగాడు.

"ఏందమ్మా ఇది? మీకేమన్నా పిచ్చిపిక్కిందా? రాకేష్‌బోయి జైల్ల కూర్చునె. నువ్వుబోయి అడవులపొంటి తిరుగుతుంటివి. మీరేం జేస్తున్నరో జర సోచాయించినావా? "అయ్యోపాపం" అనేటోల్లు గూడ లేరు మీకు. నీ అసుంటోల్లు పెండ్లెందుకు జేస్కోవాలె! పిల్లగాండ్లనెందుకు కనాలె? మీ దారిన మీరు తిర్గుతుంటే, ఈ పిల్లగాళ్లను పెంచేదెవడు? మీ అక్కమ్మ జర మంచిది గన్క సరిపోయే. లేకుంటే ఈ ముసలి వయసుల మీ అయ్యకు దిక్కెవరు? " అని గట్టిగా అడిగాడు.

సమత సమాధానం ఏమీ చెప్పకుండా నవ్వసాగింది.

"నవ్వుతవేందమ్మా ఈ తీర్గ. ఎంత తెలివైనదానివి. గా తెలివంత ఏడ బోయింది పుడు? ఆడోల్లు, మగాల్లు సమానంగా బతకాల్నంటివి. స్వేచ్ఛగ సొతంత్రంగా వుండమంటివి. ఎవడు కాదన్నడవన్ని? సంగసేవ చేయాల్నంటే ఎన్నితీరులు లేవు. దుర్గాబాయమ్మ, మదర్ థెరిసా, వాళ్ళ తీర్గ చేయాలె. ఆళ్ళంతా ఆడోల్లకు సేవ చేసిన్రా లేదా? నీ లెక్కనావేశంతో అడవులు బట్టిపోయిన్రా? నువ్వు నాశనం అవుతున్నవ్ అటుంచు. నీ వాల్లను బాదపెడతున్నవ్ గద! చివరికి నువ్వేం సాదిస్తవ్? "

సమతను మామూలుదారికి తీసుకురావాలని తన పెద్దరికం అంతా ఉపయోగించి చెప్పాడు రాయుడుగారు.

"నేను అడవుల్లో వుంటున్నానంటే, ముక్కుమూసుకుని తపస్సు చేసుకోవటం లేదు బాబాయిగారూ! జనం మధ్యనే వుంటున్నాను. నా కాల్లో ముల్లు గుచ్చుకుంటే తమ కంట్లో రాయిపడ్డట్టు బాధపడతారు ఆ జనమంతా. మమ్మల్ని కాపాడడానికి తమ ప్రాణాలను కూడా లెక్కచెయ్యరు.

ఇకపోతే, ఆడవాళ్ళ బాగుకోసం అహరహం తపించి, సంస్కరణోద్యమాలు చేసిన వాళ్ళంటే నాకు చిన్నచూపులేదు. అయితే వాళ్ళంతా బాధపడుతున్న వాళ్ళ కళ్ళనీళ్ళు తుడిచి బతికే ధైర్యం చెప్పారు. మేం ఆ

బాధలే లేకుండా చేయాలని ప్రయత్ని స్తాము. ఇల్లు కాలి భోరున విలపిస్తున్న వాళ్లను చేరదీసి రెండుపూటల భోజనం పెట్టారు వాళ్ళు ఇళ్ళను కాల్చే దుర్మార్గుల ఆట కట్టించాలనుకుంటున్నాం మేం. జబ్బుకు వైద్యం చేస్తున్నాం మేం. లక్షణా లను తొలగించే ప్రయత్నం చేశారువాళ్ళు" నవ్వుతూనే గట్టిగా చెప్పింది సమత.

"మాటకు మాట నేర్చిను మీరు... ఈ మాటలకేంగాని... జర మా గుండెల్ల బాదలు తెలుసుకోన్రి. కన్నబిడ్డలిట్టా తిరుగు తుంటే ఏ అయ్యా అమ్మా చల్లగుంటది చెప్పున్రి"

"అందరం చల్లగుండాలనే బాబాయి గారూ... కొంతమందిలా కాలిపోతోంది"

★ ★ ★

సంఘం బలం పుంజుకొంటున్నకొద్దీ వూళ్లల్లో వున్న పోలీసు ఏజంట్లు పెద్దపెద్ద రైతులు పదేపదే టౌను చుట్టూ తిరగసా గారు. వాళ్ళల్లో మళ్ళీ పాతభయాలు తలె త్తాయి.

"ఇంతకుముందొకసారి ఈ తీవ్రవాదం వుప్పెనొచ్చింది. చచ్చీచెడీ బయటపడ్డాం. ఆ ఉద్యమాన్ని మొదలంటా పెరికి పారేశా మని సంబరపడ్డంతసేపు పట్టలేదు. మళ్ళీ వచ్చి పడ్డింది" అని భయపడుతున్నారు. ఎండిన మోడు నాలుగు చినుకులు పడగానే ఎర్రచివుళ్ళు వేసినట్లు, పచ్చగా నవ్వినట్లు మళ్ళీ తలెత్తింది ఉద్యమం.

ఈసారి మొగ్గలోనే తుంచివెయ్యాలని తమతమ నాయకులకు, పోలీసులకు మొర పెట్టుకోసాగారు. "ఇదివరకు ఏ పదిమందో దళాలుగా తిరిగి మమ్మల్ని బెదరగొట్టేవారు. ఈసారి వీళ్ళు నీళ్ళల్లో చేపల్లాగా జనంతో కలిసిపోయి తిరుగుతున్నారు. అడవి దగ్గరి గ్రామాలు గాయపడ్డ బెబ్బులిలా గుర్రుమం టున్నాయి. ఏ క్షణంలో అయినా మా ప్రాణాలకు ముప్పు రావచ్చు "సంగం అన్న ప్రతివాడినీ అరెస్టు చేయాలి" అని వినతిప త్రాలు రాశారు. ఇంతవరకూ పెద్ద సంఘట నలు ఏమీ జరగలేదు కానీ ముందే జాగ్రత్త పడాలని ప్రభుత్వాన్ని హెచ్చరించారు.

ఇలా వున్నపుడే ఒక సంఘటన జరి గిందా ప్రాంతంలో.

పగడాల రామయ్య అనే పెద్ద ధనవం తుణ్ణి ఎవరో చంపేశారు. అది కుటుంబ కక్షలవల్ల వాళ్లలో వాళ్ళు చేసుకున్న పని. ఈ రామయ్య ప్రజలపాలిటి రావణాసు రుడు. ఆ వూళ్ళో వున్న సన్నకారు మనుష లంతా అతనికి అప్పు పడి వున్నారు. ఒక సారి అతని ఖాతాలోకి ఎక్కితే ఎంత డబ్బు కట్టినా ఆ పుస్తకంనుంచి పేరు బయటపడ దెవరికీ. అతనీ ప్రాంతంలో పెద్దసారాయి కంట్రాక్టరు కూడా. అతనికి ప్రతివూళ్ళోనూ దుకాణం వుంది. అయితే అక్కడి జనం సాధారణంగా ఎవరికివాళ్ళు స్వంత బట్టీలు పెట్టి, ఏ అడవిపూల రసమోకలిపి, సారాయి తయారుచేసుకుంటారు. అందు కని రామయ్య వ్యాపారం అంతజోరుగా సాగేదికాదు. అందుకని అతనెప్పుడూ పోలీ సుల్ని పిలిపించి, ఈ బట్టీలు పగలగొట్టిం చడం, వాళ్ళ సారాయి పారబోయించడం చేస్తుంటాడు. తన డిపోల్లోని ప్రభుత్వ సారాయినే అందరూ తాగాలని పీడిస్తాడు. దాదాపు డబల్ రేటుకి అమ్మేవాడతను. అయినా జనం చేసేదిలేక అతని దగ్గరే కొనేవారు. ఈ గిరిజనుల్లో ఆడ, మగ కూడా సారాయి తాగేవారు. అందుకని వాళ్ళకది చాలా ఖర్చుగా వుండేది.

ఈ సంఘం వచ్చాక జనం మళ్ళీ సొంత బట్టీలు మొదలెట్టారు. జనానికీ రామ య్యకూ మళ్ళీ తగాదాలు మొదలయ్యాయి. సంఘం నాయకత్వంలో ఒకరోజు మీటింగు వేసి, జనం అందరిముందూ అతని ఖాతా పుస్తకం తగలబెట్టారు. సంఘానికి న్యాయ మనిపించిన పద్ధతిలో కొన్ని కొత్తనోట్లు రాశారు. ఎక్కువమంది అప్పులు రద్దుచే




శారు. రామయ్యమీద పెనాల్టీ వేసి కొంత మందికి డబ్బు తిరిగి యిప్పించారు. ఇదంతా జరిగిన వారంరోజులకే రామయ్య హత్య జరిగింది.

పోలీసులకు మంచి అదను దొరికింది. వాస్తవాలేమీ పరిశీలించకుండా, పేదజనం మీద పడి ఎవరు చంపిందీ చెప్పమని బాదసాగారు. అందరూ అనుకునేది రామయ్య తమ్ముడే ఈ పని చేయించాడని. వూరంతా అదేమాట కోడై కూయసాగింది. పోలీసులు మతిపోయిన వాళ్ళలాగా తయారై సంగం నాయకులను అరెస్టు చేయాలని చూశారు.

జనం అంతా పోలీసు జీపు చుట్టూ మూగి నాలుగుగంటలపాటు దాన్ని కదలనీయలేదు. పోలీసులు ఆ పూటకు జారుకుని మరునాడు సి.ఆర్.పి.ని తీసుకొచ్చారు. ఈలోగా వూళ్ళోకూడా అంతా ఆలోచించి మగవాళ్ళంతా ఇళ్ళు వదిలి అడవిలోకి వెళ్ళిపోయారు. ఆ పగలు సమత ఆడవాళ్ళకు ధైర్యం చెబుతూ వాళ్ళమధ్యనే వుండిపోవలసివచ్చింది. అందరూ కలిసివుంటే భయపడే పని లేదని సమత వాళ్ళకు చెబుతూనే వుంది.



సి.ఆర్.పి. వాళ్ళను చూడగానే "ఇనపబొచ్చెల వాళ్ళు వచ్చార్రా" అంటూ జనం హడావుడిపడసాగారు. ఈ లోపునే పోలీసులు ఇళ్లల్లో జొరబడి నానా హంగామా చేశారు. పిల్లలు, ముసలివాళ్ళు అనే తేడా లేకుండా లాఠీఛార్జీ చేశారు. మగ వాళ్ళెక్కడున్నారో చెప్పమని బాదారు. సమత జనం అందర్నీ పోగుచేసి ఎదిరించసాగింది. ముసలాళ్ళు కర్రలు తీసుకుని పోలీసుల వెంటపడ్డారు. ఆడవాళ్ళు కారపు ముంతలు పోలీసుల కళ్ళల్లో చిమ్మటం ఆరంభించారు. ఈ హడావుడికి శేషగిరి కొంతమందితో పోలీసులను చుట్టుముట్టాడు. పోలీసులు కాల్పులు చేశారు.

తుపాకులు మోగేసరికి జనం చెల్లాచెదరై పోయారు. అటూ ఇటూ పరుగెత్తుతున్న వాళ్ళను పోలీసులు వ్యానుల్లో ఎక్కించారు. దాదాపు అరవైమందిని అరెస్టు చేశారు. సమత, శేషగిరి కూడా వ్యాను ఎక్కవలసివచ్చింది. ఇదే పోలీసులతో పెద్ద ఘర్షణ కావటం, అదీ మొట్టమొదటిది కావటంతో, వీళ్ళు తెరవెనకే మిగిలే అవకాశం లేకపోయింది. జనంలో విశ్వాసం కల్పించటానికి వీళ్ళు ముందు వరసలో నిలబడాల్సిన పరిస్థితి అది.

అసలీ హత్య, పోలీసుదాడి ఇంత త్వరలో ఎదుర్కోవలసి వస్తుందని వాళ్ళు అనుకోలేదు. జనం కిరాయిగుండాలను, దాదాగిరీని ఎదుర్కోవటానికి తయారయ్యారు కానీ పోలీసులు ఇంత పెద్ద ఎత్తున రావటంతో కంగారు పడ్డారు. ఈ సమయంలో సమత, శేషగిరి తప్పుకున్నట్లయితే 'ఇన్ని రోజులు కబుర్లు చెప్పి, అవసరం వచ్చేసరికి జారిపోయారు' అనే భావం జనంలో వచ్చేలా అనిపించింది. అందుకే వాళ్ళూ అరెస్టయ్యారు.

అందరిమీద రాయిటింగ్ కేసు, బైండోవరు కేసు పెట్టారు. పది రోజులకోసారి కోర్టుచుట్టూ తిరగడం ఆరంభమయ్యింది. బైండోవరు కేసంటే జనాన్ని పెద్ద ఎత్తున అటూ ఇటూ చాలా కాలం తిప్పి, వాళ్ళ పనులు సాగించుకోకుండా విసిగించటానికే కానీ చివరికి పడే శిక్షలేమీ వుండవు. ఇలా వొస్తూ పోతూ వున్నపుడే సమతతోసహా, పదిమంది సంఘనాయకులను, రామయ్య హత్యకు బాధ్యులని చెప్పి క్రిమినల్ కేసు బనాయించి అరెస్టు చేశారు ఖమ్మంలో. పట్నంలో అరెస్టు చేయటంతో పేదజనం ఏమీ చేయలేకపోయింది. బైండోవరుకేసు ఆరు నెలలు సాగింది. చివరికేమీ లేకుండానే ముగిసింది. క్రిమినలు కేసు కింద సమత జైలులోనే వుండిపోయింది.

రాకేష్ ఇక్కడ చంచల్‌గూడా జైలులో... సమత అక్కడ వరంగల్ జైలులో. ఇద్దరివీ పెద్ద కేసులు. ఎన్నాళ్ళు సాగుతాయో

తెలీదు.

రామారావుగారికి చెప్పలేని బాధ కలుగుతోంది. ఆయనికి జైలు జీవితం తెలియంది కాదు. ఆ తెల్లదొరల రోజుల్లోనే కాదు. ఈ నల్ల దొరల హయాంలో కూడా ఆయన జైలులో గడిపాడు. తను జైలుకెళ్ళినందుకు ఆయన ఏనాడూ బాధపడలేదు, విచారించ లేదు. కానీ ఇప్పుడు స్వేచ్ఛ, సమానత్వం అనే లక్ష్యాలకోసం తన కూతురు, అల్లుడు, అంతలేసి చదువులు చదివిన వాళ్ళు, ఇలా జైళ్ళల్లో మగ్గవలసి రావటం, ఆయనకు గుండెల్ని పిండినట్లవుతోంది. తమ రోజుల్లో ఏ లక్ష్యాలకోసం పరాయివాళ్ళతో పోరాడామో, అదే లక్ష్యాలకోసం ఆ సర్వోదయం కోసం, ఆ సర్వేజనా సుఖినోభవంతుకోసం తన పిల్లలూ పోరాడుతున్నారు. అందులో వాళ్ళని తప్పు పట్టటానికి ఏముంది అని తనకు తనే ధైర్యం చెప్పుకునే వాడాయన.

ఆయన పూర్తిగా కదలలేని స్థితిలో వున్నాడు. అయినా తన "చిట్టితల్లి ఎలా వుందో... ఒక్కసారి చూడాలని" తపించి వెళ్ళి చూసి వచ్చాడు. కళ్ళనిండా పొంగిన నీళ్లతో మాటేరాలేదాయనకి. రాకేష్‌ని చూసినా అంతే... గొంతు పెగలలేదాయనికి. వీళ్ళిద్దరూ ఆయనకి మనుషుల్లా కనిపించటంలేదు. వేగు చుక్కల్లా. వేకువ పువ్వుల్లా కనిపిస్తారు ఊహల్లో.. కలల్లో... వాస్తవంలో...

శంకరమో, ఝాన్సీనో ఎవరికి వీలయితే వాళ్ళు సుధాని, ఉజ్వలను, తెచ్చి చూపిస్తారు సమతకి కనీసం నెలకోసారి.

"ఎ" ఫర్ అరెస్టు 'బి' ఫర్ బెయిల్ అని చెబుతాడు సుధా ఇప్పుడు. ఉజ్వల కూడా అన్ననుసరిస్తూ ఏవో చిట్టిచిట్టి మాటలు అంటూ వుంటుంది.

★ ★ ★

ముసిరే దోమల జుంయ్‌జుంయ్ ధ్వనుల సంగీతం. లైట్ల చుట్టూ చేరే పురుగులు. గాలికే గాలి ఆడనంత వుక్కబోత. మహాచీదరగా, చిందరవందరగా వున్న ఆ జైలు గదిలో నిద్రపట్టక జీవితంలో ప్రతిఘట్టాన్నీ, తనకు తెలిసిన ప్రతివ్యక్తినీ తలపోస్తూ కూర్చుని వుంది సమత. ఆమె పెదవుల మీద చిరునవ్వొకటి మెరిసిపోయింది.

చిన్నప్పట్నుంచీ ఇంతే. ఎందుకో నేను అందరిలా లేను. అక్కలిద్దరూ 'నెమ్మదైన వాళ్ళు, మంచివాళ్ళు' అని పేరుతెచ్చుకుంటే 'ఇది పొరపాటున ఆడదిగా పుట్టిందిగానీ, మీకు మగపిల్లవాడు లేడనే దిగులక్కర్లేదు రామారావ్' అనేవారు నన్ను చూసి నాన్న గారి ఫ్రెండ్స్. కొంచెం వూహలు పెరిగి ఆటలకు వెళితే తను జామచెట్లెక్కేది. మగ పిల్లలతో కలిసి గోలీలు, కోకో ఆడేది. "మగ రాయుడిలా ఆ ఆటలేమిటే! అక్కలతో కలిసి అచ్చంగాయలు ఆడుకోరాదూ" అనేది అమ్మ.

స్కూలులో ఒకసారి ఆటలపోటీలు. బ్యాట్‌మింటన్ డబుల్సులో ఒక కుర్రాడితో కలిసి తను టీము ఇస్తానని ఎంత గొడవ చేసింది. పి.టి. మాష్టారితో "నాకు ఆట బాగా వచ్చు. శేఖరమూ నేనూ కలిసి ఆడితే విన్నర్సుగా వస్తాం. నన్ను ఎందుకు ఆడనివ్వరు" అని వాదం చేసింది! ఆయన "ఆడ పిల్లలకి వేరే రింగ్ టెన్నిస్ ఆడిస్తున్నాము కదా. నువ్వు అందులో ఆడు. బాట్‌మింటన్ మగపిల్లలకే పరిమితం" అని ఆయన వాదం. చివరికి హెడ్‌మాష్టారు దగ్గరికి వెళ్ళినా ఆడవాళ్ళు, మగవాళ్ళూ వేరుగా ఆడవలసిందే అన్నారాయన. ఆ రోజుల్లోనే తనను "గుండెలు తీసిన బంటు" అనేవాళ్ళు స్నేహితురాళ్ళు. ఇప్పుడు ప్రభుత్వం నక్సలైటనీ, హంతకురాలనీ జైలులో పెట్టింది. అభూతకల్పనలు చేయటం తప్ప, ఈ ప్రభుత్వం చెప్పలేదు. "నీ ఫలానా భావాలు, చర్యలు మానవ మనుగడకు అభ్యంతరకరమైనవి" అని.

అసలు చిన్నప్పటినుంచీ నాకు ఈ ఆడ-మగ అనే తేడాను బద్దలు కొట్టాలనే భావం




ఎందుకింత బలంగా వుంది. ప్రకృతిరీత్యా వచ్చిన తేడాలు తప్ప ఈ సమాజంలో, జీవితంలో అన్నింటా స్త్రీ పురుషులిద్దరూ సమానమే అని నమ్మాను. ఎన్ని పుస్తకాలు చదివాను! ఎన్ని ఉపన్యాసాలు విన్నాను!

మగవాళ్ళలో సంస్కారం పెరిగితే చాలు, ఈ తేడాలన్నీ పోతాయని అనుకుంది ముందు. "మీకంటే మేము తక్కువకాదు" అని వాదించి వాళ్లను వొప్పించాలని ప్రయత్నించేది. వాళ్ళే స్త్రీలకు ఏదో సమాన హక్కులు ఇచ్చేస్తారు అనేలా భావించేది తను. కానీ కొద్ది రోజుల్లోనే 'ఆడవాళ్ళలోనే ఈ మార్పురావాలి. తమశక్తి తాము తెలుసుకోవాలి. గట్టిగా అడగాల్సిందే అందరూ కలిసి. మామూలు మాటలతో ఈ ప్రపంచం మారదు' అని తెలుసుకుంది. ఒక కందుకూరి, ఒక రామమోహన్‌రాయ్ ఎవరో పెద్ద సంస్కర్తవొచ్చి ఆడ, మగ ఇద్దరినీ మార్చితే తప్ప సమస్య తీరదు అనుకునేది ఆ రోజుల్లో.

కానీ ఇవ్వాళ ఖచ్చితంగా, స్పష్టంగా తెలుసు. ఈ ప్రపంచంలో అణగదొక్కబడ్డ జాతులన్నీ పోరాటం చేసే స్వాతంత్ర్యం పొందాయి. వాళ్ళలాగానే స్త్రీ కూడా పోరాడి మాత్రమే తనస్థానం పొందగలదు. మహజర్లతో, మంతనాలతో ఆమెకు సమానత్వం సిద్ధించదు. ఈ పోరాటాలు శాంతియుతమా, ఆయుధాలతోనా, వువ్వెత్తున వచ్చే తిరుగుబాటా, చాలాకాలం సాగే అంతర్యుద్ధంలాంటిదా అనేది ప్రశ్నే కాదు. ఎదురు నిలిచి తిరగబడటం అదీ ముఖ్యం. ఈ సాంఘిక చట్రాన్ని మార్చకపోతే ఆమెకు విముక్తిలేదు. అందుకే పెత్తందార్ల, ధనవంతుల ఈ దోపిడి రాజ్యం కూల్చే శ్రమజీవుల విముక్తి పోరాటాలతో, స్త్రీల వుద్యమాలను కలిపి సాగించక తప్పదని తను తెలుసుకుంది.

వ్యవస్థను మార్చే పోరాటం అనకుండా, కట్నాలు పోవాలనో, కులాంతర వివాహాలు కావాలనో, అనాథ స్త్రీ మందిరాలు నడపాలనో అంటూ తిరుగుతూవుంటే ఈ ప్రభుత్వం 'పద్మశ్రీ'లు ఇచ్చి గౌరవించేది. ఆవిడ గొప్ప 'మహిళోద్ధారకురాలు' అని ప్రజలూ మెచ్చుకునేవారు. అలా పైపై మెరుగులుకాక అసలు మూలంలోకి వెళ్లి, ఆ వేరును పెల్లగించాలనుకున్నందుకు ఈ ప్రభుత్వం జైలుపాలు చేసింది.

బయట సన్నగా చినుకు పడుతోంది. చల్లగాలి వీస్తోంది. మనసు చల్లబడుతోంది. ఇంతలో కరెంటుపోయింది. కనీసం కొవ్వొత్తి వెలిగించే ప్రయత్నంలేదు ఎక్కడా జైలులో. అలా చీకట్లో కూర్చునే ఆలోచించసాగింది సమత. తెలిసిన వాళ్ళు వొక్కొక్కళ్ళూ కనిపిస్తున్నారామె వూహాపథంలో.

మగవాడి ప్రేమ మాటలకు లొంగిపోయి, కాలుజారి, చావటానికి సిద్ధపడ్డా, ఆలోచనలతో, ధైర్యంతో నిలబడి గృహిణిగా ఆనందం పండించుకుంటున్న సౌందర్య,

భర్త చేతిలో అవమానాలు పొందీపొందీ, చివరికి తెగించి ఫ్యాక్టరీ కూలీగా తన కాళ్ళ మీద నిలబడి, పిల్లల్ని పోషించుకుంటూ ఆత్మగౌరవంతో బతుకుతున్న సుభద్ర,

తన మేధస్సుని పండించుకోవటానికి మగవాడి ఆధిపత్యానికి లొంగకుండా ఒంటరిగా బతుకుతూ గర్వంగా తిరిగే మేడం జానకి,

తనకు కావలసిన సంతానాన్ని ధైర్యంగా కని, ఈ సంఘ నీతినియమాలను ఎదిరించి, తన మనసును, మమతను బతికించుకున్న అక్క ఝాన్సీ,

నేను బయట పనిచేసి డబ్బు సంపాదించి మీ బాధ్యతలు పంచుకోవాలంటే, మీరు ఇంట్లో పని పాటల్లో పాలు పంచుకొని నా బరువు తగ్గించాల్సిందే అని పట్టుబడుతున్న నేటి ఇల్లాలు సరోజిని,

భర్త చనిపోయినా, 'సంగం' వెనకనే నిలిచి, తమ కోర్కెలు, స్థానాలు సాధించు

కుంటున్న 'నాగమ్మ'.

పెళ్ళి అయినవాళ్ళూ, కాని వాళ్ళూ, వృద్యమంలో తమను సమిధలుగా సమర్పించుకుంటున్న ఎందరో యువతులు. ఒక్కరొక్కరే గుర్తొచ్చారు.

మనిషిగా బతకడానికి అన్ని అవకాశాలూ వుండీ, తమ సుఖాలు పోగొట్టుకోవడానికి ఇష్టపడక, పరువనే పరదా మాటున శవాలై జీవిస్తున్న ధీరజలు, తను స్వేచ్ఛగా జీవిస్తున్నాననే భ్రమతో మగ వాళ్ళ విలాసాలకు తమను ఆహుతి చేసుకుంటున్న వసంతలు, తెలిసీ తెలియని, అయోమయంతో తమ బతుకుల్ని నరకప్రాయం చేసుకుంటున్న సుమలతలు, అన్నీ తెలిసి విముక్తి గీతాలను తమ స్వంత సుఖాన్ని పెంచుకోవటానికి పావులుగా వాడుకుంటున్న స్రవంతులు... ఏ ఆలోచనా లేకుండా భర్త అడుగులకు మడుగులొత్తే అసంఖ్యాక గృహిణులూ... ఇంకా ఆవరించిన చీకటిలో ఎందరో వున్నారు. కానీ ఉద్యమాల వెలుగులు ఆ చీకటిని చీల్చక తప్పదు.

"అవును మహిళ ముందడుగువేస్తోంది. ఇంక ఎంతో కాలం ఈ సాంఘిక అసమానత్వాన్ని సహించి వుండలేదు. ఆమె తన సంకెళ్ళను విదుల్చుకుంటున్న సవ్వడే ఈ వురుములు. ఆమె పొందుతున్న విజయాల నవ్వులే ఈ మెరుపులు! అనుకుంటూ ఆశగా ఆకాశంలోకి చూస్తూ మెరుపుల్ని లెక్కవేస్తోంది సమత. ఆలోచనలతో అలిసిపోయినా ఇంకా మూతపడని కన్నులు నులుముకుంటూ అలాగే కూర్చుని వుంది సమత. తూర్పు దిక్కున వేకువ పూలు విచ్చుకుంటున్నాయి.

క్రిమినలు కేసు కావటంతో సమత కేసు ముందే విచారణకు వచ్చింది. త్వరగా పూర్తయింది.

"రాజకీయ అభిప్రాయాలు వున్నందుకు తను ఎవరినీ శిక్షించలేననీ, ఆ అభిప్రాయాలు ప్రచారం చేయటం, ప్రజలను కూడగట్టడం రాజ్యాంగం ప్రతి మనిషికీ ఇచ్చిన హక్కులనీ, గద్దెమీద వున్న ప్రభుత్వాలకు వాటివల్ల ఇబ్బంది కలిగినా న్యాయస్థానాలు ఏమీ చేయలేవనీ వీళ్ళను రామయ్య హత్య కేసులో, నిరాధారంగా, కేవలం రాజకీయ కారణాలతో ఇరికించారనీ ఆ హత్యకు సంబంధించిన కనీస విషయాలు పరిశీలించటంలో కూడా పోలీసులు విఫలమయ్యా"రనీ తీర్పు చెప్పాడు సెషన్సుజడ్జీ.

నిరపరాధిగా సమత విడుదలయ్యింది, మూడు సంవత్సరాల జైలు జీవితం తర్వాత.

రాకేష్ వాళ్ళకేసు విచారణ పూర్తయ్యింది. ఇంకా తీర్పు రాలేదు. అతను జైలుకెళ్ళి ఐదు సంవత్సరాలు.

నిప్పులో కాగి బయటపడ్డ అపరంజిలా మరింత వెలుగులతో సమత ఇంటికి వచ్చింది.

నాలుగేళ్ళ ఉజ్వలను తీసుకుని రాకేష్ దగ్గరకు వెళ్ళింది. వొకరినొకరు ఎంతో గర్వంగా చూసుకున్నారు. ఆప్యాయంగా పలకరించుకున్నారు. ఇన్నాళ్ళ దిగులు పాట మూగవోయింది. ఏదో ఆశా శ్వాస ఆవరించింది వాళ్ళని. అవ్యక్తమయిన మాధుర్యం మనసుల్ని మైమరపించింది.

'ఎ' ఫర్ ఎబిలిటీ- 'బి' ఫర్ బెటర్‌మెంట్

'సి' ఫర్ కమ్యూనిటీ

సమత చెప్పిన పాఠం రాకేష్‌కి వినిపించింది ఉజ్వల.

"వి" ఫర్ విక్టరీ అన్నాడు రాకేష్.



## అంకితం

ఈ "వేకువపూలు" ప్రతి అక్షరం వెనుకా నిలిచి వ్రాయించిన నా శ్రీమతి "రమణి"కి అంకితం.





# 'గమ్యం' పై సమీక్షలు

డిసెంబరు 'చతుర'లో ప్రచురితమైన తనికెళ్ళ కల్యాణీ రచన 'గమ్యం' పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## గమ్యం ఎవరికి?

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

సమాజంలో జన్మించిన ప్రతి జీవీ ఒక ధర్మానికి, ఒక ఆచారానికి కట్టుబడి ఉండాలని ఆపేక్షిస్తాడు. పరిస్థితులు అనుకూలించినట్లయితే జీవితంలో తను, తనవాళ్ళు ఎటువంటి ఆర్థిక ఇబ్బందుల్లేకుండా జీవించడానికి "ఇతరులకు నష్టం కల్గించనంతవరకు డబ్బు సంపాదనకు నువ్వేమార్గాన్నైనా అనుసరించు" అనే సూత్రాన్ని పాటించాడు చంద్రమౌళి. అయితే తన భార్య మాటలు అతనిలో ఆత్మవిమర్శ రేకెత్తించిన తరుణంలో అతని వృత్తిలో ఎదురైన అనూహ్యమైన నష్టం అతని జీవితాన్నే బలిగొంది. కొంత సానుభూతి మూటగట్టుకునే చంద్రమౌళిలాంటి పాత్రలు మనకు సమాజంలో చాలానే అగుపిస్తాయి.

ఇక అన్నపూర్ణ... కథానాయకి పాత్రను రచయిత్రి మలచిన తీరు కొద్దిగా బాధాకరంగా ఉంది (ఒక మహిళగా ఆలోచిస్తే). అన్నపూర్ణ చదువుకున్న సంస్కారవంతురాలు. ఆమెకు భర్త, పిల్లల ప్రేమానురాగాలు పుష్కలంగా ఉన్నాయి. ఆమె గృహిణిగా తన బాధ్యతలు చక్కగా నెరవేర్చిన మాట నిజమే కానీ మరీ లోకజ్ఞానం తెలియని అమాయకురాల్లా నాలుగుగోడల మధ్యనే ఉండే ఇల్లాల్లా చిత్రీకరించడం బాగాలేదు. కేవలం భర్తపోయిన తర్వాతనే కుటుంబభారం స్వీకరించవలసి రావడం (చాలావరకు సహజమే అయినా) అందుకు తనకు తగిన ఆత్మస్థైర్యం లేకపోవడం పాతకాలపు స్త్రీలవలె ఉంది. వృత్తిలో రేపు ఏం జరుగుతుందో తెలియనిస్థితిలో తన భర్త ఉన్నాడని తన చెల్లెలు ద్వారా సంకేతాలు అందుకున్న అన్నపూర్ణ తనలోతాను మథనపడిందే తప్ప తనంత తాను ఎలాంటి సాహసోపేత నిర్ణయాలు తీసుకున్నట్లు కనబడదు. అలా తీసుకున్నా ఆమెను అభ్యంతర పెట్టగలిగేవాళ్ళెవరూ లేరు.

ఉదాహరణకు తన భర్త పైసంపాదన ఆమెకు అక్కర్లేదు. అక్కలకు అడిగినప్పుడల్లా వేలకువేలు డబ్బిచ్చే (మానసిక బలహీనతా? లేక అతిప్రేమా? ) భర్త, కుటుంబపరిస్థితులతో సంబంధం లేకుండా ఆరునూరైనా ఉన్నత చదువులు చదవాలనుకునే కొడుకులున్నప్పుడు కేవలం ప్రభుత్వ జీతంతోనే అవి అసాధ్యమని అన్నపూర్ణకు తెలియదా? అటువంటప్పుడు తను ఏదైనా ఉద్యోగం చేస్తూ భర్త కోరుకున్న ఆర్థికపరమైన ఇబ్బందుల్లేని జీవితం జీవించవచ్చు ఈ కాలంలో ప్రతివాడూ రేపు గురించి ఆలోచిస్తాడు. తన అన్నలు చేసిన పనికి కొడుకుల సమర్థింపు విన్న అన్నపూర్ణ 'తనకూ రేపలాంటి పరిస్థితి వస్తే?' అని ఒక్కసారి ఆలోచించి ఉంటే ఆ పాత్ర ఎలివేట్ అయి వుండేది. ఆ పాత్రను కాస్త వ్యక్తిత్వం ఉన్న పాత్రగా (రేవతిలా) మలచి ఉంటే కథకు బలం చేకూరేది.

కృష్ణపాత్రద్వారా నేటి నిరుద్యోగ యువతకు బాధ్యత తెలియచెప్పారు. అయితే గమ్యం ఎవరికి? ఎవరు ఏ గమ్యం చేరారన్నది రచయిత్రి స్పష్టంగా వివరించలేదు.



కథలో ఉన్న బలంకంటే అధికంగా ఉన్న పాత్రలు, రచన చెట్టాపట్టాలేసుకుని సాగుతూ ఆద్యంతం చదివిస్తాయి.

–సి. అరుణ,
నెల్లూరు - 524 001

## అందరూ మెచ్చే ఇల్లాలు

*(ద్వితీయ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)*

తనికెళ్ళ కల్యాణిగారి 'గమ్యం' నవల ఈ సమాజం తీరుని చాలా చక్కగా వివరించింది. చంద్రమౌళి పాత్ర చాలా దయనీయంగా ఉంది. అతనిని ఎక్కువ డబ్బు సంపాదించమని ఎవరూ వేధించలేదు. అతను కూడా నీతి, నియమాలు పాటించి నిజాయితీగా బతకాలనుకున్నాడు. కానీ ఈ సమాజం అధికారుల రూపంలోను, రాజకీయ నాయకుల రూపంలోను, అతనిని అలా బతకనీయలేదు. ముఖ్యంగా సమాజంలో అవినీతి, అక్రమాలు పెరిగిపోవడానికి ఈ ప్రజలే కారణమవుతున్నారు. ఈ ప్రజలయొక్క బలహీనతని, స్వార్థబుద్ధిని చూసే పైవారు అవినీతి, అక్రమాలు చేయడానికి పాల్పడుతున్నారు. ఈ విషయాన్ని రచయిత్రి చంద్రమౌళి పాత్రద్వారా చక్కగానే వివరించారు.

పాఠకులనుండి కన్నీటిని తెప్పించే పాత్ర అన్నపూర్ణది. ఆమెని ఓ 'అజాతశతృవు'గా అందరూ మెచ్చిన, అందరికీ నచ్చిన ఇల్లాలిగా రూపొందించారు రచయిత్రి. కానీ ఆమెని మరీ నోరులేని మనిషిగా చేయడం విచారకరంగా ఉంది.

అలాగే కృష్ణమోహన్ పాత్రకూడా ఈ కాలం యువతకు మార్గదర్శకంగా ఉంది. ఈ నవల చదివిన ప్రతిబిడ్డా కృష్ణమోహన్‌లా ఆలోచించగలగాలి. తల్లిదండ్రులు తమ బిడ్డలకోసం ఎన్నోవిధాలుగా ఆలోచించీ, తాపత్రయపడీ వారి జీవితాలు సంతోషమయం చేయాలని ప్రయత్నిస్తారు. కానీ ఆ బిడ్డలు తమ తల్లిదండ్రులకోసం ఆలోచిస్తారా! ఎంతసేపూ వాళ్ళు చేస్తున్న సేవను, వాళ్ళు ఇస్తున్న ధబ్బునే చూస్తారు. ఆ తల్లిదండ్రుల మనస్సులను అర్థం చేసుకొని వారిని సంతోషపెట్టాలని ప్రయత్నిస్తారా?

ఈ నవలలో రామ్‌గోపాల్, నందగోపాల్‌ల మాదిరిగా మమతలు, అనురాగాలకు దూరంగా వెళ్ళిపోయి డబ్బును సంపాదిస్తూ సమాజంలో గుర్తింపుకోసం బతకడంకన్నా, కృష్ణమోహన్ మాదిరిగా తండ్రి ఉన్నప్పుడు ఎంత అల్లరిగా తిరిగినా, తండ్రిపోయాకా ఆ తల్లిని సంతోషంగా ఉంచాలని ప్రతీక్షణం తల్లి మనస్సులోని భావాలను అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తూ, ఆమె కదలికలను గమనిస్తూ చిన్నవాడైనా పెద్ద బాధ్యతను స్వీకరించి, ఆమెదగ్గరే ఉండి, ప్రయోజకుడై ఎందరికో జీవనోపాధి కల్పించి అందరి మెప్పునూ పొంది, తల్లిని సంతోషపెట్టగలిగేలా బతకడం గొప్ప.

కృష్ణమోహన్‌కి మార్గదర్శకంగా ఉన్న రేవతి పాత్ర చాలా గొప్పగావుంది. ఆమెలా స్వార్థం, అసూయ లేకుండా ప్రతిమనిషీ బతకగలిగితే ఈ ప్రపంచంలో అవినీతి, అక్రమాలు జరగవు. ఆమె తమ్ముడు చంద్రమౌళి రాసిన లెటర్ ఆయనకేకాదు, ఈ నవల చదివిన ప్రతి మనసున్న మనిషి హృదయాన్నీ కదిలిస్తుంది.

"మౌళీ! రేపు నీ బిడ్డలు నిన్ను ఆదర్శంగా తీసుకుని, మానవత్వ విలువలకి చరమగీతం పాడితే నువ్వు ఎలా భరిస్తావురా? వాళ్ళని నిలదీసే ధైర్యం నీకు ఆనాడు ఉంటుందా? ఒక్కక్షణం ఆలోచించు" అనే మాటల్ని ప్రతిమనిషీ ప్రశ్నించుకొని ఆలోచించగలగాలి. ఏనాటికైనా అవినీతి ఓటమి పాలవుతుందనీ, విజయం మాత్రం నీతికే అని గుర్తుచేశారు. ఇంతమంచి నవల రాసిన రచయిత్రిగారికి, దానిని పాఠకులకు అందించిన చతురకు నా హృదయ పూర్వక




అభినందనలు.

–ఆర్. సుశీలాదేవి,
సోంపేట - 532 284

## సమాజం తీరు

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

తనికెళ్ళ కల్యాణిగారి 'గమ్యం' నైతికవర్తనకు, జీవనమార్గాలకు మధ్యసాగే అంతర్యుద్ధాన్ని ప్రధానంగా చూపించిన కథే అయినా అంతర్లీనంగా తరాలుగా సాగుతున్న ఆర్థిక బాంధవ్యాలని, సామాజిక అవలక్షణాలనీ నేపథ్యంగా తీసుకుని, మౌనవీక్షకులై చూసే మొన్నటి తరంవారినీ, లోపాలని వేలెత్తి చూపినా తమ పంథాను, పంతాన్ని వీడలేని నిన్నటి తరాన్నీ, అప్పుడే కనులు తెరచినా సమాజం తీరుతెన్నులు గ్రహిస్తూ, ఎవరికి వారే తమ జీవనశైలిని నిర్దేశించుకుంటూ స్వతంత్రంగా వ్యవహరించే నేటితరాన్ని చక్కగా చూపించారు.

మధ్యతరగతి కంటే ఓ మెట్టు పైనున్న పెద్ద కుటుంబాల జీవనసరళే ఈ కథ. రచయిత్రి చెప్పదలుచుకున్న భావాన్ని చివరిసీన్‌లో చక్కగా చిత్రీకరించారు. అవినీతిని ఆశ్రయించి ఆనందంగా బతకడం కంటే, నిజాయితీగా సంపాదించి సంతోషంగా వుండడమనే జీవనసత్యాన్ని తండ్రీ కొడుకుల పాత్రలద్వారా చూపించారు.

కేవలం అవినీతి, ఆర్థిక బంధాలనే గాక సమాజంలో మరో సమస్యగా మారిన నిరుద్యోగానికి చక్కని పరిష్కారం చూపించారు. ఏ పెట్టుబడి లేకుండా కేవలం పరిచయాలు, స్నేహితులే ఆలంబనగా, చురుకుదనం, తెలివితేటలు పెట్టుబడిగా ఇతరుల అవసరాల్ని ఆదుకుని తన ఉపాధి మార్గం పెంచుకున్న కృష్ణమోహన్ తీరు మరెంతోమంది నిరుద్యోగులకు స్ఫూర్తి అవుతుందనడంలో సందేహంలేదు.

నవలలోని సంఘటనలు సమాజంలో ప్రత్యక్షంగా జరిగినట్లే వుండడం రచయిత్రి పరిశీలనాశక్తికి దృష్టాంతం. చాలా సంఘటనలు నా స్వానుభవంలో జరిగినవే. చాలా చక్కటి రచన అందించిన రచయిత్రి కల్యాణిగారికి నా సమస్సుమాంజలులు.

–సి. శేషఫణి,
పలుకూరు - 518 178

## స్థిరమైన లక్ష్యం

*(నాల్గవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

జీవితాలు అందరికీ ఉంటాయి. గమ్యాలు ఉండవు. కొంతజీవితం గడిపాకైనా ఒక స్థిరమైన లక్ష్యాన్ని... తనతో పాటు నలుగురికీ ఉపయోగించే లక్ష్యాన్ని ఉంచుకుని ఆ ఆశయసిద్ధికోసం నిర్విరామంగా శ్రమించినవాడే నిజమైన మనిషౌతాడు. ఈ విషయాన్ని 'గమ్యం' రచయిత్రి బాగా వివరించారు.

ఇంట్లో అందరికీ దేముడిలాంటివాడైన చంద్రమౌళి అవినీతి అనే సాలెగూడు లోంచి బయటకు రాలేక ప్రాణాలు వదిలాడు. ఇది ఒకరకంగా వ్యవస్థలోని వైఫల్యం కూడా. అన్నపూర్ణ పాత్రకి మెతకతనం అనే గ్రహణం పట్టింది.

అసలు అవినీతి మూలంగా విస్తరించిన ఏచెట్టూ నిలబడదు. కానీ ఆ కుటుంబాన్ని సంపూర్ణ వినాశనం నుండి రక్షించినది ఏదైనా ఉంటే అది కృష్ణమోహన్ మంచితనమే. రేవతి వ్యక్తిత్వం ఆకట్టుకునేలా ఉంది.

రచయిత్రి చాలా సమస్యలను చర్చకు

తీసుకున్నారని కొన్ని సందర్భాలలో అనిపించింది. ఎదిగిన పిల్లలు తమ స్వార్థం తాము చూసుకోవడం, ఆస్థిపంపకాలు, ఆడపడుచుల ఆగడాలు అందులోకొన్ని. కానీ వాటి వివరణలో ఎక్కడికక్కడే తుంచి రచయిత్రి విజ్ఞతను ప్రదర్శించారు. విశ్వవ్యాప్తమైన అవినీతి సమస్యకే పెద్దపీట వేసి మంచిపని చేశారు.

రచయిత్రి శైలి, సన్నివేశాలు ఒక సిని మాలా మన కళ్ళముందు కదిలేవిగా ఉన్నాయి.

—కలగ రామారావు,
పెంటపాడు - 534 166

## 'కంపల్సరీ ఈవిల్'

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**తనికెళ్ళ** కల్యాణిగారి 'గమ్యం' మానవజీవితపు విలువలను, జీవనగమ్యాన్ని ఆహ్లాదకరంగా తెలియచేసింది. భార్యాభర్తలమధ్య మోతాదు మించని సాన్నిహిత్యం, అన్నాచెల్లెళ్ళమధ్య ఆనందపరిచే అనురాగం, మిత్రుల మధ్య స్వార్థంలేని సహకారం, అక్కాచెల్లెళ్ళ అన్యోన్యత, వదినా మరదళ్ళ దగ్గరితనం,భార్యాపిల్లలను ఒకస్థాయిలో ఉంచాలనే తపనతో తెలిసీ పక్కదారి పట్టిన వ్యక్తిలోని మానసిక ఘర్షణ, అతని అక్రమ సంపాదనను అనుభవించలేక, అతని తప్పును సరిదిద్దలేక తనలోనే ఆందోళనపడే భార్య ఆవేదన స్వార్థపరురాలైన అక్క, బాధ్యత తెలిసిన కొడుకు... ఇలా ఈ రచనలో రచయిత్రి సృజించని కోణం అంటూలేదు. అనుకోకుండా కుటుంబపరిస్థితి తల్లకిందులైతే బెంబేలు పడిపోకుండా, జీవితాన్ని నిలబెట్టుకునే ప్రాక్టికాలిటీ ఉన్న కృష్ణమోహన్ అదేసమయంలో ఇంటి బాధ్యతలను ఎంతో ఇష్టంగా స్వీకరించి కుటుంబ విలువలను, ప్రేమలను, సెంటిమెంట్లను గౌరవించి ఈ రచనకు కథానాయకుడే అయ్యాడు. రేవతి, రాజ్యలక్ష్మి చక్కటిపాత్రలు. మనకు అలాంటి తోడు కావాలనిపించేలా, మనం కూడా ఎదుటివారితో అలా ఉండగలగాలి అనిపించేలా ఉన్నాయి. చంద్రమౌళి, అన్నపూర్ణల అనురాగం మనకి కూడా లభించాలని కోరుకోకుండా ఉండగలమా? చంద్రమౌళి మరణం- అన్నపూర్ణ ఆవేదన... పగవాడికి కూడా ఆ బాధ రాకూడదని మన స్ఫూర్తిగా ప్రార్థించేలా చిత్రీకరించారు. ఏమైనా రచయిత్రి కొన్ని డిపార్ట్‌మెంట్‌లకు సంబంధించి చక్కటి అవగాహన కలిగి ఉన్నారు. 'లంచం' తీసుకోవడం అనేది 'కంపల్సరీ ఈవిల్'లాగా మనం భావించి సమర్థించుకోకూడదు. తాత్కాలికంగా సుఖాలనుభవించినా, లంచాలు తీసుకొని, ఇతరుల ఉసురుతో ఎక్కువ ఆనందంగా, ఆరోగ్యంగా ముఖ్యంగా నిశ్చింతగా జీవించినవారు లేరనే చెప్పాలి. కుటుంబాన్ని ఎక్కువ సంతోషంగా ఉంచటానికి తండ్రి ఒక్కడే ఎక్కువ కష్టపడకుండా కుటుంబమంతా కలిసి శ్రమపడి, పొదుపుగా ఉంటే సంతోషంగానూ ఉండవచ్చు పిల్లలకు కొంతవయస్సు వచ్చిన దగ్గర్నుంచి కష్టపడి కొంతైనా సంపాదించడం అలవాటు చేయాలి. రచయిత్రి నవలలోని సంఘటనలతోపాటు నవ్వించారు. కవ్వించారు, ఏడ్పించారు, ఓదార్చారు.

—మేఘన,
మచిలీపట్నం.



Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942. Nellore: 331250.

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78

